శ్రీః

# తిక్కన సోమయాజి

(చారిత్రక నవల)

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.



ప్రకాశకులు :
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
మదరాసు - 1.

శ్రీః

# తిక్కన సోమయాజి

(చారిత్రక నవల)

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.

ప్రకాశకులు :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

మదరాసు - 1.

# అభిప్రాయములు

శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు రచించిన 'తిక్కన సోమయాజి' అను చారిత్రకనవలను సాకల్యముగా చదివితిని. ఆరంభించినది మొదలు తుదివరకు ఆపకుండ చదువవలె ననెడు కుతూహలమును కల్గించినదన్నచో రచనలోని గుణవిశేషములను వేఱే వర్ణింపనేల ? ఆనాటి చారిత్రకాంశము లెన్నో కన్నులకు గట్టినట్లు, హృదయమునకు హత్తుకొనినట్లు, ఉజ్జ్వలమైన శైలిలో వర్ణింపబడినవి. చిన్నచానమ్మ ప్రాయోపవేశము, ఖడ్గతిక్కన వీరమరణము, పెద్దచానమ్మ సహగమనము-యిత్యాది పెక్కు ఘట్టములను చదువుచుండగా పాఠకుల కన్నులు చెమర్చకమానవు. అట్లే భారతరచనాఘట్టము, ఓరుగల్లులో తిక్కయజ్వకు జరిగిన అఖండసన్మానఘట్టము పఠించునప్పుడు హృదయ ముప్పొంగిపోవును. గ్రంథకర్త కథననైపుణికి, భాషాపాటవమునకు, బహుముఖమైన పాండితీప్రకర్షకు ఈనవల దర్పణమువలె నున్నది. ఇందులో తిక్కయజ్వను కేవల మొక రాజనీతి చతురునిగా, ఒక మహాకవిగా మాత్రమేగాక, సాక్షాత్తుశారదావతారముగా, ఒక మహాదివ్యపురుషునిగా నిరూపించుటకు రచయిత చేసిన ప్రయత్నము సర్వథా ప్రశంసార్హముగా నున్నది. పాత్రపోషణము లోకాతిశాయిగా నున్నది.

తిక్కయజ్వమహత్త్వమును వ్యక్తము చేయుటకు రచయిత కొన్ని కావ్యోచితములైన కల్పనలు చేయుట అవసరమై యుండవచ్చును. అవి వాస్తవికములు కాకపోయినను సత్యదూరములు మాత్రము కావు. వాస్తవికజగత్తులో అంతర్భూతమైన సత్యమునకు నిత్యమైన రూపకల్పనచేయుటయే కావ్యధర్మము. శుద్ధయథార్థకథనము చరిత్రయగును గాని కావ్యము కాజాలదు. ఉత్తమకావ్యమైన ఈనవల ప్రతిపాదింపదలచిన సత్యము అనితరదుర్లభమైన తిక్కనార్యుని మహత్త్వము. ఆయనను కేవలము కవిగా మంత్రిగా మాత్రమే ఊహించుట ఒంటికంటితో చూచుట. నిండారిన మనోదృష్టికి గోచరించెడి ఆ పురుషపుంగవుని రూపవ్యక్తీకరణమే లక్ష్యముగా - యీ నవల రచింపబడినది. నిస్సంశయముగా నిది గుణసంపూర్ణమైన మహారచన.

తిరుపతి,
20-11-1969

పింగళి లక్ష్మీకాంతం.

శ్రీః

# తిక్కన సోమయాజి

## (చారిత్రక నవల)

## 1

శ్రీకాళహస్తిపురము పురాణప్రసిద్ధమైనది. దానిని దర్శింపని శివభక్తులు దక్షిణభారతమున లేరు. దానికి దక్షిణ భారతచరిత్రయందు కూడ సమున్నతస్థానమున్నది. అది ఆంధ్ర చోళమండలమున పొత్తపినాడునం దున్నది.

భారతసంస్కృతికి ఉత్తరమునుండి ముప్పు ముంచుకొని వచ్చిన మధ్యకాలమున, కాకతీయవంశజులైన ఆంధ్రచక్రవర్తులు యావదాంధ్రదేశవ్యాప్తమైన విశాలసామ్రాజ్యమును నిర్మించి, ఆంధ్రదేశమున భారతీయసంస్కృతికి స్థానము కల్పించి, ఆంధ్రప్రజలకు ప్రత్యేక వ్యక్తిత్వమును సమకూర్చిపెట్టిరి. కాకతీయచక్రవర్తులకు సామంతులుగా తెలుగుచోళులు పొత్తపినాడును, పాకనాటిని పరిపాలించుచున్న దినము లవి. వారి రాజధాని విక్రమసింహపురము. ఆనాటి తెలుగు చోళ రాజు తిక్కచోడ దేవరాజు.

శ్రీకాళహస్తినగరపాలకుడు దుగ్గయ్యగారు. ఆయన గృహములోని పరిస్థితులు పరమదైన్యముగా నున్నవి. ఆయన

కుమార్తె చిన్నచానమ్మ. ఆమె ఆయనకు ఏకసంతానము పదునాలుగేడుల వయసుది. ఆనాటి ప్రాతఃకాలమున ఆమె ప్రాయోపవేశమునకు సిద్ధమైనది. ఆ ఉదయము బ్రాహ్మీ ముహూర్తమునం దామెలేచి, దైవప్రార్థనచేసి, కాల్యకృత్య ములను నిర్వహించి, మంగళస్నానము చేసినది. తలితండ్రులకు పాదాభివందనములు చేసినది. తమ గృహమున పూజామంది రము కెదురుగా దర్భాసనము పరచుకొని, దానిపైన పద్మాసన మున కూర్చున్నది. పూర్వమే తనకు తండ్రిగా రుపదేశించిన గౌరీపంచాక్షరీమంత్రమును పురశ్చరణ ప్రారంభించినది. కుంభ కము ధారణపట్టి జపముచేయుట మొదలు పెట్టినది. ఆంధ్రు లకే కాక - దక్షిణభారతమున పెక్కుమందికి ఇష్టదేవతలై, తమకు ఇలువేల్పులైన శ్రీజ్ఞానప్రసూనాంబికా శ్రీకాళ హస్తీశ్వరుల సన్నిధానమును మానసికముగా కల్పించు కొనినది. ఆమెకు కొంచెముసేపు బాహ్యస్మృతి కలదేమో కాని, తరువాత కన్నులు మూతపడినవి. ఆమె చలనరహితశిలా శిల్పమువలె నైనది.

ఆమె పూనిన ప్రాయోపవేశదీక్ష-ఏవిధముగా పరిణమిం మించునో యన్న భీతి మిక్కిలికాగా - ఆమె తలితండ్రులు నిస్సహాయులై, పరిదీనవదనులై - తాము ఆహారమును ముట్టక - ఆమెకు చెరియొక ప్రక్కను కూర్చుని - ఆమెను చూచుచు దైన్యమూర్తులవలె నున్నారు.

ఆశ్వియుజ శుద్ధ పాడ్యమినాడు ప్రాతఃకాలమున దీక్షను ప్రారంభించిన చిన్నచానమ్మ, ఆసాయంత్రమున గాని, మరునాటి ప్రాతస్సాయంకాలములందుగాని, మూడవనాటి ప్రాతఃకాలమునందు కాని కనులు తెరువలేదు. చేతులు కదలింపలేదు. కూర్చున్నది కూర్చున్నట్టే చలనరహితముగా నున్నది. తలితండ్రులు మాత్రము ప్రాతస్సాయంకాలము లందు కాలోచితకృత్యములను నిర్వహించుకొనుటకు లేచి మరలవచ్చి కూర్చొనుచున్నారు. వారు సంధ్యాకాలములందు తమ తమ అనుష్ఠానములు చేసికొనుచున్నారు. కాని వారును ఆహారమును ముట్టుకొనుట లేదు. నీరు త్రాగుటలేదు. నిద్ర పోవుటలేదు. అన్నివేళలం దామెను కనిపెట్టుకొని యున్నారు.

ఆ ప్రాయోపవేశవార్త ఊరిలో వ్యాపించినది. ఆవార్త వ్యాపించినంతమేర ఊరెల్ల కదలినది. ఆబాలిక పూనిన ప్రాయోపవేశదీక్ష యెట్టి దుష్ఫలితము లిచ్చునో యని ఊరి వారు తల్లడిల్లిరి. ముఖ్యముగా స్త్రీజనము భయభ్రాంతి పొందినది. స్త్రీలందరు, వృద్ధపురుషులు వీలైనంత కాలము దుగ్గయ్యగారి గృహప్రాంగణమందే నిలచి యుండుచుండిరి. బాలవృద్ధాతురులు మాత్రము కొంత యెంగిలిపడి వచ్చు చుండిరిగాని, మిగిలినవారు మౌనముగా దుగ్గయ్యగారి గృహప్రాంగణమున కూర్చుండి జ్ఞానప్రసూనాంబికా శ్రీకాళ హస్తీశ్వరులను ధ్యానము చేయుచుండిరి. ఆబాల తపస్విని

పూనిన మహావ్రతదీక్షలో తాము కూడ పాల్గొనుచుంటిమని వారందరకొక తృప్తి కలిగినది.

ఊరి వారందరు కలసి పూనిన దీక్ష - వారందరు కలసి మానముగా చేయుచున్న అతిరుద్రపురశ్చరణమువలె, సహస్ర లలితాపారాయణమువలె నున్నది. పౌరజనుల భక్తిప్రపత్తులతో వెల్లివిరిసిన ఆయింటి వాతావరణము దివ్యత్వభరితమై అనిర్వచనీయమైన మాహాత్మ్యరామణీయకతతో శోభించినది.

చిన్నచానమ్మకు పెండ్లిచేయవలయునని తండ్రి దుగ్గయ్య గారు నాలుగైదు సంవత్సరములనుండి ప్రయత్నములు చేయుచుండిరి. అనగా ఆమెకు అష్టవర్షములు దాటిన నాటినుండి. కాని ఆమె వివాహముచేసికొనుట కంగీకరింపలేదు. దుగ్గయ్య గారు పెండ్లిమాట తలపెట్టిన నాడే ఆమె మామూలు ఆహారమును విసర్జించినది. పాలుమాత్రము తీసికొనుచున్నది. ఆమె వ్యక్తురాలు కాక మునుపు వివాహము చేయనిచో - తమ కుటుంబమును వెలివేయుదురని దుగ్గయ్యగారికున్న భయము. ఆ భయమును నివారించుటకై ఆమె తాను వ్యక్తురాలు కాకుండుటకు శరీరమును శుష్కింపచేసికొనినది. అందుచేతనే బలకరమైన ఆహారమును ముట్టక, కేవలము ప్రాణధారణకై క్షీరమాత్రాహారమును గ్రహించుచు, ఆమె నాలుగైదు సంవత్సరములుగా శరీరమును శుష్కింపచేసికొనుచు, బాల యోగినియై, జ్ఞానప్రసూనాంబికాధ్యానము చేయుచున్నది.

జ్ఞానప్రసూనాంబికాదేవినే జ్ఞానమ్మ యని, శాణమ్మ యని నల్లశాణాంబ యని, చానమ్మ యని చెప్పుదురు.

తమ యిలువేల్పు జ్ఞానప్రసూనాంబికాదేవి పేరే చానమ్మ యని దుగ్గయ్యగారు కుమార్తెకు పెట్టుకొనిరి. ఆమెకు పదునాలుగేడులు వచ్చినను పెండ్లిచేయలేదని లోకము కోడియయి కూయుచున్నది. ఆమె వివాహవిషయమే తండ్రికి, కుటుంబమునకు, బంధువులకు క్లిష్టసమస్యగా పరిణమించినది. నగరపాలకుడై యుండుట, మహారాజులవారికి సన్నిహితుడై యుండుట - దుగ్గయ్యగారిని రక్షించినవి గాని - లేనిచో శ్రోత్రియు లాయనను తప్పక వెలివేసియుండెడివారు. తలి బుజ్జగించినప్పటికి, తండ్రి బ్రతిమిలాడినప్పటికి, బంధువులు చెప్పి చూచినప్పటికి చిన్నచానమ్మ వివాహము చేసికొనుటకు సమ్మతింపలేదు.

తానసలే వివాహము చేసికొననని చిన్నచానమ్మ చెప్పుట లేదు. ఆమె పసికందుగానున్నప్పుడు తండ్రిగారు తన్నెవరికో నిత్తునని మాటనిచ్చిరట. ఆపురుషునేగాని వేరెవ్వరిని వివాహ మాడనని చెప్పుచున్నది. కాని తండ్రిగారు మాటచెప్పినది పదునాలుగేండ్లకు పూర్వము. అప్పుడు చిన్నచానమ్మ మూడు వారముల వయసు కలిగిన పొత్తిళ్లలోని పసిగ్రుడ్డు. మాట తీసికొనిన బాలున కప్పుడు వయస్సు యెనిమిదేండ్లు. దాదాపు అప్పటినుండి ఆబాలుడు కనుపించుటలేదు. దేశాంతరగతుడై నాడో - అవాంతరమృత్యువు వాతపడినాడో - మరేమైనాడో

తెలియదు. అతనిని వెదకి పట్టుకొనుటకు సలిపిన ప్రయత్నము లన్నియు వ్యర్థములైనవి.

తాను మాట చెప్పినప్పుడు పొత్తిళ్లలో నొత్తిగిలలేని పసికూనకు తనమాటపై దీక్షదేనికని, పట్టుదలదేనికని తండ్రి దుగ్గయ్యగారి వాదము. పదునాలుగేండ్ల క్రితము దేశభ్రష్టుడైన బాలుడు తిరిగి రాగలడను నమ్మకము లేదని - ఆబాలుని చూచి యెరుగని పసిగ్రుడ్డునకు వానిపై ప్రేమ, మమకారము అసందర్భముగా నున్నవని, తండ్రి చెప్పినమాట తనను బంధింప జాలదని, పాటింపవలసిన బాధ్యతలేదని బంధుజనుల వాదము.

అన్ని వాదములకు చిన్నచానమ్మ చెప్పుచున్న సమాధానమొక్కటే. తాను పితృవాగ్దత్త. ఆబాలునికి భార్యగా తనను తండ్రి పూర్వమే దత్తముచేసినాడు. అనగా పంచభూతములు సాక్షిగా సత్యదేవతసాక్షిగా - ధర్మదేవతసాక్షిగా - విశ్వమయులైన పార్వతీపరమేశ్వరుల సాక్షిగా కన్యాదానము జరిగిపోయినదన్నమాట. కాకపోతే లాంఛనప్రాయముగా వివాహోత్సవము జరుపకొనవలసి యున్నది. కావున మరియొక పురుషునితో వివాహము మరియొక వివాహమే - అనగా పునర్వివాహమే కాగలదు. కులీనులైన స్త్రీలకు మారుమనువు లేదని చెప్పవలసిన పనిలేదు. అసలు మరియొక పురుషునితో వివాహము చేయవలయునని ప్రయత్నము చేయుటకుగాని - అట్టి ఊహను ఊహించుటకుగాని తన తండ్రికి హక్కులేనే

లేదని ఆమె వాదము అట్లు చేసినచో దత్తాపహరణ దోషము సంక్రమించుననని-(అనగా తానే దానముచేసిన వస్తువును మరల తాను దొంగిలించిన నేరము)-ఆమె వాదము. ఆమెకు తండ్రి గాని, బంధువులుగాని, పండితులుగాని సమాధానము చెప్ప లేకపోయిరి.

ఆమె వాదములో, భావములో, దృష్టిలో - తీవ్రత్వ ముండి - ఆమెకు యెదురుగా నెవ్వరును నిలచి వాదింపలేక పోయిరి. ఆమె తాను చూచి యెరుగని పురుషుని వలచి-వానిని వివాహము చేసికొనుటకు ప్రాయోపవేశము చేయుచున్న దనగా - ఆమె అసాధారణమైన ప్రకృతి కలిగిన బాలికయని చెప్పనక్కరలేదు.

తానిచ్చిన మాట చెల్లించుకొనుటకు దుగ్గయ్యగారికి మార్గము తోచుటలేదు. అదృశ్యుడైన వ్యక్తి కొరకెన్ని సంవత్సరములు వేచియుండగలరు? ఆ భావములతో దుగ్గయ్యగారు తమ కుమార్తెకు వివాహప్రయత్నములు చేసిరి. కాని ఆయన కుమార్తె చిన్నచానమ్మ అన్యపురుషస్పర్శ సహింపనని ప్రాయోపవేశదీక్షను తీసికొన్నది.

## 2

విక్రమసింహపురరాజు తిక్కదేవ చోళ మహారాజు ధర్మాభిరతికలవాడు. దేశమునందు ధర్మాభిమానము తగ్గిపోవుచున్నదని దేశమున ధర్మప్రచారము విరివిగా జరుగవలసి

యున్నదని, ప్రజలకు ధర్మరహస్యములు తెలిసి, ధర్మమునందు ఆదరము పెరుగుటకై - ధర్మస్వరూపమైన మహాభారతము దేశ భాషలోనికి అనువదింపబడి, ప్రచారము చేయబడవలెనని ఆయన తహతహపడుచున్నవాడు. నన్నయ భట్టారకులవారు మహాభారతమును సంపూర్ణముగా ఆంధ్రీకరింపకుండుట ఆంధ్రుల దురదృష్టమని భావించుచు, మిగిలిన భాగమును ఆంధ్రీకరింపగల సమర్థునికొరకు వెదకించుచున్నవాడు. మహాభారత ఆంధ్రీకరణ మును పూర్తిచేసినవారికి అర్ధాసనగౌరవమిత్తుమని, అనేకా గ్రహారముల నిత్తుమని ప్రకటించినవాడు. ఆయన ప్రకటన ఆంధ్రదేశమున నలుమూలలకు ప్రాకినది. కాని విద్వత్కవులు సాహసింపలేదు.

ఏవేవో సందర్భములలో నెచ్చటెచ్చటనో పండితసభలు జరిగినప్పుడు, ఆయాసభలకు తమ భట్టులను పంపి తమ ప్రకట నను పండితులకు మరల మరల తెలియునట్లు చేయుచుండిరి. కాని ముందునకు వచ్చినవారు లేకపోయిరి.

గౌతమీతటమునందున్న రాజమహేంద్రవరమున ప్రతిసంవత్సరమును గణపతి నవరాత్రి ఉత్సవములు శోభాయ మానముగ జరుగును. ఆసందర్భమున విద్వత్సభలు జరుగును. పండితులు సమావేశమై సకలశాస్త్ర విషయములను చర్చించె దరు. ఆసభలకు ఆంధ్రదేశపు పండితులేగాక యావద్భారత పండితులు వచ్చుచుండిరి. ఆసభలలో తిక్కదేవ చోళరాజుల

వారి ప్రకటన ప్రతిసంవత్సరమును వినిపింపబడుచున్నది. ఆ సంవత్సరము కూడ విక్రమసింహపుర మహారాజులు తమ పరివారమును పంపి ఆసభలలో తమ ప్రకటనను పండితులకు మరల వినిపించుటకు ఆజ్ఞలుపెట్టిరి.

రాజమహేంద్రవరమున గణపతి నవరాత్రి మహోత్సవములు జరుగునది మార్కండేయస్వామివారి ఆలయమునందు. అది మిక్కిలి పురాతనమైన ఆలయము. అచ్చటి శివలింగము నుండి పరమశివు డావిర్భవించి యముని శిక్షించి, మార్కండేయ మహామునిని చిరంజీవిగా రక్షించెనని స్థలపురాణగాథ.

నన్నయ భట్టారకులవారు మార్కండేయస్వామివారి ఆలయమునకు గోపురప్రాకారములు నిర్మించిరని ఐతిహ్యప్రతీతి. పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవుడైన రాజనరేంద్రుడు నిత్యము మార్కండేయస్వామివారి ఆలయమునకు వచ్చి దర్శనము చేసికొనుచుండువారని గాథలు.

మార్కండేయస్వామివారి ఆలయమున గణపతి నవరాత్రి ఉత్సవములు వార్షికముగాచేయుట రాజనరేంద్రుడు ప్రారంభించెనట. ఆనాటినుండి అవివార్షికముగా, అవిచ్ఛిన్నముగా జరుగుచున్నవి. వేదములలో, వేదాంగములలో, దర్శనాది సర్వశాస్త్రములలో, ఆగమములలో, ఆలంకారికాది సాహిత్యశాస్త్రములలో పండితులను పిలచి, ఘనసమ్మానములు చేయుట జరుగుచునే యున్నది.

వేంగీమండలమును కాకతీయులు కైవసమును చేసికొన్న ప్పటినుండి గణపతి నవరాత్రి ఉత్సవములు, సభలు మరింత శోభగా జరుగుచున్నవి. కాకతీయచక్రవర్తులు అన్యమత ద్వేషములేని శైవులు. గణపతిదేవచక్రవర్తి మహాభక్తుడు. ఆయన చాల పురాతనదేవాలయములను బాగుచేయించి, పూజావిధానమును పరిపుష్టముచేసెను. పెక్కు నూతనదేవా లయములను నిర్మించెను. గణపతిదేవచక్రవర్తులు స్వయముగా ముఖ్యోద్యోగులను రాజమహేంద్రవరమునకు పంపి, సంభా రములను పంపి, ఉత్సవములు శోభగా జరుపుటకు, పండితులకు ఘనమైన సమ్మానములు జరుపుటకు సహాయములు కల్పించిరి. దేశము శాంతి సుభిక్షముగా నుండుటవలన - చక్రవర్తుల సహా యము పుష్కలముగా నుండుటవలన - ఉత్సవములు శోభించు చున్నవి.

ఆ సంవత్సరము రాజమహేంద్రవర గణపతి నవరాత్రి ఉత్సవములకు విక్రమసింహపురమహారాజులవారి పరివార జనము వెళ్లినది. ఆపరివారబృందమునకు నాయకుడు ప్రబం ధాంకము అన్నంభట్టు. అతడు అష్టసచివులలో నొకడు. రాజ మహేంద్రవరమునుండి ప్రబంధాంకము అన్నంభట్టు మహా రాజులవారి కొక వర్తమానము పంపెను. ఆవార్తావహుడు మహారాజులవారికి ప్రణామములుచేసి - రాజమహేంద్రవర సభలలో - మహాభారత ఆంధ్రీకరణమునకు సమ్మతించిన సమర్థు డైన విద్వాంసుడు లభించెనని - ఆయనను పరివారసహితముగా

రాజలాంఛనములతో తోడ్కొనివచ్చుచున్నారని, భాద్రపద అమావాస్య వెళ్లినతరువాత ఆశ్వియుజ శుద్ధపాడ్యమి ఘడియ లలో ఆవిద్వాంసుని అన్నంభట్టుగారు పురప్రవేశము చేయింప వచ్చునని వార్తావహుడు మనవి చేసెను.

మహాభారత ఆంధ్రీకరణమును పరిపూర్ణము చేయుటకు మరల నన్నయభట్టారకులవారు అవతరించినట్లు, వారు రాజ మహేంద్రవరమునుంచి విక్రమసింహపురమునకు విజయము చేయుచున్నట్లు మహారాజులవారికి ఆనందము కలిగినది. ఆయనకు కలిగిన సంతోషమునకు అవధులు లేకపోయినవి. రాజమహేంద్రనరములోని సభావిశేషములను చెప్పుమని, అభినవనన్నయభట్టారకులవారు తమ విన్నపమును మన్నించిన విధమును సవిస్తరముగా చెప్పుమని మహారాజులవారు వార్తా వహుని ఆదేశించిరి.

వార్తావహుడు మరల నమస్కరించి - వినయముగా శిరమువంచి - అంజలి బంధించి - మహారాజులవారికి వివర ములను విన్నవించెను.

రాజమహేంద్రవరగణపతి నవరాత్రి ఉత్సవములలో - ప్రతి సంవత్సరమువలె - ఆసంవత్సరము కూడ వేదములందు, వేదాంగములందు, దర్శనాది సర్వశాస్త్రములందు నూతన పండితులకు విద్యాపరీక్షలు జరిగినవి. ముప్పవ్వరు యువకులు అన్ని పరీక్షలందు వేదపరీక్షలందు, వేదాంగ పరీక్షలందు,

దర్శనాది సర్వశాస్త్రపరీక్షలందు పాల్గొని ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై పారిషదులకు అచ్చెరువు కలిగించిరి. వారి పాండిత్యము అతిలోకముగా నున్నదని వారు త్రిమూర్తులవలె నున్నారని, వారి ముగ్గురలో తరతమ విభేదమునకు సావకాశము లేదని, వారి పాండిత్యమువలె వారి వినయగుణము కూడ ఉన్నతముగా నున్నదని సభాస్తారులు కొనియాడిరి.

వారు తేజస్వులు. ఆజానుబాహులు. గాఢోరస్కులు. వారిని గురించిన గాథలు పెక్కు రాజమహేంద్రవరమున ప్రచారమునందున్నవి. వారు చిన్నవయసులో ఆంధ్రదేశము నుండి కాశీకి విద్యాభ్యాసమునకు వెళ్లినవారట. అచ్చట గంగానాథ మహామహోపాధ్యాయులవారికడ విద్యాభ్యాసము చేసిరట. కాశీవిద్యాపరిషత్తులు వారి విద్యాపారంగతత్త్వమును ప్రశంసించినవట. కాశీలో వ్యాకర్తలను, తార్కికులను, మీమాంసకులను వారు విద్యావివాదములందు పరాభూతులనుచేసి, జయపత్రములను గ్రహించిరట. వీరినిబట్టి కాశీలో దాక్షిణాత్యవిద్వాంసులకు ముఖ్యముగా ఆంధ్ర విద్వాంసులకు గౌరవము ప్రబలినదట. తర్కశాస్త్రమునకు, అందును నవన్యాయమునకు పుట్టినిల్లువంటి నవద్వీపమునకు వారు వెళ్లి అక్కడ దిగ్గంతులవంటి పండితప్రకాండులతో విద్యాఘుర్షణలుపడి జయించిరట. అచ్చటి పండితులు గౌడ బ్రాహ్మణులు. మిథిలానివాసి యగు గంగేశోపాధ్యాయుడు 'తత్త్వచింతామణి' యను గ్రంథముతో నవ్యన్యాయమును

ప్రామాణికముగా నిర్మించెనట. ఆయన తరువాత నవ్యన్యాయమునకు నవద్వీపము నిలయమైనదట. విద్యావివాదమున పరాజయము పొందిన నవద్వీపగౌడపండితులు మత్సరగ్రస్తులై - యీయువకత్రయముపైన క్షుద్రప్రయోగములను చేసిరట. మంత్రవేత్తలైన యువపండితులు త్రిప్పికొట్టి - ప్రయోగము చేసిన వారిప్రాణముల మీదకు తెచ్చిరట. వారు ప్రాణభీతితో పాదముల నాశ్రయింపగా వారిని రక్షించిరట.

ఆషాఢమాసమున పూరీజగన్నాథమున బ్రహ్మోత్సవములు రథోత్సవములు జరిగినప్పుడు శ్రీపూర్వామ్నాయ శంకరపీఠాధిపతుల సన్నిధానమున విద్వత్సభలు జరిగినవట. అప్పుడీ యువపండితులు అమోఘవిద్వత్ప్రదర్శనముచేసి పీఠాధిపతుల మన్ననలను గడించిరట.

రాజమహేంద్రవరసభలలో వారు చూపిన విద్వత్తు సకలజనామోదముగా నున్నది. ముగ్గురు యువకులలో కొంచెము పెద్దవానివలె నున్నవాడు విశ్వేశ్వరుడు. ఉత్తర మీమాంసాచర్చలలో అతడు శ్వేతాశ్వతరఉపనిషత్తు ఆధారముగా పాశుపతశైవమైన శివాద్వైతమును ప్రతిపాదించి, మహాపాశుపతప్రవర్తకుడు యోగాచార్యుడు, శివాంశావతారమైనవాడు, ఐన శ్రీకంఠశివాచార్యుని ప్రస్తుతించి సభికులకు ఆహ్లాదమును కలిగించెను.

వయసులో తరువాతవాడైన రుద్రారాధ్యుడు సర్వశ్రుతులను సమన్వయముచేసి ద్వైతాద్వైతమైన విశేషా

ద్వైతమును, శ్రుతిసమ్మతమైన వీరశైవమతముగా ప్రతిపాదించి శైవపంచాచార్యులను కీర్తించి సభాసదులను రంజింపచేసెను.

మూడవ యువపండితుడు గౌతముడు. ఆయన యుక్తి యుక్తముగా ఉపనిషన్మతమైన శంకరాద్వైతమును ప్రతిపాదించి, త్రోటకాచార్యకృత శంకరస్తుతినిచేసి సభాస్తారులను హర్షపులకాంకితులను చేసెను. సభికుల హర్షధ్వానములకు ఆయువకుడు మందస్మితముచేసి, రాజమహేంద్రవరపండిత సభను వర్ణించుచు నన్నయభట్టారకులవారు మహాభారతము నందు వ్రాసిన "పరమవివేకసౌరభవిభాసిత" అను పద్యమును చదువగా - ఆసభవారు ఆనందించి - హర్షధ్వానములు ద్విగుణీకృతముచేసిరి. ఆయువకుని సమయోచితప్రజ్ఞకు, ఆంధ్రభాషా పాండిత్యమునకు, మధురమైన కంఠధ్వనికి సభికులు ముగ్ధులైరి.

కాకతీయచక్రవర్తులవారి ఉద్యోగులు విద్వాంసులను ఘనముగా సమ్మానించిరి. ఈ మువ్వురు యువవిద్వాంసులను చక్రవర్తులవారి సభకు విచ్చేసి చక్రవర్తులవారికి ఆహ్లాదము కలిగింపుడని ఉద్యోగులు ప్రార్థించిరి. వారి ఆహ్వానమును విశ్వేశ్వరుడు మన్నించెను. అతడు రాజోద్యోగులవెంట ఓరుగల్లునకు ప్రయాణసన్నద్ధుడయ్యెను. కాని రుద్రారాధ్యుడు, గౌతముడు, తాము స్వజనమును కలసికొనవలసియున్నదని, తమవారు తమకై బహుసంవత్సరములుగా వేచియున్నారని,

కావున తాము స్వస్థలములకు పోవలసియున్నదని చెప్పి - ఓరుగల్లునకు రాజాలక పోయినందులకు మన్నింపుడని కోరిరి.

ఆ తరువాత ఆంధ్ర కవితాగోష్ఠి జరిగినది. దానిలో కవులు రెండువర్గములుగా చీలి వివాదమునకు సిద్ధపడిరి. దేశి కవితాపద్ధతిని ఆదరించువారి వర్గ మొకటి. మార్గకవితాపద్ధతిని ఆదరించువారి వర్గము మరియొకటి. వారి వివాదము సభా మర్యాదలను అతిక్రమించినది. సభికులకు మనఃక్లేశము కలిగినది. ఆసమయమున గౌతమపండితుడు కల్పించుకొని ఉపన్యసించెను.

"ఛందోవిధానమును గురించిన వివాదము అసందర్భముగా నున్నది. కావ్యమునకు ప్రాణమేదియన్న ఆలంకారికుల మీమాంసకు ఔచిత్యమున్నది గాని ఛందస్సు - యేదైననేమి? రచనాశైలికి, కవితావస్తువునకు, కథాసన్నివేశమునకు తగిన ఛందస్సును కవి స్వీకరించును. శిల్పము పద్యరచనాతిశాయి. బహ్వర్థములను యేకత్ర సమావేశపరచి, అందువలన పాఠకుని మనస్సును భావనామయముచేయుట, దానిని ఉన్నతపథము లందు సంచరింపచేయుట శిల్పము. బహ్వర్థములను సంధానించుటకు బహుమార్గము లున్నవి. ఆమార్గములు కవియొక్క నైపుణిపైన ఆధారపడియున్నవి. కథానిర్మాణమును సూక్ష్మాంశ రమణీయముచేయుట కథాకథనశిల్పము. దానినే నన్నయభట్టారకులవారు ప్రసన్నకథాకలితార్థయుక్తి యనిరి. పద్యరచన యందున్న శిల్పము మరియొకటి. అది అక్షరసన్నివేశ రామణీయకత. నన్నయభట్టారకులవారి రచనయం దీరెండుశిల్ప

ములు పరాకాష్ఠదశను పొందినవి. ఆంధ్రమహాభారతరచనలో నన్నయ భట్టారకులవారు ప్రత్యేక ఆలంకారిక మార్గమును అనుసరించిరి. కావ్యమునకు ప్రాణముగా ఆయన రసధ్వని స్వీకరించిరి. ఆంధ్రభాషలో ప్రమాణతమమైన గ్రంథము ఆంధ్ర మహాభారతము. దానినిబట్టి చూచినచో ఛందస్సును గురించి వివాదము లేనేలేదు. స్వీకరించిన ఛందస్సు యేదైనప్పటికి - సమున్నతముగా - సముచితముగా - శిల్పవంతముగా నిర్వహింప బడవలెను. ఇది నన్నయభట్టారకులవారి మతము. ఆంధ్రకవితా లోకమున ప్రామాణికమైన మతము". ఆయన ఉపన్యాసముతో వివాదము నశించినది.

ఆయన చేసిన పరిష్కారమునకు సభ సంతోషపడినది. మరల నన్నయభట్టారకులవారు అవతరించివచ్చినట్లు భావుకులు ఆనందించిరి; నన్నయభట్టారకుల వారియం దాయన ప్రవర్తించిన గౌరవమునకు ఆయనను బుధారాధనవిధేయుడని సభవారు కీర్తించిరి. ఉభయకవి వర్గములకు మధ్యనున్న వివాదమును పరిష్కరించినందులకు ఉభయకవిమిత్రుడని సభికులు ముక్త కంఠముతో జయజయధ్వానములు చేసిరి.

ఆసభలో సభాపతివారి అనుమతితో మన అన్నం భట్టు గారు సభవారికి నమస్కరించి విన్నపములు మనవిచేసెను. ఆయన చేసిన మనవి యిట్లున్నది. "నేను శ్రీవిక్రమసింహపుర మహాప్రభువులైన రాయగండాంక, పృథ్వీశ్వరశిరః కందుక క్రీడావినోద, యిత్యాది సకల బిరుదాంకితులైన శ్రీతిక్కదేవ

చోడ మహారాజులవారు పనుపగా వచ్చితిని. మా ప్రభువుల వారు సభాస్థితులైన విద్వాంసలోకమున కీవిన్నపమును పంపు కొనిరి.

'మహామనీషులారా! ప్రణామములు. వేదవ్యాసకృతమై పంచమవేదమని ప్రసిద్ధిపొందిన మహాభారతమును నన్నయ భట్టారకులవారు ఆంధ్రీకరించుటకు పూనుకొని మారణపర్వము మధ్యలో దివంగతులైనారని తమకందరకు తెలిసిన విషయమే. ఆంధ్రావళి దురదృష్టమో యనునట్లు మరల నెవ్వరును భారత ఆంధ్రీకరణకు పూనుకొనలేదు. మహావిద్వాంసులై సమర్థులైన ఆంధ్రమహాకవులు లేకపోలేదు. నానారుచిరార్థనిధులై, నిత్య సత్యవచనులై, ఉభయభాషాకావ్యరచనాశోభితులై సత్ప్రీతి భాభియోగ్యులై, ఆంధ్రకవితావిశారదులైన మహాకవులను శేషించిన మహాభారతభాగమును ఆంధ్రీకరించుటకు పూనుకొనుడని మేము అభ్యర్థించుచున్నాము. అట్టి మహాకవులను మేము సర్వరాజగౌరవములతో, ఆస్థానగౌరవముతో సత్కరించి కోరినన్ని అగ్రహారములను బహూకరింతుమని వాగ్దానము చేయుచున్నాము. ఈమహాభారమును నిర్వహించుటకు నన్నయభట్టారకుల వారితో తుల్యమైన సమర్థులు కావలసియున్నది. అట్టి సామర్థ్యము కలవారని నిరూపణకై - నన్నయ భట్టారకుల వారివలె - అన్నివిధముల వారివలెపద్యము రచింపవలసియున్నదని, అందులకై 'మదమాతంగతురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్యసంపద' అను పద్యమువలెనే-అన్నివిధముల

దానివలెనే పద్యమును వ్రాయగల మహాకవిని రాచమర్యాద లతో మాసభకు తోడ్కొని రావలసినదిగా ఆనతిచేసినాము.”

ఇవి మాప్రభువులవారి విన్నపములు. ఆంధ్రదేశమున బహువర్షములు గా బహుసభలందు చేయబడుచున్న విన్నపములు. ఈనాటికైనా మాఅన్వేషణఫలించి అభినవ నన్నయ భట్టారకులవారి దర్శనము లభింపగలదని ఆశతో నున్నాము.” అని అన్నంభట్టుగారు సభను కలయజూచి నమస్కరించిరి.

అంతట గౌతమపండితులవారు లేచి “భట్టూ! నీవు చదివిన పద్యము లోకప్రసిద్ధమైనది; అన్నివిధముల నట్లే పద్యమును వ్రాయవలెనంటివి కదా! నేను చెప్పెదను వ్రాసికొనుము—” అని చెప్పి - ఆపద్యమును మరల నట్లే చదివిరి. ఆమాటలలోని చమత్కారమును గుర్తించిన సభికులు హర్షధ్వానాలు చేసిరి.

అన్నంభట్టుగారు చేతులు జోడించి “ఆర్యా! మావిన్నపములోని పొరపాటు మాకిప్పుడు తెలిసినది. తమరు అపర నన్నయభట్టారకులవా రని, విద్యాసరస్వతులని తెలిసికొంటిమి. మాసేవలు స్వీకరించి, మావిక్రమసింహపుర సభను పవిత్రము చేయుడు. పల్లకి సిద్ధముగా నున్నది. పరివారము సన్నద్ధముగా నున్నది.” అని మనవి చేసెను.

గౌతమపండితులు మాసేవలు స్వీకరించి విక్రమసింహపురమునకు విచ్చేయుచుండిరి. రాచమర్యాదలతో గౌతమ పండితుని అన్నంభట్టుగారు తీసికొని వచ్చుచున్నారు. అన్న

గసుజ శుద్ధపాడ్యమి ప్రవేశించిన తరువాత పురఃప్రవేశము చేయుదుమని యేలినవారికి విన్నపము చేయుదు మన్నారు.”

అని శ్వావహుడు విన్నవింపగా తిక్కదేవచోడ మహారాజులవారు సంతోషపడి వెంటనే మహామంత్రి సిద్దన్న గారికి వ రమానము చేసిరి.

## 3

మహామంత్రి సిద్ధన్నగారికి మనశ్శాంతి కొరతగానున్నది. రాచకీయముల సమస్యలే గాక కుటుంబసమస్యలు కూడ జటిలములై పరిష్కారమార్గములు లేనివిగా నున్నవి. మహామంత్రి సిద్దన్నగారికి కనిష్ఠ సోదరుడు కొమ్మనామాత్యులవారు. ఆయన కూడ విక్రమసింహాపురప్రభువుల కొలువులో నుండెడివారు. విక్రమసింహాపురరాజ్యమున కాయన ఉత్తరప్రాంతదండనాథుడు. ఉత్తరపుసరిహద్దును కాపాడుట ఆయన కర్తవ్యముగా నుండెడిది. ఆప్రాంతమున శాంతిభద్రతలను రక్షించుట సామంతులు తిరుగుబాటుచేయకుండ అప్రమత్తతతోనుండుట ఆయన బాధ్యతలు.

ఒక పర్యాయము అద్దంకిపాలకు డగు శాలంకాయన గోత్రుడు తిరుగుబాటు చేసెను. అతనిని లొంగదీయుటకు కొమ్మన దండనాథులవారు సైన్యసమేతముగా దండెత్తి వెళ్లిరి. అప్పుడు జరిగిన సంకులసమరమున విజయము కొమ్మన దండనాథులవారినే వరించినది. యుద్ధము ముగిసిన తరువాత కొమ్మన

దండనాథులవారు రణభూమినుండి నిష్క్రమించుచుండగా - హతశేషుడైన శత్రుసైనికు డొకడు వెనుకనుండి దొంగ చాటుగా బల్లెము విసరగా - అది కొమ్మన దండనాథులవారి కంఠమున గ్రుచ్చుకొనినది. ఆయన అశ్వముసుండి నేలకొరిగి రణరంగమునందే వీరమరణమును పొందిరి. కొమ్మన దండ నాథులవారి అంగరక్షకు లాశత్రుసైనికుని ముక్కలు ముక్క లుగా ఖండించిరి, కాని ప్రయోజన మేమున్నది ?

విజయము లభించినను దండనాథులవారు వీరస్వర్గ మలంకరించుటవలన విక్రమసింహపురమహారాజులవారు విజ యోత్సవములు జరుపలేదు. విజయమును సాధించిన దండ నాథులను వీరతిలకముతో అలంకరించి, వీరాభిషేకము చేసి, వీరఖడ్గమును బహూకరించుట ఆనాటి వీరమర్యాదలు. ఆమర్యాదలను పాటించుటకు విక్రమసింహపురమహారాజుల వారికి అవకాశము కలుగలేదు.

కొమ్మన దండనాథులవారి భార్య అన్నమాంబాదేవి. ఆమె వీరమరణమును పొందిన భర్తగారితో సహగమనము చేసినది. వారి కుమారుడు తిక్కన. తలిదండ్రులను పోగొట్టు కొనిననాటి కాయన వయస్సు యెనిమిది సంవత్సరములు. అంతకు ముందు కొన్నినెలలకు పూర్వమే - ఆయనకు ఉపనయ నము జరిగినది. ఆకుటుంబమునకు యిలువేల్పయిన శ్రీకాళ హస్తీశ్వరునివలన తిక్కనపేరు వచ్చినది. శ్రీకాళహస్తీశ్వరునికి తిరుకాళత్తిదేవుడని, తిక్కదేవుడని సామాన్యజన

వ్యవహారము. తిక్కనగారికి బాలతిక్కనయని చిన్న తిక్కన యని పేర్లు కుటుంబమునందు వాడుకలోనున్నవి. ఆకుటుంబమునందు ఆయనకంటె పెద్దవాడైన తిక్కనగారు మరియొకరున్నారు. అతడు మహామంత్రి సిద్ధన్నగారి కుమారుడు. మహాశూరుడై ఖడ్గవిద్యయందు అప్రతిమానుడగుటవలన ఆయనను రణతిక్కన యని ఖడ్గతిక్కన యని చెప్పుదురు.

బాలతిక్కనగారు తండ్రియైన కొమ్మనామాత్యులవారికి తల్లియైన అన్నమాంబాదేవిగారికి యథావిధిగా కర్మకాండలు నిర్వహించెను.

తలితండ్రుల అంత్యక్రియలు పూర్తియైన మరునాటి నుండి బాలతిక్కనగారు కన్పించుటలేదు. ఆబాలు డేమై పోయెనో తెలియలేదు. బంధువులకెవ్వరకు తెలియదు. పెద తండ్రిగారైన మహామంత్రి సిద్ధనామాత్యులవారు చాలవ్యథ పడిరి. తన కనిష్ఠసోదరుని ఏకపుత్త్రుడు అదృశ్యమగుట ఆయనకు తీవ్రసంతాపహేతువైనది. ఆయన బాలతిక్కనగారికై బహుధా అన్వేషలు చేయించిరి. కాని ప్రయోజనము కలుగలేదు.

విక్రమసింహపురరాజ్యమునకు కొమ్మనదండనాథులవారు చేసిన సేవ గొప్పది. వారిని రణరంగమున విజయము సాధించి నందులకు సమ్మానించుట పొసగలేదు. కొమ్మన దండనాథుల వారి యేకపుత్త్రునకు విద్యాబుద్ధులుచెప్పించి, సంరక్షించి, ఆశ్రయము కల్పించుటకైనను మహారాజులవారికి అవకాశము

లభింపలేదు. మహారాజుల వారి వ్యథకు మేరలేకుండనైనది. మహారాజులవారి మానసికవ్యథను ఉపశమింపచేయుటకు మహామంత్రి సిద్ధన్నగారికి మార్గము కన్పింపలేదు.

ధనప్రయాసలకు వెనుదీయక విక్రమసింహపురరాజ భటులు బాలతిక్కనగారికై అన్వేషణలు చేయుచునే యుండిరి. కొమ్మన దండనాథులవారిచేత పరాభూతులైన శత్రురాజవంశ ములవారు ఆయన కుమారుడు బాలతిక్కనగారిని అపహరించి యుండవచ్చునేని, హత్యచేసి యుండవచ్చునని అనుమాన ములు కలిగినవి. కాని నిదర్శనములు దొరకలేదు. శత్రు రాజనగరములలో గూఢచారులు పరిశోధించిరి. కాని బాల తిక్కనగారి జాడకాని - అందులకు సంబంధించిన సమాచారము గాని లభింపలేదు. ఆధారములు దొరకలేదు. మహారాజుల వారికి మరింత తాపమైనది. ఆయన మనస్తాపమును నివారించు టకు తగిన ఉపాయము లేక మహామంత్రి సిద్ధన్నగారు వేదన పడుచుండిరి.

పదునాలుగేండ్లుగా మహామంత్రి సిద్ధన్నగారు విశ్ర మింపలేదు. బాలతిక్కనగారి జాడ తెలియక పరితపించుచునే యున్నారు. దక్షిణభారతమున ప్రముఖరాజ్యముయొక్క శక్తిసంపదలు సర్వము తనచేతియందుండగా - తానొక చిన్న బాలుని - తన తమ్ముని వంశాంకురమైన యేకపుత్త్రుని - వెదకిపట్టు కొనలేకపోయితి మని ఆయన లజ్జాభరితులై పోయిరి.

మహామంత్రి సిద్దన్నగారి భార్య ప్రోలాంబ. కొమ్మన దండనాథులవారి భార్య అన్నమాంబాదేవి ప్రోలాంబగారి చెల్లెలే. అన్నమాంబాదేవి మహాపతివ్రత. సతి. ఆమె భర్తతో సహగమనముచేసి ఉభయవంశములను పునీతముచేసి వెడలి పోగా - ఆమె యేకపుత్రునికి ఆశ్రయము కల్పించి పెద్దవానిని చేయలేకపోయితి మని ప్రోలాంబ బాధపడుచున్నది. ఆమె బాధ భరింపజాలనంతగా నున్నది. ఈపదునాలుగేడులుగా ప్రతిదినము బాలతిక్కనగారిని గురించి ఆమె మహామంత్రి సిద్దన్నగారిని హెచ్చరించుచు నేయున్నది. ప్రాధేయపడుచునే యున్నది.

ప్రోలాంబకు తమ్ములిద్దరు. పెద్దతమ్ముడు అనంతయ్య. ఆయనకు సంతాన మొక్కకుమార్తె. ఆకుమార్తె కలిగినప్పుడే అనంతయ్యగారి భార్య పురిటిలో చనిపోయినది. తరువాత కొలది దినములకే అనంతయ్య మరణించెను. ఆయన తమ్ముడే అనగా ప్రోలాంబకు ద్వితీయసహోదరుడు దుగ్గయ్యగారు. శ్రీకాళహస్తి నగరపాలకుడైన దుగ్గయ్యగారు అన్నగారి కుమార్తె యగు పెద్ద చానమ్మను స్వంతకుమార్తెవలె పెంచెను. ఆయనకు పెద్దచానమ్మ చిన్నచానమ్మ రెండు కన్నులు పెద్ద చానమ్మను మహామంత్రి సిద్దన్నగారి ప్రోలాంబకు కుమారుడైన ఖడ్గతిక్కనగారికిచ్చి వివాహము చేసెను.

దుగ్గయ్యగారికి రెండవసోదరి అన్నమాంబాదేవి కొమ్మన దండనాథులవారు వీరమరణము పొందినప్పుడు ఆమె

సహగమనముచేయుచు అన్నగారైన దుగ్గయ్యగారి దగ్గర మాట తీసికొనినది. తన కుమారుడైన చిన్నతిక్కనకు దుగ్గయ్య గారి కుమార్తె చిన్నచానమ్మ నిచ్చి వివాహము చేయుదునను మాట. ఆమె కోరికను మన్నించుటకు దుగ్గయ్యగారు సంతోష ముతో మాట నిచ్చిరి. ఆచెప్పిన మాట నిలుపుకొనుట కాయన సిద్ధమే. తమ యిలువేల్పయిన నల్లకామాంబాదేవి అనుగ్రహము వలన తనమాట నిలిచినయెడల ఆయన జన్మచరితార్థమైనట్లు సంతోషపడును. కాని బాలతిక్కనగారి జాడ కనిపించుట లేదు.

దుగ్గయ్యగారు తనగోడు బావగారైన మహామంత్రి సిద్ధన్నగారికి బహుపర్యాయములు మనవి చేసికొనెను. కాని సమస్య పరిష్కారము కాలేదు. ఆశ్వయుజ పాడ్యమి నాటి నుండి తన కుమార్తె ప్రాయోపవేశము చేయబోవుచున్నదని భాద్రపద పౌర్ణమినాటికే దుగ్గయ్యగారు మహామంత్రి సిద్ధన్న గారికి వర్తమానము పంపెను.

మహామంత్రి సిద్ధన్నగారు ప్రోలాంబను, కోడలు పెద్ద చానమ్మను దుగ్గయ్యగారింటికి పంపిరి. వారిరువురు చిన్న చానమ్మకు బహువిధముల చెప్పిచూచిరి. కాని చిన్నచానమ్మ సంకల్పమును విరమించుకొనలేదు. అంతేగాక - "మీరిరువురు నాకంటె పెద్దలు. ఈయింటి ఆడపడుచులు. ధర్మమర్మము లెరిగినవారు. కొట్టరువు వారి కోడండ్రు. వీరపత్నులు. వీరమాతలు. నాకు ధర్మపాలనమున ఆలంబనము లభించునట్లు

సాయము చేయవలయునుగాని అవరోధము కల్పింపవచ్చునా ? ధర్మవ్యతిరేకమైన బోధ చేయవచ్చునా ?" అని నిగ్గతీసినది.

ఆమె భావములలో ధర్మమున్నదని వారికి తెలిసినది. ఆమె భావములు దోషరహితముగా నున్నవని వారు సంతసించిరి. ఆమె భావకల్పనమునం దొక దివ్యత్వము, సంకల్పమునం దొక తీవ్రత్వము, ముఖమునందు అతిలోకమైన తేజస్సు కలవని గుర్తించి, వారు సంతోషపడిరి. ఆదరభాషణములతో నామెను ఆదరించిరి. ఐతే కేవలము తీవ్రభావనాబలముచేత దేశాంతరముల కేగిన బాలతిక్కనను రప్పింపవచ్చునా ? అని శంకించిరి. దేవీ అనుగ్రహమునకు సాధ్యముకానిది లేదని చిన్నచానమ్మ సమాధానము. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినాటి నుండి దేవీ నవరాత్రులు ప్రారంభము. ఆనాటినుండి తీవ్రమైన దీక్షతో సాధింపగలనన్నది. అమ్మవారి కరుణ లభింపనిచో ప్రాణత్యాగము చేయుదు నన్నది.

పెద్దచానమ్మ "చెల్లాయీ ! దైవబలముమీద ఆధారపడి పురుషప్రయత్నము విస్మరింపరాదు. ఈ కలియుగమున దైవ బలము ఫలింపకపోవచ్చును. పురుషప్రయత్నమునకు నాచేత నైన సహాయము నేను చేయుదును. మన మిర్వురము పురుష వేషములను ధరించి సర్వదేశములను గాలించి మరదిగారిని పట్టుకొందము." అన్నది. ఆమాటలకు చిన్నచానమ్మ కృతజ్ఞతా దృష్టులతో "అక్కా ! నీవు ఖడ్గమాత్రసహాయురాలైన వీరశిఖా

మణికి ధర్మపత్నివి. వీరపత్నికి సముచితమైనటుల నీవు వీర భాషణము చేసితివి. సత్సంకల్పముతో చేసిన తపస్సు వ్యర్థము కాదు. అమ్మవారు తపస్సుచేసి పరమేశ్వరుని పొందినది. కాబట్టి పతివ్రతలను అమ్మవారు తప్పక కరుణించును. అభీష్టసిద్ధి తప్పక కలుగునని విశ్వాసము నాకున్నది.” అని చెప్పినది.

ప్రోలాంబ, పెద్దచానమ్మ భాద్రపద బహుళ దశమినాడే తిరిగి బయలుదేరి విక్రమసింహపురమునకు వచ్చిరి. దుగ్గయ్యగారి గృహములోని సంగతులను మహామంత్రి సిద్దన్నగారికి, సేనాపతి ఖడ్గతిక్కన్నగారికి తెలిపిరి.

తన తమ్ముడు దుగ్గయ్య కడుపున నల్లశాణాంబ అంశతో కుమార్తె జన్మించినదని, ఆమెను కోడలుగా పొందగల అవకాశమును కొట్టరువువారు పోగొట్టుకొనకూడదని, బాల తిక్కనను వెదకిపట్టుకొనవలెనని ప్రోలాంబ మహామంత్రి సిద్దన్నగారికి నొక్కి నొక్కి చెప్పినది. దుగ్గయ్యపడుచున్న బాధ చూడలేకుండనుంటి నన్నది. చిన్నచానమ్మకు అపాయము సంభవించినచో తన తమ్ముడు దుగ్గయ్య బ్రతుకడని, అప్పుడు తనకు, పెద్దచానమ్మకు పుట్టిల్లే మిగులదని, కన్నులనిండ నీరు పెట్టుకొని చెప్పినది.

పెద్దచానమ్మకు చిన్నచానమ్మ ప్రాణాధికమైన చెల్లెలు. తన చెల్లెలు ప్రాణత్యాగము చేసినచో తన ప్రాణములు నిలువవని పెద్దచానమ్మ ఖడ్గతిక్కనగారి ముందు రోదించినది.

మహామంత్రి సిద్ధన్నగారింట దుఃఖదేవత, దైన్యదేవత కలసి తాండవముచేయుచుండగా మహారాజులవారి ఆదేశము వచ్చినది. భారతఆంధ్రీకరణమునకు అంగీకరించి అన్నంభట్టు వెంట రాజమహేంద్రవరమునుండి వచ్చుచున్న గౌతమ పండితునికి స్వాగతసత్కారములు చేయుటకై వచ్చిన ఆదేశమది.

## 4

మహారాజులవారి ఆనతిమేరకు మహామంత్రి సిద్ధన్న గారు సముచితపరివారముతో బహిర్వనములకు వెళ్లి గౌతమ పండితునికి స్వాగతసత్కారములు చేయుటకు సన్నద్ధముచేసిరి. మహామంత్రిగారి వెంట చతురంగబలములతో సేనాపతులు ఖడ్గ తిక్కనగారును, యువరాజులు మనుమసిద్ధిగారును, కోశాధికారి ఆత్మకూరి గురునాథుడును వెడలిరి. జనము తండోపతండము లుగ వెళ్లిరి. అది అభూతమైన వార్త. సాహిత్యసరస సత్కారము జరుగుట ఆంధ్రదేశమునందపూర్వము. విక్రమ సింహపురమున అశ్రుతపూర్వము. నగరము కోలాహలముగ నున్నది. ఈ అపూర్వసత్కారమును తిలకించుటకు జనము ఉత్సాహభరితమైనది.

రాజమహేంద్రవరమునుండి వచ్చుచున్న అన్నంభట్టు తన పరివారముతో బహిర్వనము చేరకమునుపే పరివార సమేతులై మహామంత్రి సిద్ధన్నగారువచ్చి వేచియుండిరి.

కొలది సేపటికి అన్నంభట్టు పరివారము దూరమున కన్పించినవి. అశ్వారూఢులైన పరివారసేవకులు పల్లకీని పరివేష్టించి వచ్చు చుండిరి. అన్నంభట్టు అశ్వారూఢుడై అగ్రగామిగానుండెను. పల్లకీ పుష్పదామాలంకృతమైయున్నది. త్రోవలో జానపదము లలో పండితునికి సత్కారములు జరిగిన చిహ్నములవి. అశ్వా రూఢులైన అంగరక్షకబలముతో మూర్ధాభిషిక్తుడైన మండలే శ్వరుడు వచ్చుచున్నట్లు—ఆపల్లకి రాచఠీవితో—మందగమన ముతో వచ్చుచున్నది.

ఉభయపరివారములు తారసిల్లి జయజయధ్వానములు చేసినవి. అన్నంభట్టు తన పరివారముతో మహామంత్రిగారికి, యువరాజులవారికి, సేనాపతులవారికి అభివాదనలు చేసెను. చతురంగబలములవారు పల్లకీని చుట్టి వ్యూహారచనచేసి రాజ మర్యాదగా సైనికవందనము చేసిరి. పల్లకి నేలకు దింప బడినది. మహామంత్రి సిద్ధన్నగారు దానిని సమీపించిరి. పల్లకీనుండి గౌతమపండితుడు లాఘవముగా బయటకు దుమికి మహామంత్రి సిద్ధన్నగారి పాదములపై వ్రాలిపోయెను. అనూహ్యమైన ఆసంఘటనకు విభ్రాంతులై పరివారము తిలకించుచుండగా మహామంత్రి సిద్ధన్నగారు నివ్వెరపోయి "తాము మహా విద్వాంసులు. వయోభావమువలనగాక విద్వత్తుపరాజముగా గౌరవార్హత కలవి. తమకు నేను స్వాగతము మనవి చేయవలసి యుండగా తమరు నాకు పాదాభివందనము చేయుట సమంజస ముగా లేదు." అనగా, గౌతమపండితుడు లేచి నిలువబడి

అంజలి బంధించి "పెదబాబయ్యగారు! నన్ను పోల్చుకొనలేదా ? నేను తిక్కనను" అనెను.

మహామంత్రిగారు "ఓరి నాయనా!" అని బాలతిక్కనను ఆలింగనము చేసికొనిరి. ఆయన సంతోషమునకు, ఉత్సాహమునకు పరిమితులు లేకపోయినవి. "నీకై మేము పదునాలుగేండ్లగా నెంత తాపత్రయముపడినామురా! ఎన్నెన్ని దేశములు వెదకించినాము! ఇన్ని సంవత్సరములు నీవు కాశీలో విద్యాభ్యాసముచేసి సకలవిద్యావేత్తవై వచ్చితివన్నమాట. నన్నయభట్టారకులవారిపద్యముతో మేము పంపిన విన్నపములో పొరపాటును చూపించినది నీవే నన్నమాట. ఈనాడు నీవు కలిగించిన ఆనందము పదునాలుగేండ్లుగా పడినవేదనను విస్మరింప చేయుచున్నది." అనుచు ఆనందబాష్పములతో మహామంత్రిగారు బాలతిక్కనగారిని మరల మరల ఆలింగనము చేసికొని చుబుకమును ముద్దాడిరి.

అశ్వారూఢులైన భటులద్వారా ఖడ్గతిక్కనగారీఆశ్చర్యకరపరిణామమును వెంటనే మహారాజుల వారికిని, తమ యింటిలో తల్లిగారికిని తెలుపబంపి, తమ తండ్రిగారి బాహుమధ్యములందున్న బాలతిక్కనగారిని సమీపింపగా—ఆయన పెదతండ్రిగారి బాహువులనుండి బయటపడి ఖడ్గతిక్కనగారికి పాదాభివందనము చేయుచు, "అన్నా!" అని ఆనందము ల్లడించిరి. ఖడ్గతిక్కనగారాయనను లేవనెత్తి ఆలింగనము చేసికొనిరి.

ఇంతలో యువరాజులవారు సమీపించి బాలతిక్కన గారికి అభివాదనముచేయగా ఆయన ప్రత్యభివాదనముతో మందహాసముచేసెను. యువరాజులవారు "సేనాపతులవారు మాతండ్రిగారికడ ఖడ్గవిద్యాభ్యాసము చేసిరి. మాకు సేనాపతులవారు శస్త్రాస్త్రఖడ్గవిద్యాగురువులు. ఈ పరస్పరసంబంధమువలన మేము సేనాపతులవారిని మాతుల గౌరవముతో చూచుచున్నాము. మీతో పూర్వమెన్నిజన్మముల సౌహార్దమో కాని, పరస్పరాలోకనముతో ఆనందము పరవసించుచున్నది. ఈనాటినుండి మీరుకూడ మాకు మేనమామగారే. మీరు చిన్నమామయ్య." అని సంతోషము వ్యక్తముచేయగా బాలతిక్కనగారు 'కృతజ్ఞుణ్ణి' అనిరి.

ఇంతలో పరివారమునందున్న కోశాధికారి ఆత్మకూరి గురునాథుడు తిక్కనగారిని సమీపించి నమస్కరించి "చిన్నస్వామీ! నేను గురునాథుణ్ణి. మీచిన్నతనంలో బాబయ్యగారివద్ద చదువుకొనుచుండెడివాడను. మిమ్మల్ని యెత్తుకుని లాలించేవాడిని. తమరిని చూడగా గురుపాదులను చూచినంత సంతోషముగా నున్నది." అనగా తిక్కనగారు "అన్నా! గురునాథా!" అని ఆలింగనము చేసికొనిరి.

రాజమహేంద్రవరమునుండి వచ్చిన గౌతమపండితుడు కొమ్మన దండనాథులవారి కుమారుడు తిక్కనగారుగా పరిణమించుట పరివారజనములకు ప్రమోదము కూర్చినది. వారిలో పెక్కుమంది కొమ్మన దండనాథులవారిని సేవించినవారో,

సన్నిహితముగా నెరిగినవారో వారంవరకు మరల కొమ్మన దండనాథులవారి దర్శనము లభించినట్లుగా ఆనందమైనది. వారందరు పేరు పేరు వరుసనా - తమ్ము తా మెరిగించుకొని తమకు దండనాథులవారితోఁగల సంబంధమును నివరించుకొని తిక్కనగారికి అభివాదనలు చేసిరి.

లాంఛనప్రాయమైన స్వాగతసత్కారములకు బదులు కుటుంబపునస్సమాగమముగా పరిణమించి బహిర్వనములోని కార్యక్రమము చాలసేపు పట్టినది.

ఈ వర్తమానము మహామంత్రి సిద్ధన్నగారి గృహమునకు చేరగా - ప్రోలాంబ ఆనందముతో పొంగిపోయినది. మహామంత్రిగారు తిక్కనగారితో వెంటనే తిరిగివచ్చెదగని వేచిచూచి - జరుగుచున్న జాప్యమును భరింపలేక - మేనాలో - అశ్వారూఢులైన భటు లిద్దరు వెంటరాగా బహిర్వనమునకు వచ్చినది.

అక్కడ జరుగుచున్న ఆనందకోలాహలమున మహామంత్రిగారుగాని, సేనాపతులవారుగాని ఆమె రాకను గమనింపలేదు. ఆమె మేనాదిగి మహామంత్రిగారిని సమీపించి "ఐతే మీరింకా ఆనందసల్లాపములలో నుండినారన్నమాట. అవతల నా తమ్ముడు, నా మేనకోడలు ప్రాయోపవేశముతో నేడో రేపో ప్రాణత్యాగముచేయుటకు సిద్ధమవుతుంటే?" అనినది. ఆమెను తిక్కనగారు గుర్తించి "పెద్దమ్మా" అని పాదాభివంద

నముచేసిరి. ఆయనను లేవనెత్తి ఆమె తలనిమిరి 'నాయనా యెన్నాళ్లకు కన్పించితివిరా! నా చెల్లెలు లోకోత్తమమైన పతివ్రత. ఆమె సహగమనము చేసివెళ్లిపోగా—ఆమె కడుపున కాయవు నీవు అదృశ్యము కాగా—మేము అనుభవించిన దుఃఖం అంతా యింతా అని చెప్పగలమా? ఇప్పుడు నా చెల్లెలు మళ్లీపుంభావ సరస్వతిగా వచ్చి కన్పించినంత ఆనందముగా నున్నదిరా!" అని మరల మరల తల నిమురుచు ఆనందబాష్పములను కురిసినది.

మహామంత్రి సిద్ధన్నగారు ఖడ్గతిక్కనగారి వంకచూచుచు "నాయనా! నేటి సాయంత్రమునకు విదియ ఘడియలు వచ్చుచున్నవి. బాగానే ఉన్నది. నీవు కోడలిని తీసికొని కాళహస్తికి బయలుదేరు. ఏకాదశినాడు పూర్వాహ్ణంలో ధనుర్లగ్నంలో వివాహమునకు బాగున్నది. దానికి సిద్ధమై తరలివచ్చుచుంటి మని చెప్పు. రేపే లగ్నపత్రిక వ్రాయించి పురోహితులను పంపెదను. వివాహమునకు అన్ని భాండారములు నీవే సమకూర్చుము. మనకంటె మామయ్యకు వేరెవ్వరున్నారు? ఆయన వంటరివాడు. మే మందరము విజయదశమినాడు విజయయాత్రాలగ్నమున బయలుదేరి—ఆ రాత్రియంతయు ప్రయాణముచేసి—మరునాటి ఉషఃకాలమునకు కాళహస్తిచేరుదుము." అని చెప్పిరి. ఖడ్గతిక్కనగారు శిరస్సువంచి ఆజ్ఞలు స్వీకరించెను. ప్రోలాంబ, "అన్నియు జాగ్రత్తగా

చూచుకో!" అని చెప్పగా ఖడ్గతిక్కనగారు అనుకూలశిరః కంపనము చేసిరి.

ఇక నగరప్రవేశము చేయుటకు జాప్యముకూడదని మహామంత్రి సిద్దన్నగారు భావించి పరివారమును బయలుదేర తీసిరి. అంగరక్షకులతో ప్రోలాంబ మేనా ముందు వెళ్లిపోయినది. మిగిలినవారు పరివారసమేతులై మంగళవాద్యములతో నగరప్రవేశము చేసిరి.

ఇంతలో కొందరు రాజభటులు పరువులువెట్టుచువచ్చి "మహారాజులవారు, మహారాజులవారు" అని హెచ్చరికలు చేసిరి. అశ్వారూఢులై అంగరక్షకపరివారయుక్తులై మహారాజులవారు రానేవచ్చిరి. అందరు అశ్వములనుండి దిగి మహారాజులవారికి జయజయాభివాదనలుచేసిరి. మహారాజులవారు గుఱ్ఱముమీదనుండి అభివాదనలను మందస్మితముగా స్వీకరించుచు తిక్కన్నగారిని చూచుచు, "అదిగో! అంతా మాకొమ్మన దండనాథులవారే! ఆదీర్ఘనాసిక, విశాలలలాటము. ఆకర్ణాంతనేత్రములు. సుందరభ్రూయుగ్మం. స్ఫురద్రూపం. ఆజానుబాహువులు. దీర్ఘమైన ఊర్ధ్వకాయము. అసమానమైన తేజస్సౌందర్యం. మేము పోగొట్టుకొనిన దండనాథులవారు తిరిగి మాకొరకు వచ్చినట్లుగా ఉన్నది." అనుచు గుఱ్ఱము దిగి తిక్కనగారిని సమీపించి ఆలింగనముచేసికొని పరవశులైరి. తిక్కన్నగారు అవనతశిరస్కులై మహారాజులవారియందు గౌరవమును ప్రకటించిరి.

మహారాజులవారు మహామంత్రి సిద్దన్నగారి వంక చూచుచు "అయితే వివాహలగ్నము మాటేమిటి? మేము దుగ్గయ్య దండనాథులవారి కుమార్తె చేయుచున్న ప్రాయోప వేశవృత్తాంతమును వినినాము. ఆసౌభాగ్యవతి తపస్సిద్ధురాలు. ఆమె తపస్సే మాకు కొమ్మన దండనాథులవారి కుమారుని తిరిగి సంపాదించిపెట్టినది. మాకు మహాభారతరచనాదక్షుడైన మహా కవిని సంపాదించి పెట్టినది. తపస్సిద్ధుల తేజస్సుతో విరాజిల్లు చున్న కొట్టరువు వారి కుటుంబముతో మాకుగల స్నేహబంధ ములు మాభాగ్యవిశేషమువలన లభించినవని భావించుకొను చున్నాము. వివాహానికి కావలసిన వస్తుసంభారమంతటిని మన కోశాగారమునుండి యేర్పాటుచేయించండి." అని గురు నాథుని వంక చూచిరి. మరల మహామంత్రిగారిని చూచుచు "కొమ్మన దండనాథులవారి ఋణమును తీర్చుకునే అవకాశం మాకు యీమాత్రమైనా యిప్పించండి" అన్నారు.

తరువాత మహారాజులవారు తిక్కన్నగారిని చూచుచు "ఉభయభావసరస్వతిని మావిద్యాసచివపదవితో అలంకరిస్తు న్నాము." అని తమ కంఠహారమును తిక్కనగారి మెడలో వేసిరి. అందరు జయజయధ్వానములు చేసిరి.

మహామంత్రి సిద్దన్నగారు, విద్యామంత్రి తిక్కన్నగారు 'మహాప్రసాదం' అని వినయకృతజ్ఞతాభావములను ప్రకటించిరి. మహామంత్రి సిద్దన్నగారు అంజలి ఘటించి "ఏకాదశినాటి పూర్వాహ్ణంలో ధనుర్లగ్నమును వివాహమునకు నిశ్చయించి

లిమి. విజయదశమినాటి విజయయాత్రాలగ్నమున తరలి వెళ్లవలెనని అభిప్రాయము." అని మనవిచేసిరి. మహారాజుల వారు మందహాసముతో బాగున్నది. కొమ్మన దండనాథులవారి కుమారుని వివాహమునకు మేమును తరలివచ్చుచున్నాము. మాకు శ్రీకాళహస్తిలో - పార్వతీపరమేశ్వరులదర్శనం కూడా లభిస్తుంది." అనిరి.

మహామంత్రిగారు, విద్యామంత్రి తిక్కనగారు అంజలి ఘటించి మరల "మహాప్రసాదము" అని హర్షకృతజ్ఞభావములను వెల్లడించిరి.

మహారాజులవారు విద్యామంత్రి తిక్కనగారి చేతులను తమ చేతులలోనికి తీసికొని "ఆజన్మసహజముగా మీరు వైదిక ధర్మనిష్ఠులన్నమాట. సాంగవేదవేదులకు తగిన కుమారులే. మీధర్మవ్యగ్రత పరమాశ్చర్యకరముగా నున్నది. వయస్సు యొనిమిది సంవత్సరములు. ఉపనయనమై కొన్నిమాసము లైనది. తలితండ్రు లిద్దరు నొకసారి దివంగతులు కాగా అంత్యక్రియలను యథావిధిగ నిర్వహించి - ఆసమయమున తలితండ్రుల అస్థికలను గంగానిమజ్జనము చేసినయెడల వారికి ఉత్తమలోకము లుండు నను శ్రౌతవాక్యములను విని - అస్థికలను తీసికొని - కాలినడకను అసహాయులై - కాశికి వెళ్లిరి. ఎవరితో చెప్పినా - చిన్నవాడవు నీవు కాశికి వెళ్లవలదని నిరోధింప వచ్చునని - యెవ్వరికిని చెప్పకయే వెళ్లిపోయితి రన్నమాట.

ఎంత ధర్మాభిరతి! ఎంత ధర్మనిష్ఠ. ఎంత పట్టుదల. అన్ని విద్యల లోను పారమునుముట్టి తిరిగివచ్చితి రన్నమాట.

కాశీలో నవద్వీపములో, జగన్నాథమున, రాజ మహేంద్రవరమున మీపాండితీ దిగ్విజయవార్తలు విన్నాము. మీరు విద్వద్వరేణ్యులై తిరిగివచ్చి మారాజ్యమునకు, ఆంధ్ర దేశమునకు ఘనత చేకూర్చితిరి." అని లాలించిరి. మరల మహా మంత్రిగారిని చూచుచు "వివాహోత్సవములైన తర్వాత మహాభారత ఆంధ్రీకరణమును గురించి ఆలోచించుదము" అనిరి.

## 5

పెద్దచానమ్మను మేనాలో కూర్చుండబెట్టుకొని, అశ్వా రూఢులై - పరివారసమేతముగా ఖడ్గతిక్కనగారు విక్రమ సింహపురమునుండి బయలుదేరి తదియనాటి పూర్వాహ్ణముననే శ్రీకాళహస్తిలో దుగ్గయ్యగారి గృహమును చేరిరి.

వచ్చిన ఖడ్గతిక్కన కారాగృహప్రాంగణమున జన సమూహమును చూచిరి. కైలాసపర్వతముమీద ప్రమథగణ సమూహమువలె పార్వతీ పరమేశ్వరధ్యానమగ్నమైయున్న ఆ జనసమూహమును చూచి అచ్చెరువుపడిరి. ఆయనను చూచిన జనము మౌనము త్యజింపలేదు. చలింపలేదు. లుక రింపలేదు. దీనమైన దృక్కులతో అచ్చటి సమాచారమును వ్యక్తముచేసిరి. ఖడ్గతిక్కనగారు మంచివార్త తెచ్చియుండ వచ్చునని వెలుగుచూపులు చూచిరి.

ఖడ్గతిక్కనగారు, పెద్దచానమ్మ లోపలకువెళ్లిరి. దుగ్గయ్య గారికి ఆయన భార్యకు పాదాభివందనములను చేసిరి. ఆయన దుగ్గయ్యగారితో "తమ్ముడు తిక్కన తిరిగి వచ్చాడు మామయ్యా" అని హర్షముతో చెప్పగా, దుగ్గయ్యగారు నమ్మశక్యము కానివార్త వినినట్లు చూచెను. ఖడ్గతిక్కనగారు మరల "నిజమే మామయ్యా! తిరిగివచ్చాడు. ఏకాదశినాడు పూర్వాహ్ణంలో ధనుర్లగ్నంలో వివాహానికి నిశ్చయము చేశారు. రేపు పురోహితులు లగ్నపత్రికతో వచ్చుచున్నారు." అని ఆనందమును వెలిబుచ్చెను. పెద్దచానమ్మ 'ఔను బాబయ్యా' అని దుగ్గయ్యగారి వంకచూచి మరల 'ఔను పిన్నమ్మా' అని ఆయన భార్యవంక చూచినది.

దుగ్గయ్యగారు ప్రకృతమునకువచ్చి ఖడ్గతిక్కనగారిని అభినందించి మరల మరల ఆలింగనము చేసికొనిరి. దుగ్గయ్య గారి భార్య పెద్దచానమ్మను అక్కునచేర్చుకొని ఆనందపరవశు రాలైనది. ఆవార్త ప్రాంగణములోని జనమునకు, ఊరిలోని జనమునకు ఆనందకారియయినది. పార్వతీ పరమేశ్వరులు తమ తమ తపస్సులకు మెచ్చి ప్రత్యక్షమై వరప్రదానము చేసినట్లు ఆ జనులందరు సంతోషభరితులయిరి. స్నిగ్ధమైన అను భూతిని పొందిరి.

ఊరిలోని జనము, దుగ్గయ్యగారు, ఆయన భార్య నిరాహారదీక్షను విరమించిరి. ఊరిలోనివారికి మనశ్శాంతి

కలిగినది. కాని చిన్నచానమ్మ మాత్రము పద్మాసనమున కన్నులు మూసికొని అట్లేకూర్చునియున్నది. చేతులను మోకాళ్లపై పెట్టుకొని కూర్చునియున్నది. చలనములేనట్లు యున్నది. నిట్ట నిలువుగా కూర్చునియున్నది. ఆమె కీశుభవార్త తెలిసినట్లు లేదు. ఈలోకమునందామె యున్నట్లులేదు. ఆమె కీవార్తను తెలుపుటకు చేసినప్రయత్నములు ఫలింపలేదు. ఎంత గట్టిగా చెప్పినను, కదలించినను ఆమె కనులు తెరువలేదు. చలనరహిత శిల్పాకృతిగా నున్నది. ఏమిచేయుటకు తోచక తలితండ్రులు, ఖడ్గతిక్కనగారు, పెద్దచానమ్మ వికలమైన మనస్సులతో ఆందోళనపడిరి. తీరిపోయిన దనుకున్నసమస్య ద్విగుణీకృతమైనట్లు గావచ్చినది. తాము పడిన సంతోషమునకు హేతువే లేనట్లు వారు నిరుత్సాహపడిరి. అయినను వివాహప్రయత్నములను సాగించుటకు నిశ్చయించిరి. మరునాడు పురోహితులు లగ్న పత్రికలను తెచ్చిరి.

దినములు గడచినను చిన్నచానమ్మ పరిస్థితిలో మార్పు రాలేదు. కాళహస్తిలోని జనమంతయు మరల చలించిపోయి నది. అందరును ప్రాతస్సాయంకాలములందాగృహమునకు వచ్చి, ఆమె సన్నిధానమున నిలచి, అంజలి ఘటించి, మౌన ధ్యానముచేసి, ఆమె తపస్సమాధికి విస్మయులై పోవుచుండిరి. మహాపండితులు వచ్చిచూచిరి. మహాభక్తులు వచ్చిచూచిరి. మంత్రశాస్త్రవేత్తలు వచ్చిచూచిరి. వారెవ్వరును ఆమెకు

సమాధిభంగము చేయలేకపోయిరి. ఆమెను లౌకికవిషయము లందు జాగరితము చేయజాలకపోయిరి.

ఒకవంక ఆందోళనతో క్రుంగిపోవుచు, మరియొకవంక పెండ్లిప్రయత్నములను సాగించుచుండిరి. ఆతలితండ్రుల పరిస్థితి దయనీయముగా దైన్యప్రమాణముగా పరిణమించినది.

అనుకొనినట్లు పెండ్లివారు తరలివచ్చిరి. మహారాజుల వారు వచ్చిరి. విద్వాంసులు, మంత్రులు, సామంతులు వచ్చిరి. మహారాజులవెంట చతురంగబలపరివారమువచ్చినది. ముఖ్యదళ వాయులు, దండనాథులు వచ్చిరి. ప్రముఖరాజోద్యోగులు వచ్చిరి. ముఖ్యులైన పౌరులు వచ్చిరి. వారివారికి తగిన వసతి యేర్పాట్లు చేయబడినవి.

ఊరివెలుపల పెండ్లివారికి స్వాగతములు నివేదించి, పానకము కావిళ్లు సమర్పించి, దుగ్గయ్యగారు పెండ్లివారిని తోడ్కొనితెచ్చిరి. మహారాజులవారికి దేవాలయమునకు సమీపమున విడిది యేర్పాటుచేసిరి. మహారాజులవారిని తక్కుంగలవారిని వారివారి వసతులకుచేర్చి—మహామంత్రి సిద్ధన్నగారి కుటుంబమువారిని తమ గృహసమీపమున విడిదికి చేర్చిరి. అక్కడికు చేరినతరువాత ఖడ్గతిక్కనగారు, దుగ్గయ్య గారు, మహామంత్రిగారికి, ప్రోలాంబకు చిన్నచానమ్మ పరిస్థితులను వివరించిచెప్పిరి. వారి కేమియు పాలుపోలేదు. పరుగులమీద వచ్చి చిన్నచానమ్మను చూచిరి. ఒక దేవతాస్త్రీ బాలికా

రూపము ధరించి తపస్సమాధిలో నున్నట్లుగాతోచినది. ఆమె అసదృశ తేజోవికాసభరితముగా నున్నది. ఆమెను పలుకరించిరి; లాభము కలుగలేదు. సమాధానము రాలేదు. తాకి కదలించిరి. ఆమె పరిస్థితిలో మార్పుకలుగలేదు. కన్నులు తెరువలేదు. చేతులుగాని పాదములుగాని కదల్పలేదు. దుఃఖపడవలెనో సంతోషపడవలెనో తెలియక కుమిలిపోయిరి.

మహామంత్రిగారు విడిదికి తిరిగివచ్చి పెండ్లికుమారుడు తిక్కనగారికి పరిస్థితులను తెలిపిరి. తిక్కనగారికి మాత్రమేమి తోచును ? పతివ్రతాశిరోమణియైన తనతల్లి అన్నమాంబాదేవి తనకోసమై దాచిపెట్టిన బాలవధువు తనకు దక్కునా ? వ్యగ్రమైన ఆమె భావనాబలముచేత తాను కాశీనుండి నిరుపద్రవముగ వచ్చెనన్నమాట. ఇప్పుడు తాను చేయవలసినదేమి? ఆలోచన రాలేదు. తాను వెళ్లి వధువును స్పృశింపరాదు. చూడరాదు తమకు యిలువేల్పులైన నల్లశాణాంబ, తిరుకాళయహత్తిదేవులను ధ్యానించెను. ఒక ఆలోచన మెరసినది. పురోహితులను పంపి ఆలయమునుండి నల్లశాణాంబప్రసాదమైన కుంకుమను తెప్పించి వధువునకు తిలకముపెట్టుడని పెద్దలకు చెప్పెను.

ఆలయమునుండి అమ్మవారి కుంకుమతెచ్చి వధువునకు తిలకముపెట్టిరి. ఆతిలకధారణముతో చిన్నచానమ్మ కదలినది. పద్మాసనమునుండి కాళ్లుమార్చినది. చేతులు త్రిప్పినవి. కన్నులు మాత్రము తెరువలేదు. ఇంకను లోకాంతరములందున్నట్లే

కన్పించినది. అందరకు ఆశ్చర్యమైనది. ఆమె మరల దక్కినదని అందరకు ధైర్యమువచ్చినది. వివాహలగ్నము సమీపించుచున్నదని గుర్తించిరి. ఆమె పది దినములుగా తపస్సమాధియందున్నప్పటికీ—ఆమె ముఖము వాడలేదు. శరీరమునకు చెమట పట్టలేదు. బట్టమాయలేదు. శిరోజములు చెదరలేదు. అంతకుమునుపే స్నానముచేసి నంతశుభ్రముగా నున్నది. ఆమె దీక్షారక్షితయగుటచేత తిరిగి మంగళస్నానప్రమేయములేదని, అమ్మవారి కుంకుమధారణమే సర్వమంగళాకటాక్షభరితమైన మంగళస్నానమని, తిక్కనగారి యదృష్టమునుబట్టి ఆమె కోలుకొనగలదని పెద్దలు చెప్పిరి.

వివాహక్రతువులో చిన్నచానమ్మ కనులు తెరువలేదు. ఆమెను తల్లియో, పెద్దచానమ్మయో పట్టుకొని పనులుచేయించిరి. ఆమె మనస్సు పనిచేయుచున్నట్లులేదు. ఆమె శరీరము తోలుబొమ్మవలె ప్రక్కవారాడించిన టాడినది.

తెరతీయగా తిక్కనగారు వధువును చూచి ఆనందమో సంభ్రమమో తెలియని స్థితియందుపడెను. ఆమె దేవీకరుణాకిరణమా—లేక దేవీపాదాబ్జజనితమరీచియా—అనిపించినది. భారతజాతికి మూలకందమైన పాతివ్రత్యధర్మం మూర్తికట్టినట్లుగా నున్నది. తనకొరకై తల్లిగారు దాచిపెట్టిన దివ్యతేజఃపుంజముల పెన్నిధానమువలె నున్నది.

మంగళసూత్రధారణజరిగినది. లాంఛనముగా రెండు దోసిళ్లు తలంబ్రాలు పోయించిరి. వధూవరులను దేవాలయము

నకు తీసికొనిపోయిరి. వధువు కన్నులు తెరువనేలేదు. ఆమె స్థితి అతిలోకముగా నున్నది. ఆమెను పల్లకిలో కొనిపోయిరి. పల్లకిని రాజగోపురము దాటించి సింహద్వారమువరకు తీసికొని పోయిరి. అక్కడనుంచి ఆమెను చేతులమీదుగా గైకొని పోయిరి. ఆమె తలితండ్రులు, మహామంత్రి సిద్ధన్నగారు, ప్రోలాంబ, ఖడ్గతిక్కనగారు, పెద్దచానమ్మ వెంట నుండిరి.

ముందు శ్రీకాళహస్తీశ్వరస్వామివారి దర్శనమునకు వెళ్లిరి. స్వామివారి కొక యభిషేకమును చేయించిరి. మంత్ర పుష్పము తరువాత తిక్కనగారు మహిమ్నస్తోత్రమును పఠించిరి. ఆగానము అమృతనిర్మితముగా నుండినది. ఏదో పోగొట్టుకొనిన దానిని తిరిగి ప్రసాదింపుమని దీనముగా ప్రార్థించినట్లున్నది. ఆదీనాలాపము ముఖారిరాగమధురమై వాయురూప పరమేశ్వరునియందు కరుణాతరంగములను కల్పించినట్లున్నది. ఆకరుణాతరంగపాతమునకు సన్నిధానమందున్న దీపజ్వాల అవనతమై మరల యథాపూర్వముగా జ్వలించినది. పంచముఖుడైన పరమేశ్వరుని మందహాసవైభవముగా, జటాపటలకోటీకటాహతటినీవికాసిచంద్రాతపమువలె ప్రకాశించినదాదీపజ్వాల. అందరును హర్షవివశులైరి. చిన్నచానమ్మ కనులు మూసికొని వారు నడిపించినట్లు నడచినది.

తరువాత జ్ఞానప్రసూనాంబికాదేవి మహాసన్నిధానమునకు వెళ్లిరి. తిక్కనగారు చిన్నచానమ్మను తన వామహస్తముతో పొదివిపట్టుకొనిరి. ఆమె కన్నులు మూసికొని ఆయన

వామభుజముపైన శిరముంచినది. స్మృతియున్నట్లులేదు. అమ్మ వారికి సహస్రనామావళి అర్చన జరిగినది. తిక్కనగారు గొంతు కలిపెను. నీరాజనమువేళ తిక్కనగారు త్రిశతీగానముచేయుచు కన్నుల కద్దికొని చిన్నచానమ్మ కన్నులకద్దుచు, ఆమె కన్నులవంక చూచిరి. చూచిన వాడట్లే చూచుచు నిలచిపోయెను. ఆమె కన్నులు తెరచినది. మరల తానే హారతి నద్దుకొన్నది. అందరు ఆనందపడిరి. ప్రసాదములు స్వీకరించి బయటకువచ్చువరకు తిక్కనగారామెను పొదివిపట్టుకొని నడిపించిరి. ఆమె ఆయన భుజముపై వ్రాలి నడచినది. ఆమె తిక్కనగారిని తదేకదృష్టితో చూచుచున్నది. పల్లకీవద్దకుచేరగా ఆమెకు పూర్తిగా స్మృతి వచ్చినట్లయి 'బావ' యని లజ్జతో చలించిపోయినది. ప్రక్కగా నున్న తల్లియు, పెద్దచానమ్మయు ఆమెను చేతులతో పట్టుకొనిరి. చిన్నచానమ్మకు పూర్తిగా స్మృతి వచ్చినదని అందరకు తెలిసినది. ఆమెకు పరిస్థితులు పూర్తిగా తెలిసినవి.

## 6

వివాహమహోత్సవ సందర్భముగా కార్యకలాపము లన్నియు పదునారవపండుగతో పూర్తియయినవి. నాలుగు సంవత్సరములుగా క్షీరపానముతో శుష్కించిన చిన్నచానమ్మ శరీరము పదిరోజులలో పూర్ణవికాసము పొందినది. తేజః పూర్ణమై యౌవనభరితమైనది.

పదునారవపండుగ నాడే మహారాజులవారు మహామంత్రి సిద్ధన్నగారిని, సేనాపతి ఖడ్గతిక్కన్నగారిని, విద్యామంత్రి

తిక్కన్నగారిని ముఖ్యమైన రాచకార్యమున్నదని ఆలోచనా మందిరమునకు పిలువనంపిరి. ముఖ్యమైన, ప్రమాదకరమైన, రహస్యమైన సమస్యలు లేకపోయిన నిట్టివ ర్తమానము రాదని వా రాందోళనపడిరి.

మహామంత్రి సిద్ధన్నగారు, సేనాపతులు ఖడ్గతిక్కనగారు, విద్యామంత్రి తిక్కనగారు ఆలోచనామందిరమును చేరు నప్పటికే మహారాజులవారు విచ్చేసియుండిరి. ఆయన తీవ్రాలో చనలో నుండినట్లుతోచెను. అన్యోన్యఅభివాదనల తరువాత అందరు నాసీనులైరి. మహారాజులవారి మనస్సులోని తీవ్ర సమస్య యెట్టిదో యితరులకు అవగాహన కాలేదు.

మహారాజులవారు మహామంత్రిగారిని, సేనాపతులను, విద్యామంత్రిని పరికించి చూచి, మరల మహామంత్రిగారిపై దృష్టినిలిపి "చోళరాజైన మూడవ రాజేంద్రచోళుని కర్ణాట సోమేశ్వరుడు మోసముగా సింహాసనభ్రష్టునిచేసి చెఱపట్టినట్లు చారులవా ర్త. ఇప్పుడు మనక ర్తవ్యం" అనిరి. మహామంత్రి గారు చకితులై 'చోళులు పూర్వమునుండి మనకు ఆప్తులు. మన దక్షిణపుసరిహద్దు కాపాడుకొనవలెనంటే చోళులు పునః ప్రతిష్ఠులు కావలెను." అన్నారు.

"మేమును ఆవిధముగానే భావించితిమి. రేపే మనము సేనలను కర్ణాట సోమేశ్వరునిపైకి నడిపిద్దాము. మేమే స్వయంగా రణరంగమునకు వచ్చి వ్యూహరచనచేస్తాము" అని

మహారాజులవారు తొందరపాటు [redacted] ఖడ్గతిక్కనగారు అంజలి బంధించి, ఒకసారి మహామంత్రిగారిని చూచి, తరువాత మహారాజులవారిని చూచుచు 'ఏలినవారు మన్నింపవలెను. గోటితో పోయేదానికి గొడ్డలిదేనికి? సోమేశ్వరుని లొంగదీయుటకు యేలినవారు రణరంగమునకు రానక్కరలేదు. కర్ణాట సోమేశ్వరుని లొంగదీయు అవకాశమును నాకు అనుగ్రహింపుడు. నేను యేలినవారికి సేనాపతినే గాక—తమవద్ద ఖడ్గవిద్యనభ్యాసముచేసిన శిష్యుడను. కర్ణాట సోమేశ్వరుని జయించి చోళరాజ్యమును స్వాధీనమును చేసికొని దానిని గురుదక్షిణగా సమర్పించుకొనే అవకాశమును నాకు అనుగ్రహించండి" అని ప్రాధేయపడిరి. మహారాజులవారు "మీ అభీష్టప్రకారమే కానివ్వండి' అనిరి.

విద్యామంత్రి తిక్కనగారు కల్పించుకొని "ఏలినవారు మన్నింపవలెను. నావిన్నపమును చిత్తగింపవలెను" అనగా మహారాజులవారు "చెప్పుడు" అనిరి. విద్యామంత్రిగారు చేతులుజోడించి మనవిచేసిరి.

"ఇప్పుడుమన రాజ్యమునకువచ్చిన తత్క్షణఉపద్రవము లేదు. మన శాంతిభద్రతలకు భంగము కలుగలేదు. మన ధనము వెచ్చించి మన సేనలను నడిపించి, మనవారి రక్తపాతమునకు పూనుకొనవలసినంత - మనవారిని బలిచేయవలసినంత ఉపద్రవము మనకేమి వచ్చినది? ఐతే మనము మిత్రధర్మము పాటింపవలసిన మాట వాస్తవమే. రాజేంద్రచోళుడు మన

కాపుడు. అతనికి మనము సాయపడవలసినదే. అందులకు ముందుగా సామదాన భేదోపాయముల నుపయోగించి కార్య సాధనము చేసికొనవచ్చును కదా? అవి నిష్ఫలమైనప్పుడు కదా యుద్ధప్రసక్తి! కర్ణాట వీరసోమేశ్వరుడు మనకు చోళులవలె ఆప్తుడుకాడు. ఐతే శత్రువుకూడ కాడు. పైగా యేలినవారి కడ ఖడ్గవిద్యనేర్చిన శిష్యుడు. ఆతనికి గురుభక్తి యుండ వచ్చును. స్వల్పపరివారముతో పోయి సేనాపతులవారును, నేనును కార్యము సాధించుకొనివచ్చెదము. గుప్తవేషములతో పోయెదము. ఏదైనా అవరోధము కలిగినచో మాకు అపాయములేదు. హస్తమునందు ఖడ్గమున్నంతకాలము మన సేనాపతులవారు త్రిలోకవీరులకు అజేయులు." అని విన్నపము చేసిరి.

మహామంత్రిగారు సాలోచనగా చూచిరి. ఖడ్గతిక్కనగారేదో చెప్పుటకు ప్రయత్నింపగా, మహామంత్రిగారు కనుసైగలతో వారించిరి. మహారాజులవారు కొలదిసేపు ఆలోచించి "మీ అభిప్రాయము సమయోచితముగా నున్నది. అట్లాగే చేదాము. నేడే బయలుదేరండి." అని ఉభయ తిక్కన గార్లను మహామంత్రిగారిని చూచిరి.

... ... ... ... ...

ఖడ్గతిక్కనగారు, విద్యామంత్రి తిక్కనగారు, అయిదు మంది పరివారజనముతో - గుప్తవేషములతో - కర్ణాటసోమేశ్వ

రుని రాజధానికి బయలుదేరి వెడలి రెండు నెలలైనది. వారి నుండి వార్తలు వచ్చుటలేదు. వారేమైపోయిరో యని ఆందోళనముగానున్నది. దినములు గడచిన కొలది భయాందోళనలు పెరుగుచున్నవి. చారులు తెచ్చిన వార్తలలో రాజేంద్రచోళు డింకను బందీగా నుండెను. కర్ణాటసోమేశ్వరుడు రాజధానిని వదలి గుప్తవేషముతో తీర్థయాత్రలకు వెళ్లినట్లు వినికిడి. అతడు మూడవరాజేంద్రచోళుని పట్టుకొని బందీచేసి విజయోత్సవములు చేయించి, తరువాత గుప్తముగా యాత్రలకు పోయెనట. ఆయన తీర్థయాత్రల కేదిక్కునకు పోయెనో చారులు చెప్పలేకపోయిరి. ఖడ్గతిక్కనగారు, విద్యామంత్రిగారు పరివారసమేతముగా పురము విడచి వెడలిన వారము దినములవరకు వారి క్షేమవార్తలు గూఢచారులు తెలిపిరి. ఆతరువాత వార్తలు లేవు. విక్రమసింహపురరాజ్య గూఢచారసంచారము లేని ప్రాంతమునకు పోయిరా? అని అనుమానము. అంతదూరముపోవుట కేమిపని? కర్ణాటరాజధానిలో తమ గూఢచారు లున్నారు. ఖడ్గతిక్కనగారి బృందము కర్ణాటకుని రాజధానికి రానేలేదని చారులవార్త. మరి వారెట్లు పోయినట్లు? మహాసేనాపతి, విద్యామంత్రి, మాయమైపోయినప్పుడు శాంతిగానుండుట యెట్లు?

## 7

మహామంత్రిగారికి, మహారాజులవారికి ఆహారము రుచించుటలేదు. నిద్రపట్టుటలేదు. దొరుకక దొరకిన కొమ్మన

దండనాథులవారి కుమారుని, వీరాగ్రేసరుడైన ఖడ్గతిక్కనగారిని పోగొట్టుకుంటిమని వేదనపడుచుండిరి. వీరసోమేశ్వరుని చేతిలో వీరు హతమైపోయిరేమో యని బలమైన యనుమానము; కాని ఖడ్గతిక్కనగారు అసహాయశూరుడు. విద్యామంత్రి తిక్కన గారు బుద్ధిశాలి. వీరిని శత్రువులు నిర్జింపగలరా ?

వారినుండి రావలసిన వర్తమానము రానప్పుడు ఆందోళన సహజమే. అదే సమస్య మహారాజులవారిని సంతతము వేధించుచున్నది. ఆనాటి సభలో మహారాజులవారు మహామంత్రిగారితో ఆదేవిషయము ప్రస్తావించి, తత్కాలకర్తవ్యమేమి టనిరి. మహామంత్రులవా రాసమస్యనే ఆలోచించుచుండిరి. మహారాజులవా రదే ప్రస్తావింపగా - మహామంత్రులవారికి మనస్సుపోయినది. దైన్యము ఆవరించినది. 'మనవారు శత్రువులకు చిక్కిపోయినట్లు నిశ్చయించుకొనవచ్చు'నని దీనముగా సమాధానము చెప్పిరి.

ఇంతలో సభాద్వారమున జయజయధ్వానములు వినిపించినవి. "జయజయ పరిఘురట్టపృథ్వీశ్వరశిరఃకందుకక్రీడావినోదా, జయజయ సేవణకటకవేణుకబళనదావపావకోపమానా, జయజయ ద్రవిడవార్ధిపరిశోషణబడబానలా, జయజయ రాయగండగోపాలా, జయజయ అరాతిభయదరాయా, జయజయ పెండార, జయజయ ఉభయరాయగండాంక, జయజయ చోళరాజ్యప్రతిష్ఠాపనా! జయజయా!" అని వైతాళికగద్య వినిపించినది.

మహామంత్రిగారి ముఖము విప్పారినది. మహారాజుల వారు ఉప్పొంగిపోయిరి. ఆయన ఆనందముతో "ఐతే మన వారు రాజేంద్రచోళుని తిరిగి సింహాసనస్థుని చేసివచ్చిరన్న మాట" అనుచుండగా ఖడ్గతిక్కనగారు, విద్యామంత్రి తిక్కన గారు సభలోనికి ప్రవేశించి అభివాదనలు చేసిరి.

మహారాజులవారు "మహాసేనాపతులవారు అపూర్వ శౌర్యధురీణులు. ఆయనకు మారాజ్యము ఋణపడియున్నది. చోళునిరాజ్యమున పునఃప్రతిష్ఠితునిచేసిన ఆయన శౌర్యరేఖ మన దక్షిణసరిహద్దును పటిష్ఠము చేసినది. ఈ ఋణమెట్లు తీర్చుకొనవలెనో" అనుచు సింహాసనమునుండి దిగివచ్చి ఖడ్గ తిక్కనగారి భుజముపై చేయివైచి "ఏమి తపంబుచేసి పరమే శ్వరు నెమ్మిట పూజచేసిరో, రాముని తల్లియుఁ పరశురాముని తల్లియు భీముతల్లియుఁ; కాముని కన్నతల్లియును కంజ దళాక్షు ననుంగుతల్లియుఁ; శ్రీమహితప్రతాపు డగు సిద్ధయ తిక్కనగారి తల్లియున్." అని సాధురమణీయముగా చదివి ఆనందాశ్రువులను రాల్చిరి. సభ హర్షపులకితమైనది. మహా రాజులవారు ఖడ్గతిక్కనగారిని ఆలింగనము చేసికొని - తమతో సింహాసనముకడకు గైకొనిపోయి తమప్రక్క కూర్చుండబెట్టు కొని ఆనందించిరి.

తరువాత మహామంత్రులవారిని చూచి "వెంటనే నిర్ణ యింపుడు! ఖడ్గమాత్రసహాయమున అఖండవిజయమును

సంపాదించిన సర్వసేనాపతుల కెట్టి మహాగౌరవసత్కారములు చేయవలెను?" అనిరి.

మహామంత్రులవారు మహారాజులవారికి అంజలి ఘటించి "విన్నవించుకుంటాను. ముదిమివలన మది తప్పు నన్న ఆరోక్తి నాయందు నిదర్శనముగా ఫలించినది. నన్ను యేలిన వారు అనుగ్రహించి నాకు పదవీ విరమణం ప్రసాదింపుడు. మహామంత్రి పదవిలోనుండి మనవారి కార్యదక్షతను నిరూపించుకొనలేకపోయితిని. జటిలసమస్య లిక నాకు దుర్గమములే. నేను పదవీవిరమణ చేయుట నాకు, రాజ్యమునకు, శ్రేయస్కరము. అవశ్యకర్తవ్యము. అనుజ్ఞ ఇప్పించుడు." అని ప్రార్థేయపడిరి.

ఖడ్గతిక్కనగారు మహారాజులవారి ప్రక్కనుండి లేచి - యెదురుగావచ్చి నిలువబడి-అంజలిబంధించి - ఒక పర్యాయము మహామంత్రులవారిని చూచి మరల మహారాజులవారియందు దృష్టినిలపి "ఒక ముఖ్యమైన విన్నపమును యేలినవారు చిత్తగించవలెను" అనిరి. మహారాజులవారు చెప్పుడన్నట్లు శిరఃకంపనము చేసిరి.

అంత ఖడ్గతిక్కనగారు "నాకు చూడగా మహామంత్రులవారి అభిప్రాయము నన్ను మహామంత్రిని చేయవలెనని యున్నట్లు తోచుచున్నది. ఆభావము యేలినవారికి సమ్మతము కావచ్చునని కూడ భావము కలిగినది. యథార్థమునకు నేను రాచకార్యనిపుణుడను కాను. నేను రణరంగవిహారుడనేకాని

రాజ్యకార్యభారధూర్వహుఁడను కాను. ప్రధానామాత్యపదవికి శేముషీ సంపన్నతకావలయును, శాంతచిత్తము కావలెను. బృహస్పతియొక్క బుద్ధి, చాణక్యుని రాజనీతి, యౌగంధరాయణుని ప్రజ్ఞ, వశిష్ఠుని తపశ్శక్తి, సుమంత్రునిగాఢ ప్రభుభక్తి కావలెను. సకలవిద్యాపారంగతత్వము కావలెను. అట్టి యోగ్యతలు నాకు లేవు. యోగ్యతాహీనుని గౌరవించినచో యోగ్యతలుకలవానిని అవమానముచేసినట్లే కదా. యోగ్యతకు సామర్థ్యమునకు ద్రోహము జరిగినట్లే యగును. నేను సాధించినట్లుగా భావింపబడుచున్న ఘనవిజయమునకు తోడైన బుద్ధి బలః మెవ్వరిది? అమోఘువచస్సు యెవ్వరిది? ఈసమ్మానమునకు అర్హత వారిది. వివరములు మనవిచేయుదును" అని సాభిప్రాయముగా చూడగా—మహారాజులవారు చెప్పుడన్నట్లు చూచిరి.

# 8

"మేము ప్రయాణము సాగించిన వారమునకు కావేరీ నదిని చేరితిమి. రేపో మాపో సోమేశ్వరుని రాజధానివచ్చుననగా మాకు వార్త తెలిసినది. సోమేశ్వరుడు స్వల్పపరివారముతో గుప్తముగా తన కులదైవమైన గోకర్ణేశ్వరుని సేవించుటకు వెళ్లెనట. అతడు వెళ్లి నాలుగైదు దినములైనదట. మేమాపరిస్థితులలో చేయవలసినదేమని ఆలోచించితిమి. అతనిని వెన్నంటివెళ్లిన—అతనికి స్థానబలము లేనిచోట సాముముగా

పనిజరుగవచ్చునని తోచి మేమును గోకర్ణమునకు ప్రయాణ మైతిమి.

మేము వేగముగా ప్రయాణముచేసి అతనిని మార్గమున కలసి కొనవచ్చునను కొంటిమి. ఆప్రాంతము మాకు క్రొత్తది. సమతలముకాదు. కొండలు. గుట్టలు. దుర్గమారణ్యములు. అరణ్యములలో వన్యమృగములు. ప్రయాణము సుకరముకాదు. సులభముకాదు. మాకు శీఘ్రయానము వీలుకాలేదు. అతనికి పరిచయమైన ప్రాంతము—ఆప్రాంతమున ప్రయాణమతనికి అభ్యాసము. మే మతనిని కలుసుకొనలేకపోతిమి. అరణ్యము లలో ప్రయాణించుచు, కొండలు దాటుచు, నదులను దాటుచు, రెండువారములు ప్రయాణించిన తరువాత తుంగానదీప్రాంత మును చేరితిమి.

అది నిసర్గరమణీయమైన ప్రదేశము. సుందరమైన పర్వ తములమధ్య, శ్యామలములైన కాననములతో ప్రశాంత గంభీరముగా నున్నది. అచ్చటనే శారదానిలయమైన శృంగగిరి క్షేత్ర మున్నది. శ్రీశంకరభగవత్పాద ప్రతిష్ఠాపిత చతు రామ్నాయపీఠములం దచట యజుర్వేద దక్షిణామ్నాయపీఠ మున్నది. కల్పాంతకాలము శృంగేరిలో నుందునని శారదాంబ భగవత్పాదులకు మాట నిచ్చెనట.

శ్రీభగవత్పాదులనుండి అవిచ్ఛిన్నపరంపరలో జగద్గురు వులుగా శ్రీవిద్యాతీర్థమహాస్వాములవా రున్నారు. శ్రీవారి

దర్శనము మాకు లభించినది. ఆయన వేదవేదాంగవేత్త. మధురవాగ్వైభవము కలవారు. వారిని మన విద్యామంత్రి "విద్యాతీర్థయతీంద్రోయమతిశేతేదివాకరమ్ । తమోహరతి యత్పుంసామంతర్వాహి రహర్నిశమ్" అని కీర్తింపగా వారు మందస్మితముతో ప్రసన్నులై ఆశీర్వదించిరి.

శారదామందిరమునకు ప్రక్క జనార్దనస్వామివారి ఆలయ మున్నది. దానిని శ్రీజ్ఞానఘనాచార్యులవారు పీఠాధిపతులుగా నున్నప్పుడు నిర్మించిరట. అచట చిన్న ఆలయ మున్నది. అక్కడ చిత్రమైన విగ్రహము లున్నవి. శ్రీశంకరుల శివకేశవాభేదభావమునకు రూపకల్పనగా హరిహరనాథ విగ్రహము లవి. అందొక దానియందు శివభాగము త్రిశూల రుద్రాక్షమాలలు ధరింపగా విష్ణుభాగము శంఖచక్రములను ధరించినది. ఆహరిహరనాథునికి లక్ష్మీపార్వతుల విగ్రహములు చెరియొకప్రక్క నున్నవి. ముందు నందివిగ్రహము గరుడ విగ్రహము కలవు. ఆహరిహరమూర్తిని చూచి మన విద్యామంత్రి పరవశత్వమున—

'శ్రీయన గౌరినాబరగు చెల్వకుచిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరి హరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చుమెచ్చుపరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్" అని

గానముచేసి శ్రీశంకరుల ప్రశ్నోత్తరమాలలో పరతత్త్వము శివకేశవసమ్మిళిత మని చెప్పినట్లుగా శిల్పాకృతియున్న దని

శ్లాఘించిరి. ఆప్రక్క మరియొక హరిహరవిగ్రహము. దానికి పరశుడమరములు శివచిహ్నములు. అభయముద్రాచక్రములు విష్ణుచిహ్నములు. దానిని చూచి "కిముస్థిమాలాంకిము కౌస్తుభం వా పరిష్క్రియా యాం బహుమన్యసేత్వమ్। కిం కాలకూటః కిము వా యశోదా స్తన్యం తవస్వాదువదప్రభోమే" అని ప్రార్థించిరి. శంకరుల భావముల కివి శిల్పాకారము లని, ఆయన విష్ణ్వీశ భేదమతివారణ పంచవక్త్రు లని కీర్తించిరి.

మేము జగద్గురువులవారి ఆశీస్సులతో ఉత్తరమునకు ప్రయాణముచేసి శరావతీనదిని చేరితిమి. అక్కడ మాకెదురుగా పదిమంది అశ్వారూఢులైన పరివారజనముతో రాజపురుషు డొకడు ఉత్తమాశ్వముపై వచ్చుచుండెను. అతడెవ్వడో మాకు తెలియదు. ఆబృందము మమ్ము సమీపింపగా మేము గుఱ్ఱములను నిలుపక నడపించితిమి. ఆబృందమును మేము పలుకరింపలేదు. తాను రాజపురుషుడై కన్పించుచుండగా తన కభివాదము చేయలేదని ఆబృందము నాయకునికి కోపము వచ్చినది. మమ్ము బంధింపుడని తన పరివారమునకు ఉత్తర్వులిచ్చెను. వారు మమ్ము చుట్టుముట్టిరి. మేము అప్రమత్తతతో నుండుటవలన ప్రమాదము జరుగలేదు. మాపరివారము వారైదుమంది కాకలుతీరిన యోధులు. వారా పదిమందితో తలపడిరి. ఆరాజపురుషుడు కత్తిదూసి చూచుచు నిలబడినాడు. నేనును విద్యామంత్రి తిక్కనగారును నిలబడి యుంటిమి. అరఘడియ పోరాటములో మనవారైదుమంది

వారి పదిమందిని నిలబెట్టిరి. మనవారు గాయపడలేదు. వారు కూడ గాయపడలేదు. వారును మహాయోధులే. కాని ఖడ్గ విద్యలో మనవారివలె ప్రత్యేకముగా శిక్షితులుకారు. మన వారి లాఘవము, చాలనము, వారిలో నలువురను అకస్మాత్తుగా గాయపరచినది. పోరాటములో మావారిది పైచేయి అయినది. మమ్ము జయింపశక్యముకాదని రాజపురుషునికి తెలిసినది. నేను గాని మన విద్యామంత్రిగాని కత్తి దూయనేలేదు.

ఇంతలో నేను అప్రమత్తతగా నుండుటగమనించిన ఆరాజపురుషుడు, కనురెప్పపాటులో లాఘవముగా గుఱ్ఱమును దూకించి—నాకత్తియొరను నేలకు పడవైచి—నాపై ఖడ్గము నెత్తి శిరము తెగవేయుటకు ప్రయత్నించెను. అప్పుడు మన విద్యామంత్రి "ఓరి నీచుడా! రణధర్మసింధువులో హాలాహలము వంటి నిన్ను శివప్రసాదలబ్ధశౌర్య విరాజితుడైన మాఅన్నగారు హరించి వేయుదురు." అనుచు గుఱ్ఱముపైనుంచి రాజపురుషుని ఱొమ్ముపై తన్నెను. అతడు క్రిందపడెను. అంతలో నేను ఖడ్గమును తీసికొని అతని మీదపడి నిరాయుధుని చేసి బంధించితిని. ఆతరువాత నేను మన పరివారజనముతో కలసి కత్తి దూయగా—అతని పరివారము లొంగిపోయి బందీలైరి.

అప్పు డారాజపురుషుడు క్షమాభిక్ష కోరి శరణాగతుడై—మేము బ్రాహ్మణుల మగుట గుర్తించి—బ్రాహ్మణ యోధులు విక్రమసింహపురవాసులు కాక మరెవ్వ రుందురని శంకించి తాను కర్ణాట వీరసోమేశ్వరుడ నని తెలుపుకొనెను.

మే మతనిని విడుదలచేయుటకు పెట్టిన షరతులనుబట్టి మమ్ము తడు గుర్తించి, యేలినవారి క్షేమసమాచారము లడిగి గురు భక్తిని ప్రకటించెను. మాషరతుల కంగీకరించెను. మే మతనిని విడుదలచేసితిమి. అతడు మమ్ము పరమాదరముగా తన రాజ ధానికి కొనిపోయెను.

రాజేంద్రచోళుని చెఱసాలనుండి విడచిపుచ్చి అతని రాజ్యమతని కిచ్చెను. ఏలినవారితో శాశ్వతమైత్రి వాంఛిం చుచు విన్నపములు వ్రాసికొని అమూల్యరత్నమాలాభూషణ ములతో శతగజయూథమును కానుకపెట్టి మమ్ము సాగనంపెను.

ఈవిజయయాత్రలో విద్యామంత్రి బుద్ధివైభవము, వాక్శుద్ధి విజయహేతువులైనవి. సమ్మానగౌరవములు చెంద వలసినది మన విద్యామంత్రిగారికి" అని ఖడ్గతిక్కనగారువిద్యా మంత్రిగారివంక చూడగా ఆయన వినయముగా అంజలి బంధించి నిలచెను.

మహారాజులవారు మహామంత్రి సిద్దన్నగారివంక "తమ అభిప్రాయము." అనినట్లు చూచిరి. మహామంత్రిగారు ఆమో దముచూపు దృష్టులతో తిక్కనగారిని చూచి, మగల మహా రాజులవారివైపు తిరిగి "నాకు సంతోషముగా నున్నది. ఏలిన వారికి తగిన ప్రధానామాత్యులు లభించిరి." అని మనవి చేసిరి.

మహారాజులవారు తిక్కనగారిని సమీపించి ఆలింగ నము చేసికొని "జయం, జయం, విక్రమసింహపుర మహా

మాత్యులవారికి" అనిరి. సభ జయధ్వానములు చేసినది. తిక్కన మహామాత్యులవారు, సిద్ధనామాత్యులవారిని, ఖడ్గ తిక్కనగారిని కృతజ్ఞతానమస్కారదృష్టులతో చూచి, మహారాజులవారికి అభివాదనము చేసి—

"కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కధా
త్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరికాచరితంబు గల్గునే
శైశవలీలనాఁడు పటుశౌర్యదురంధరబాహుఁడై నపృ
థ్వీశనరేంద్రమస్తకము నేర్తెఱఁ గందుకకేళిసల్పుడే
ఉకు మయగురుములూరికి నెత్తివచ్చినఁ గొనడె యాహవ
మున ఘోటకముల, దర్పదుర్జయులగు దాయాద నృపతుల
ననిలోన గఱపడే యాగ్రహమున, శంభురాజాది ప్రశస్తారి
మండలికము జేర్చి యేలడె కంచిపురము, చేవిమండలము
గాసిగ జేసి కాడవపతి నియ్యకొలుపడే పలచమునకు

రాయగండగోపాల! అరాతిభయద, రాయపెండారబిరుదాభిరామ! ఉభయరాయగండాంక!" అని శ్రీరాగమధురముగా మహారాజులవారిని కీర్తింపగా సభ జయజయారావ మధురమైనది.

## 9

ఆరాత్రి విక్రమసింహపురప్రభువులు చోడతిక్కమహారాజులకు నిద్రపట్టలేదు. అందుకు చాల కారణము లున్నవి. కుటుంబకారణములు, రాచకీయకారణములు.

మహారాజులకు యౌవనమునందే కళత్రవియోగమైనది. అప్పటికి మనుమసిద్ధి యువరాజు పసివాడు. తరువాత యువరాజును దాదులే పెంచిరి. మహారాజులవారికి యువరాజులవారికి సన్నిహితత్వ మేర్పడలేదు. వారు కలసికొనుటే అరుదు. అంతఃపుర పరిచారకులే వారిమధ్య వార్తావహులు. అంతఃపురములో వార్తలు ప్రయాణముచేయుట కేండ్లు పూండ్లు పట్టును. యువరాజులవారి స్నేహములు మంచివి కావని - నిష్ప్రయోజకులైన దాయాదులు అక్కన బయ్యన గార్లతో మిక్కిలి స్నేహమని - యువరాజులవారు వేశ్యావాటికకు పోవుచుండిరని - మహారాజులవారికా దినమే తెలిసినది. ఆవార్త లాయన మనస్సును కలతపెట్టినవి. నిద్ర రానీయలేదు.

తమది సూర్యవంశక్షత్రియుల కోవ. శ్రీరామచంద్రుని వంశము. తమ పూర్వపురుషులందరును శ్రీరామునివలె ఏకపత్నీ వ్రతస్థులు. కుమారుని వేశ్యాలోలత్వ మాయనకు చిత్తక్షోభ కలిగించినది.

వయసువచ్చినవారికి బుద్ధులు చెప్పుటెట్లు? తెలియనప్పుడుకదా చెప్పుటకు. బాధ్యతలు తెలిసి భారములు మోయవలసివచ్చినప్పుడు కుదుటపడవచ్చును. తాముమాత్రము తమ పూర్వపురుషులు ప్రవర్తించినట్లు ప్రవర్తించుచుండిరా? ఈవయస్సున పూర్వులు వానప్రస్థులుగా నుండెడివారుకదా!

మరునాడు తెల్లవారునప్పటికే మహారాజులవారు మహామంత్రి తిక్కనగారికి, ఖడ్గతిక్కనగారికి, పూర్వమహామాత్యులు సిద్దన్నగారికి, కోశాధికారి ఆత్మకూరు గురునాథునకు, యితర మంత్రులు ప్రబంధాంకము అన్నంభట్టు, భవ్యభారతి బయ్యనగార్లకు వర్తమానముచేసి ఆలోచనామందిరమునకు పిలిపించిరి. అందరు వచ్చిన తరువాత కూర్చుండ నియమించి మహారాజులవారు వారికి ట్లనిరి. "మీకు ముఖ్యమైన విన్నపము చేయవలసియున్నది. నలుబదిసంవత్సరములు మమ్ము మారాజ్యమును మహామంత్రి సిద్దన్నగారి బుద్ధిబలము పెట్టనికోటగా రక్షించినది. ఆయన అభిప్రాయములు రాజాజ్ఞలవలె మారాజ్యమునందు చెల్లుబడియగుచు వచ్చినవి. ఆయన అభిప్రాయములకు భిన్నముగా విక్రమసింహపురమునం దీనాటికి జరుగలేదు. ఈనాడును జరుగరాదు. నిన్నటిదినము వారు వృద్ధాప్యము వలన పదవీవిరమణము చేసి మాకును కర్తవ్యమును బోధించిరి. వారు బోధించిన నీతిని మేము పాలించుచుంటిమి.

మేమును సింహాసనమునుండి అవరోహణము చేయుచున్నాము. ఈపూర్వాహ్ణమునందే యువరాజులవారి పట్టాభిషేకమునకు, మా మహాప్రస్థానయాత్రకు ముహూర్తములు నిశ్చయించినాము. ఇది మా తుది ఆజ్ఞ. మన్నింపబడవలెను. మీ అందరి బుద్ధిబలము తెలుగుచోడ రాజ్యమునకు భవిష్యత్తునందుకూడ అండదండలుగా నుండవలెను. ఈ రాజలాంఛనములను పట్టాభిషేకసమయమున యువరాజులవారికి.

సమర్పించుడు." అని మహారాజులవారు రాజలాంఛనములను మహామంత్రి తిక్కన్నగారి కిచ్చిరి.

లోపలకు వెళ్లి నిరలంకారముగ శ్వేతవస్త్రములతో వచ్చిరి. అందరకు నమస్కరించి "ఇక మాకు మిగిలినది మా యిష్టదేవతాదర్శనము, చివరసారి సిద్ధన్న మహామాత్యుల వారిని వారిగృహమునందుండగానే సేవించి శలవు తీసి కొనుట." అని బయటకు వచ్చిరి. మహారాజులవా రిదివరకే వర్తమానము చేసియుండుటవలన నునుమసిద్ధి యువరాజుల వారు వచ్చివేచియున్నారు. ఆయనకు తండ్రిగారి వేషము బోధపడలేదు. సంభ్రమచకితులై పాదాభివందనము చేసిరి. మహారాజులవారు మౌనముగా ఆశీర్వదించి మహామంత్రి తిక్కనగారివంక చూచిరి. ఆయన యువరాజులవారికి క్లుప్తముగ వివరములు తెలిపిరి. యువరాజులవారు దుఃఖమును భరింపలేక తండ్రిగారి పాదములమీద వ్రాలిపోయిరి. ఆయన కుమారుని లేవనెత్తి మహామంత్రి తిక్కనగారి చేతులలో నుంచిరి. మహామంత్రి తిక్కనగారు యువరాజులవారిని అనుస రించుచుండగా మహారాజులవారు చరచరా వెళ్లిపోయిరి.

పాదచారులై శీఘ్రగమనముతో తిక్కదేవమహారాజుల వారు శ్రీరంగనాథస్వామివారి ఆలయమునకు వెళ్లిరి. అచ్చట నిత్యార్చన జరిగినంతసేపు నిలచిచూచిరి. నగరములోని జనము నకు మహారాజులవారు రాజలాంఛనములు లేకుండా, శ్వేత వస్త్రసాధువులై పాదచారులై వెళ్లుట అపూర్వమైన సందర్భ

ముగా భాసించి—కారణము తెలియక తబ్బిబ్బులై పోయిరి. కాని వెనువెంటనే కారణములు గుసగుసలుగా, ధ్వనులుగా - వార్తలుగా తెలిసినవి. అప్పుడు నగరప్రజలకు తమ మహా రాజులవారు రఘుమహారాజుగా, జనకమహారాజుగా, దిలీప మహారాజుగా, ధర్మరాజుగా తోచి— అట్టి మహారాజుల పరి పాలనలో నింతకాల మున్నందులకు సంతోషము— నేడు పోగొట్టుకొనుచున్నందుకు దుఃఖాతిరేకము— యేకకాలమున పొంది—ఆనందదుఃఖబాష్పములను కురిసిరి. జయజయ ధ్వాన ములు చేసిరి. ఆయన మౌనముగా శిరఃకంపనముతో కృతజ్ఞ తలు తెలిపిరి. రాజసభలో మనుమసిద్ధి యువరాజులవారికి పట్టా భిషేకము జరిగినంతవరకు తిక్కదేవచోళరాజులవారు శ్రీరంగ నాథస్వామివారి ఆలయమునందే యుండిరి. తరువాత సిద్దన్న మహామాత్యులవారి గృహమునకు వెళ్లిరి.

సిద్దన్న మహామాత్యులవారు, ఖడ్గతిక్కనగారు మహా మంత్రి తిక్కనగారు తిక్కదేవ చోళమహారాజులవారి కోసము వేచియుండిరి. మహారాజులవారికి స్వాగతముచెప్పి లోపలకు ఆహ్వానించిరి. మహారాజులవారు బహిఃప్రాంగణములోనే నిలచి పోయి తమకు గృహములో ప్రవేశించు అధికారము లేదని చెప్పిరి. ఇక ఆసనముమీద కూర్చుండుటకూడ లేదనిరి. తిక్క దేవ చోళమహారాజులవారు సిద్దన్న మహామాత్యులవారికి పాదాభివందనముచేసి "మీరు నాకు ఆబాల్యమిత్రులు. ఆప్తసచివులు. ఏవిగాని తొందరమాటలు చెప్పియున్న మన్నిం

ఫుడు." అని అంజలి బంధించి ప్రార్థేయపడిరి. మరల వారిని చూచుచు "నాకేదైనా ఉపదేశం అనుగ్రహించి ఆధ్యాత్మిక ఉన్నతికిమార్గము చూపించండి" అనిరి.

సిద్దన్న మహామాత్యులవారు "నేను ఆబాల్యము రాజ్యకార్యభారంలోపడి అర్షవిద్యలను సాధనచేయలేదు. తమకు మార్గోపదేశముచేయగల ఆధ్యాత్మికశక్తి నాకు లేదు. ఈచిరంజీవి అమలోదాత్తమనీషి. మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుడు. ఇతనిని ఆశ్రయింపుడు" అని మహామంత్రి తిక్కనగారిని చూపిరి.

మహారాజులవారు మహామంత్రి తిక్కనగారికి పాదాభివందనముచేసి అంజలి బంధించి వినీతులై నిలచిరి. మహామంత్రి తిక్కనగారు "మహారాజా మీరు కఠినమైన వ్రతమును స్వీకరించిరి. మీరు యుధిష్ఠిర మహారాజువంటి రాజర్షులు. మీకు ఉపదేశింపవలసిన దేమున్నది? ఈమహాప్రస్థాన యాత్రా సంకల్పమువలననే తమరు ఉన్నతకక్ష్యను చేరిపోయిరి. ఇక మౌనముగా ఉత్తరదిక్కుగా—నిరాహారముగా ముందునకు నిర్విరామముగా నడచిపోవడమే. వెనుకకు తిరిగి చూడరాదు. రాత్రింబవళ్లు విరామము లేకుండా నడువవలెను. శబ్దోచ్చారణమే చేయరాదు. 'అచ్యుతానంద గోవింద' నామత్రయమును మానసికముగా మననము చేయుచుండవలెను. ఈపరిస్థితులలో దీనికన్న దీర్ఘ ఉపదేశమునకు సావకాశము లేదు. మహాభారతమున పాండవుల మహాప్రస్థాన యాత్రావివరములు మీకు

తెలియనివి కావు. పాండవులను అనుసరించండి. ఇష్టదైవమైన శ్రీరంగనాథస్వామివారి సన్నిధానమును మానసికముగా కల్పించుకొని నామత్రయము జపముచేయుడు. అదిగో మీ వంశమూలపురుషుడు సూర్యనారాయణుడు ఆకాశమధ్యమునకువచ్చియున్నారు. ఆయన అధోమార్గగామి కాకమునుపే మీమహాప్రస్థానయాత్రను ప్రారంభింపుడు" అనిరి.

ఇంతలో లోపలనుండి ప్రోలాంబ, పెద్దచానమ్మ, చిన్నచానమ్మ మంగళహారతులు తెచ్చిచూపిరి. వారు ముప్వురు వారి భర్తలకు ప్రక్కన నిలువబడగా—మహారాజులవారు వారందరకు సమిష్టిగా ప్రదక్షిణముచేసి సాష్టాంగముచేసిరి. ఒక పర్యాయము సిద్ధన్న మహామాత్యులవారిని, మరొకసారి మహామంత్రి తిక్కనగారిని చూచి, కన్నులందు నీరు నిలువగా ఉత్తరదిక్కుగా తిరిగి చరచరా నడచి వెళ్లిపోయిరి.

వెనుకనున్నవా రీయారుమంది 'అచ్యుతానంతగోవింద' యని ఉచ్చైస్స్వరములతో పలికిరి.

## 10

మనుమసిద్ధి మహారాజులవారి పట్టాభిషేకము జరిగిన మరునాటి యుదయము రాజధాని నగరమంతయు నల్లకల్లోలముగ నున్నది. ఆగడచినరాత్రి సర్వసేనాపతులవారు అకస్మాత్తుగా చతురంగబలముతో పురమువదలి వెళ్లిరట. వా రేకార్యమునకై వెళ్లిరో తెలియుటలేదు. చతురంగబలములో ఆశ్విక

దళమునకు నాయకుడైన గంగయసాహిణిని రాజోద్యోగులు ఖైదుచేసిరి. కారణమేమిటో తెలియుటలేదు. ఊరంతయు సైనికుల మయముగా నున్నది. ఆంతరంగిక శత్రువు లెవ్వరో సైనిక తిరుగుబాటునకు ప్రయత్నించిరనియు, వారందరను అదుపులోనికి తీసికొనిరనియు చెప్పికొనుచుండిరి. రాజోద్యోగు లింకను శోధించుచునే యుండిరి. విద్రోహులు మరికొందరు పట్టుపడవచ్చునని జనము చెప్పుకొనుచుండిరి.

పూర్వమహారాజులవారు మహాప్రస్థానమునకు వెళ్లుట, క్రొత్తగా యువరాజులకు పట్టాభిషేకము జరుగుట, సిద్ధన్న మహామాత్యులవారు పదవీ విరమణము చేయుట క్రొత్తగా తిక్కన్నగారు మహామంత్రులగుట—యిట్టిమార్పులు తమకు అనుకూలముగానున్నవని పాతవ్యవస్థలు తొలగి క్రొత్తవ్యవస్థలు రూపుకట్టని సంధిసమయములో తిరుగుబాటునకు తగిన వేళయని భావించిన విద్రోహులు తిరుగుబాటునకు ప్రయత్నించిరని, మహారాజులవారిని బందీగా పట్టుకొనుటకు ప్రయత్నించిరని, కాని మతిమాణిక్యులు నీతిచాణక్యులు అగు మహామంత్రి తిక్కనగారు పరిస్థితులు విషమింపకమునుపే సమయోచిత చర్యలను గైకొనిరని జనము చెప్పుకొనుచున్నారు.

సూర్యోదయమైన ఝామునేపటికి సమావేశమైన రాజసభలో గంగయసాహిణి బందీగాతీసికొని రాబడినాడు. సభా ప్రారంభమున జరుగవలసిన లాంఛనములు మర్యాదలు జరిగిన

తరువాత గంగయసాహిణి చేసిన రాజద్రోహ నేరము విచారము నకు వచ్చినది. మహారాజులకు పట్టాభిషేకమైన మరుదినము. అకస్మాత్తుగా విజృంభించిన విప్లవము అణచివేయబడిన దినము. నగరములో జనుల సంభ్రమాశ్చర్యములకు కౌతూహలము నకు మేరలు లేవు. జనులు తండోపతండములుగ రాజసభకు వచ్చిరి.

గంగయసాహిణి కాయస్థుడు. ఔత్తరాహుడు. అశ్వ హృదయ మెరిగిన శూరశిఖామణి. తిక్కదేవ మహారాజులకు ఆప్తుడు. వా రతనిని అశ్వికదళాధిపతిని చేసిరి. అతడు మహా పరాక్రమవంతుడు. అనేక యుద్ధములలో విజయము చేకూర్చిన వాడు. అతని ప్రభుభక్తికి శౌర్యమునకు మెచ్చి మహారాజులవా రతనిని ఉత్తరపెన్నామండలమైన గండికోట మండలమునకు సామంతునిగా నియమించిరి. అతని రాజధాని నగరము వల్లూరు. సామంతుడై యుండి అశ్వికదళాధిపత్యమును నిర్వహించుచుం డెను. ఎక్కువకాల మతడు రాజధానియందే నివసించును.

విక్రమసింహపుర రాజ్యమునకు ఆగ్నేయమున చేది రాజ్య మున్నది. దానికి కాడవులు ప్రభువులు. వారికి తెలుగు చోళులతో వైరము. గంగయసాహిణి కాడవపతితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండెనట. కాడవపతి సహాయమును అర్థించెనట. తిరుగుబాటు చేయుటకు కుట్రపన్నెనట. తగిన సమయమునకై వేచియుండెనట. మార్పులువచ్చిన సమయము

తగినదని కాడవపతి సహాయమునకై చారుని పంపెను. ఆ ఆచారుడు రహస్యలేఖతో రాజోద్యోగులకు చిక్కెనట.

ఆనాటనుండి నాలుగవనాటి రాత్రి మూడవయామమున తన ఆశ్వికదళముతో—తనకు ఆప్తులైన పదాతిదళవాయి మిత్రులతో కలసి తిరుగుబాటుచేసి మహారాజులను, సేనాపతులను, మంత్రులను చెఱబట్టవలెనని కుట్రయట. ఆవేళకు కాడవపతిసేనలతో వచ్చినచో తన పని సులభమగునట. ఆరహస్యలేఖలోని సమాచారము లివి..

సభలో మనుమసిద్ధి మహారాజులవారు సింహాసనస్థులై యున్నారు. మహామంత్రులు, మంత్రులు, సామంతులు, పురోహితులు, దండనాథులు ప్రాడ్వివాకులు తమ తమ స్థానములందుండిరి. గంగయసాహిణి అతని అనుచరవర్గము నిందితుల స్థానమునం దుండిరి. సేనాపతులు ఖడ్గతిక్కనగారు సభలో లేరు. నగరపాలకుడు నేరారోపణచేసి, నిందితులను సభకు పరిచయముచేసి, సాక్ష్యాధారములైన పత్రములను చదివి, ఆపత్రములను ప్రాడ్వివాకుల ముందుంచెను.

సాక్షులు విచారింపబడిరి. వారందరు ఆరోపింపబడిన నేరమును బలపరచుచు వాఙ్మూలముల నిచ్చిరి. నేరము ఋజువైనట్లే సభకు తోచినది. ప్రాడ్వివాకులు నిందితులను పేరు పేరు వరుసగా పిలచి వారు చెప్పుకొనవలసినదేమిగాని కలదేని చెప్పుకొమ్మనిరి. నిందితు లెవ్వరు నేరారోపణకు వ్యతి

రేకముగా చెప్పలేదు. వా రసలు చెప్పికొన్నదేమియు లేదు. మాటాడనేలేదు. తలయెత్తి సభను చూడలేదు.

గంగయసాహిణి దిగ్భ్రాంతునివలె - మనస్థిమితము లేనివానివలె పిచ్చిచూపులు చూచుచుండెను. అతడును మాటాడలేదు. సభలో జరుగుచున్న విచారణను పట్టించుకొన్నట్లు లేదు. నిందితు లందరు శిరస్సులు వంచుకొని యుండిరి. నిందితుల తరఫున వేరెవ్వరైన చెప్పుకొనవచ్చు నని ఆనతివచ్చినది. ఎవ్వరును మాటాడలేదు. సభవారు నిశ్శబ్ద ముగా వేచియుండిరి.

మహామంత్రి తిక్కనగారు లేచి నిలువబడిరి. ఏదో ముఖ్యసమాచార ముండునని సభాస్తారులు కౌతూహలాయత్త చిత్తులై యుండిరి. గంగయసాహిణితోపాటు అతనికి ముఖ్యుడైన వీరయసాహిణి నిందితులలో నొకడు. మహామంత్రిగా రతనిని ఉద్దేశించి "వీరయసాహిణీ! నీవు సత్యము చెప్పినచో నీకు మహారాజులవారు ప్రాణభిక్షను పెట్టుదురు. లేకపోతే మరణశిక్ష తప్పదు. నీవు చెప్పకపోయినను సత్యము బయట పడక తప్పదు. నిర్దోషులు విడువబడుదురు. దోషులు శిక్షింప బడగలరు. ఈపాటికి సేనాపతులవారిచేతిలో కక్కన గంగన బందీ అయివుండును." అని చెప్పగా వీరయసాహిణి వెలవెల లాడి చలించిపోయెను.

అతడు ముందునకువచ్చి మహారాజులవారికి, మహామంత్రులవారికి, ప్రాడ్వివాకులకు, సభకు నమస్కరించి, విన్నపము చేసెను.

"తాను గంగయసాహిణికి ఆప్తుడు. అంగరక్షకదళమున తాను ప్రధాని. గంగయసాహిణి గండికోట మండలేశ్వరుడు. దానికి సరిహద్దున సిద్ధవటమండల మున్నది. దాని సామంత ప్రభువు రక్కసగంగన. గంగయసాహిణికి, రక్కసగంగనికి నిత్యవైరము. అమితమైన పరస్పరద్వేషము. సరిహద్దులలో మండలేశ్వరులగుటవలన నెక్కువివాదములు. రక్కసగంగన రాచనీతిచతురుడు. విక్రమసింహపురప్రభువుల అనుగ్రహమున్నంతకాలము గంగయసాహిణిని రక్కసగంగన జయింపలేడు. అందుచేత పన్నాగ మొకటి పన్నెను. సిద్ధవటములోనున్న తనభార్య బంధువులద్వారా తనకు ఆశలు చూపి గంగయసాహిణిని కూలద్రోయుటకు తన సాయము కోరెను. తనకు పదిగ్రామముల అమరమాగాణము నిత్తుననెను. ఆశ పెద్దది. తా నావలలో పడి అతని చేతికీలుబొమ్మయి పోయెను. గంగయసాహిణి ముద్ర తనకు తేలికగా లభించును. దానితో తానే కాకతపతికి లేఖను సృష్టించి రాజోద్యోగులచేతిలో పడునట్లు చేసెను. గంగయసాహిణి కూలబడునని తాను భావించెను. తాను అనుమానింపబడవచ్చు ననుకొనలేదు. ఈ పన్నాగములో గంగయసాహిణికిగాని, యితర నిందితులకుగాని సంబంధము లేదు. వారు నిర్దోషులు."

ఆ మాటలు విని సభాస్తారులు నిర్ఘాంతపోయిరి. మహామంత్రి తిక్కనగారు లేచి "ఇతడు చెప్పినది సత్యము. ఆలేఖ కల్పితమైనదని మే మెఱుగుదుము. కాని సత్యము రాజసభలో వెల్లడికావలెనని గంగయసాహిణిని, అతని అనుచరవర్గమును మేము బంధించితిమి. రక్కెసగంగని సన్నాగములు మహారాజులవా రెరుగుదురు. నిన్న మధ్యాహ్నమే అతనిని రాజధానికి ఆహ్వానించుచు ఆహ్వానము వెళ్లినది. అతడు స్వల్ప పరివారముతో బయలుదేరి వచ్చుచుండగా త్రోవలో మహాసేనాపతులవా రతనిని బందీచేసినట్లు యిప్పుడే వార్త వచ్చినది. అతడు తన తప్పిదము నంగీకరించుచు చేసికొన్న విన్నపమును మహాసేనాపతులవారు పంపిరి." అని నివేదించిరి. గంగయసాహిణి అతని అనుచరులు విడుదలచేయబడి తమ తమ గౌరవస్థానములం దాసీనులైరి.

మహారాజులవారు గంగయసాహిణి తమ తండ్రిగారి యందు భక్తికలవాడని, తమకుకూడ అతని భక్తియుక్తమైన సేవ లభించునని విశ్వసించుచుంటి మని చెప్పిరి. అతడు విక్రమసింహపురమునకు చేసిన సేవకు బహుమానముగా సిద్ధవటమండలాధిపత్యము నొసగుచుంటిమని రక్కెసగంగని దేశము నుండి బహిష్కరించుచుంటి మని తమ ఆజ్ఞలను సభకు చెప్పిరి.

సభలో జయజయధ్వానములు మిన్నుముట్టెను. క్రొత్త మహామంత్రులవారి శక్తిసామర్థ్యములను, క్రొత్తమహారాజుల

వారి ప్రతిభాశక్తులను కొనియాడుచు సభికులు గృహములకు చేరిరి. ఆదినమే రక్కెసగంగన విక్రమసింహపురరాజ్యపు సరిహద్దుల వెలుపల వదలిపెట్టబడెను.

# 11

రాజులు మారినప్పుడు - ఆరాజ్యములే. రూపు మారి పోవుట చరిత్రలో సాధారణమైన విషయమే. క్రొత్తరాజు నిలువత్రొక్కుకొనులోపల, విప్లవములు, కలహములు, తిరుగుబాట్లు తప్పవు. శత్రువిజృంభణము తప్పదు. మనుమసిద్ధి మహారాజులవారు క్రొత్తగా రాజ్యమునకు వచ్చినప్పుడు రక్కెసగంగన చేసిన పన్నాగమేకాక మరికొన్ని కష్టములు వచ్చినవి. పరిహద్దులలోని శత్రురాజులు బలములతో దాడివెడలుటకు సిద్ధము కాజొచ్చిరి.

విక్రమసింహపురరాజ్యమునకు అద్దంకిరాజ్యము ఉత్తరముగానున్నది. శాలంకాయనగోత్రులైన మహారాష్ట్రబ్రాహ్మణప్రభువులు అద్దంకిపాలకులు. వారికి ద్విజరాజు లని పేరు. ఆకాలమున అద్దంకిపాలకుడుగా నున్నది సారంగపాణి దేవ మహారాజు. ఆయనకు మహామండలేశ్వర, మహావిషమమహాహయారూఢ, ప్రౌఢరేఖావసంత, పరబలకృతాంత, శరణాగతవజ్రపంజర మండలీకరవాందోళి జీవరక్ష, చక్రనారాయణ మొదలగు బిరుదము లున్నవి.

అద్దంకి ప్రభువులకు, విక్రమసింహ పుర ప్రభు వు ల కు వంశానుగతవైరము. విక్రమసింహపురమున అకస్మాత్తుగా

క్రొత్తరాజు, క్రొత్తమహామంత్రి పదవులలోనికి వచ్చిరని అద్దంకిపాలకులు తెలిసికొనిరి. వారిరువురు యువకులు. అనుభవము లేనివారు. క్రొత్తలో వారిని జయించుట తేలికయైన పని యని అద్దంకిపాలకు లభిప్రాయపడిరి.

అద్దంకిప్రభువుల చతురంగబలములో అశ్వికదళము గొప్పది. దానికి స్వయముగా సారంగపాణి దేవమహారాజుల వారే నాయకత్వము వహించుచుండిరి. అశ్విక దళమువారు మహాధానుష్కులు. ఖడ్గవిద్యావేత్తలు. దక్షిణభారతమున వారినిమించిన అశ్వికదళమువారు లేరని ప్రశస్తి కలదు.

చతురంగబలములతో - ముఖ్యముగా అమితబలవంతమైన అశ్వికదళమువారి ఆధిక్యముతో, అద్దంకిపాలకుడైన సారంగపాణిదేవమహారాజు విక్రమసింహపురముపైకి దండెత్తుటకు సిద్ధపడుచుండిరి.

చారచక్షువులైన విక్రమసింహపురమహామంత్రులకు అద్దంకివారి సన్నాహములు ముందుగా తెలిసినవి. మహామంత్రులవారు అనుభవజ్ఞులైనవారిని పిలిపించి రహస్యాలోచనలను జరిపిరి.

"శత్రువుల అశ్వికబలము గొప్పదే. కాని వారు మన సైనికులంత ఖడ్గవిద్యానైపుణ్యము కలవారు కారు. అద్దంకివారిసేనలు మనపురమునకు వచ్చినప్పుడు రణరంగమున మనము చీల్చి చెండాడగలము." అని సేనాపతులు ఖడ్గతిక్కనగారు తమ అభిప్రాయమును చెప్పిరి.

"యుద్ధము మన పురసమీపమున జరిగినప్పుడు మన సామాన్యప్రజల కెన్నో కష్టములు. మన కెన్నో సమస్యలు. సాధ్యమైనంత తక్కువ రక్తపాతముతో, తక్కువ జననష్టముతో, తక్కువ వ్యయముతో - దాడివచ్చుచున్న సేనలు మనపురమును చుట్టుముట్టక మునుపే పరాభూతులను చేయుట జరుగవలసిన కర్తవ్యము. అందుకు తగినట్లు వ్యూహ రచన చేయవలయును." అని మహామంత్రుల వారి అభిప్రాయము.

మహారాజుల వారి కా అభిప్రాయము ఆచరణయోగ్యమైనదా యని సందేహము కలిగినది. మహామంత్రులవారు తమ వ్యూహరచనావివరములను మనవి చేసిరి. సేనాపతులైన ఖడ్గతిక్కనగా రావ్యూహమును ప్రశంసించి కొన్ని ముఖ్యమైన మార్పులను సూచించిరి. మహామంత్రులు, సేనాపతులు, మహారాజులవారు వ్యూహమును పటిష్ఠముగా నిశ్చయించిరి.

సారంగపాణిదేవమహారాజులవారు సైన్యములతో మజిలీలు చేసికొనుచు వచ్చుచుండెను. ఆయన బలములు కందుకూరు ప్రాంతాటవులు చేరినవి. అవి దట్టమైన అడవులు.

అద్దంకివారి సైన్యములు అడవిలో - ఒక మైదానము నందు విడిది చేసినవి. అక్కడ గుడారములను నిర్మించుకొని రాజోద్యోగులు, దళవాయిలు, దండనాథులు, మహారాజుల వారు గుడారములం దుండిరి. ఆ ప్రాంతముచుట్టును చెంచుగూడెము లున్నవి. కొంచెము దూరమున పాలేరునది యున్నది. ఆశ్వికదళసైనికులు, పదాతిసైనికులు, గజసైనికులు వృక్షముల

నీడలలో విశ్రాంతితీసి కొనుచుండిరి. గుఱ్ఱములకు మాలీసు చేయువారు గుఱ్ఱములను నీరు త్రావించుటకు పాలేటినదికి తీసి కొనిపోయిరి. అయిదువేల గుఱ్ఱములు బారులుతీర్చి వెళ్లినవి. గుఱ్ఱములవెంట మాలీసువారికి సహాయముగా వేయిమంది ఆశ్వికసైనికులు, వేయిమంది పదాతిసైనికులు నడచివెళ్లిరి. గుఱ్ఱములు పాలేటినదిలోనికి దిగి నీరుత్రాగుచున్నవి. వెంట వెళ్లిన సైనికులు ప్రమత్తులుగా నుండిరి.

ఇంతలో పదివేలమంది మహాధానుష్కులు హఠాత్తుగా వచ్చి వారందరను చుట్టుముట్టిరి. గుఱ్ఱము మాలీసువారు నిరా యుధులు. వేయిమంది పదాతిసైనికులు, వేయిమంది పాదచారు లైన ఆశ్వికులుగాని ప్రమత్తులుగానున్నప్పుడు- సర్వాయుధ సన్నద్ధముగా వచ్చిన పదివేలమంది మహాధానుష్కుల నెదు ర్కొనజాలరు. తేలికగా వారందరు బంధింపబడిరి. అయిదు వేలమంది ధానుష్కులు గుఱ్ఱములను స్వాధీనముచేసికొని, పరువులెత్తించు కొనిపోయిరి.

బంధింపబడిన గుఱ్ఱమువారి, ఆశ్వికదళమువారి, పదాతి దళమువారి ఆక్రందనము విని సైనికగుడారములనుండి జనము పరువులెత్తికొని వచ్చిరి.

అంతలో సర్వాయుధసంపన్నములై, సర్వసన్నద్ధములై, విక్రమసింహపురసేనలు చెంచుగూడెములనుండి బయలుపడినవి. అద్దంకిసేనలను చుట్టుముట్టినవి. అద్దంకిసేనలు యుద్ధమునకు సిద్ధ ముగాలేవు. వారికి ఆయుధములను సరిగా తీసికొనుటకు కూడ

సమయము లేకపోయినది. అంగపదాదచారులై యుద్ధముచేయ వలసి వచ్చినది. జరుగుచున్న యుద్ధమంతయు ఖడ్గములతోనే ఖడ్గవిద్యయందు విక్రమసింహపురము వారు అసమానులు. కన్నుమూసి తెరచునప్పటికి అద్దంకివారి సైనికగుడారములు, వాటియందున్న సైనికులు - నేలపైపడుట జరిగినది. జనము చచ్చినంత మంది చనిపోయిరి. పారిపోయినంతమంది పారి పోయిరి. చావుతప్పి కన్నులొట్టపడి సారంగపాణి దేవమహా రాజు ప్రాణములతో అద్దంకిమార్గమును పట్టెను. అతని జీవిత మున మరల యుద్ధమున కతడు తయారుకాజాలనంత అపారనష్ట ముతో బ్రతికి బయటపడెను. విక్రమసింహపురసైన్యములు జననష్టము లేక, అద్దంకివారి సేనలను పరాభూతము చేసినవి. అద్దంకివారి అశ్వములన్నియు, గజయూథమంతయు విక్రమ సింహపురము వారి స్వాధీనమైనవి.

## 12

సేనాపతులు ఖడ్గతిక్కనగారి పరాక్రమము, మహామంత్రి తిక్కనగారి బుద్ధిబలము విక్రమసింహపుర రాజ్యమునకు సుస్థి రత్వమును సమకూర్చినవి. వారిద్దరి కీర్తి దక్షిణభారతమున సర్వ రాజసభలందు విస్తరించినది.

సేనాపతులు ఖడ్గతిక్కనగారు అవక్రపరాక్రమశాలి యని, అభూతసాహసోపేతుడని, ఖడ్గవిద్యాసర్వజ్ఞుడని, ఆశ్రిత పక్షపాతియని దానరాధేయుడని కీర్తిచంద్రికలు వ్యాపించినవి.

యావద్భారతమునుండి రాజకుమారులు, రాజపురుషులు, మహావీరులు ఆయనను ఆశ్రయించి ఖడ్గవిద్యాశిక్షణము పొందు చుండిరి.

మహామంత్రి తిక్కనగారు విద్యాసరస్వతియని, బహు భాషావేత్తయని, చిత్తనిత్యస్థితశివుడని, సకలశాస్త్రవిద్యాకళా చరణుడని, సమస్తరాజ్య ధౌరేయుడని, నిత్యదానవ్రతుడని, నిరంతరయాగశీలుడని, త్రయ్యంతనిష్ణాతుడని కీర్తి సౌరభ్య ములు వ్యాపించినవి. పెక్కుమంది సంస్కృతకవులు, ఆంధ్ర కవులు ఆయనను ఆశ్రయించి సంపన్నులైరి. పెక్కుమంది శాస్త్ర పండితులు, వేదవిదులు ఆయనను ఆశ్రయించి అగ్రహారములను పొందిరి. బహుదూరప్రాంతములనుండి విద్యార్థులు వచ్చి ఆయనకడ సాంగవేదములు, శాస్త్రములు, సాహిత్యము అధ్య యనము చేయుచుండిరి. వారందరకు వారి స్వగృహముననే భోజనవసతి సౌకర్యములు. వేంగీప్రాంత మూలఘటిక కేతన, ఓరుగల్లు నివాసి మారన ఆయనకు మిక్కిలి ప్రీతిపాత్రులైన శిష్యులైరి. మారన విద్యాభ్యాసము ముగించుకొని స్వస్థలము నకు తిరిగిపోగా, కేతన గురుసేవలో నిలచియుండెను.

మనుమసిద్ధి మహారాజులవారు సింహాసనమునకు వచ్చిన తరువాత శాంతిభద్రతలు సుష్ఠుగానున్నవి. సాహిత్యాదరము ప్రబలినది. రాజసభలో సాహిత్యగోష్ఠి నిత్యవిషయమైనది.

ఒకనాటి ఇష్టాగోష్ఠిలో మహారాజులవారు మహామంత్రి గారి కిట్లనిరి. "మీతో మాకు స్నేహానుబంధము బహుజన్మ

పట్టిష్ఠమైనది. మీ ప్రథమ దర్శనము లభించినప్పుడే మిమ్ము మేము మామగారంటిమి. మీ రొక మహాకావ్యమును రచించి మమ్ము చిరంజీవులను చేయుడని అర్థించుచున్నాము" అని కప్పురపు తాంబూలము మహామంత్రులవారి కిచ్చి ప్రణమిల్లిరి.

మహామంత్రులవారు కప్పురపుతాంబూలమును స్వీకరించి మహారాజుల వారి నిట్లు ఆశీర్వదించిరి.

"శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజా స్తంభే జగన్మండల
ప్రాసాదస్థిర భారభాజిదధతీవాసాల భంజీశ్రియమ్,
శుండాలో త్తమ గండభి త్తిషు మదవ్యాసంగవశ్యాత్మనా
యాము త్తే జయతేతరాం మధులిహామానందసాంద్రాస్థితిః."

మరియు మహామంత్రులవారు "శ్రీతిక్క దేవమహారాజుల వారికి నాయందు అమితమైన అభిమానము. తమరున్నూ నాయందు బద్ధాదరులు. నేను మిక్కిలి ఋణపడియున్నాను. తమ కోరికను ఆజ్ఞగా మన్నించి, సముచితమైన కావ్యవస్తువును గ్రహించి కావ్యనిర్మాణమును చేయుదును." అనిరి. మహారాజులవారు "మహాప్రసాదం" అని మరల "మహాభారతము విషయమో" అనిరి. మహామంత్రులవారు "మహాభారతమును గురించి ఆలోచనము నిత్యము చేయుచుంటిని. మరియొకసారి మనవి చేయుదును" అనిరి.

మహామంత్రిగారు రాజసభనుండి గృహమున కేతెంచి - మనస్సు కావ్యవస్తుసంశోధన చేయుచుండగా - సాయంసంధ్యా కరణీయముల కుపక్రమించిరి. మనస్సు పరిపరివిధముల పరి

శోధించినది. శ్రీరామచంద్రునకన్న ఉత్తమకథానాయకుడు లేడనిపించినది గాని తమ పితామహులు భాస్కరామాత్యుల వారు రామాయణమును స్పృశించిరి కావున మరల తామదే వస్తువును స్వీకరించుట బాగుండదనిపించినది. ఇట్టి ఆలోచనలు మనస్సునందు ముసురియుండగా ఆయన భార్య చిన్నచానమ్మ చేసిన రెండు మూడు హెచ్చరిక లాయన పట్టించుకొనలేదు. ఆమె సమీపమునకువచ్చి గట్టిగా పలుకరించినది. ఆయన ప్రకృతులై "ఏమిటన్నారు." మహారాణీవారి అంతఃపురదాసి దర్శనమునకు వచ్చినదని ఆమె చెప్పినది. మహామంత్రులవారు సంధ్యాకరణీయములను ముగించుకొని ముందు వాకిటకు వచ్చిరి.

మహారాణీవారి అంతఃపురమునుండి వచ్చిన దాసి మహామంత్రులవారికి ప్రణామములు చేసికొని విన్నవించుకొనినది. తాను మహారాణీ శీలామహాదేవి అమ్మవారి అంతఃపురమున ప్రధానపరిచారిక. ఆనాడు కార్తిక పౌర్ణిమ. రోహిణీ నక్షత్రము. ఆరాత్రి పౌర్ణమి నక్షత్రపు గడియలలో రోహిణీ నక్షత్రసమయమున ద్విజరాజైన చంద్రదేవులను పూజించే వ్రతము అంతఃపురములలో ఆచారమని మహామంత్రులవారెరుగుదురు. పూజచేసిన తరువాత బ్రాహ్మణదంపతులను కూడ అర్చించి దక్షిణతాంబూలములతో సత్కరింపవలెను. ఇది మహారాణీదేవివారు ప్రతిసంవత్సరము జరుపుచున్నదే. ఈమధ్య మహారాణీదేవివారు మహామంత్రులవారి వివాహం

జరిగినప్పుడు అమ్మయ్యవారు చేసిన తీవ్ర తపస్సును గురించి విన్నారు. బాల్యంలో ఉండినన్నీ అమ్మయ్యవారు మహాతపస్సు చేసి తమ తపోబలముచేతనే మహామంత్రు వారిని కాశీనుంచి రప్పించి వివాహం చేసికొన్నారని మహారాణీదేవివారు విన్నారు. అమ్మయ్యవారిని సేవించుకోవలెనని మహారాణీదేవి వారికి అభిలాష కలిగినది. మహారాణిదేవివారి ప్రార్థనను మన్నించి మహామంత్రులవారు అమ్మయ్యవారితో కలసి అంతః పురమునకు వేంచేయవలెను. చంద్రపూజ, దంపతిపూజ, చంద్రోదయమైన తరువాత వృషభలగ్నంలో జరుపవలెను. మహారాణిదేవివారి ప్రార్థనను మన్నింపవలెనని పునః పునః ప్రార్థనలు.

పరిచారిక చేసిన విన్నపమును వినగా మహామంత్రుల వారికి వెంటనే కర్తవ్యము బోధపడలేదు. ఇంతవరకు తాము మహారాణీదేవివారిని చూడనేలేదు. నేడు అంతఃపురమున కీయాహ్వానమేమిటి? దానిని తిరస్కరింపవచ్చునా? తాము పురోహితవృత్తియందు లేదు. ఇట్టి సత్కారమునకు తమ్ము పిలుచుట ఆచారము కాదు. భావ్యము కాదు. ఆమె వేరు కారణములు చెప్పుచున్నది. పైగా తాము కూడ షట్కర్ములే. దానప్రతిగ్రహ, యజన, యాజన, అధ్యయన అధ్యాపన వృత్తులు తమకు సహజములే. ఈ వృత్తులు చేయమని చెప్పు టెట్లు? తమ తండ్రిగారు సాంగవేదవేదియయి దండనాథ వృత్తిని చేపట్టిరి. ఇన్ని ఆలోచనలు మనస్సునందు సంచరింపగా

మహామంత్రిగారు "సరే. ఘడియలో వచ్చుచున్నాము." అని పరిచారికకు శెలవు దయచేసిరి.

భార్య చిన్నమ్మను మేనాలో యెక్కించి, తాము అశ్వారూఢులై, స్వల్ప అంగరక్షకబలము వెంటనడువ - మహామంత్రి తిక్కనగారు మహారాణీదేవివారి అంతఃపురమునకు వెళ్లిరి. బహిర్ద్వారము దాటగనే గుఱ్ఱముదిగి, అంగరక్షకభటులను నిలిపిరి. తాము పాదచారులై స్త్రీలు త్రోవలు చూపగా మేనాతో లోపలకు వెళ్లిరి. అంతర్ద్వారము సమీపింపగా మేనా నిలపిరి. అక్కడ చిన్నచానమ్మ మేనాదిగి భర్తగారిని పాదచారియై వెంటనంటినది. ద్వారముదాటగా మహారాణీదేవివారు మేలిముసుగుతో పూర్ణకుంభమును పట్టుకొని స్వాగతము చెప్పిరి. ఆహూతులైవచ్చిన బ్రాహ్మణముత్తైదువలు మంగళహారతులు పట్టిరి. మహారాజులవారు మాత్రము కన్పించలేదు.

మహారాణీదేవివారు బ్రాహ్మణముత్తైదువల సహాయముతో కల్పసూత్రప్రకారము రోహిణీచంద్రులకు పూజ చేసిరి. అమృతపాయసములు నివేదనము చేసిరి. వ్రతవిధానములో చంద్రపూజ తరువాత మహారాణీదేవివారు తమ భర్తగారిని పూజింపవలసియున్నది. మహారాజులవారి శిల్పవిగ్రహమునకు పూజ జరిగినది. తరువాత సువాసినులపూజ, దంపతిపూజ జరిగినవి.

మహారాణీదేవివారు మహామంత్రులవారిని, చిన్న చానమ్మను భూరి దక్షిణతాంబూల భూషణాంబరములతో సత్కరించినది. సాష్టాంగ ప్రణామము లు చేసినది. తాను గొంటూరి ఉదయరాజు పౌత్రినసీ - మహామంత్రులవారి పితామహులైన భాస్కరామాత్యులవారు ఆయనకు అమాత్యులు కావడంవలన తమకు మహామంత్రిగారు ఆప్తవర్గంలోని వారని మనవిచేసినది. చిన్నచానమ్మను దేవతాస్త్రీని చూచినట్లు మహాభక్తితో సేవించి వినయముగా పునఃపునః ప్రణామములు చేసినది.

బహిర్ద్వారమువరకు సాగనంపవచ్చిన వృద్ధపరిచారికతో మహామంత్రిగారు అర్థోక్తిగా "మహారాజులవారు కూడ స్వయముగావచ్చి అర్చనచేయించుకొనిన బాగుండెడిది" అనిరి. దానికి వృద్ధపరిచారిక మెల్లిగా రహస్యము చెప్పినట్లు "వివాహము జరిగిన తరువాత మహారాజులవా రింతవరకు అంతఃపురప్రవేశము చేయనేలేదు" అనినది. అంతఃపురరహస్యము వెల్లడించినందులకు పశ్చాత్తాపము పొంది వెలవెలపోయినది.

మహామంత్రిగారికి విషయములు పూర్తిగా అవగాహన అయినవి. మనుమసిద్ధి మహారాజులవారు కుందమాదేవి అను వేశ్యను ఆదరించుచుండిరని తెలియును. ఐతే సకలసద్గుణరాశి, పతివ్రత అగు కులపత్నిని సంపూర్ణముగా నిరాదరించి, ఆమెకు చిత్తక్షోభకలిగించిరని తెలియదు. ఆవిషయము లిప్పుడు తెలిసినవి. తమకు కర్తవ్యము బోధపడినది.

మహామంత్రి గారు గృహమునకు తిరిగివచ్చిన తరువాత భోజనము కూడ చేయలేదు. నలువురశిష్యులను గంటములతో, తాళపత్రములతో వగ్గరనుంచుకొని దేవతామందిరమున పద్మాసనస్థులై కూర్చొనిరి. ఇష్టదేవతా ప్రార్థనముచేసి రచన ప్రారంభించిరి. వారు కనులుమూసికొని సాహిత్యసమాధి యందుండి అనర్గళముగా గాంగనిర్ఝరపదృక్ ధారాళవాగ్ధాటిగా పద్యములను చెప్పుచుండిరి. శిష్యు లొక్కొ రొక్కరొకపద్యమును వరుసగా తాళపత్రములపైన గంటములతో లిఖించుచుండిరి. సాహిత్య ఆవేశములో వారికి వెలువడిన పద్యధారాపాతమున గద్యములు దొర్లుట జరుగలేదు. తెల్లవారుఝామున బ్రాహ్మీముహూర్తమునకు నిర్వచనోత్తరరామాయణము సంపూర్ణమైనది.

రెండు దినములలో శుభముహూర్తమున కృతిసమర్పణ సభ జరిగినది. కళావిశారదుడై, సాహిత్యమర్మజ్ఞుడై, భావుకుడైన మనుమసిద్ధి మహారాజులవారికి నిర్వచనోత్తరరామాయణములోని యెత్తుగడ ఆశ్చర్యమును కలిగించినది. శ్రీరామచంద్రుడు ఉత్తమ నాయకుడని చెప్పి, ఆయన కథ యెక్కడ నుంచి యెత్తుకొని నప్పటికి రసవంతమనిచెప్పి - కృతిపతి వంశవర్ణన సూర్యవంశవర్ణనగా శ్రీరామచంద్రునితో నిలుపు చేయబడినది. మహారాజులవారికి మహాకవుల భావమేమిటో స్ఫురించినది. శ్రీరామచంద్రులవారియందు ప్రయోగింపబడుచున్న వర్ణనావిశేషములు, అమ్మవారిని నిష్కారణముగా

ఆయన పరిత్యజించుట - ఆమె లోకోత్తరపతివ్రత - జగన్మాత. ఆమె దుఃఖము అరణ్యములను పర్వతములను దుఃఖమయము చేసినది. ఆమె విప్రయోగము సాహిత్యభూషణముగా చిత్రింపబడినది. తనను తాను త్యజించిన శ్రీరామచంద్రుడు కూడ రోదించెను. తపించెను. శ్రీరామచంద్రుడు తమవంశ మునకు మూలపురుషుడు. ఆదర్శపురుషుడు.

నిష్కారణముగా పరిత్యక్త అయిన సీతామహాదేవి గర్భవతి. ఆమెకు ఆపదలేమివచ్చునో యని తహతహలాడి పోయినది సభ యంతయు. మహారాజులవారితో సహా సభవా రందరు సీతా అమ్మవారితో కలసి రోదించిరి. మహాకవు లీకావ్యవస్తువుగా రామాయణ ఉత్తరభాగమును - దుఃఖాంత భాగమును స్వీకరించిన కారణమేమిటని పండితులు శోధింప నారంభించిరి. కథ నడచిపోవుచున్నది. సీతామహాదేవికి వాల్మీకి మహామునుల ఆశ్రయము లభించినది. కుశలవులు జన్మించిరి. కుశలవులకు ఉపనయనములైనవి. వాల్మీకి మహాముని విద్యా బుద్ధులు చెప్పెను. శ్రీరామచంద్రుని అశ్వమేధయాగము కారణముగా కుశలవులు తమ పరాక్రమమును చూపిరి. సీతా మహాదేవి మరల శ్రీరామచంద్రుని కలసికొన్నది. మహాకవులు చేసిన ముగింపు సభలోని పండితులకు పామరులకు ఆహ్లాద మును కలిగించినది. వాల్మీకి ఉత్తరకాండలో సీతారామచంద్రు లకు పునస్సమాగమము జరుగలేదు. మహాకవి తిక్కనగారేదో ప్రయోజనమును సంభావించి సీతారామచంద్రులకు పున

స్సమాగమమును కల్పించిరని భావుకులు గ్రహించిరి. మహా రాజులవారికి కవిహృదయము బోధపడినది. తమ కర్తవ్యము బోధపడినది.

మహారాజులవారివదనము ఆలోచనావ్యగ్రతను చూపు చున్నది. ఆయన సింహాసనమునుండి లేచి మహాకవి తిక్కన గారిని చూచుచు "సేవించుకుంటాము" అని విన్నవించి సభా మర్యాదలతో సభను ముగింపుచేయక చరచరా వెళ్లిపోయిరి. పరమసాధువైన రాజోత్తముడు సభామర్యాదలను పాటింపక, సభను ముగింపుచేయక, తాము కోరి నిర్మింపచేసిన ఉత్తమ కృతిని అవధరించి, మహాకవిని సముచితముగా సమ్మానింపక - లేచి వెడలిపోవుట సభాస్తారులందరకు అచ్చెరువు కలిగించినది. లౌకికవ్యగ్రబుద్ధులకుమాత్రము దీనియందు పరమనిగూఢమైన రాచకీయమున్నదని తెలిసినది. సీతామహాదేవి దుఃఖము మహా రాజులవారికి దుఃఖాతిరేకము కలిగించినదని - ఆయన అపూర్వ ముగా చలించిపోయెనని సభాస్తారులందరకు తెలిసినది.

మహామంత్రిగారు స్వగృహము చేరునప్పటికే అక్కడ అంతఃపురపరిచారికా బృందమువారు వేచియుండిరి. స్త్రీపరి చారికలు స్వయముగా మోసికొనివచ్చిన మేనా యున్నది. మహారాజులవారి అంగరక్షక బలములోని ఆశ్వికదళపతి పరి వారముతో నుండెను. మహామంత్రులవారు సమీపింపగా వారందరు వందనములు చేసిరి. మహామంత్రులవారు అంగ

రక్షకదళపతిని ప్రశ్నార్థకముగా చూచిరి. అతడు అంజలి బంధించి "మహారాజులవారు మహారాణీదేవివారు తమకు విన్న పాలు పంపుకొన్నారు. తమరిని అమ్మయ్యవారిని అంతఃపురంలో సేవించుకోవడానికి అవకాశం ఇవ్వవలసినదిగా ప్రార్థనలు మనవి చేయుమన్నారు" అని విన్నవించెను. మహామంత్రులవారు హర్షపులకాంకితులై శిరఃకంపనము చేసిరి.

అంతఃపురపరిచారికలు మోయుచున్న మేనాలో చిన్న చానమ్మ వెంటరాగా మహామంత్రి తిక్కనగారు అశ్వారూఢులై బయలుదేరిరి. వెంట మహారాజులవారి అంగరక్షకదళము సేవించుచు వచ్చినది.

అంతఃపుర బహిర్ద్వారముకడనే మహారాజులవారు మహారాణీదేవి వారితోకలసి పూర్ణకుంభముతో మహామంత్రిగారికి ఆయన భార్యకు స్వాగతము నివేదించిరి. అంతరద్వారముదగ్గర పాదప్రక్షాళనములు మహారాజదంపతులు స్వయముగాచేసి తోడ్కొనిపోయిరి.

మహామంత్రులవారిని ఆయన భార్యను ఉన్నతాసనము లందు ఆసీనులనుచేసి సర్వరాజలాంఛనములతో, సర్వదేవ లాంఛనములతో మహారాజులవారు మహారాణీదేవివారు దంపతి పూజచేసిరి. మహారాణీదేవివారు చిన్నచానమ్మకు మరల మరల ప్రణామములనుచేసిరి. "అమ్మయ్యా! తమరు తపస్సిద్ధులు. పతివ్రతాశిరోమణులు. తమ పాదములను సేవించుకున్న మహా

భాగ్యమువలన నాకు అభీష్టసిద్ధి కలిగినది. స్త్రీకి ముఖ్యముగా కావలసినది భర్త అనురాగము. అది మీపాదసేవవలన నాకు లభించినది." అని అంజలిబంధముతో విన్నవింపగా చిన్నచానమ్మ మందస్మితముచేసి మహామంత్రిగారి కన్నులలోనికి చూచినది.

మహారాణీదేవివారు కూడ మహామంత్రులవారిని చూచుచు "బాబయ్యా! నాకు తమరు చేసిన మహోపకారమునకు జన్మాంతము ఋణపడితిని" అనిరి. మహామంత్రిగారు చిరునవ్వుతో "అమ్మా! నేను నావిధ్యుక్తధర్మమును మాత్రము నిర్వహించితిని. నేను నాప్రభువులవారికి ధర్మమార్గమును నిరూపింప జాలకపోయితినేని యీమహారాజ్యమును ధర్మమార్గమున నడిపించుటకు సామర్థ్యము కలిగియుండునా? నా ప్రభువుల కుటుంబము సుఖసంపదలతో నుండునట్లు చూచుట నాకర్తవ్యమే కదా!" అని సమాధానమును చెప్పిరి. మహారాణీదేవివారు "బాబయ్యగారు మహాపండితులు. ఏమైనా సమర్థింపగలరు. మరి మాకు వ్యక్తిగతముగా జరిగిన ఉపకారము మాటేమిటి? కృతజ్ఞత మనవి చేసికొనడము రాజకుటుంబమువారికైనా తప్పని కర్తవ్యమే. గొంటూరి మండలములో నాపుట్టింటివారు నాకు 'అరణము'గానిచ్చిన గ్రామములలో అయిదు గ్రామములను అమ్మయ్యగారికిని నాలుగు గ్రామములను తమకును వెరసి తొమ్మిది గ్రామములను దంపతిపూజాసమయమున తాంబూల దక్షిణగా సమర్పించుకొనుచున్నాము." అని ఆమె పాదాభివందనముచేయగా మహారాజులవా రామెను అనుసరించిరి.

మహాకవి తిక్కనగారు వేదోక్తముగా ఆశీర్వదించి మరల నిర్వచనోత్తరరామాయణములోని "శ్రీరాస్తాం" అను శ్లోకమును శ్రీరాగమధురముగా నోట ననిరి.

మహారాజులవారు మహారాణీవారు మరల బహిర్ద్వారమువరకువచ్చి వీడ్కోలుచెప్పిరి. గృహముచేరిన తరువాత చిన్నచానమ్మ మహామంత్రిగారిని ప్రశ్నించినది. "ఐతే స్వామీ! ఉత్తరరామాయణమున తమరు సీతారామచంద్రులకు పునస్సమాగమము కల్పించిన దిందులకా?" ఆప్రశ్నకు మహామంత్రిగారు మందస్మితముచేసి "నేను కవిని, మంత్రిని, ఆగమరహస్యవేత్తలైన కొమ్మనామాత్యులవారి కుమారుడను. ఆగమరహస్యమేమిటనగా లక్ష్మణునిచేత సేవింపబడుచున్న సీతారామచంద్రులు ప్రణవస్వరూపులు. వారు విడిపోయి ఉండనే ఉండరు. కోదండము ధర్మస్వరూపము. ధర్మరక్ష. శ్రీరామార్చన చేయునప్పుడు కోదండమును ధరించిన శ్రీరాముడు సీతాయుక్తుడై, లక్ష్మణ సేవితుడైయుండగా చేయవలెనని ఆగమ శాసనము. ఉత్తరరామాయణమున నేనుచేసినది ఆగమోక్తమైన ముగింపు" అని సమాధానమును చెప్పిరి.

## 13

మరునాటి ఉదయము మహామంత్రి తిక్కనగారు ప్రాతస్సంధ్యాకాలానుష్ఠానములు ముగించుకొని దేవిడీకి ప్రయాణమగుచుండగా శిష్యుడు కేతన వచ్చి "తమ చిన్ననాటి సహాధ్యా

యులు పండితారాధ్యుల బ్రహ్మరుద్రయ్యగారు పంపగావచ్చితి నని భట్టొకడు దర్శనమునకై వేచియున్నాడు” అని చెప్పెను.

మహామంత్రి తిక్కనగారు వెలుపలకువచ్చి భట్టునకు స్వాగతముచెప్పి లోనికి తోడ్కొనిపోయి ఆసీనునిచేసిరి. కుశల ప్రశ్నాదికము చేసిరి. మరియు భట్టుతో “శివశ్రీ బ్రహ్మరుద్రయ్య గారు మాకు కాశీలో సహాధ్యాయులు. మాకు శ్రీవిశ్వేశ్వర శివాచార్యులవారు కూడ సహాధ్యాయులే. మేము ముగ్గు రము ఆప్తమిత్రులము. ఈమధ్య బ్రహ్మరుద్రయ్యగారి క్షేమ సమాచారములు తెలియుటలేదు పల్లికొండ సమీపమున వారు ఆశ్రమము నిర్మించుకొనియున్నారని పల్లికొండప్రభువులకు, ఎఱ్ఱగడ్డపాటిప్రభువులకు రాజగురువులుగా నున్నారని వింటిమి. వారి తపస్సు నిరభ్యంతరముగ సాగుచున్నదికదా? మీరు తెచ్చినవార్త లెట్టివి” అనిరి.

భట్టు వినయముగా శిరస్సువంచి ‘చిత్తము. చిత్తము’ అనుచు తాను తెచ్చిన లేఖను దగ్గరలోనున్న కేతనగారి చేతులలో నుంచెను. దానిని కేతనమహామంత్రులవారి కందీయ బోవగా, వారు కేతనను చదువుమనిరి. కేతన లేఖను పఠించెను.

“శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులును, బుధారాధనవిరాజమానులును, ఉభయకవిమిత్రులును, వేదమూర్తులును అయిన బ్రహ్మశ్రీ కొట్టరువు తిక్కన మహామాత్యులవారి దివ్యసన్నిధికి—

యాదవకులరాజచంద్రులు, కారుణ్యరసపురాములు, ఆత్రేయగోత్రోద్భవులు అగు కాటమరాజప్రభువులవారి రాజగురువు పండితారాధ్యుల బ్రహ్మారుద్రయ్య నిత్యము త్రికాలములందును అనేకనమస్కారములు చేసి కళ్యాణభావపురస్సరముగ చేయు విన్నపములు.

మేము ఎఱ్ఱగడ్డపాడునందు కుశలము. అచ్చట తమ సకలసంతోషాతిశయములను వ్రాయించి పంపుచురావలెను.

ఎఱ్ఱగడ్డపాడు రాజ్యసీమయందు వర్షములు లేక క్షామము వచ్చి యాదవవంశోద్భవులైన కాటమరాజచంద్రుల పశుగణమునకు గ్రాసముకూడ లభించుటలేదు. మీప్రభువులవారి యేలుబడిలోని లంకమల, పాలకొండ, నల్లమల మొదలగు పర్వతప్రదేశములందున్న అరణ్యములలోని పచ్చికపట్లలో మారాజచంద్రుల గోగణమును మేపుకొనుటకు అనుమతి లభింపచేయుదురని మిక్కిలి ప్రార్థించుచున్నాము. ఇందుకుగాను పుల్లరిగా, మా ఆలమందలు మీరాజ్యమునందుండగా పుట్టిన కోడెలను సమర్పించుకొందుము. మన్నింపవలెను. తమ ఆజ్ఞలు శిరసావహించి తెచ్చుటకు మాభట్టుకు ఉత్తర్వులిచ్చినాము.

ఇవియే అనేక విన్నపములు.

దివ్యచిత్తమునకు తేవలెను.

ఇట్లు విధేయుడు,

"పండితారాధ్యుల బ్రహ్మారుద్రయ్యవ్రాలు"

అని కేతన లేఖను చదువుట ముగించి మహామంత్రులవారి వంక చూడగా- ఆయన లేఖను స్వీకరించిరి.

మహామంత్రులవారు భట్టును చూచుచు "ఎఱ్ఱగడ్డపాటి సీమలో వర్షాభావం అంత తీవ్రంగా ఉన్నదా! పాపం-పశుగణానికి యెంత కష్టంగా ఉన్నదో" అనిరి.

భట్టు అంజలి బంధించి "మనవి చేసుకుంటాను. నాలుగు సంవత్సరములుగా మాసీమలో వర్షములు లేవు. పశువులకు గ్రాసము లేదు. కొన్నిచోట్ల బావులలో త్రాగుటకు కూడ నీరు లేదు. పశువులస్థితి దుర్భరముగా నున్నది. మారాజచంద్రులు కులదేవత గంగానమ్మ ఉత్సవములు చేయించిరి. రాజచంద్రుల తల్లిగారు పెద్దిమాదేవిగారు స్వయముగా గంగానమ్మకు పూజలు చేసిరి. జగములుబ్రోచు జగదంబకు కరుణకలుగలేదు.

మాప్రభువులకు ఆప్తులైన పల్లికొండ ప్రభువులగు చల్లపిన్నమనాయకులతో సంప్రతించి రాజగురువులైన బ్రహ్మరుద్రయ్యగారి దర్శనముచేసి విన్నవించుకొనిరి. వారు ఎఱ్ఱగడ్డ పాడునకు విజయముచేసి పరిస్థితులను స్వయముగా చూచిరి. గోగణముయొక్క బాధ వారికి కళ్లనీళ్లపర్యంతమైనది. వారికి ఆ బాల్యమిత్రులైన తమ సహాయమును అర్థించుటకు నిశ్చయించుకొనిరి. తమరు వారికి ప్రాణమిత్రులని, కరుణాసముద్రులని, వారి అభ్యర్థనను తప్పకమన్నింతురని— లేఖవ్రాసి— మారాజచంద్రుల సమ్మతితో నన్ను తమ పాద సన్నిధానమునకు పంపిరి" అని విన్నవించెను.

[redacted]. సోమయాజి, చారిత్రక నవల.

[redacted]క్కనగారు భట్టును చూచి “మేము మా ప్రభువులవారితో మనవిచేసి ప్రత్యుత్తరం వ్రాయిస్తాము” అని కేతనను చూచుచు “భట్టుకు వసతి యేర్పాట్లుచెయ్యి” అనిరి. కేతన ‘చిత్తం’ అని చెప్పి భట్టును తోడ్కొని పోయెను.

మహారాజులవారి ఆలోచనామందిరమున బ్రహ్మరుద్రయ్య గారి లేఖ పరిశీలనకు వచ్చినది. మహారాజులవారి ఆజ్ఞతో ప్రబంధాంకం అన్నంభట్టు లేఖను చదివి వినిపించెను. మహారాజులవారు సేనాపతులైన ఖడ్గతిక్కనగారి వంకచూచుచు “తమ అభిప్రాయం” అనిరి.

ఖడ్గతిక్కనగారు దీర్ఘమైన నిట్టూర్పువిడచి “కాటమ రాజు, చల్లపిన్నమనాయడు నాకు శిష్యులు. నాయందు భక్తి గలవారు. నాదగ్గర ఖడ్గవిద్యనేర్చినప్పుడు నన్ను దైవముగా ఆరాధించినవారు. కాటమరాజుపై నాకు మిక్కిలి వాత్సల్య భావమున్నది. కాని మన మీసమస్యను రాజకీయదృష్టితో పరిశీలింపవలసియున్నదికదా! యాదవులు మన రాజ్యమునకు వైరివర్గములోనివారు. వారికి అద్దంకి పాలకులతోను పల్లవ రాజైన కాడవపతితోను మైత్రి కలదు. అనగా మన ముఖ్య శత్రువులకు యాదవులు ఆప్తులన్నమాట. అట్టివారిని యేమిష చేతగాని మన రాజ్యములోనికి రానీయరాదు. గోగణమును మేపుకొనుటకైనా రానివ్వరాదు. శత్రువులందు కరుణా దృష్టి పనికిరాదు. అది పామునకు పాలుపోసినట్లే కాగలదు. ఏలిన వారిచిత్తము” అని చెప్పిరి.

మహారాజులవారు మహామంత్రిగారి వంక సాలోచనగా చూచిరి. మహామంత్రిగారు ఖడ్గతిక్కనగారి వంకచూచి మరల మహారాజులవారిపై దృష్టినిలపి "సేనాపతులవారు చెప్పినది నీతి సమ్మతముగా నున్నది. యాదవులకు మనకు మధ్యగల పగకు ఆది యేదో యుండవలెను. ఆది కలదానికి అంతము తప్పదు. అంతము యీనాడేల కాకూడదు? నిజముగా పగను పగచేత జయింపలేము. సాధింపలేము. పగను జయింపగలిగినది మైత్రి. యాదవులందు మైత్రిని ప్రయోగించి చూచుదము. అది ఫలించినచో అద్దంకిపాలకులకు కాడవపతికి యాదవుల స్నేహబలము పోగలదు. మనమైత్రిని యాదవులు నిరాదరించినచో మనకు క్రొత్తగా కలుగు నష్టము లేదు. యాదవుల గోగణము జలగ్రాసములు లేని విపత్తునందున్నది. మనము మానవతాదృష్టిని విస్మరింపరాదు. గోవులు భారతీయులందరు పూజింపవలసినవి. శత్రువుల గోవులను కూడ పూజింపవలసినదే." అని విన్నవించిరి.

మహారాజులవారు "అవును దుర్భిక్షమువచ్చి పశుగ్రాసములేక జలములేక గోగణము మహావిపత్తునకు లోనైనప్పుడు మనము సహాయము చేయవలసియున్నది. పైగా వారు అర్థించుచున్నారు. నిజమునకు వారి గోగణమునకు కలిగిన ఆపదనుబట్టి వారి అభ్యర్థనము లేకపోయినను మనము గోగణసహాయము చేయవలయును. కావున అడవులలో

మాత్రము పశువులను మేపుకొనే నియమముతో అనుమతిని పంపవచ్చు. అది ధర్మం. కమ్మ అట్లే వ్రాయించండి." అని ఆనతిచేసిరి.

భట్టు తన రాయబారము ఫలించినందులకు సంతోష పడుచు, ఆనాటి రాత్రికే కమ్మను తీసికొని తిరుగు ప్రయాణ మును చేసెను.

## 14

మనుమసిద్ధి మహారాజులవారు, మహామంత్రి తిక్కన గారికి ప్రతిదినము మహాభారత ఆంధ్రీకరణమును గురించి మనవి చేయుచుండిరి. తమ తండ్రిగారు తిక్కదేవమహారాజుల వారి చివరికోర్కె మహాభారత ఆంధ్రీకరణమని - దానిని మన్నింపుడని-మహారాజులవారు నిత్యప్రార్థనలు చేయుచుండిరి. రాజకీయసమస్యల భారమువలన కొన్నినాళ్లు, ముఖ్యావసర కార్యకలాపములవలన కొన్నినాళ్లు వ్యవధి కావలెనని మహా మంత్రిగారు చెప్పుచుండిరి. చతుర్వేదములను యాస్కుని నిరుక్తసహాయముతో పరిశీలింపవలసియున్నదని, ఉపనిష ద్వ్యాఖ్యానములు చూడవలసియున్నదని, బ్రహ్మసూత్ర భాష్యము, గీతాభాష్యము పరిశీలన చేయవలసియున్నదని - అప్పుడుగాని పంచమవేదమగు మహాభారతమును రచించిన వేద వ్యాసహృదయము బోధపడదని భావించి ఆకార్యక్రమమును పూర్తిచేసిరి.

నారాయణుని నరులలో నుత్తముడైన అర్జునుని, సరస్వతీ దేవిని, వేదవ్యాసుని సంప్రార్థించి మహాభారతమును స్పృశింపవలయును. వారివారి ఉపాసనాపూజలను యథావిధిగ నిర్వహించిరి.

సంస్కృతమహాభారతమును పదునెనిమిదిపర్యాయములు పారాయణచేసిరి. నన్నయభట్టారకులవారి ఆంధ్రమహాభారతము వారికి బాల్యమునుండి కంఠగతమే. అనేకమంది శిష్యులకు వేదపాఠము చెప్పుట మాత్రమేగాక - తమకు ఏకపుత్త్రుడైన కొమ్మనకు యెనిమిదవయేట ఉపనయనసంస్కారముచేసి అధ్యాపనగురువులై గోత్రఋషులకు తృప్తిని కలిగించిరి. ఇప్పుడు మరల నేమి చేయవలయునని చెప్పి మహాభారత ఆంధ్రీకరణమును చేపట్టుటకు అడ్డు చెప్పుదురో యని మహారాజులవారు ఆందోళన పడుచుండిరి.

ఆదినము మరల మహారాజులవారు మహాభారత ఆంధ్రీకరణమును గురించి ప్రస్తావించిరి. తమ తండ్రిగారి చివరి కోరికను తీర్పుడని ప్రార్థేయపడిరి. మహామంత్రిగారు "ఏలినవారికి తెలియని విషయము కాదు. మహాభారత ఆంధ్రీకరణము సముద్రమును తరించుటవంటిది. అందుచేతనే నన్నయభట్టారకులవారు 'అమలినములైన తారకాసముదయములను లెక్కించుట, సర్వవేదశాస్త్రముల పారమును పొందుట, భారత సముద్రమును తరింపనీదుట, విధాతృనకైనను నేరబోలునే' అనిరి." అని మెల్లిగా పలికిరి.

అక్కడనే సమావిష్టులైయున్న సేనాపతులు ఖడ్గతిక్కన గారు కల్పించుకొని "నన్నయభట్టారకులవారు చెప్పినది కేవలము అతిశయోక్తి అలంకారము. ఆమాటలకు అతిశయోక్తిగానే అర్థము చేసికొనవలెను. లేనప్పు డది అసందర్భమే. సృష్టికర్తయగు విధాతసృష్టిలో అల్పమైన సముద్రమును అతడే తరింపజాలక పోవడమేమిటి? సృష్టికర్తకు అతని సృష్టి అతీతముగా నున్నదనుట అతిశయోక్తి కానిచో హాస్యాస్పదమే." అని మందస్మితము చేసిరి.

మహారాజులవారు పూనుకొని "సేనాపతులవారు చెప్పినది లెస్సగా నున్నది. మీరు ఆంధ్రమహాభారతరచనకు పూనుకోవలసినదని ఆంధ్రావళి కోరుచున్నది. మీరు కవిబ్రహ్మలు. భారతసముద్రతరణము మీకు కష్టము కానేకాదు. మీరు భారతరచనకు పూనుకోవలసినదని బుధాదేశము. మహాకవిత్వదీక్షాసమర్థులైన మీకు గాక మరెవ్వరికిగాని సాధ్యమగు పని కాదిది. మహాభక్తులు, వైదికమార్గపరినిష్ఠులు, వ్యాసనిర్మితసర్వపురాణరహస్యవేత్తలు, మీ రీభారమును వహింపకతప్పదు" అని ప్రార్థేయపడిరి.

మహామంత్రి తిక్కనగారు "ఆంధ్రకవిత్వవిశారదుడైన నన్నయభట్టారకులవారు విద్యాదయితులు. ఆయనను అనుసరింపవలెనను కౌతుకము నాకును కలుగుచున్నది. కాని మనస్సునందు శంక కొంచెమున్నది. ఆలోచనకు కొంచెము వ్యవధి

కావలెను." అనిరి. మహారాజులవారు "మహాకవీ! మీరు పర తత్త్వవేత్తలు. తత్ప్రసాదాపాదిత కవిత్వతత్త్వనిరతి శయాను భావానంద భరితాంతఃకరణులు. ఆంధ్రావళి విన్నపమును మన్నించినందులకు ధన్యవాదములు" అని శిరస్సు వంచిరి.

ఆసాయంకాలము మహామంత్రిగారు గృహము చేరు నప్పటికి ప్రదోషసమయమగుచున్నది. బాలకొమ్మన వేదపారా యణము నుపక్రమించుచు మధురషడ్జమమున వేదవ్యాసధ్యా నము చేయుచుండెను. "ఓం నమః శ్రుతి శిరః పద్మషండ మార్తాండమూర్తయే బాదరాయణసంజ్ఞాయమునయేశివవేశ్మనే" ఆ శ్లోకము మహామంత్రులవారి మనస్సునందు ప్రవేశించి వేద వ్యాసులవారి సన్నిధానమును ప్రసాదించినట్లు చూపినది. ఆయన నాలుగు మోములు లేని బ్రహ్మయని, రెండు చేతులే గల నారాయణుడని, ఫాలలోచనము లేని పరమశివుడని, మనస్సు వినమ్రమైపోయినది. ఆయన మాహాత్మ్యమునకు పరవశమై పోయినది.

మహామంత్రులవారు సాయంకాలానుష్ఠానము చేయు నప్పుడు, భోజనముచేయునప్పుడు, శయనమందిరమునకు వెళ్లి నప్పుడు, మనస్సు వేదవ్యాసులవారిని గురించి ఆలోచించినది. ఆయనయందే లగ్నమైనది. వేదవ్యాసమయముగా నున్నది.

తండ్రిగారిని స్మరించి, గురుధ్యానముచేసి, ఇష్టదేవతా ధ్యానముచేసి కన్ను మూసికొనిరి. కన్నులుమూయగా మరల

వేదవ్యాసదర్శనమే. వేదవ్యాసులవారిని ధ్యానించుచు నిద్రించుటకు ప్రయత్నించిరి. మనస్సు ఆనందభరితముగా నున్నది. నిద్రపట్టినది తెలియదు.

నిద్రలో సుఖస్వప్నముల తరువాత సుఖస్వప్నములు. వేదవ్యాసులవారి దర్శనమై ఆయన అనుగ్రహము లభించినట్లు వ్యాససంప్రదాయపరంపరలో జగద్గురు పదస్థులైన శ్రీవిద్యా తీర్థమహాస్వాములవారి సేవాభాగ్యము లభించినట్లు, అమ్మవారు శారదాదేవి మందస్మితముతో అభయవరముద్రలతో కటాక్షించినట్లు సుఖస్వప్నములు.

ఇంతలో మెలకువ వచ్చినది. జలప్రాశనముచేసి మరల శయనించిరి. మరల నిద్రపట్టినది. మరల సుఖస్వప్నములు. తండ్రిగారు సాంగవేదవేది కొమ్మనామాత్యులవారు దర్శనము అనుగ్రహింపగా తాము ప్రణామముచేయుటయు వారు దీవించి "నీవు మున్ను "కిమస్థిమాలాం"అని రచించిన శ్లోకమును గాఢాదరముతో నవధరించి భక్తవత్సలుడగు హరిహరనాథస్వామి నీదెస దయాళుడైయుండి నిన్ను కృతార్థునిచేయుటకు సంకల్పించి స్వర్గమందున్న నాకు తన చిత్తమునందుగల కారుణ్యము నెరుగు శక్తిని ప్రసాదించి, నన్ను ఆకర్షించి, నాసేవను స్వీకరించి, నీకు దర్శనము అనుగ్రహించుటకు విజయము చేసిరి." అని చెప్పగా హరిహరనాథుని దివ్యస్వరూపము వారికి గోచరమైనది.

కరుణారసము పొంగివచ్చుచున్నట్లుగా శిరస్సునందున్న చంద్ర రేఖనుండి అమృతము జాలువారగా - నాభియందు ధవళ పంకజము సురభిచందనమువలెనుండగా - లోకరక్షణమునకు చిహ్నముగా గరళకంఠముతోపగా - ఉరమునందున్న కౌస్తుభ రత్నము ఉదయించుచున్న సూర్యబింబమువలె ప్రకాశించు చుండగా - గంగా యమునానదుల సంగమమువలె కాంతి పూరముతో - హరిహరనాథుని దివ్యమంగళ విగ్రహము సన్నిధిని చేయగా - తిక్కనగారు భక్తితో సాష్టాంగదండప్రణామములుచేసి - ప్రక్కగా నిలువబడి - వినయముగా లలాటోపరిభాగమున అంజలిఘటించి యుండగా - హరిహరనాథుడు దయామధురమైన మందస్మితముతో ప్రసన్నతతో తిక్కన గారిని చూచుచు -'నీవు మత్పాదనిరంతరస్మరణ భావముకలిగిన వైదికమార్గవర్తనుడవు. పారాశర్యునికృతి పంచమవేదమను ప్రఖ్యాతినిపొంది జనుల కారాధ్యమైనది. నీవు దానిని తెనుగు భాషలోనిర్మించుట భవ్యపురుషార్థఫలము. ఆకృతిని నాకంకితము చేయుమనిఅర్థింపవచ్చితిని'' అనిరి. అంత తిక్కనగారు మరలమరల ప్రణామములుచేసి తండ్రిగారి వంకచూచిరి. ఆయన సమ్మతింపుమని శిరఃకంపనము చేసిరి.

అంత తిక్కనగారు హరిహరనాథునికి అంజలించి 'అల్పుడైన నాయందుఅచ్చెరువుగా నీకారుణ్యక్షీరాంబుధి నుంచితివి. నాకవితావాణి నీకృపాప్రసాదఫలము. నాకు జన్మాంతరదుఃఖములను పోగొట్టుము.' అని సాష్టాంగదండప్రణామములు

చేయగా హరిహరనాథుడు 'జననమరణాదులైన దురితములు తొలగు వెలుగు నీకిచ్చితిని.' అని చెప్పి అంతర్హితుడయ్యెను. తిక్కనగారు ఆనందపరవశత్వము ననుభవించుచుండగా స్వప్న భంగమైనది.

తిక్కనగారు కనులు తెరచిచూడగా - ఉషఃకాలము సమీపించుచున్నది. భరద్వాజపక్షి కలకలరావము చేయు చున్నది. గురుధ్యానము, ఇష్టదేవతాధ్యానముచేసి, తిక్కన గారు కాల్యకరణీయముల కుపక్రమించిరి.

## 15

మహారాజులవారి ఆలోచనామందిరమున మనుమసిద్ధి మహారాజులవారు కొలువు తీర్చియుండిరి. సేనాపతులు ఖడ్గ తిక్కనగారు, కోశాధిపతి ఆత్మకూరు గురునాథుడు, ప్రబంధాంకం-అన్నంభట్టు, భవ్యభారతి బయ్యనగారు పరివేష్టించి తమ తమ ఆసనములందుండిరి. మహామంత్రి తిక్కనగా రింకను వచ్చి యుండకపోవుటచేత వారి యాసనము అలంకరింపబడి యుండలేదు.

మహారాజులవారు ఆసీనులైయున్న మంత్రులను చూచుచు "నిన్న మహామంత్రులవారు ప్రసన్నముగా నుండిరి. మహాభారతరచన చేయుడని ప్రార్థించినప్పుడు వారు ప్రసన్న లలితముగా నుండిరి. ఆప్రసన్నలాలిత్యమునందు వేదవ్యాస భట్టారకులవారియొక్క నన్నయ భట్టారకులవారి యొక్క తేజస్సులు సమ్మిళితమైనట్లు - గంగా యమునా సంగమ ముల

కాంతిపూరమువలె తోచినది. ఆలాలిత్య తేజోరేఖ వారు భారత రచనకు పూనుకొందురన్న విశ్వాసమును కలిగించినది." అనిరి.

ఆత్మకూరి గురునాథుడు "ఏలినవారు చెప్పినది చక్కగా నున్నది. మహామాత్యపాదులవారి ముఖమున నూత్నమైన తేజోలాలిత్యము తాండవించుచున్నది. సాంగవేదవేది కొమ్మన దండనాథులవారి ప్రసన్నత నాకు మహామాత్యపాదులవారి ముఖమున గోచరించినది. వారు భారతము ఆంధ్రీకరించి ఆంధ్రావళికి మోదమును చేకూర్చెదరని విశ్వాసము దృఢతర మగుచున్నది." అనెను.

సేనాపతులు ఖడ్గతిక్కనగారు రందుకొని "నిన్న మహామంత్రిగారి ముఖము నూత్నతేజోవిలసితముగా నున్నమాట నిజము. ఆతేజస్సునందేదో వినూత్న రేఖయున్నది. పూర్వము శృంగేరిలో హరిహరనాథవిగ్రహములను దర్శించినప్పు డాయన పొందిన ఉద్వేగవైఖరి నిన్న మరల ఆయన ముఖమునందు నాకు గోచరించినది. నేను బాలుడనైయుండగా సారకవితాభిరాములైన మాపితామహులను చూచియుంటిని. వారి తేజస్సులోని స్నిగ్ధత నిన్న మన మహామంత్రులవారి ముఖమునందు నాకు మరల కన్పించినది." అనిరి.

భవ్యభారతి బయ్యనగారు "మహామాత్యపాదులవారు వ్యాసహృదయమును వ్యాసదార్శనిక రహస్యమును అవగాహన చేసికొనిన మహామనీషామణి. ఆదార్శనిక తాత్త్విక

తేజస్సు వారి ముఖమునందు నాకు గోచరించినది. వారు భార తము రచింపగలరని నాకా తేజఃప్రసన్నత తెలిపినది.” అనిరి.

ఇంతలో మహామంత్రి తిక్కనగారు లోపలకువచ్చిరి. అన్యోన్య అభివాదనలు జరిగినవి. అందరు తమ తమ ఆసనము లందు తిరిగి కూర్చుండిరి. మహామంత్రి తిక్కనగారు మహా రాజులవారిని ప్రసన్నమధురముగా వీక్షించుచు “ఆంధ్ర మహాభారతరచనా భారమును స్వీకరించుటకు తలపోసినాము.” అనిరి. మహారాజులవారు “మహాప్రసాదం” అని చేతులు జోడించి ఆనందబాష్పములు కురిసిరి. సమావిష్టులైన మంత్రులు హర్షధ్వానములు చేసిరి.

మహామంత్రి తిక్కనగారు మహారాజుల వారిని చూచుచు “ఐతే మహాభారతరచనకు రెండు విషయములున్నవి. ఈ మహా భారమును నిర్విఘ్నముగా నిర్వహించుటకు కావలసిన ఆత్మ శక్తిని సంపాదించుకొనవలెను. అనగా దయా క్షాంతి అన సూయా శౌచ అనాయాస మాంగల్య అకార్పణ్య అస్పృ హాదులైన ఆత్మగుణములను బలవత్తరము చేసికొనవలెను. అందులకై త్రయీనిర్దేశితములైన యజ్ఞకార్యములను నిర్వ హింపవలెను. సప్తపాకయజ్ఞములను సమాప్తిచేసి, సప్తహవి స్సంస్థలను పూర్తిచేసి, అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ, ఉక్థ్యషోడశీ, వాజపేయ, అతిరాత్రి అప్తోర్యామాదులైన సోమయజ్ఞము లను పూర్తిచేసి, సర్వతోముఖ, సర్వపృష్ఠాగ్నిచయన పౌండరీ కాంతము సర్వక్రతువులను సర్వజిద్యాగమును యథావిధిగా

నిర్వహింపవలెను. అయితే హవిస్సంస్థలను పూర్తిచేసి సోమ యజ్ఞములందు అగ్నిష్టోమము పూర్తిచేసిన వెంటనే సోమ యాజియై భారతరచనప్రారంభించి రాత్రులందు నిర్వహింప వచ్చును." అనిరి. మహారాజులవారు "గురునాథా! మహా మంత్రులవారిసర్వక్రతునిర్వహణకు సన్నాహములు చేయించు" అనిరి. గురునాథుడు "చిత్తం చిత్తం" అని మహారాజులవారితో అంజలి బంధించిచెప్పెను. మహామంత్రిగారి నొకసారి చూచి- మరల మహారాజులవారిని చూచుచు "మహామాత్యపాదుల వారు వాజపేయక్రతువు పూర్తిచేసినప్పుడు మహాప్రభువుల వారు శ్వేతచ్ఛత్రంపట్టి గౌరవింపవలసియున్నది. ఆనాడు శ్వేత చ్ఛత్రవాహకునిగా నన్ను నియమింపుడని ప్రార్థించుచున్నాను. గురుస్వరూపులైన గురుపుత్రులను సేవించుకొనే భాగ్యం నాకు ప్రసాదించండి" అని ప్రార్థేయపూర్వకమైన విన్నపముచేసెను. మహారాజులవారు మందస్మితులై అనుకూల శిరఃకంపనముచేసిరి.

ఇంతలో మహాకవి తిక్కనగారు "మరియొక క్లిష్టపరిస్థితి కలదు." అని మహారాజులవారిని చూచిరి. మహారాజులవారు చలించి "ఏమిటన్న" ఆందోళనాదృష్టులను చూచిరి. అప్పుడు మహాకవిగారు "మహాభారతరచన ఆవేశపూరితమైనది. తగిన లేఖకులు లభించినచో ఆవేశభంగము జరుగకుండా సాగుటకు వీలున్నది. సోమయజ్ఞములందు రెండవది ప్రారంభమైన నాటి నుండి సాయంకాలానుష్ఠానమును ముగించుకొని రచనకు కూర్చుని నడిరాత్రివరకు రచనసాగింపవలెను. ఈ అన్నిక్రతు

వులు యథాక్రమముగ పూర్తియగుటకు సంవత్సరమునకు తక్కువకాని కాలముపట్టును. ఆలోగా మహాభారతరచన పూర్తికావలెను. అందుచేత సాహిత్యావేశమున కన్నులు మూసికొని పద్యములు పలుకుచున్నంత వేగమున - లేఖకుడు నిరాఘాటముగ ఘంటము నిలుపుచేయక వ్రాయవలెను. అట్టి లేఖకుడు లభింపవలెను." అని మహారాజులవారిని మిగిలిన వారిని కలయజూచిరి.

ఖడ్గతిక్కనగా రందుకొని "వేదవ్యాసమహర్షికి గణ నాథుడు లభించినట్లు" అనిరి. మహారాజులవారు "ఔను. అట్టి లేఖకోత్తముడు - సంస్కృతాంధ్రోభయ భాషావేత్త - లభించుట దుర్లభమే" అని సంశయమును వెల్లడించిరి. ఖడ్గతిక్కన గారు "సాహిత్యసమాధిలో ఆవేశభరితులై గాంగనిర్ఝరస దృక్ధారాళవాగ్ధారతో పద్యములు ప్రవహించు సమయమున - అంతవేగముతో ఘంటము నిలుపక వ్రాయగల లేఖకు లుండుట విశ్వసనీయమేనా ?" అనిరి. భవ్యభారతి బయ్యన్న గారు "ఉంటేవారు గణనాథవరప్రసాదలబ్ధశక్తి సమన్వితులు కావాలి" అనిరి. ప్రబంధాంకం అన్నంభట్టు - "నూరు పద్యములవరకు అయితే విన్నవాటిని ధారణపట్టి వ్రాయవచ్చును. కాని మహామాత్యులవారు చెప్పుచున్నది అతీతముగా నున్నది" అనెను.

మహారాజులవారు "అయినా యజ్ఞసన్నాహములు జరుపవలెను. ఈలోగా వరప్రసాదుడైన లేఖకోత్తముని వెదకి

తీసికొనివచ్చెదము" అనిరి. గురునాథుడు లేచి చేతులు జోడించి "ఏలినవారికి, మహామాత్యపాదులకు ఒక విన్నపం మనవిచేసు కుంటాను" అని ప్రార్థేయపూర్వకముగా చూచెను. వారిద్దరు ప్రశ్నార్థక శిరఃకంపనము చేసిరి.

గురునాథుడు అంజలిబంధించి వినయముతోపగా "మహా కవులు అనర్గళముగా పద్యములు పలుకునప్పుడు నే నంతవేగ ముతో ఘంటము నిలుపకుండ వ్రాయగలను. సారకవితాభి రాములైన భాస్కరామాత్యులవారి కుమారులు సాంగవేద వేది కొమ్మనామాత్యపాదులవారు నాకు సంస్కృతాంధ్ర భాషా జ్ఞానమును అనుగ్రహించిరి. ఈనాడు మహామాత్యపాదులవారి సేవ నాకు గురుసేవాభాగ్యమే. నాజన్మ చరితార్థ మౌతుంది. ఆంధ్రసరస్వతిని సేవించుకునే మహాభాగ్యాన్ని నాకు అను గ్రహించండి" అని మనవి చేసెను.

మహారాజులవా రతనిని చూచుచు "గురునాథా! నీవు సమర్థుడవే లెమ్ము. కాని మహామాత్యులవారిని వేదవ్యాస భట్టారకులవారు, నన్నయభట్టారకులవారు ఆవేశించియున్నారు. ఆదివ్యావేశబలముతో, అనర్గళముగా - ధారాప్రవాహము వలె వారు పద్యములను పలుకునప్పుడు నీ వావేగమును అను సరించి ఘంటము నిలుపకుండ వ్రాయగలవా ? అనిరి.

గురునాథుడు మహామంత్రిగారి దిక్కై 'మహామాత్య పాదులవారు నన్ను అనుగ్రహిస్తారని ప్రార్థించుచున్నాను" అనెను. మహామంత్రిగారు గురునాథుని చూచుచు "గురు

నాథా! నీవు సమర్థుడవే. నీవు మాపితృపాదుల అంతేవాసివి. నీశక్తిని నేను శంకించుటెట్లు? కాని నీవు మహారాజులవారి ప్రశ్నకు సమాధానము చెప్పుకొనలేదు. అది సభామర్యాద” అనిరి. గురునాథుడు మహామంత్రిగారిని చూచి, మహారాజుల వారి దిక్కుగా తిరిగి “నా ఇష్టదేవతయైన ప్రసన్నవిఘ్నేశ్వర స్వామివారి కృపావిశేషమువలన, నాగురుదైవమైన సాంగ వేదవేది కొమ్మన దండనాథులవారి కటాక్షమువలన నీ నీభార మును నిర్వహింపగలను. ఐనా మహారాజులవారి ప్రశ్నను మహాకవులు ఉద్ధరించిరి కావున మనవి చేయుచుంటిని. సాహిత్య దివ్యావేశమున మహాకవులు చెప్పినంత వేగముతో నేను ఘంట మును నిలుపకుండా వ్రాయలేకపోయినచో నేను నా దక్షిణ హస్తాన్ని ఖండించుకుంటాను” అని ఆవేశముతో చెప్పి అంద రను చూచెను.

మనుమసిద్ధి మహారాజు “గురునాథా చాల తొందరపడి నావు. తగినంతకారణములు లేకుండా అంతటి ప్రతిజ్ఞలు పనికి రావు.” అని మందలించిరి. ఇంతలో ఖడ్గతిక్కనగారు సంభ్రమ చకితులై ఆవేశపూరితముగా “గురునాథా! నీప్రతిజ్ఞ పౌరుష వంతముగా వీరపురుషోచితముగా నున్నది. కాని సాహిత్య సేవకునకు అవసరమగు వినయమును విద్యమానము చేయుట లేదు. గురుస్వరూపులైన గురుపుత్రులందు గౌరవమును వెల్లడించుటలేదు. మహామంత్రిగారు నీకు గురుపుత్రుడు. వేదవ్యాసభట్టారకులవారి అవతారము. రెండవ నన్నయ

భట్టారకులు. వ్రాయుటకు పూనుకొనినది ఆశ్లేయమైన పంచమ వేదము. పుంభావసరస్వతియై, ఆవేశభరితముగా, అనర్గళ ధారావేగముతో పద్యములను పలుకునప్పుడు అంత వాగ్వే గానికి తుల్యముగా ఘంటమును నడిపింపగలననే ప్రతిజ్ఞా హంకారము మంచిది కాదు. అసమంజసముగా నున్నది. నీఘంటముతో సమానముగా ఆయన వాగ్ధాటి ఉండక పోవచ్చునను ధ్వనికూడ విద్యమానమగుచున్నది. అది నిజ మైతే - శ్రీమద్రామాయణ మహాకావ్యనిర్మాణధురంధరులైన భాస్కరామాత్యులవారి పౌత్రుడు, సాంగవేదవేది కొమ్మ నామాత్యులవారి పుత్రుడు విక్రమసింహపురమహారాజ్య భాగ్యధారేయుడు - తన వాగ్ధాటి కుంటుపడితే తన జిహ్వను ఖండించుకుంటాడు." అని ప్రతిజ్ఞ చేసిరి.

మహారాజులవారు చకితులై "సేనాపతులవారు తొందర పడిరి. ఇంత ఉద్వేగం - ఆవేశపూరితమైన ప్రతిజ్ఞలు సాహిత్య రంగమున ఉచితము కావు." అని మందలింపుగా చూచిరి. ఖడ్గతిక్కనగారు పశ్చాత్తప్తశిరఃకంపనము చేసిరి. గురునాథుడు కూడ పశ్చాత్తాపముతో "నన్ను మన్నించండి. నాతొందర పాటువలననే యిదంతా జరిగినది. మహాప్రభువులవారు, మహామాత్యులవారు, మహాసేనాపతులవారు నన్ను మన్నింప వలెను." అని చేతులు జోడించెను.

మహామంత్రి తిక్కనగారు గురునాథుని వంకచూచుచు "నీదోషము లేదు. మాతండ్రిగారి అంతేవాసివైన నిన్ను

లేఖకునిగా స్వీకరించుటకంటె సంతోషము మరొకటి లేదు. సేనాపతులవారు నాకు అన్నగారు. వారు శాసించినవిధముగా నేను ప్రతిజ్ఞానిర్వహణము చేయుట కర్తవ్యమై యున్నది. సేనాపతులవారి ప్రతిజ్ఞాశాసనములోనే గురునాథుని లేఖకునిగా స్వీకరించుట యున్నది." అనిరి. గురునాథుడు "మహా ప్రసాదం" అని అంజలి బంధించి శిరము వంచెను.

మహారాజులవారు మహామంత్రిగారి వంకచూచుచు "ఐతే క్రతువు లెప్పుడు ప్రారంభించెదరు" అనిరి. మహామంత్రి గారు "రేపటి దశమినాడే" అని గురునాథుని చూచుచు "పశ్చిమపాకనాటిలో తిరుపతిక్షేత్రమునకు పదేనుక్రోశుల దూరమున పెరుంగండూరు అగ్రహారమున్నది. దాని నిప్పుడు కోడూరని పిలుచుచున్నారు. ఆ బ్రాహ్మణాగ్రహారమున చతుర్వేదవేత్తలు పౌండరీకాంతశ్రౌతులు, ధర్మశాస్త్రవేత్తలు కలరు. క్రతునిర్వహణమునకు వారిని ఆహ్వానించు" అని ఆదేశించిరి.

## 16

ఎఱ్ఱగడ్డపాటి ప్రభువులు యాదవకుల రాజచంద్రులైన కాటమరాజులవారు తమ పశుగణమును విక్రమసింహాపుర రాజ్యమున అరణ్యప్రాంతములలోని పచ్చికపట్టులందు మేపుకొనుచుండిరి. సేనాభటవర్గముతో, సహచరవర్గముతో ఆయన స్వయముగావెళ్లి పశుగణమును కాపాడుకొనుచుండెను.

పశువులను మేపుకొనుచున్న పట్టులందు పచ్చిక సమృద్ధిగా నున్నది. తృణజలకాష్ఠ సమృద్ధికల ప్రాంతమది. పశువుల కాపరులకు కూడ సౌకర్యముగా నున్నది. పశువులు బాగుగా కోలుకొనినవి. వాటికి రోగములుగాని బాధలుగాని లేవు. తమ ప్రాంతమునుండి మంచివార్తలు రాకపోవడమువలన వారింకా ఉండవలసివచ్చినది. గుడారములను నిర్మించుకొని వారు నివసించుచుండిరి.

కాటమరాజుగారికి పినతండ్రి ప్రోలమరాజు. అతని కుమారుడు కరియావులరాజు. కాటమరాజుగారికి ఆప్తుడైన అంగరక్షకుడు కరియావులరాజు. కాటమరాజుగారు శాంత స్వభావుడు. కరియావులరాజు చాల తొందరమనిషి.

యాదవులు పశువులను మేపుకొనుచున్న అడవుల చుట్టు పల్లెలుకలవు. అవి పాడిపంటలతో సుభిక్షముగా నున్నవి. ఒకనాడొకపల్లెలోని రైతులు కొంతమంది ఆవులను తోలుకొని యాదవుల గుడారములకు వచ్చిరి. ఆరైతులలో ముఖ్యుడు గుడారముల కడనున్న కరియావులరాజుతో "కాటమ రాజెవరయ్యా" అని ప్రశ్నించెను. కరియావులరాజు "మర్యాదగా మాట్లాడుట తెలియదా ?" అని దూకుడుగా సమాధానము చెప్పెను. ఆరైతులపెద్ద "పశుకాపరులముఖ ములకు మర్యాదకావలెనా ?" అని గద్దించెను. కరియావుల రాజు "నోర్ముయ్" అని మీదకు లంఘించుచుండ, కాటమ రాజు వెనుకనుండివచ్చి పట్టుకొని వారించి "తొందరపనికిరాదు,

వారు అమాయకులైన గ్రామీణులు. మనకు రాజమర్యాదలు కావలెనని వారికెట్లు తెలియును" అని మందలించి ఆరైతుల వంకచూచుచు "మీకేమి కావలెనో చెప్పండి. నేనే కాటమ రాజును" అని చెప్పెను.

ఆరైతుపెద్ద "మాప్రభువులవారు మీరు పశువులను అడవులలో మేపుకొనుటకు అనుమతించిరిగాని మాపంటచేలను మేపుకొమ్మనలేదు కదా!" అని ప్రశ్నించెను. కరియావులరాజు దూకుడుగా 'ఐతే' అని హుంకరించెను. ఇంతలో యాదవుల భటవర్గము రైతుజనమును చుట్టుముట్టినది. రైతుపెద్ద "మరి మీఆవులనుపంటచేలలోని కెందుకుతోలినారు" అని గద్దించెను. కరియావులరాజు "పంటచేలలోని కెవరు తోలుతారు? నీవు చూడు బుద్ధిలేక మా మహారాజువారిని అమర్యాదగా మాటాడినావు. అట్లే పశువులుకూడ బుద్ధిలేక పంటచేలపైకి పోయియుండవచ్చును." అని యెగతాళిచేసెను. రైతుపెద్ద "నాకు బుద్ధిలేదంటావా? నన్ను పశువు అంటావా?" అని గద్దించెను. కరియావులరాజు "ఔనౌను" అనెను. చుట్టుకొని యున్న యాదవభటవర్గము బిగ్గరగా నవ్వి ఈలలుకొట్టి గోల చేసిరి. రైతులు ఆగ్రహమును నిలువత్రొక్కుకొనుచు, చేయునదిలేక దూకుడుగా వెళ్లిపోయిరి.

ఆమరునాడు అప్రాంతముల చెంచుగూడెముల చెంచు దొరలు కొందరు చచ్చినలేడి నొకదానిని తీసికొనివచ్చిరి. దానికి బాణమొకటి గ్రుచ్చుకొనియున్నది. ఆబాణమునకు యాదవుల

గుర్తులున్నవి. చెంచుదొరలనాయకుడు యాదవుల గుడార ముల కడకువచ్చి "ఆలమందలను మేపుతున్న పశుపాలకులు మీరేనా ?" అని ప్రశ్నించెను. కరియావులరాజు 'ఔను' అనెను. చెంచుదొర "పశుపాలకులకు మెకాలతో సంబంధ మేమిటయ్యా" అనెను. కరియావులరాజు ధిక్కారముగా "పశుపాలనలో పశుసంరక్షణ ఉండనే ఉన్నది. అడవి మృగముల బారినుండి మాపశువులను రక్షించుకొనే హక్కు మాకుకలదు. మాపశువులపైకివచ్చే వన్యమృగములను మేము సంహరింపవచ్చు" అనెను.

చెంచుదొర వెటకారముగా "లేళ్లు మీ ఆవులను భక్షించడానికి ప్రయత్నించినవటయ్యా! పచ్చికమేసి బ్రతుకు చున్న లేళ్లు జింకలు మీపశువుల కేమి హానిచేసినవి?" అనెను. కరియావులరాజు "ఒకటి రెండు బాణములు పొరపాటుగా యీమాదిరి జంతువులకు తగిలియుండవచ్చును." అని సమా ధానము చెప్పెను. చెంచుదొర "పొరపాటేమిటి? మీభటుడు గురిచూచి యీలేడిని కొట్టుతుంటే మేము గద్దింపగా - లేడిని వదలిపెట్టి ఉడాయించాడు. మీభటులు అనేక సాధుజంతువు లను వేటాడుతున్నారు! మీభటుడు చంపినలేడిని మేము తీసి కొనిపోయేటంత పౌరుషహీనులంకాము. మీరే తీసికోండి" అని లేడిని క్రిందపడవేయించి మరల కరియావులరాజుతో "మీరు కంటికి కనబడిన అడవిజంతువు లన్నిటినీ చంపుతుంటే అడవిలో జంతువులే మిగులవు. అడవి జంతువులమీద ఆధార

పడు మావంటివారి నోటికడ కూడు తీసివేస్తున్నారు." అని గద్దించెను.

కరియావులరాజు "నీవు అధికప్రసంగము చేయనక్కర లేదు. చాలించు. మేమును మాంసాహారులము. అడవిలో నున్నప్పుడు అడవిజంతువులను వేటాడి ఆహారమును సంపాదించుకొనుటలో అసందర్భము కాని, తప్పుగాని, అధర్మంగాని లేదు. ఇది కాదనగలవా శ్లీవరు ?" అని రెట్టించెను. చెంచు దొర "ఎవరా? మామహారాజులవారు!" అని హెచ్చుస్థాయిలోనే సమాధానము చెప్పెను. కరియావులరాజు "మీమహారాజు మీకే మహారాజుగాని మాకుకాదు. మమ్ము శాసించే హక్కు ఆయనకు లేదు. ఆయన మమ్మేమీ చెయ్యలేడు." అని ధీమాగా చెప్పెను. చెంచుదొర "ఐతే మామహారాజులవారినే ధిక్కరిస్తావన్నమాట. నీసంగతి చూడగలం" అని దూకుడుగా వెళ్లిపోయెను. చెంచులు వాళ్లదొరను అనుసరించిరి.

## 17

నిర్వచనోత్తరరామాయణమును కృతి స్వీకరించిన నాటి నుండి మనుమసిద్ధి మహారాజులవారు వేశ్యావాటికకుపోలేదు. సంవత్సరములుగా నిత్యము వేంచేయుచున్న మహారాజుల వారు అకస్మాత్తుగా రాకపోవడమునకు కారణమేమిటో కుంద మాదేవికి తెలియలేదు. ఆమెను చిన్నతనములోనే మనుమసిద్ధి మహారాజులవారు వలచి చేరతీసిరి. అప్పుడాయన యువరాజు.

ఆమె సంగీతనాట్యములందు విశేషకృషి చేసినది. ఆమె తల్లి శ్రీరంగనాథస్వామివారి ఆలయమున దేవదాసి. కుమార్తెకు నాట్యశిక్షణపూర్తికాగా శ్రీరంగనాథస్వామివారి కళ్యాణోత్సవములలో తొలిసారి నాట్యము చేయించినది. ఆప్రదర్శనమును తిలకించుటకు వచ్చిన మనుమసిద్ధి యువరాజులను కుందమాదేవి ఆకర్షించినది.

యువరాజులకు అక్కన బయ్యనలు పిన్నతండ్రి పుత్త్రులు. వారాయనకు స్నేహితులు. వారికి వేశ్యావాటిక విహారభూమి. వారెరుగని వేశ్యాగృహములేదు. వారు విటచక్రవర్తులు. రాజధానిలోని వేశ్యల అందచందములు, సంగీత నాట్య చాతుర్యములు వారికి ధ్యానశ్లోకములే.

యువరాజులవారు కుందమాదేవిపై తనకుగల వలపును వారికి చెప్పిరి. వారు రాయబారమును నడపిరి. మరునాడే యువరాజులవారిని కుందమాదేవి శయనమందిరమునకు చేర్చిరి. తరువాత వివాహమైనను యువరాజులవారు కుందమాదేవిని విడువలేదు. ఆమెను ప్రతిదినము సేవించుచుండిరి. మహారాజైన తర్వాత కూడ పట్టపురాణి ముఖము చూడలేదు. కుందమాదేవిని విడనాడలేదు. ఇది పూర్వస్థితి.

అట్టి మహారాజులవారు అకస్మాత్తుగావచ్చుట మాని నప్పుడు కుందమాదేవికి పిడుగుపాటువలెనున్నది. రాజకార్యముల తొందరవలన రాకపోయియుండవచ్చునని, త్వరలో రావచ్చునని కుందమాదేవి తలపోసినది. మహారాజులవారు

వచ్చుట మానుకొని దినములు, వారములైనవి. నెలలైనవి. సంవత్సరము లైనవి. కుందమాదేవి కేమియు పాలుపోలేదు. ఆమెయు ఆమె తల్లియు పరిపరివిధముల నాలోచించిరి. అన్ని దేవతలకు మ్రొక్కిరి. శాంతులు చేయించిరి. జ్యోతిష్కులను సంప్రతించిరి. మాంత్రికులను భూతవైద్యులను దర్శించిరి. వారొసగిన రక్షలను కుందమాదేవి ధరించినది. ఏమి జరిపినను ఫలములేదు. వేశ్యమాత అక్కన బయ్యనలను ఆశ్రయించినది.

మనుమసిద్ధిమహారాజు పట్టాభిషేకము చేసికొని సింహాసన మెక్కిననాటినుండి అక్కన బయ్యనలను దగ్గరకు రానీయ లెదు. వారు రెండు మూడు పర్యాయములు మహారాజుల వారి సన్నిధికిపోవుటకు ప్రయత్నించిరి. వీలుపడలేదు. వారికి రాజసభాప్రవేశమే లేకుండచేయబడినది. దానినిబట్టి నగరమున వారి పలుకుబడి తగ్గినది. వారిని లెక్కచేయువారు నగరమున లేకుండపోయిరి. ఆపరిస్థితిలో వారు వేశ్యమాతకు చేయగలిగిన సాయమేమియు లేదు.

వేశ్యమాత కుమారెను ప్రతిదినము శ్రీరంగనాథ స్వామివారి దర్శనమునకు తీసికొనివెళ్లుచున్నది. స్వామివారి అనుగ్రహము కలుగలేదు. కళ్యాణోత్సవములలో మహారాజుల దర్శనము కావచ్చునని ఆశపడిరి. మహారాజులవారు కళ్యాణోత్సవములలో మహారాణీవారితో కలసివచ్చి స్వామి దర్శనముచేసి వెళ్లుచుండిరని, అప్పుడు దేవాలయములోనికి మరెవ్వరిని రానిచ్చుటలేదని, మహారాజులవారు నాట్య-

ములకు సంగీత కచేరీలకు వచ్చుటలేదని తెలిసికొని ఆశా భంగము పొందిరి. సకల మహారాజదర్శనమే లభింపదని కుందమాదేవి దుఃఖించినది. కాని వేశ్యమాత ఆశను విడ నాడలేదు.

శ్రీశైలమునకు అష్టదిక్కులందు అష్టశివాలయములు ప్రసిద్ధములు. అందు సిద్ధవటములోని సిద్ధవటేశ్వరాలయ మొకటి. యాత్రికులు పెక్కుమంది నిత్యము వెళ్లుచుందురు. సిద్ధవటేశ్వరుని సేవించిరమ్మని వేశ్యమాత కెవ్వరో చెప్పిరి.

ఆశీఃకులైన కొందరు భటులను రక్షకపరివారముగా నియమించుకొని, తానును కుమార్తెయు మేనాలో ప్రయాణించుచు, విక్రమసింహపురమునుండి సిద్ధవటమునకు బయలు దేరినది. ప్రయాణము సజిలీలుగా సాగుచున్నది.

తల్లి కుమార్తెలతోపాటు మేనాలో పెంపుడు చిలుక పంజరమున్నది. దానితో వారికి కొంత కాలక్షేపము.

అడవిలో ప్రయాణము జరుగుచున్నది. బోయీలు దాహమగుచున్నదనిరి. దూరమున గుడారములు కన్పింపగా - అచ్చట దాహమునకు నీరు లభించునని మేనా నొక చెట్టునీడను దింపి బోయీలు గుడారముల కడకుపోయిరి. పరివారభటులు కూడ కొందరు దాహమునకు పోయిరి.

కుందమాదేవియు, ఆమెతల్లియు మేనానుండి బయటకు దిగి అడవిని చూచిరి. అడవి రమణీయముగా నున్నది. గుడారము లున్న దెసలో సమీపమున చెరువున్నట్లే తోచుచున్నది.

అన్నిప్రక్కల కొండలు. అవిశ్యామలములై మనోహరముగా నున్నవి. కొండలపైన పచ్చికలు మేయుచున్న ఆలమందలు. ఆసుందరదృశ్యము చూచి కుందమాదేవి సంతోషించినది. ఆప్రదేశము వాసయోగ్యముగా నున్నదని, మరునాటివరకు మజిలీ చేయుదమని కుందమాదేవి తల్లికి చెప్పినది. తల్లి అడవి మధ్యలో నివాసము క్షేమము కాదని నిరుత్సాహపరచినది. అడవిమధ్యకాదు. గుడారము లున్నవి. అవి జననివాస గృహములే. ఆలమందలున్నవి. భయపడవలసిన పనిలేదు. అని కుందమాదేవి. "అదికాదు తల్లీ! సిద్ధవటమింకా వారమునాళ్ల ప్రయాణముకదా! మధ్యలో జాగు దేనికి?" అన్నది వేశ్య మాత." "మనకేమి తొందరవచ్చినది. నాలుగురోజు లాలస్య ముగా సిద్ధవటము చేరినచో మనకు నష్టమేమి? మన మచ్చట కొన్నిదినములు సేవలు చేయుటేకదా!" అని కుందమాదేవి. పెంపుడు చిలుక పంజరమునుండి "ఔను ఔను" అనుచున్నది.

వేశ్యమాత మెత్తపడినది. "ఆగుడారములపైన రాజ చిహ్నములతో పతాకము లున్నవి. మృగయావినోదమునకు వచ్చిన రాజపురుషులు కావచ్చును. మనమహారాజులైతే యెంత అదృష్టము!" అని వేశ్యమాత సంతోషము వెలిబుచ్చి "అక్కడ వారిదగ్గరే మజిలీ చేద్దాము." అని అభిప్రాయము చెప్పినది.

బోయీలు తిరిగివచ్చిన తరువాత వేశ్యమాత మేనాను గుడారములవద్దకు తీసికొనివెళ్లినది. అక్కడ తల్లి కూతురు

మేనానుండిదిగిరి. ఎదురుగా పెద్దగుడారము ముందు కాటమ రాజు కరియావులరాజు ఆసీనులై యుండిరి.

వేశ్యమాత కాటమరాజును చూచి "మహాప్రభువులు-తమ రెవరో మాకు తెలియదు. మాది విక్రమసింహపురం. మేము సిద్ధవటయాత్రకు వెళ్లుచున్నాము. రేపటివరకు యిక్కడ మకాము చేయాలని ఉన్నది. అనుమతి యిప్పించండి." అని చేతులు జోడించి చెప్పినది. కాటమరాజు "అట్లాగే ఉండండమ్మా! అభ్యంతర మేమీలేదు. పాపం అడవి ప్రయాణంలో ఏమి కష్టాలుపడ్డారో! ఇక్కడ మా ఆతిథ్యాన్ని స్వీకరించండి." అని కరియావులరాజుతో "ఖాళీగా ఉన్న బాబయ్యగారి గుడారం వీళ్లకు చూపు. అక్కడ ఉంటారు. వాళ్లకు కావలసిన సదుపాయాలు చూడు" అనెను.

వేశ్యమాత కృతజ్ఞతతో 'చిత్తం చిత్తం' అనినది. కుందమాదేవి కాటమరాజును రెప్పవాల్చకుండా చూచుచున్నది. అత డామెను గమనింపనేలేదు. అతని సౌందర్యమా మెను ఆకర్షించినది. ఆమె మోహపరవశ అయినది. ఆమె కాటమరాజుతో "తమ దయకు కృతజ్ఞులము." అని 'ఇంతకు ప్రభువులవా రెవ్వరో మాకు తెలియలేదు' అని అన్నది ఆ అనుట పరవశత్వసూచకంగా మోహనరాగములో వీణ తంత్రులు మ్రోయించినట్లున్నది. కరియావులరాజు 'వీరు యాదవకులరాజచంద్రులు. కారుణ్యరఘురాములు. కాటమ రాజప్రభువులవారు' అని చెప్పెను.

వేశ్యమాత కుందమాదేవి అచ్చెరువు పడిరి. కాటమ రాజునకు నమస్కరించిరి. కరియాపులరాజు వారికి వసతి గుడారము చూపుటకు తోడ్కొనిపోయెను.

వారిని గుడారమునుచేర్చి భటులు బోయీలు చెరువు కడకు స్నానమునకుపోయిరి. తల్లియు కూతురును మిగిలిరి. కుందమాదేవి తల్లితో "అమ్మా! కాటమరాజెంత మనోహరుడు. అభినవభీమసేనునివలె నున్నవిగ్రహము." అనినది. వేశ్యమాత "అదేమిటికి తల్లీ! అప్పుడే మనుమసిద్ధి మహారాజులవారిని మరచితివి" అని ఆశ్చర్యమును ప్రకటించినది. కుందమాదేవి "ఔనమ్మా కాటమరాజచంద్రులవంటి సౌందర్యమూర్తిని ఏస్త్రీ కామించదమ్మా!" అన్నది. వేశ్యమాత "తల్లీ! కాటమరాజు గారు అభినవరఘురాములట. ఏకపత్నీవ్రతస్థులేమో" అనినది. కుందమాదేవి "ఇది కలియుగమమ్మా! కలియుగము. రామ చంద్రులు సోమచంద్రులు కలియుగంవాళ్లు కాదమ్మా" అనినది.

ఇంతలో గాలి రివ్వున విసరినది. గుడారమున కొయ్యకు తగిలించిన పంజరము క్రిందపడి శబ్దముచేసినది. తల్లి కుమార్తె లటు చూచిరి. క్రిందపడుటలో పంజరము తెరచుకొన్నది. దానిలోని చిలుక బయటపడి 'ఔను ఔను' అనుచు తుఱ్ఱు మన్నది. దానిని పట్టుకొనుటకు వేశ్యమాత దానివెంటపడినది. వేశ్యమాతకు చిలుక దొరకలేదు. దూరదూరముగా పోవు చున్నది. వేశ్యమాతను దగ్గరకురానిచ్చి తుఱ్ఱుమని దూరముగా పోవుచున్నది. దానివెంట వేశ్యమాత పరువులెత్తుచున్నది.

కుందమాదేవి కూడ గుడారము వెలుపలకువచ్చి పరువు లెత్తుచున్న తల్లిని కొంతసేపు చూచినది. తరువాత రెండవ ప్రక్కచూడగా కాటమరాజు తన గుడారము ముందు ఏకాంతముగా కూర్చొనియుండెను. అతడు వేరొకప్రక్క చూచుచుండెను. ఆమె అడుగులందు అడుగులు వేసికొనుచు మెల్లగా కాటమరాజును సమీపించి చిన్నని మధురస్వరముతో "కాటమరాజచంద్రా" అనినది.

కాటమరాజు ఉలిక్కిపడి తేరుకొని - ఆమెను చూచి "ఏమమ్మా" అని లేచి నిలువబడెను. కాటమరాజును ఆమె మోహావేశముతో కలికి చూపులతో ముంచెత్తివేయుచు "అమ్మా! అనెదరేమి రాజచంద్రా? నేను కులవృత్తిచేయుచున్న వారకాంతను!" అని అతనిని బాహువులలో పట్టుటకు సమీపించినది. కాటమరాజు "ఆగు! నీవు వినలేదా? కాటమరాజు రఘురామునివలె ఏకపత్నీవ్రతస్థుడు." అని గద్దించెను. ఆమె అనునయింపుగా "రఘురాముడు త్రేతాయుగమువాడు. ఇది కలియుగము. అంతేగాక ఆరఘురాముని తండ్రి కెంతమంది భార్యలో తెలుసునా? మీరు యాదవకుల రాజచంద్రులు గాని సూర్యవంశక్షత్రియులు కారుకదా! మీవంశ పురుషుడు గోపీజనవల్లభుడైన శ్రీకృష్ణుడు. ఆయన తరుణీమన్మథుడు. ఆయన కెంతమంది పట్టమహిషులు, భార్యలు, గోపికలు! విక్రమ సింహపురరాజ్యమునందెల్ల సౌందర్యవతినని పేరుపొందిన కుందమాదేవిని నేను. మూర్ధాభిషిక్తులైన మండలేశ్వరులను

నిరాకరించిన దానను. నా అంతట నేను వలచివచ్చితిని. సిరి రామోకాలడ్డు పెట్టుట తగదు." అనిచెప్పుచు కాటమరాజును కౌగలించుకొనపోయినది. ఆమె కతడు దొరుకలేదు. ఇంతలో కరియావులరాజు కొంతమంది భటులతో దగ్గరకు వచ్చెను.

అందకపరువు లెత్తుచున్న చిలుకను వెంబడించుచు వేశ్యమాత దూరముపోయినది. చిలుక ఆలమందను దాటినది. ఒక వృక్షముక్రింద ప్రసవవేదనపడుచున్న గోవు కొమ్ములమీద వ్రాలి 'ఔను ఔను' అనుచున్నది. దగ్గరలో నిలువబడిన ప్రోలమరాజు దానిని బెదిరింపగా చిలుక పైకెగిరినది. కాని ప్రోలమరాజు ప్రక్కకు తిరుగగా మరల గోవుకొమ్ములపైన వ్రాలినది. ఈ విధముగా నాలుగైదు పర్యాయము లైనది.

ప్రోలమరాజు విసిగిపోయి ఈటెపెల్ల గురిచూచికొట్టెను. అది తగిలి చిలుక క్రిందపడి గిలగిలకొట్టుకొని చనిపోయినది. ఇంతలో వేశ్యమాత పరువులెత్తుకొనివచ్చి, చచ్చిన చిలుకను చూచి విలవిలలాడిపోయి ప్రోలమరాజుతో "ఎంత ఘోర అన్యాయం చేశావురా! క్రూరాతుడా! ముద్దులు మూట కట్టుచున్న పెంపుడు చిలుకను చంపుటకు చేతు లెట్లువచ్చినవిరా! రాక్షసుడా!" అన్నది. ఆమాటలకు ప్రోలమరాజు క్రుద్ధుడయ్యెను. ఆమెస్త్రీయగుటవలన తమాయించుకొని "నీవు స్త్రీవి అగుటవలన ఆమాటలుచెప్పి బ్రతికిఉన్నావు! నాగరకస్త్రీ వలె ఉండి గ్రామ్యభాషణం చేయుచున్నావే? అది నీపెంపుడు చిలుకా? అది చిలుక కాదు. మాయారాక్షసి. అవతలచూడు.

ఆవు మహావేదనపడుచున్నది. నీరాక్షసచిలుక దానిని రొష్టు పెట్టినది. ఎన్నిసార్లు బెదిరించినా అది ఆవు కొమ్ములను విడువ లేదు. చివరకు విసిగి చిన్నరాతిపెల్ల విసిరితే చచ్చిపోయింది" అని చెప్పెను.

వేశ్యమాత "చాలఘనకార్యము చేసితివి. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమును వేసితివి. మూలనున్న ముసలమ్మను కొట్టువాడు నీకన్నపరాక్రమవంతుడు." అనినది. ప్రోలమరాజు "నోర్ముయ్" అని హుంకరించెను. ఆమె "లేకపోతే ఏంచేస్తావు? చిలుకను చంపడంకాదు! తెలిసిందా?" అని గదమాయించినది. ప్రోలమరాజు రౌద్రంగా "ఆడుదానివై పోయావు. లేకపోతే ఎప్పుడో యమపురిలో ఊడిగంచేస్తూండే దానివి" అనెను. ఆమె "యమపురికి నిన్ను పంపుతాను. నే నెవరో తెలుసా? విక్రమసింహపురమహాప్రభువులు మనుమసిద్ధిమహారాజులవారి ప్రియురాలు కుందమాదేవి తల్లిని నేను. ఈమహాఘోర ఉదంతాన్ని మామహారాజులవారికి మనవిచేసి నిన్నేమిచేస్తానో చూడు! నీశిరస్సు నీకు దక్కకుండా చేస్తాను" అని కేకలు వేయుచు గుడారములవైపు పరువులతో వెళ్లినది.

## 18

మహామంత్రి తిక్కనగారు పినాకినీనదీతీరమున విక్రమ సింహపురమునకు రెండుక్రోశుల దూరమున పాటూరు అగ్రహారసమీపమున యజ్ఞశాలను నిర్మించుకొని క్రతువులను

ప్రారంభించిరి. అనుకొనిన ప్రకారము పాకసంస్థలు, హవి స్సంస్థలు ముగిసినవి. సోమసంస్థలందు అగ్నిష్టోమము పూర్తి చేయబడినది. మహామంత్రిగారు సోమయాజిరై కుండలీంద్రు డైనారు. సోమసంస్థలందు రెండవది ప్రారంభించిన నాడే రాత్రి పూట మహాభారతరచన ప్రారంభింపబడినది. యజ్ఞశాలలో తగినంత పరిచారకబృందమున్నది. యజ్ఞశాలారక్షణకు తగినంత రక్షకభటవర్గమున్నది. కావలసిన వస్తుసంభారము సదుపాయ ములు సమకూర్చుటకు మహారాజులవారు యేర్పాట్లుకావించిరి. భవ్యభారతి బిరుదాంకితుడైన బయ్యనగారు మహారాజుల వారికి ప్రతినిధిగానుండి పర్యవేక్షణ చేయుచుండెను.

యజ్ఞశాలనుండి వార్తలను మహారాజులవారు ప్రతి దినము తెప్పించుకొనుచుండిరి. రాత్రివేళలందు జరుగుచున్న ఆంధ్రమహాభారతకావ్యరచనకు మరునాడే పెక్కుప్రతులు తయారుచేయబడి అన్నిప్రాంతములకు పోవుచున్నవి. మహా రాజులవారు, రాజధానిలోని సాహిత్యభావుకులు, విద్వాం సులు—ఆంధ్రదేశమునం దన్నిప్రాంతములవారు మోదము పొందుచుండిరి. ఆనందపరవశులగుచుండిరి. శరవేగముతో శతాధికముగా ప్రతులు తయారగుచున్నవి. ఆంధ్రదేశమున నలుమూలలకు వేగముగా ప్రయాణముచేయుచున్నవి. ఆంధ్రా వళి మోదభరితమై తరువాత భాగములకై వేచి చూచు చున్నది.

మహారాజులవారు మాత్రము మహామంత్రులవారి క్రతువులన్నియు పూర్తియై ఆంధ్రమహాభారతరచన మంగళాంతము అగువరకు మహామంత్రులవారికి రాజకీయపు వార్తలు తెలుపరాదని అశౌచపువార్తలు, బంధుపరివారజనుల క్షేమాక్షేమవార్తలు వారినిచేరకూడదని కట్టడిచేసిరి. మహామంత్రిగారి సన్నిధానమున వారి ధర్మపత్నిగాక కుమారుడు మాత్రముండెను.

మహామంత్రి తిక్కనగారి మహాభారతరచనావిధానము అద్భుతముగా నున్నదని జనులలో చెప్పుకొనుచుండిరి. వారు సాయంకాలానుష్ఠానము ముగించుకొని యజ్ఞశాలలో పద్మాసనస్థులై కూర్చుని నారాయణ నరసరస్వతీవ్యాసులప్రార్థనము చేసి, హరిహరనాథుని ధ్యానించి కనులు మూసికొందురట. సాహిత్యసమాధినిచేరి కనులుమూసికొనియే—అనర్గళముగా పద్యములు గద్యములు పలుకుచుందురట. ఆపలుకుట శ్రీరాగఫణితిలో నాతిమందముగ మంద్రస్వరము నందుండునట.

గురునాథుడు పవలు చాలభాగమువిఘ్నేశ్వరధ్యానము చేయుచుండునట. అతనికి మహాభారతమును వ్రాయునప్పుడు స్మృతియున్నట్లు కన్పించదట. ఏదో దివ్యశక్తి తన్ను ఆవేశించినట్లు—ఆకన్నులు తేజఃపుంజములవలె వెలుగుచుండగా—అతడు అతిలోకమైన వ్యక్తివలె ఘంటమును నడిపించునట.

మహాకవి తిక్కనగారు గురునాథుడు మహాభారతమును పరిపూర్ణము చేయుచున్నపద్ధతి చూడగా—వారు వేదవ్యాస

భట్టారకుల, గణనాథుల అంశావతారములుగ నుండిరని చూప రులకు తోచుచున్నదట. ఆదివ్యదృశ్యమును కనులార చూచినవారు తాము పునీతులమైతిమని భావించుకొనుచుండిరి. మహాకవి తిక్కనగారి వాక్కు కుంటుపడుట లేదు. గురునాథుని ఘంటము నిలువబడుట లేదు.

XX XX XX

కాటమరాజు పశుపాలకబృందమువారి ఆగడములు మితిమీరుచున్నవని మహారాజులవారికి ప్రతిదినము వర్తమానములు వచ్చుచున్నవి. రైతులువచ్చి విన్నపములు చేసికొనిరి. చెంచులువచ్చి చెప్పుకొనిరి.

వేశ్యమాత స్వయముగా రాజసభకువచ్చి "మహాప్రభువుల రాజ్యమున మహాప్రభువులవారి ముఖ్యాశ్రితులమైన మావంటివారికి కూడా కాటమరాజు దుశ్చర్యలవలన రక్షణలేకుండా పోయిన"దని మొరపెట్టుకొనినది. అన్నంభట్టు వేశ్యమాతతో "మహారాజులవారు నీవిన్నపమును ఆలకించిరి. అమానుషముగా ప్రవర్తించిన దండగీళ్లపై తగిన చర్యలను తీసికొందురు." అని చెప్పిపంపెను.

యాదవులను గురించి తీసికొనవలసిన చర్యను గురించి మహారాజులవారు ఆలోచనలను జరిపిరి. యాదవులను హెచ్చరింపవలసియున్నదని సేనాపతులు మంత్రులు అభిప్రాయపడిరి. కార్యమును సౌమ్యముగా సాధింపవలసియున్నదని మహారాజులవారు భావించిరి. సేనాపతులు ఖడ్గతిక్కనగారితో

మహారాజులవారు "కాటమరాజు మీకు శిష్యుడు. గురుభక్తి కలవాడు. మీరు కష్టవ్రాసి హెచ్చరింపుడు" అనిరి.

కాటమరాజుగారి మకాములో ఆయన తన పరివార జనముతో ఆలోచనలు జరుపుచుండెను. ఆ ప్రాంతపు రైతులతో, చెంచులతో తన తొందరపాటువలన తగవులు వచ్చినవని కరియావులరాజు పశ్చాత్తాపమునుచెంది - ఆ రైతులు చెంచులు తమకు ఆహారధాన్యములు, ఇతర వస్తుసంభారములు అమ్ముట లేదని, అందుచేత పశుపాలకులకు ఆహారమును సమకూర్చుట కష్టముగా నున్నదని కాటమరాజుగారికి విన్నవించెను.

చెంచులు ఘోరమైన దురంతములు చేయుచుండిరని అడవిజంతువులను వేటాడు నెపముతో ప్రతిదినము కొంత పశుగణమును సంహరించుచుండిరని, ఆదినము పదియావులను చంపిరని ప్రోలమరాజు చెప్పెను.

అది తమగడ్డ కాకపోవుటవలన రైతులతోగాని, చెంచులతోగాని తగవులు పెంచుకొనుట సమంజసము కాదని, తాము కొంత యోపిక పట్టవలసియున్నదని కాటమరాజు వారికి నచ్చచెప్పెను.

అంతలో విక్రమసింహపురరాజభటుడు వచ్చి "జయం జయం యాదవకులరాజచంద్రులకు" అని అభివాదనము చేసెను. "నీ వెవరి బంటువయ్యా" అని కరియావులరాజు ప్రశ్నించెను. తాను విక్రమసింహపురరాజభటుడనని వాడు చెప్పికొని - సేనాపతులు ఖడ్గతిక్కనగారు కమ్మ పంపిరనిచెప్పి

లేఖనుతీసి కరియావులరాజు చేతికిచ్చెను. కరియావులరాజు లేఖను స్వీకరించుచుండగా కాటమరాజు దానిని చదువుమనెను. కరియావులరాజు లేఖను విప్పిపఠించెను.

"విక్రమసింహపురరాజ్యసర్వసేనాధ్యక్షులు కొట్టరువు ఖడ్గతిక్కనామాత్యులవారు తమ ప్రియశిష్యుడైన యాదవ రాజచంద్ర కాటమరాజును ఆశీర్వదించి వ్రాయించిపంపిన గమనిక.

ఇదివరలో మీ అభ్యర్థనమును మన్నించి మా మహా రాజులవారు మీగోగణమును మారాజ్యములోని పచ్చిక పట్లలో మేపుకొనుటకు అనుమతించిరి. కాని పంటచేలు మేపు కొమ్మనలేదు. మీపశుగణరక్షణకై దుష్టవన్యమృగములను అడువులో నుంచవచ్చును గాని సాధువులైన జంతుజాలములను సంహరించరాదు. అరణ్యములందు మీరు గుడారములం దుండవచ్చును గాని బాటసారులైన పాంథజనమును పీడింప రాదు. ఇది మా మహారాజులవారి ఆజ్ఞమేరకు చేసిన హెచ్చరిక. ఇట్లు - ఖడ్గతిక్కన."

ఉత్తరమును చదువుట ముగించి కరియావులరాజు కాటమరాజును చూచుచు "తమవంటి రాజచంద్రులకు వ్రాయవలసిన లేఖ కాదిది" అని ఆగ్రహముతో పలికెను. కాటమరాజు విక్రమసింహపురరాజభటుని చూచి "మీ లేఖను తీసికొంటిమని చెప్పు" అనెను. అత డభివాదనముచేసి నిష్క్రమించెను. తరువాత కాటమరాజు కరియావులరాజుతో

"తమ్ముడూ తొందరపడకూడదు" అనెను. కరియావులరాజు "అదికాదు మహారాజా! ఖడ్గతిక్కనగారు మనకు ఖడ్గవిద్యా గురువులైన మాట వాస్తవమే. వారి లేఖను మనకు గురువులుగా వ్రాయలేదు. మనుమసిద్ధి మహారాజులవారి సేనాపతులుగా రాచకార్యములమీద వ్రాయబడినది. కావున మన మర్యాదలు మనకు చూపవలెను కదా!" అని విమర్శించెను.

ఇక నాసీమలో జాగుచేయుట తమకుగాని తమ పశుగణమునకుగాని క్షేమము కాదని కాటమరాజు ఆందోళన పడుచుండెను. ఆసాయంకాలమే ప్రోలమరాజు యెఱ్ఱగడ్డపాటినుండి తిరిగివచ్చి శుభవర్తమానము తెచ్చితిననెను. అతడు సుఖాసీనుడైన తరువాత కాటమరాజు తమ గ్రామమున బంధుమిత్రపరివారజనముల క్షేమసమాచారము లడిగెను.

ప్రోలమరాజు సంతోషముతో "నేను మన ఊరు సుఖప్రయాణమున చేరితిని. అక్కడ మనవారందరు క్షేమము. పదునైదునాళ్లక్రితము నాలుగు దినములు మన సీమలో కుంభవృష్టికురిసినది. సెలయేళ్లు పారినవి. చెరువులు నిండినవి. పచ్చికలు పట్టినవి. చేలు పదునైనవి. మనవారు విత్తనములు చల్లిరి. ఇక మన మిచ్చట నుండవలసిన పనిలేదు" అని చెప్పి హర్షమును ప్రకటించెను. అందరు సంతోషపడిరి. కాటమరాజు ఆజ్ఞలతో ఆసాయంకాలమే గుడారములు పీకివేయబడినవి. ఆలమందలు కదలినవి.

ఆ రెండవనాడు మనుమసిద్ధి మహారాజులవారు ఆలోచనా మందిరమునందుండ, ఉదయగిరిదుర్గపాలకుని వగ్గరనుండి ఆశ్వికభటుడు ముఖ్యమైన సమాచారము తెచ్చెను.

కాటమరాజు తన పరివారముతో పశుగణమును తోలుకొనిపోయెనని, విక్రమసింహపుర రాజ్యపు యెల్లలు దాటిపోయెనని - మహారాజులవారి ఉత్తర్వులు లేక అతనిని నిరోధింపలేదని, ఉదయగిరిపాలకుని విన్నపము - ఆవర్తమానమును విని ఖడ్గతిక్కనగారు "అనుకొనిన నిబంధనలప్రకారము మనకు రావలసిన పుల్లరిని మనము రాబట్టుకొనవలసినదే. లేకపోతే మనము అపహాస్యము పాలైపోగలము." అనిరి. మహారాజులవారు నిజమేనని అన్నంభట్టుతో "మీరు వెంటనే బయలుదేరి వెళ్లి కాటమరాజును కలుసుకొనండి. మన పుల్లరిని మనకు చెల్లింపుమని నిలువదీసి అడగండి" అని ఆజ్ఞాపించిరి.

ఖడ్గతిక్కనగారు అన్నంభట్టుతో "పుల్లరిని నేటికవారము దినములలోగా చెల్లింపకపోయిన యుద్ధము తప్పదని హెచ్చరించండి" అనిరి. మరల "మీరు సముచితమైన పరివారమును తీసికొనివెళ్లండి" అనిచెప్పిరి. అన్నంభట్టు 'చిత్తం చిత్తం' అని శిరమువంచి సమాధానము చెప్పెను.

ఆసాయంకాలమే సముచితపరివారముతో అన్నంభట్టు బయలుదేరెను. కాటమరాజు స్వగ్రామమునుచేరిన మూడవనాడే అన్నంభట్టు కూడ యెఱ్ఱగడ్డపాడు చేరెను.

అన్నంభట్టు కాటమరాజును దర్శించి "జయమస్తు బ్రహ్మోయురస్తు ఐశ్వర్యమస్తు కళ్యాణమస్తు కుశలమస్తు" అని కైవారములుచేసెను. కాటమరాజాతనిని సుఖాసీనునిచేసి "అయ్యా భట్టుగారు! తమ కైవారమునకు కృతజ్ఞుడను. తమ నామధేయ మేమి? తమ దేయూరు? ఏరాజ్యములోని వారు? నావలన కావలసిన పనియేమి?" అని ప్రశ్నించెను.

అన్నంభట్టు వినయముగా నిట్లు చెప్పెను "నేను భట్టదేవరకులజుడను. అన్నంభట్టు నా నామధేయము. నేను విక్రమసింహపుర మహారాజులవారి కొలువులోనివాడను. మహారాజులవారు పంపగా వచ్చితిని. మా మహారాజులవారు తమకు చెప్పుమనిన మాటలివి. "కాటమరాజా! మారాజ్యములోని పచ్చికపట్లయందు గోగణమును మేపుకొనుటకు మావలన ఉత్తర్వులనుపొంది అందుకుగాను పుల్లరిగా మీరు మీ ఆలమందలు మారాజ్యమునందుండగా జన్మించిన కోడెలను మాకిచ్చుట కంగీకరించియుండిరి. మీ రామాటను నిలుపుకొనక మీ ఆలమందలను తోలుకొనిపోయితిరి. మీరు మా కివ్వవలసిన పుల్లరికోడెలను వెంటనే మాకు తోలింపవలసినదిగా హెచ్చరించుచున్నాము." అని అన్నంభట్టు చెప్పగా కరియావుల రాజు "కోడెలను తోలింపనిచో?" అని ధీమాగా ప్రశ్నించెను.

ఆమాటకు సమాధానముగా అన్నంభట్టు "మాకు కావలసిన పుల్లరికోడెలు మాకు వారము దినములలో చేరని

యెడల మా వీరభటులు మీ యావత్ గోగణమును తరలించు
కొనివచ్చుటకు ఆజ్ఞలను పొందియున్నారు" అనెను.

కరియావులరాజు "ఐతే చూస్తాం! విక్రమసింహపుర
భటులెంత విక్రమవంతులో" అని అపహాస్యముచేసెను. అన్నం
భట్టు "యాదవరాజా! మావీరభటులు ముందే రావలసిన
వారు. నేనే మా మహారాజులవారికి మనవిచేసితిని. గోటితో
చేయవలసిన పనికి గొడ్డలిదేనికని. గొల్లమీది పుల్లరిగోగుమీద
బచ్చలి మెల్లనకోయవలెనని చెప్పివచ్చితిని. మీమాట మీరు
నిలుపుకొనుట మీకు క్షేమః" అనెను.

కాటమరాజు "అన్నంభట్టుగారు, మాకు మా క్షేమము
తెలియును. మాపశుగణం మీరాజ్యమందుండగా సంరక్షణము
లేక చాల నశించినది. మీరైతులవలన, చెంచులవలన, మేము,
మాపశుపాలకులు, పశుగణము బాధలుపడినాము. మీ రాజ్య
మందుండగా మాపశుగణమునకు రక్షణకల్పింపలేని మీ మహా
రాజులకు పుల్లరితీసికొనే హక్కులేదు" అనెను.

అన్నంభట్టు "యాదవరాజచంద్రా! మందలలోని పశు
వులు మరణింపకుండునా? మృత్యువువచ్చిన వేళ - అన్నిజీవులు
మరణింపవలసినదే. ఏప్రదేశము నందున్నప్పటికి మృత్యువు
తప్పదు. కాలము వాతపడి మరణింపని జీవమేమున్నది? మా
రాజ్యమునందుండగా మరణించెనని చెప్పుటదేనికి? రక్షణ
కల్పింపలేదని దానివలన పుల్లరినిచ్చేది లేదని చెప్పవలసిన
దీనాడా?" అని హెచ్చరించెను.

కరియావులరాజు దూకుడుగా అందుకొని చాలింప వయ్యా భట్టూ! నీ తెలివితేటలు. మేము కోడెలనివ్వము. పుల్లరి నివ్వమని అడిగినప్పుడు కదా మేమివ్వమని చెప్పవలసినది” అని విసురుగా చెప్పెను. అన్నంభట్టు కాటమరాజును చూచి “అంతే నా కాటమరాజ చంద్రా!” అనెను. కరియావులరాజు “మమ్మాటికీ అంతేనయ్యా” అని గట్టిగా రెట్టించి చెప్పెను. అన్నంభట్టు “మీరాజుగారి సమాధానమును వాంఛించుచున్నానయ్యా!” అనెను. కరియావులరాజు “మా మహారాజులవారి యెదుట చెప్పబడుచున్నదేకదా యీసమాధానం! దానిని వారు కాదనక మౌనంతో అంగీకారం చూపుతున్నప్పుడు అది వారి సమాధానమే అవుతుందని నీకు తెలియదా? రాజసభామర్యాదలట్టివే కదా!” అని రెట్టించెను.

అన్నంభట్టు “ఐతే మీరు లోకోక్తిని పాటించుచుంటి రన్నమాట. వేపకాయంత వెఱ్ఱిని పోగొట్టుకొనలేదన్నమాట. పుల్లరి కోడెలకోసము సర్వనాశనము తెచ్చే యుద్ధానికి పూనుకుంటున్నారన్నమాట.” అనగా కరియావులరాజు “మేమెప్పుడు యుద్ధమునకు సిద్ధమే. యుద్ధంపేరుచెప్పి మమ్మల్ని భయపెట్టి కోడెల్ని తోలుకుపోగలమని మీరనుకుంటే వేపకాయంత వెఱ్ఱి మీకే.” అని యీసడించెను. అన్నంభట్టు “విక్రమసింహపురవీరభటులు రణరంగంలో వీరవిహారము చేస్తున్నప్పుడు వేపకాయంత వెఱ్ఱి యెవరికో తెలుసుంది.” అనుచు లేచి వెళ్లిపోయెను.

కాటమరాజు యుద్ధప్రయత్నములకు పూనుకొనెను. తనకు బంధువులు మిత్రులు అగు వారికడకు ప్రోలమరాజును కరియావులరాజును పంపి సాయము కోరెను. పల్నాటిప్రభువు పద్మనాయడు, పల్లికొండప్రభువు చల్లపిన్నమనాయడు, దొనకొండ అయితమరాజు, భట్టావులరాజు ఎఱ్ఱయ్య, వల్లభన్ననాళకూళ్లనాయడు, నేతి ముద్దయ్యనాయడు, పాచయ్యనాయడు, ముమ్మయ్యనాయడు, పుత్తమరాజు మొదలైన యోధవరులు సహాయము వచ్చుటకు బాస చేసిరి.

కాటమరాజు తమ కులదైవమైన పల్లికొండ గంగమ్మకు తిరునాళ్లు చేయించి తమకు జయము ప్రసాదింపుమని ప్రార్థించెను.

కాటమరాజు తల్లి పెద్దిమాదేవి. భార్య గంగమాదేవి. వారిరువురు "జయాపజయములు దైవాధీనములు. సామముతో కార్యసాధన చేసియున్న బాగుండెడిది" అని అభిప్రాయములు తెలిపిరి. కాటమరాజు వారలతో "రాచకార్యములలోని ధర్మాధర్మములు మీకు తెలియవు. ధర్మము మన పక్షమున లేనప్పుడు మేము యుద్ధమునకేల దిగుదుము. మన కులదేవత పల్లికొండ గంగమ్మతల్లి మనలను చల్లగా రక్షింపగలదు" అని చెప్పి సమాధానపరచెను.

అన్నంభట్టు విక్రమసింహపురమునకు తిరిగివచ్చి మహారాజులవారికి యాదవుల సమాచారము నివేదించెను. యాదవుల గర్వమణచుటకు యుద్ధము తప్ప మరియొక మార్గము లేదని

విన్నవించెను. సేనాపతులు ఖడ్గతిక్కనగారు "ఐతే ఆజ్ఞయి యిప్పించండి మహారాజా! మన ఆశ్వికదళము వారిని వంద మందిని కాల్బలమువారిని రెండు వందల మందిని తీసికొని వెళ్లి యాదవులను శిక్షించి వచ్చెదను" అని అభ్యర్థించిరి. అన్నంభట్టు "సేనాపతులవారు యాదవ యోధుల సామర్థ్యముల నెరుగుదురు. పల్నాటి పద్మనాయడు, పల్లికొండప్రభువు చల్లపిన్నమనాయుడు దొనకొండ అయితమరాజు కరియావుల రాజు కాటమరాజు మహాపరాక్రమవంతులు. వారందరు తమ వద్దనే ఖడ్గవిద్యాభ్యాసము చేసిన యోధశిఖామణులు. కాటమ రాజు చల్లపిన్నమనాయడు తమ శిష్యులందరిలోను ఖడ్గవిద్య యందు అసమానులైన మహాబలాఢ్యులని ప్రసిద్ధిని పొందిన వారు. వారికి మహామాంత్రికుడు సర్వప్రయోగదక్షుడు ఐన పండితారాధ్యుల బ్రహ్మరుద్రయ్యగారి మంత్రశక్తితోడుగా నున్నది. మనము అధికమైన బలముతో వెళ్లుట యుక్త మేమో?" అని మనవిచేసెను.

ఖడ్గతిక్కనగారు ఆగ్రహముతో "అన్నంభట్టూ! విక్రమ సింహపురవీరభటుల ప్రతాపాన్నే శంకిస్తున్నావా? పిఱికి మాటలుమాట్లాడతావేం?" అని గర్జింపగా అన్నంభట్టు మౌనము వహించెను.

మనుమసిద్ధి మహారాజులవారు "ఒకసారి మహామంత్రుల వారితో సంప్రతించివచ్చినచో?" అనిరి. ఖడ్గతిక్కనగారు

"ఈస్వల్పవిషయమునకై ఆయన క్రతుదీక్షకు మహాభారత రచనావ్యాసంగమునకు అంతరాయము కలిగించుట సముచిత మా ?" అనిరి. మరల "నాతమ్ములు దోహత్తనారాయణుడు చినభాస్కరుడు నగరరక్షణచేయుదురు. నాకు అంగరక్షక బలములోని వారైన తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేగిచొక్కరాజు, పెదవరదరాజు, ఆదివన్నెమాదిరాజు, గయికొండ గంగరాజు చెన్నపట్టణము చంద్రశేఖరుడు, పట్టకోట బసవరాజు నాతో వచ్చెదరు. వీరందరు అప్రతి మానులైన మహాయోధులని మహాప్రభువులకు తెలిసిన విషయమే. అనుజ్ఞ యిప్పించండి." అని చేతులు జోడించి అభ్యర్థింపగా మహారాజులవారు 'అట్లే కానివ్వండి" అనిరి.

# 19

యాదవుల యుద్ధప్రయత్నములు పూర్తి అయినవి. భార్యతోకలసి కాటమరాజు తమ కులదేవతయగు పల్లికొండ గంగమ్మను అర్చించి దండప్రణామములు చేసెను. ఖడ్గమును ఆమె ముందుంచి పూజించి కన్నుల కద్దుకొని గ్రహించెను.

ఖడ్గమును ధరించి ఆలయమునుండి బయటకువచ్చి కాటమరాజు ఆలయమువైపు తిరిగి నమస్కరించి దూరమున చెట్టుకడనున్న తన గుఱ్ఱము కడకుపోయెను. గుఱ్ఱమును అధిరోహింపబోయి తన ఖడ్గమును పరీక్షింపవలెనను కుతూహలము కలుగగా చెట్టుకడకుపోయి ఖడ్గమును దూసి—

కన్నుల కద్దుకొని—బాహుబలముతో చెట్టుకాండమును నరికెను. ఆమహావృక్షము కుప్పకూలిపోగా తృప్తిపడి తన ఖడ్గమును కన్నుల కద్దుకొనెను.

అప్పుడే వెనుకనుంచి వచ్చిన చల్లపిన్నమనాయడు "బావా! నీబలప్రదర్శనము అద్భుతముగా నున్నదయ్యా! మహాబలా" అనెను. కాటమరాజు చకితుడై "ఇది బలప్రదర్శనమే కాని ఖడ్గవిద్యాప్రదర్శనము కాదా?" అనెను. పిన్నమనాయడు "ఖడ్గవిద్యాప్రదర్శనము చూడవలయునని యున్నదా?" అనుచు నేలకొరిగిన వృక్షముకడకు పోయి—యెడమచేతితో ఆకుకోసి పైకెగురవేసెను. అది క్రిందపడుచుండగా—దాని వంక చూడకుండ—దానిని కుడిచేతనున్న కత్తితో ఈనవెంట రెండు సమభాగములుగా చీల్చెను. క్రిందపడిన రెండు ముక్కలను పరిశీలించి కాటమరాజు ఆశ్చర్యచకితుడయ్యెను.

కాటమరాజు పిన్నమనాయకుని ఆలింగనము చేసికొని "బావా! నీవు ఖడ్గతిక్కనగారికి నిజమైన శిష్యుడవు. ఖడ్గ విద్యలో ఆయనకు నీవేసాటి. మన సేనలకు నిన్నే సేనాపతిగా అభిషేకిస్తాను" అని అతనిని ఆలయములోనికి గొనిపోయి సేనాపతిగా అభిషేకించెను.

ఇంతలో ప్రోలమరాజు కరియావులరాజు పరువులెత్తుచు వచ్చిరి. ఖడ్గతిక్కనగారు సైన్యములతో బయలుదేరి వచ్చుచుండిరని వారిని పంచలింగముల కొండదగ్గర తలపడుట

సముచితముగానుండుననని మనవిచేసిరి. సైన్యములను పంచ లింగములకడకు కదలుటకు కాటమరాజు పిన్నమనాయడు ఆజ్ఞలిచ్చిరి.

కాటమరాజును రణరంగమునకు రావలదని, అతనికి అంగరక్షకునిగా ప్రోలమరాజును నియమించి, యోధవరులతో పిన్నమనాయడు పంచలింగముల కొండకు చేరెను.

ఉభయసైన్యములు తలపడినవి. ఘోరమైన యుద్ధము ప్రారంభమైనది. ఉభయసైన్యములలోని మహాయోధులు విక్రమించిరి. సేనాపతులైన ఖడ్గతిక్కనగారు మహాసేనానియైన కుమారస్వామివలె విజృంభించిరి. యాదవసైన్యములు క్షీణించుచున్నవి. యాదవమహాయోధులలో చాలమంది వీరమరణమును పొందిరి. రణరంగవార్తలను కాటమరాజునకు తెలుపుటకు పిన్నమనాయడు కరియావులరాజును పంపెను.

ప్రోలమరాజుతో, తనతల్లి భార్యలతో కాటమరాజు గంగమ్మను ప్రార్థించుచుండగా కరియావులరాజు వచ్చెను. ఖడ్గతిక్కనగారు రణరంగమున ప్రళయకాల రుద్రునివలె పరాక్రమించుచుండిరని, తమసేనలు నిలువలేక పోవుచున్నవని కరియావులరాజు వార్తలు వినిపించెను. పొంగుచున్న ఖడ్గతిక్కనగారి పరాక్రమ మహాప్రవాహమునకు తాత్కాలికముగా పిన్నమనాయడు అడ్డుకట్టగా నిలచినాడని చెప్పెను. కాటమరాజు తాను కూడ రణరంగమునకు పోవ నుద్యుక్తుడు

కాగా ప్రోలమరాజు వారించి "నాయనా! మనము బాహు బలశౌర్యములతో ఖడ్గతిక్కనగారిని జయింపలేము. ఆయనను జయించుటకు మంత్రబలము కావలెను. మనకు గురువులైన పండితారాధ్యుల బ్రహ్మరుద్రయ్యగారి కడకుపోయి వారి ఆశీర్బలమును పొందివచ్చుట మంచిది" అనిచెప్పి కాటమరాజును బ్రహ్మరుద్రయ్యగారి ఆశ్రమమునకు తోడ్కొనిపోయెను. త్రోవలో వారి ఆలమందలున్నవి. అవి కాటమరాజును చూచి సంతోషపడి చుట్టుముట్టినవి. అతని వెంటనంటి నడచినవి.

ప్రోలమరాజుతో-వెంటనంటి వచ్చుచున్న సహస్రాధిక గోగణముతో - కాటమరాజు బ్రహ్మరుద్రయ్యగారి ఆశ్రమమును చేరెను. ఆశ్రమము ముందు గోగణము నిలచినది. కాటమరాజు గోగణము మధ్యనుండి ముందుభాగమునకు వచ్చెను.

ఇంతలో బ్రహ్మరుద్రయ్యగారు మాధ్యాహ్నికమును ముగించుకొని బయటకు వచ్చుచుండగా ఆలమందలతో కాటమరాజు ప్రోలమరాజు కనుపించిరి. ఆయన బయటకురాగా ప్రణామములనుచేసిరి. బ్రహ్మరుద్రయ్యగారు కుశలప్రశ్నాదికముచేసి ఆలమందలతో వచ్చినకారణమేమి టనిరి.

ప్రోలమరాజు వివరములు మనవిచేసెను. పుల్లరి తగాదా వచ్చినదని, ఖడ్గతిక్కనగారు సేనవతోవచ్చి వీరవిహారముచేయుచుకడిరని, యాదవులు మహాప్రమాదమునపడి పోయిరనిమనవి

చేసెను. బాహుబలముతో ఖడ్గతిక్కనగారిని జయింపజాలమని, ఆయనఆశీర్బలము అనుగ్రహింపవలెనని ప్రార్థేయపడెను. ఇరువురు చేతులు జోడించిరి.

బ్రహ్మరుద్రయ్యగారు "మీరు తొందరపడినారు. చిల్లర విషయమైన పుల్లరి తగాదాతో మహాయుద్ధం తెచ్చి పెట్టుకున్నారు." అని నిస్పృహావెల్లడించిరి. కాటమరాజు అంజలిబంధించి "మీపాదములను ఆశ్రయించినాము. పాల ముంచినా మీరే నీటముంచినా మీరే" అని విన్నవించెను. బ్రహ్మరుద్రయ్యగారు "సరే—యుద్ధాన్ని కోరి తెచ్చు కున్నప్పుడు కాకపోయినా ప్రమాదంలోనైనా జ్ఞాపకం ఉంచు కున్నారు." అనిరి. యాదవులిద్దరు "మన్నించండి మన్నించండి" అనిరి.

బ్రహ్మరుద్రయ్యగారు మూడుక్షణములు కనులు మూసి కొని మరల తెరచిచూడగా. ఆలమంద ఎదురుగా కన్పించినవి. ఆయన కొక ఆలోచన తోచినది. ఆయనముందుకువచ్చి ఆవులను చూచుచు "దుర్గా, మహాకాళి, దుందుభి, సౌమిత్రి, జాంబవతి, సౌభద్రదేవి, కౌసల్య, రేవతి, కాళింది, ధర్మదేవత, చంద్ర తగమతిదేవి" అని ఆవులను గంభీరస్వరములతో పిలచిరి. ఆవు లొక్కటొక్కటే బుసలుకొట్టుచు, కాళ్లుదువ్వుచు, ముందునకు వచ్చినవి. బ్రహ్మరుద్రయ్యగారు "జయజయ రుద్ర, మహారౌద్ర, భద్రావతార, మహాభైరవ, కాలభైరవ, కల్పాంత

భైరవ ఓం క్లీం గ్రీం వీరభద్ర జయజయ నమ స్స్వాహా" అని మహావీరభద్రుని ఆహ్వానించి ఆవులపై ఆవహింపచేసిరి. ఆవులు రుద్రాకృతులై పరవళ్లుపోయినవి. బ్రహ్మారుద్రయ్యగారు "ఓ మహాప్రమథగణసేవిత మహారుద్రా! వీరభద్రా! విజృంభించు! దక్షయజ్ఞమును ధ్వంసము చేసినట్లు ఖడ్గతిక్కన సేనాబలాన్ని ధ్వంసం చెయ్యండి! ;" అని చేతులు చాపి ఆదేశించెను.

ఆవులు కల్పాంతకాల సముద్రతరంగములు విజృంభించినట్లు, దావానలజ్వాలలు ముందునకు ప్రాకినట్లు, ప్రళయ తాండవ వేళా రుద్రతార్తీయీకజ్వాలా జ్వాలికలవలె పరువులెత్తినవి.

ధూళిమేఘములను కట్టుచు దూరమునుండి పరువులెత్తి వచ్చుచున్న ఆలమందలను రణరంగమందున్న ఖడ్గతిక్కనగారి సైనికులు చూచిరి. ఆవుల గిట్టలు రేపిన ధూళి మేఘములు ప్రళయకాల నీరంధ్ర జీమూతములవలె వ్యాపించినవి. బ్రద్దలైన అగ్నిపర్వతపు పొగలు వ్యాపించినట్లు వ్యాపించినవి. పరుగెత్తుచున్న ఆవులగిట్టల చప్పుళ్లు కల్పాంతకాలవర్షపాతధ్వనులవలె, గంగాది సర్వజీవనదుల జలపాతసమిష్టిధ్వనులవలె వినిపించినవి. పొంగుచున్న సముద్రపుఘోషవలె - కాలాహివిషజ్వాలా సహితమైన బుసలవలె ఆవులు బుసకొట్టుచున్నవి. ఏదో మహాభూతము ఆలమందను ఆవహించినట్లు ఆవులమంద మహాభయంకరముగా నున్నది.

పరువులెత్తుకొనివచ్చుచున్న ఆవుల మందను చూచి యాదవవీరులు ఆనందముతో రణరంగమునుండి తప్పికొనిరి. మహాభీభత్సరసాకృతిగా వచ్చుచున్న గోగణమును చూచి ఖడ్గతిక్కనగారి సైనికులు కర్తవ్యమేమిటని యాలోచించిరి. గోగణమును నివారించుట కాని పని యని తెలిసి విస్తుపోయిరి. గోహత్య మహాపాతకము. భారతీయులకు గోవు తల్లివంటిది. పరమపూజ్య. గోహత్యచేయనేరాదు. మరి చేయవలసినదేమి ? వీరపురుషులకు రణరంగమునుండి నిష్క్రమించు ప్రసక్తిలేనే లేదు. ఆమహాయోధులు గోవులపై కత్తుల నెత్తకూడదని ప్రాణత్యాగమునకు సిద్ధపడిరి. రణరంగమధ్యమమున వీరస్తంభములవలె నిశ్చేష్టితులై నిలచిపోయిరి. ఖడ్గములను వాటి యొరలందుంచిరి. చేతులు కట్టుకొనిరి. కన్నులు మూసికొనిరి. ఇష్టదేవతాధ్యానము చేయుచుండిరి.

ఆవులు సైనికులను చుట్టుముట్టినవి. ముట్టెలతో నేలకు త్రోసినవి. గిట్టలతో త్రొక్కినవి. కొమ్ములతో చీల్చి చెండాడినవి. ఒక్క సైనికుడుకూడ రణరంగమును విడచి పారిపోలేదు. ఒక్క సైనికుని కూడ ఆవులు మిగల్చలేదు. అందరు రణభూమిని వ్రాలిపోయిరి. శరీరములను ఆవుల గిట్టలతో త్రొక్కించుకొనిరి. కొమ్ములతో చీల్పించుకొనిరి. గోవులయందు తమకుగల భక్తికి నిదర్శనముగా ప్రాణములను బలిపెట్టిరి. కత్తియెత్తిన యోధుడుగాని, కదలిన యోధుడుగాని, కన్నులు తెరచిన యోధుడుగాని లేడు. గోవుల రౌద్రాగ్నికి వారు ఆహుతి

అయిరి. అందరు సైనికులు విగతప్రాణులు కాగా ఆవులు శాంతించినవి. ఆవులు పరమసాధువులై-శాంతమూర్తులై-పచ్చిక బయళ్లనుండి సాయంవేళ గ్రామమునకు తిరిగివచ్చుచున్న మందలవలె-బారులుకట్టి - శాంతసాధుసుందరములుగా తిరోగమించినవి. ఆరౌద్రమేమైపోయినదో - సాధువులైన గోవుల కామహాభయంకరాకారమెట్లువచ్చినదో చూపరులకు అచ్చెరువైనది.

ఖడ్గతిక్కనగారు తమ సైనికులందరివలె తాము కూడ కత్తిని యొరలోపెట్టి చేతులుకట్టుకొని, కన్నులు మూసికొని నిశ్చేష్టితులై, స్తంభాకృతిగా-శివధ్యానము చేయుచు నిలువబడియుండిరి. ప్రక్కన జరుగుచున్న భీభత్సదృశ్యము లాయన చూచుటలేదు. గోవుల స్వైరవిహారమాయన చూచుటలేదు. సైనికుల హాహాకారములు, గోవుల బుసలు, గిట్టల చప్పుళ్లు వినుచుండిరి. ఏమి జరుగుచున్నదియు ఆయనకు తెలియలేదు. చిత్రముగా ఆవు లాయనను స్పృశింపలేదు. ఆయన దాపునకు పోలేదు. ఆయనకు హాని జరుగలేదు. ఆవులు శాంతమూర్తులై సాధువులుగా తిరోగమించిన తరువాత కూడ ఆయన అట్లే నిలచియుండెను. రణరంగమధ్యమున జయస్తంభాకృతిగా నిలచియుండెను.

ఆవులు తిరోగమించిన తరువాత దూరమునుండి పిన్నమనాయ డాయనను చూచి సమీపించి నమస్కరించి పిలిచెను.

ఖడ్గతిక్కనగారు కన్నులు తెరచి జరిగిన భీభత్సమును చూచిరి. పరమదైన్యస్థితినిపొంది, క్షణములో తేరికొని కత్తిదూసి పిన్నమనాయని యుద్ధమున కాహ్వానించిరి.

పిన్నమనాయడు మరల నమస్కరించి చేతులు జోడించి "మీరు మాకు గురువులు. భూసురులు. రణరంగమునం దేకాకిగా నున్నారు. మేము మీశిష్యులము. బలసమన్వితముగా నున్నాము. ఈస్థితిలో మీతో యుద్ధము మాకు పాడికాదు. మేముచేయము. రణధర్మవేత్తలైన మీకు తెలియనిదేమున్నది! వెళ్లిరండు" అని మనవిచేసెను. రణనీతినెరిగిన ఖడ్గతిక్కనగారికి పిన్నమనాయని మాటలలోని ధర్మము తెలిసినది. తమ సైన్యము నామరూపములు లేనట్లు హతమైనదని దుఃఖించిరి. రణభూమిపైన విగతజీవులైపడియున్న తన ఆప్తవీరయోధులను చూచి కన్నీటిధారలను ప్రవహించిరి. ఆవీరయోధుల కొక్కొక్కరికి యాదవసైనికుల సహాయముతో రణభూమియందే అంతిమ సంస్కారములు నిర్వహించిరి.

అపజయము మూర్తికట్టి నడచివచ్చుచున్నట్లు - దైన్యదేవత భూమిపై అవతరించినట్లు-అవమానరాక్షసుడు భక్షించిన మానవుని యెముకల గూడు కదలివచ్చినట్లు - తలవంచుకొని-కాళ్లీడ్చుకొనుచు-సిగ్గుతో తల మున్కలగుచు, ఖడ్గతిక్కనగారు విక్రమసింహపురమునకు తిరిగివచ్చిరి. ఆయన గుఱ్ఱమాయన వెంట నడచి వచ్చినది.

## 20

ఖడ్గతిక్కనగారు యుద్ధమున అపజయమును పొందిరని, సర్వసైన్యమును పోగొట్టుకొనిరని వార్తలు ఆయనకంటె ముందుగా విక్రమసింహపురమును చేరినవి. రణరంగమున కల్పాంతరుద్రుడని పేరుపొందిన రణతిక్కనగారు అపజయమును పొందుట నగరములోని ఆబాలగోపాలమునకు అచ్చెరువుగా నున్నది. సాధుజంతువులైన గోవులు క్రూరమృగములవలె విజృంభించి రణరంగమున అభూతవిహారముచు చేసెనన్న వార్త ప్రజలకు నమ్మశక్యముగాలేదు. సంవత్సరములుగా ప్రతి యుద్ధమునందు విజయలక్ష్మినిచేపట్టి పురప్రవేశముచేయుచు - పురజనులు విజయగానములతో మంగళవాద్యములతో జయ జయధ్వానములతో స్వాగతము చెప్పుచుండగా - అర్థిజనులు వైతాళికులు బిరుదు గద్యలు చదువుచుండగా, బ్రాహ్మణులు ఆశీస్సులు చెప్పుచుండగా, పౌరంధ్రీజనము సేసలు చల్లుచుండగా, మహారాజులవా రెదురువచ్చి స్వాగతములు పలుకుచుండగా రాజలాంఛనములతో పురప్రవేశముచేయుటకు అలవాటుపడిన ఖడ్గతిక్కనగారు-ఏకాకిగా, వంచిన శిరస్సుతో, అవమానభార మును భరింపలేక-సిగ్గుచేత శరీరము దహించుకొనిపోవుచుం డగా-సాయంవేళ మసకచీకట్లతో పురప్రవేశముచేసెను. ఎదు రైన వారిని తలయెత్తి చూడలేదు. సరాసరి గృహమునకు వెళ్లెను. త్రోవలో శిరస్సుపైకెత్తనే లేదు.

ఇంటి గుమ్మములో తండ్రి సిద్దన్నగారు నిలచియుండిరి. ఆయనమోమును ఖడ్గతిక్కనగారు చూడలేకపోయెను. చలించి పోయెను. కుమారుని మోము చూడలేని తండ్రి ప్రక్కకు తిరిగి కుమారుడు వినునట్లు "కడుపు చెఱుపబుట్టినాడు! యుద్ధమున చావక పారిపోయి వచ్చుటెందులకు" అని చీదరించుకొనెను. ఖడ్గతిక్కనగారు సిగ్గుతో వెలవెలపోయి లోనికివెళ్లిరి.

ఎదురుగా భార్య చానమ్మవచ్చి ఖడ్గమును తీసికొని గోడకు తగిలించినది. "అలసిపోయి వచ్చితిరి! స్నానము చేయుడు" అనుచు దొడ్డిలోనికి త్రోవతీసినది. ఖడ్గతిక్కనగారామె ననుసరించిరి. దొడ్డిలో మరుగుగానున్నస్థలమున కామె తీసికొనిపోయినది. అక్కడ నులకమంచముమీద చీరెవేసి అడ్డుపెట్టియుండగా - లోపల నీటిబిందె పసపుముద్ద యున్నవి. స్త్రీలు స్నానముచేయుట కమర్పబడినట్లున్నది. ఖడ్గతిక్కనగారు సిగ్గుతో చలించి కన్నీరు ధారగా కురిసిరి. పెద్దచానమ్మ "పగఱకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపు నాయకు లందఱ, ముగురాడువారమైతిమి, వగ పేటికి స్నానమాడ వచ్చినచోటన్" అని సన్నగా పలికినది. ఖడ్గతిక్కనగారు దుఃఖమును భరింపలేకపోయిరి.

దుఃఖము దహించుచుండగా స్నానమును ముగించిరి. లోపలకువెళ్లి భోజనమునకు కూర్చుండిరి. తల్లి ప్రోలాంబ వడ్డించినది. ఖడ్గతిక్కనగారు అసంతృప్తిగా భోజనముచేసి

ముగింపు ఘట్టమునకు వచ్చిరి. తల్లి విరిగిన మజ్జిగ పోసినది. ఆయన "అమ్మా విరిగినట్లున్నది" అనెను. తల్లి మెత్తని స్వరముతో "అసదృశముగ నరివీరుల పసమీరగ గెలువలేక పంద క్రియన్ నీవసివైచి తిరిగివచ్చిన పసులున్ విరిగినవి నింక పాలున్ విరిగెన్" అనినది. ఖడ్గతిక్కనగారికి కర్ణరంధ్రములందు శూలము గ్రుచ్చినట్లయినది. చటుక్కున లేచి చేతులు కడుగుకొనెను. మరల యుద్ధభూమికి పోవుటకై కవచము శిరస్త్రాణము ధరించుటకు పూనుకొనెను. తలితండ్రులు భార్యయూ సమీపించిరి.

ఖడ్గతిక్కనగారు వారిని చూచి "నేను రణభూమినుండి వెన్నిచ్చి పారిపోయిరాలేదు. ఓడిపోయిరాలేదు. యాదవుల గోవులు మంత్రబలముతో విజృంభించి మన సైనికులందరను పొడిచి చంపినవి. గోహత్యాపాతకమునకు వెరచి మన యోధులు గోగణముపై కత్తి దూయలేదు. ఆవులు కొమ్ములతో పొడిచిచంపగా రణభూమిపై వీరమరణమేగాదు దివ్యమరణమే పొందిరి. ఆవులు నన్ను తాకలేదు. పవిత్రమైన గోగణముపై నేను ఖడ్గప్రయోగము చేయలేదు. ఆవులు విజృంభింపగా యాదవులు రణభూమినుండి నిష్క్రమించిరి. తిరిగి వారు రణభూమికి రాలేదు. నేనెవ్వరితో యుద్ధము చేయవలెను? తిరిగివచ్చితిని. మరల రణభూమిని ప్రవేశించుచున్నాను" అని తలితండ్రులకు పాదాభివందనము చేసిరి.

తలితండ్రులు అశ్రుధారతో ఆయన శిరస్సును తడిపిరి. తండ్రి "నాయనా! నీశౌర్యము నాకు తెలియదా! మాట లంటిమని బాధపడకు." అనెను. తల్లి "నాయనా! లోకోత్తర వీరుడైన నిన్ను కని నేను చరితార్థత పొందితిని. రణభూమిలో విజయమును పొంది తిరిగిరా!" అని దీవించినది.

పెద్దచానమ్మ ఆయన పాదములపైన వ్రాలి "నన్ను మన్నింపుడు. వీరపత్ని నన్నదురహంకారమున నే నన్నమాట లను క్షమింపుడు" అనెను. ఆమెను లేవనెత్తి ఖడ్గతిక్కనగారు పూజామందిరమునకు వెళ్లిరి. ఆమె అనుసరించినది. ఆయన ఖడ్గమును తీసికొని అమ్మవారి ముందుంచి పసుపు కుంకుమ పుష్ప ములతో అక్షతలతో, గంధముతో ఆమె అర్చించినది. మంగళ హారతి పట్టినది. నైవేద్యము పెట్టినది. భర్తకు తీర్థప్రసాదము లిచ్చి హారతి పట్టినది. తరువాత ఖడ్గముచుతీసి తాను కన్నుల కద్దుకొని భర్తకిచ్చినది. ఆయన కన్నుల కద్దుకొని ధరించెను.

కుమారుడు రాగా చిబుకమును స్పృశించి ముద్దాడిరి. కుమారుని వెంట నడిపించుకొనుచు ఖడ్గతిక్కనగారు వెలు పలకు వచ్చిరి. భార్య ఆయన వెంటవచ్చినది. తలితండ్రులు కూడ వెలుపలకువచ్చిరి. బయట గుఱ్ఱము సిద్ధముగా నున్నది. ఆయనను చూచి గుఱ్ఱము విజయధ్వనిగా సకిలించినది. ఆయన మరల తలితండ్రులకు నమస్కరించి, భార్యను కుమారుని సార్ద్రముగా చూచి, అశ్వ మధిరోహించిరి.

ఇంతలో ప్రబంధాంకం అన్నంభట్టు పరువులెత్తుకొనుచు వచ్చి చేయెత్తి - "ధైర్యంబు నీమేన తగిలియుండుట జేసి చలియించి మందరాచలము తిరిగె, గాంభీర్యమెల్ల నీకడనయుండుట జేసి కాకుత్థ్సుచే వార్ధి కట్టుపడియె, జయలక్ష్మి నీయురస్థలిని యుండుటజేసి హరి పోయి బలిదానమడుగుకొనియె. ఆకారమెల్ల నీకడనయుండుటజేసి మరుడు చిచ్చునబడి మడసిచనియె." అని గంభీరరమణీయముగ కైవారము చేయునప్పటికి, ఖడ్గ తిక్కనగారు "అన్నంభట్టు! కైవారము బాగున్నది. నే నీ అశ్వమునుండి దిరుగుటకు వీలులేదు. రణభూమినుండి తిరిగివచ్చి బహుమానమిచ్చెదను" అని గుఱ్ఱమును దౌడు తీయించిరి.

ఖడ్గతిక్కనగారు మహారాజులవారి దర్శనమునకు వెళ్లిరి. మహారాజులవా రెదురువచ్చి లోపలకు తోడ్కొనిపోయిరి. మహారాజులవారు "మేము అంతా విన్నాము. బ్రహ్మరుద్రయ్యగారి మంత్రశక్తిచేత గోవులు రౌద్రావేశముతో రణభూమికివచ్చి గోహత్యాపాతకమునకు వెరచి నిశ్చేష్టితులై యున్న మనసైనికులను కొమ్ములతో చీల్చి చంపినవని మేము తెలిసికొంటిమి. మంత్రశక్తిముందు మానవశక్తి నిలువలేక పోయినది. అది మన వీరభటుల దోషం కాదు. లోపము కాదు. గోహత్యాపాతకమునకు పాల్పడక ప్రాణత్యాగము చేయుటే ధర్మమైన పని. ఇది అపజయము కాదు. మీరు పౌరుషశక్తితో రణవిహారము చేయు మహాసేనానులు కాని మంత్రతంత్రవేత్తలుకారు. . మీరు ధర్మయుద్ధము చేసిరి.

ఇంద్రజిత్తు చేతిలో రామలక్ష్మణులు పాశబద్ధులైనంతమాత్ర మున - అతడు వారిని మించిన వీరుడు కాలేదు. ధర్మవీరుడు కాలేదు. జయలక్ష్మి అతనిని వరింపలేదు. తమ విషయము రామలక్ష్మణుల విషయమువంటిదే. ఖేదము పొందకండి. మన మహామాత్యులవారు సర్వమంత్రవేత్తలు. మనము వారిని సంప్రతించి వారి మంత్రబలముతో శత్రువులను జయింప వచ్చును." అని అనునయించిరి.

ఖడ్గతిక్కనగారు కృతజ్ఞత, దైన్యము, పౌరుషము సమ్మి ళితమైన దృష్టులతో మహారాజులవారిని చూచుచు చేతులు జోడించి "ఏలినవారు నన్ను మన్నింపవలెను. మహామంత్రుల వారు మహాభారతరచనాదీక్షితులై యున్నారు. మహాభారతము పంచమవేదము అది యావదాంధ్రమునకు, సర్వకాలముల వారికి కావలసిన ధర్మస్వరూపము. భవిష్యత్తున ఏలినవారి యశస్సునకుకూడా ఆమహాకావ్యము నిత్యజయపతాకవంటిది. ఈనాడు మనకు వచ్చిన అత్యల్పసమస్యలకోసము మహామంత్రుల వారి మహాభారతరచనాదీక్షకు అంతరాయమును కల్గించుట సమంజసము కాదని విన్నవించుకొనుచున్నాను" అనిరి.

మహారాజులవారికి ఖడ్గతిక్కనగారి అభిప్రాయమేమిటో అవగాహనకాలేదు. "ఐతే మన కిప్పుడు కర్తవ్యమేమిటి ?" అనిరి. ఖడ్గతిక్కనగారు చేతులు జోడించి "మనవి చేయు చున్నాను. తిరిగి నేను రణభూమిని ప్రవేశించుచున్నాను. వీరయోధాగ్రేసరులైన కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి

వెంగళపతిరాజు, ప్రభుగిరిపట్టణము పద్మశేఖరుడు నాతో వచ్చు చున్నారు. మూలబలములను తరలించుకొనిపోవుచుంటిని. అపజయ మెరుగని నాఖడ్గము వీరవిహారముచేసి ఈ అపజయ పంకిలమును కడగివేయవలెను. శత్రువులను నిశ్శేషముగా హతముచేసి, జయలక్ష్మిని స్వీకరించిగాని ఖడ్గతిక్కన తిరిగి ఏలిన వారి దర్శనమునకు రాడు. జయము లభింపనియెడల ప్రాణములున్నంతవరకు పోరాడి వీరస్వర్గమునకు పోగలడు. అప్రతిహతము, దృఢతరము అయిన నాశివపదాబ్జధ్యానము నాకు అపజయము లేకుండా నన్ను రక్షింపగలదని విశ్వసించు చున్నాను. మాయిలువేల్పులైన జ్ఞానప్రసూనాంబికా శ్రీకాళహస్తీశ్వరులు నాఖడ్గమును కాపాడుచుందురని విశ్వసించు చున్నాను. నాకు అనుజ్ఞ దయచేయించండి" అని శిరస్సువంచి ప్రార్థించిరి.

మహారాజులవారు "మీరు మానసికముగా చాల బాధపడుచున్నారు. మీకు కలిగిన అపజయము లేదు. మీరు పట్టుదలగా నుండిరి. కావున నేను కాదనుట లేదు. ప్రతాప శౌర్యసాహసములలో ధైర్యములో మీతో తుల్యుడైన యోధాగ్రణి శాతవాహనుల కాలమునుండి ఆంధ్రభూమిపైన అవతరింపలేదు. ఖడ్గవిద్యలో మిమ్ము మించిన యోధుడు త్రికాలములందు లేడు. వేడిన అర్థార్థిని వృథపుచ్చని దానము మీది. రణరంగమున యమధర్మరాజునైనా ఢీకొని పోరాడగల శౌర్యము మీది. శరణుజొచ్చిన శత్రువునైనా రక్షించు

కరుణ మీది. పాండవజ్యేష్ఠుడైన ధర్మరాజుకంటె మీరు సత్య వ్రతములో గొప్పవారు. మీ ప్రతాపమునకు, శీలమునకు తగిన విజయమును మీకు ప్రసాదింపుడని మాయిలువేల్పులైన శ్రీరంగనాథస్వామివారిని ప్రార్థించుచున్నాము" అని ఆనతి నిచ్చిరి.

ఖడ్గతిక్కనగారు కృతజ్ఞతామయమైన దృష్టులతో శిరస్సువంచి, అంజలి బంధించి నమస్కరించి "మహాప్రసాదం", అనిరి. మరల "ఏలినవారు నావిన్నపమును అవధరింపవలెను. యుద్ధమున జయాపజయములు దైవాధీనములు. నేను వీర స్వర్గమునకు వెళ్లిపోయి నగరమునకు తిరిగి రాకపోవచ్చును. నాకెట్టి విపత్తు వచ్చినను మహామంత్రులవారి మహాభారతరచనా దీక్షకు అంతరాయము కలిగింపరాదు. నావిన్నపమును మన్నించి మాకుటుంబము వారందరు రాజాజ్ఞగా పాలించునట్లు ఉత్తర్వులు చేయవలెను" అని ప్రాధేయపడిరి. మహారాజుల వారు "మీ అభీష్టము" అని అనుకూలశిరఃకంపము చేసిరి. ఖడ్గ తిక్కనగారు జయజయారావములతో రణభేరి మ్రోయించి బయలుదేరిరి.

## 21

యాదవులు విజయోత్సవములు చేసికొనుచుండిరి. పాలేటియొడ్డున గంగమ్మకు పొంగళ్లు పెట్టుకొనుచుండిరి. ఆబాలవృద్ధము ఆనందోత్సాహభరితమై ఆలమందల నలంకరించి

కులోచితమైన ఉత్సవవిశేషకార్యకలాపములలో నిమగ్నులై యుండిరి.

ఇంతలో హఠాత్తుగ ఖడ్గతిక్కనగారి సేనలువచ్చి మీద పడినవి. విజయోత్సవములు చిందరవందరలైనవి. బాలస్త్రీ వృద్ధులు పలాయనులైరి. మిగిలిన మగవారందరు ఖడ్గములను పట్టి యెదిరించిరి. ప్రమత్తమైన యాదవబృందమును ఖడ్గ తిక్కనగారి యోధులు ఊచకోతగా నరకిరి. ఖడ్గతిక్కనగారి విజృంభణము అపూర్వముగా నున్నది. అశ్వమును విచిత్ర వల్గనములతో లాఘవముగా లంఘింపచేసి శిరస్సులను ఖండించిరి. ఆగుఱ్ఱము నేలమీద సంచరించుచున్నట్లు లేదు. భూమిపై కొంతయెత్తున విచిత్రగమనము చేయుచున్నట్లున్నది. ఆయన అశ్వహృదయ మెరిగినవాడు. ఆయన వాంఛప్రకారము గుఱ్ఱము లంఘించుచున్నది. పరువులెత్తుచున్నది. తొలగుచున్నది. వలయములు చుట్టుచున్నది. రెండుకాళ్లతో - నాల్గుకాళ్లతో విచిత్రసంచారము చేయుచున్నది. అయనకు అశ్వహృదయము తెలియుటమాత్రమే కాదు. అశ్వమున కాయన హృదయము, అభిప్రాయము తెలిసినట్లు—దాని కూడ రణరంగపరిస్థితులు తెలిసినట్లు తోచుచున్నది. ఆయన అవక్రవిక్రమముతో పరాక్రమించెను. యాదవులు శక్తివంచన లేనట్లు కత్తులతో, కటారులతో, శూలములతో, బల్లెములతో, చేతికందిన దానితో ఖడ్గతిక్కనగారి సైన్యమును చీకాకుచేసిరి. యుద్ధము భయం

కరముగా నున్నది. ఉభయవర్గములందు అసంఖ్యాకముగ వీరభటులు నేలకూలిరి.

కాటమరాజు దూరముగా మామిడితోపులో తల్లితో భార్యతోకలసి గంగమ్మకు పొంగళ్లు పెట్టించుచుండెను. ప్రోలమరాజు గుండెలు బాదుకొనుచువచ్చి "నాయనా మహా విపత్తు వచ్చినది. ఖడ్గతిక్కనగారు మహాబలములతో వచ్చిరి. విజయోత్సవములలో ప్రమత్తులైయున్న మనవారిపై పడిరి. ఊచకోతగా శిరఃఖండన కేళిచేయుచున్నారు. స్త్రీబాలవృద్ధులు మాత్రము బయటపడిరి. కరియావులరాజు వీరమరణము పొందెను. ఇక మిగిలిన మహాయోధుడు పిన్నమనాయ డొక్కడు" అని చెప్పెను.

కాటమరాజు "ఐతే పద. నేనుకూడ కత్తి తీసికొనివచ్చు చున్నాను." అని దూకుడుగా వెళ్లబోయెను. ప్రోలమరాజు "నాయనా! మనము బాహుబలముతో ఖడ్గతిక్కనగారిని జయింపలేము. అయన మహాసేనాని అవతారమే. బ్రహ్మారుద్రయ్య గారి మంత్రబలమే మనకు రక్ష. నీవువెళ్లి ఆయనను ఆశ్ర యించు. నేను రాణివాసమువారిని రక్షించుచు ఉంటాను" అని ఉద్బోధించెను.

ఇంతలో కాటమరాజు భార్యవచ్చి దీనముగా భర్తను సమీపించి కన్నీరు కార్చినది. కాటమరాజు అనునయింపుగా చూచెను. ఆమె "ప్రభూ! నాకు రాత్రి నాలుగవఝామున భయంకరమైన స్వప్నము వచ్చినది. మీరు విజృంభించుచున్న

దావాగ్నిమధ్యమున విపత్తులో నున్నారట. మన కులదేవత గంగాభవానీదేవి మిమ్మల్ని రక్షించడానికి ప్రయత్నించి విఫల మైనదట. అంతులేని దుఃఖము పొంగివచ్చినది. ఆదుఃఖములో మెలకువ వచ్చినది. చూడగా తెలవారుచున్నది. మనవారు విజయోత్సవాలలో నున్నారు. కలలో కలిగిన భయోత్పాతమునకు హేతువు లేదని సమాధానపరచుకుంటిని. ఇప్పుడీవార్త నాకు కలవరము కలిగించుచున్నది. ఏదో విపత్తు ముంచుకొని వచ్చినట్లున్నది." అని కన్నీరు కార్చినది.

ఆమెను సముదాయించుచు కాటమరాజు "కలలు నిజముకావు. కాని నీవు గంగాభవాని బిడ్డవు. నీకు ఆందోళన కలిగినచో తగిన హేతువు కలదన్నమాట. ఐనా కాగలదానికి విచారించి లాభములేదు. మన కులదేవత గంగాభవానిపై భారమువేసి మనస్సమాధానము చేసికోవలెను" అనెను. ఆమె కన్నులు తుడుచుకొని భర్తకు హారతిపట్టి కత్తిని తెచ్చియిచ్చినది. "నావిన్నప మొకటి మన్నింపవలయును" అన్నదామె. కాటమరాజు 'ఊఁ' అనెను. ఆమె "మీకు బ్రాహ్మణులపైన కత్తి యెత్తనని ప్రతిజ్ఞకదా! ఖడ్గతిక్కనగారు బ్రాహ్మణులు. పైగా మీకు ఖడ్గవిద్యాగురువులు. యోధాగ్రేసరుడైన ఆయన యుద్ధమునకు వచ్చినప్పుడు మీరు కత్తిపట్టకపోతే యెట్లు?" అనినది. కాటమరాజు ప్రసన్నముగా "నీభయ మిదా! ఆయన గురువు. గురుద్రోహ మెట్లాచేయమంటావు?" అనెను. ఆమె "ఈవిపత్తునకు కారణము మన కరియావులరాజు తొందర

పాటే. పుల్లరితగాదాను సౌమ్యముగా పరిష్కరించుకున్న రక్తపాతం జరిగియుండెడిది కాదు. అప్పుడు మీరు ధర్మాధర్మ విచక్షణ చేయలేదు. ఇప్పుడు బ్రాహ్మణునిపైన గురువుపైన కత్తి యెత్తనని భీష్మించుకొని కూర్చొనవద్దు." అని ప్రార్థేయపడినది. కాటమరాజు "ఖడ్గతిక్కనగారి సేనలు మహాయోధబలసంపన్న ములైయుండి కూడా గోగణమును సంహరింపకూడదను నియ మమును పాటించి ప్రాణములను బలిచేయలేదా? గోవులు రణ భూమికి వెళ్లుట ధర్మమా? అట్లే బ్రాహ్మణుడు యుద్ధరంగము నకు వచ్చుటకూడ. విక్రమసింహపురసైనికులు గోహత్యచెయ్య లేదు. యాదవులు బ్రహ్మహత్యచేయ్యరు. ఐతే నేను ప్రాణరక్ష ణకు మాత్రము ప్రయత్నము చేయగలను. ఆయనతో యుద్ధము వచ్చినచో నన్ను నేను కాపాడుకొందునేగాని ఆయనను గాయపరచను. ఇది నీ కోరికను మన్నించుటకు. ఇది నాగురు భక్తికి అగ్నిపరీక్ష" అని నిట్టూర్చెను.

అమె "అర్జునుడు ద్రోణాచార్యులవారితో యుద్ధము చేయలేదా?" అనినది. కాటమరాజు "ద్రోణాచార్యులవారు అర్జునునికి అనుమతినిచ్చిరి. విజయుని విజయమును ద్రోణులవారు ఆకాంక్షించిరి. ఇక్కడ పరిస్థితి అటువంటిది కాదు. మనము యాదవులము. యాదవకులశ్రేష్ఠుడు శ్రీకృష్ణపరమాత్మ. ఆయన గురుభక్తి అద్వితీయమైనది. మృత్యువునే జయించి గురుసాందీపుని కుమారుని తీసికొని వచ్చారాయన. మేము కారుణ్యరఘురాములము. శ్రీరామచంద్రులవారు అరణ్య

వాసము చేయునప్పుడు సప్తర్షి మండలమునందున్న నక్షత్రరూప వశిష్ఠమహర్షికి త[illegible] కనుపడుతుందో నని- అపచారము జరిగిపోవచ్చునని - తల్లడిల్లిపోయారట. మాకు శ్రీకృష్ణులు, శ్రీరాములు ఆదర్శపురుషులు. ఇంతకు నీవు భయ పడనక్కరలేదు. అంతయు ధర్మబద్ధముగా జరుగును" అని చెప్పి బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమమునకు బయలుదేరెను.

ఖడ్గతిక్కనగారు రణరంగమున వీరవిహారము చేసి యాదవసేనలను రూపుమాపిరి. పిన్నమనాయడు గాయపడి అశ్వమునుండి నేలకొరిగి కాలుచేతులు కదలక నిశ్చేష్టితు డయ్యెను. ఖడ్గతిక్కనగారు రణభూమి మధ్యమున సైనికులను సమావేశపరచి యుద్ధభూమిని పర్యాలోకించి చూచిరి. కాటమ రాజు యుద్ధభూమికి రాలేదని యోధులు చెప్పిరి. శత్రురాజు బ్రతికియుండగా శత్రునిశ్శేషము కాదనియు కాటమరాజును వధించిగాని పోకూడదనియు ఆయన భావించెను. కాటమరాజు బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమమునకు పోయియుండవచ్చునని తోచినది. సేనలను దళపతులందరను రాజధానికివెళ్లి మహా రాజులవారికి విజయవృత్తాంతము నివేదింపుడని పంపి తాము అశ్వారూఢులై ఖడ్గమాత్రసహాయులై వీరోత్సాహము పుక్కిలింతలగుచుండ బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమమునకు ఖడ్గతిక్కనగారు గుఱ్ఱమును పరువెత్తించిరి.

ఖడ్గతిక్కనగారు బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమము సమీపించు సమయమునకు కొంచెము ముందు కాటమరాజు

చేరియుండెను. అప్పుడు బ్రహ్మరుద్రయ్యగారు మాధ్యాహ్నిక అనుష్ఠానము చేయుచుండిరి. ఆయన ఆశ్రమము ముందు చిన్న అరుగుపైన కూర్చుని ధ్యానములో నుండిరి. దర్భాసనము పరచుకొని పద్మాసనస్థులై యుండిరి. ఆయనను పలుకరించుటకు వీలులేక ప్రణామములుచేసి చేతులు కట్టుకొని కాటమరాజు నిలువబడియుండెను. ఆయన కనులు తెరచిన తరువాత నివేదింప వచ్చునని భావించెను.

ఇంతలో వేగముగా వచ్చుచున్న గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చినది. కాటమరాజు తన గుఱ్ఱమును కొలది దూరమున చెట్టునకుకట్టి వచ్చెను. అది ప్రమాదమును సూచించుచు సకిలించినది. తా నక్కడనేయున్న వచ్చుచున్న యోధుడచ్చటకే రావచ్చునని - బ్రహ్మరుద్రయ్యగారికి ధ్యానభంగము కావచ్చునని శంకించి కాటమరాజు ఆశ్రమమునుండి బయటకు వచ్చెను.

ఖడ్గతిక్కనగారు అశ్వముమీద మహావేగముతో ఆశ్రమమును సమీపించిరి. అప్పటికే కాటమరాజు గుఱ్ఱమును దాటివచ్చిరి. కాటమరాజు తన గుఱ్ఱము కడకుపోవుటకు ఖడ్గతిక్కనగా రడ్డువచ్చియుండిరి. ఆయన కాటమరాజును చూచుటే తడవుగ కత్తిదూసి గుఱ్ఱమును త్రిస్రరేఖాసంచారము చేయించి కాటమరాజు పైకివచ్చిరి.

కాటమరాజు పాదచారి. ఖడ్గతిక్కనగా రశ్వారూఢులు. నేలపైనున్న కాటమరాజు శిరస్సు ఖడ్గతిక్కనగారి ఖడ్గరేఖలో

నున్నది. కాటమరాజు ఆయనను గాయపరచడు. ఆయన ఖడ్గమునుండి తాను తప్పుకొనుటే చేయదలచెను. కాటమరాజు ఖడ్గతిక్కనగారికి నమస్కరించి కత్తిపుచ్చుకొని నిలువబడెను.

ఖడ్గతిక్కనగారి ఖడ్గచాలనము కాటమరాజును కదలింపలేదు. కత్తిని కత్తితో నిలుపుట - శిరముపైకివచ్చు అసిధారను శిరశ్చలనమువలన తప్పించుకొనుట - పాదములపైకివచ్చు ధారను విచిత్రముగా లంఘించి తప్పించుకొనుటవంటి సర్వ ప్రయత్నములతో కాటమరాజు ఖడ్గతిక్కనగారి అసిధారా జలములో తడియలేదు. ఖడ్గతిక్కనగారి మెప్పుదల పొందు విద్యానైపుణ్యమును ప్రదర్శించుచుండెను.

ఈ విచిత్రమైన ద్వంద్వయుద్ధము ఘడియకాలము జరిగినది. ఖడ్గతిక్కనగారికి గాయములు తగులలేదుగాని - కాటమరాజు కత్తివాదర ఖడ్గతిక్కనగారి గుఱ్ఱమును గాయపరచుచునేయున్నది. దానికి బలమైన గాయములే తగిలినవి.

ఒకరు పాదచారిగా మరియొకరు అశ్వారూఢులై చేయుచున్న కత్తియుద్ధము సామీచీన్యము కాదు. కాటమరాజు పట్టిన వ్రతమువలన అతనికి అనుకూలముగానున్నది.

శ్రీరామచంద్రునికి బాణమువలె, శ్రీకృష్ణునికి చక్రాయుధమువలె - ఖడ్గతిక్కనగారికి ఖడ్గము సహజముగా అప్రతిమానమైన ఆయుధము. దానిని ప్రయోగించుటలో ఆయనకు తెలియని రహస్యములు లేవు. అనంతుడు సహస్రఫణులతో బుసలు కొట్టినట్లు, శరభవిహగేంద్రుడు ముక్కుతో పట్టుకొని

నట్లు - శతకోటిప్రయోగమట్లు - వర్షధారాపాతమువలె - గదా ఘాతమువలె, చక్రచాలనమువలె - ఆయన ఖడ్గమును ప్రయో గింపగలడు.

కాటమరాజు తన పాదములపైకి వచ్చుచున్న కత్తి పాటును తప్పించుకొనుటకు లంఘింపగా కనురెప్పపాటులో అతని శిరస్సు విచిత్రముగా ఖండింపబడి నేలపైపడినవి. కాటమ రాజు గుఱ్ఱము అతిదీనముగా దుఃఖోద్విగ్నత వెల్లివిరియగా ఘోషించినది.

ప్రతియోధుడు రాజపురుషు డగుటవలన, తన శిష్యు డగుటవలన, అది ద్వంద్వయుద్ధ మగుటవలన, ఖడ్గతిక్కనగారు గుఱ్ఱమును దిగి కాటమరాజు శరీరమును శిరస్సును యేకత్ర సమావేశపరచి - దానిపై అతని శిరోవేష్టనమును కప్పి - తన శిష్యుని తానే వధించితినని ఖేదపడి - తిరిగి గుఱ్ఱము నెక్కిరి.

ఈ జరిగిన యుద్ధములో కత్తులసంఘర్షణల ధ్వనులకు, గుఱ్ఱముల సకిలింపులకు బ్రహ్మారుద్రయ్యగారికి ధ్యానభంగమైనది. ఆయన కన్నులు తెరచిచూడగా కాటమరాజు నేలపడి యుండగా ఖడ్గతిక్కనగారాశరీరమునకు గౌరవము నెరపుట కన్పించినది. బ్రహ్మారుద్రయ్యగారికి విషయమంతయు అవగాహన అయినది. అశ్వారూఢులై వెళ్లిపోవుచున్న ఖడ్గతిక్కనగారిని బ్రహ్మారుద్రయ్యగారు తప్పట్లుచరచి పిలచిరి. గుఱ్ఱముపైనుండి ఖడ్గతిక్కనగారాయనవంకచూచిరి. బ్రహ్మారుద్రయ్యగారు పద్మా సనమున కూర్చుని చూచుచుండిరి. ఖడ్గతిక్కనగారివంక తీక్ష్ణముగ

చూచుచు బ్రహ్మరుద్రయ్యగారు "కాటమరాజచంద్రుల గురువును నేనుండగా మీకు శత్రుశేషమున్నట్లే. నేను మిగిలియుండగా మీవిజయము సంపూర్ణముకాదు. విజయమును సంపూర్ణముచేసికొనక వెళ్లిపోవుచున్నారే?" అని ప్రశ్నించిరి.

ఖడ్గతిక్కనగారు గుఱ్ఱముపైనుండి "ఐతే ద్వంద్వయుద్ధమునకు రా" అని గద్దించిరి. బ్రహ్మరుద్రయ్యగారు "మీతో యుద్ధము చేయుటకు నేను ఆసనభంగము చేసికొనుట కూడనా?" అని తాము కూర్చున్న దర్భాసనమునుండి దర్భను తీసి మంత్రించి విసిరిరి. అది పెద్దత్రిశూలమై ఖడ్గతిక్కనగారి మీదకు వచ్చినది.

వచ్చుచున్న మాయాత్రిశూలమును గుఱ్ఱముపైనుండి ఖడ్గతిక్కనగారు చూచిరి. అశ్వమును వలయములుగా, చిత్రగమనములుగా లంఘింపజేసి త్రిశూలమును తప్పించుకొనుటకు ప్రయత్నించిరి. కాని అది విడచిపోలేదు.

ఖడ్గతిక్కనగారికి తెలిసిపోయినది. మంత్రశక్తితోనున్న ఆ త్రిశూలమును తప్పించుకొనుశక్తి తనకు లేదు. దానివలన తన మృత్యువు తప్పదు. దానితో పోరాడిలాభము లేదు. ఆయన నిశ్చయమునకు వచ్చి బ్రహ్మరుద్రయ్యగారితో "బ్రహ్మరుద్రయ్యా! ఇది అధర్మయుద్ధము. రణభూమిలో చూపవలసినది పౌరుషపరాక్రమముగాని మంత్రబలము కాదు. రణధర్మవిరుద్ధమైన నీయత్నము జయాంతము కారాదు. నేను యుద్ధధర్మమును అతిక్రమింపని వీరుడనైతే - నేను సత్యవ్రతుడ

నైతే - నాతలితండ్రులను దైవముగా సేవించువాడ నైతే నా ఖడ్గము నిన్ను సంహరించును గాక" అనుచు తన ఖడ్గమును బ్రహ్మరుద్రయ్యగారి శిరస్సుపైకి విసరెను. మంత్రశక్తితో వచ్చుచున్న త్రిశూలమునకు శిరస్సుతో నమస్కరించుచు కనులు మూసికొని 'హరహరమహాదేవ శంభో' అనుచుండగా ఖడ్గతిక్కనగారి ఖడ్గము బ్రహ్మరుద్రయ్యగారి శిరమును ఖండించినది. అదేసమయమున ఖడ్గముచేతియందులేని ఖడ్గతిక్కనగారి శిరమును మంత్రత్రిశూలము ఛేదించుకొని - ఆశిరములో గ్రుచ్చుకొని ఆకాశములోనికి వెళ్లిపోయినది.

ఖడ్గతిక్కనగారి శరీరము శిరోవిహీనమై గుఱ్ఱముపై నట్లే కూర్చునియున్నది. వామహస్తముతో గుఱ్ఱము పగ్గములను పట్టుకొనియున్నది. కుడిచేయి కత్తి విసరుచున్నట్లుగా నిలచి పోయినది. ఆ గుఱ్ఱమునకు జరిగిన విషయము తెలిసినది. దీనముగా ఘోషించినది. ఆశరీరముతో గుఱ్ఱము విక్రమసింహపురమునకు దౌడు తీసినది.

## 22

రణభూమిలో విజయము తమ వీరులను వరించినదని, యాదవులు నిశ్శేషులైనారని, విక్రమసింహపురమున వార్తలు తెలిసినవి. ప్రజలు సంతోషపడిరి. మహారాజులవారు ఆనందించిరి. ఖడ్గతిక్కనగారి గృహమునకు విజయవార్త చేరునప్పటికి ఆయన భార్య పెద్దచానమ్మ గౌరీ పూజలో నున్నది. ఖడ్గతిక్కన

గారి తలితండ్రులు విజయవార్తకు సంతసించిరి. పెద్దచానమ్మ గారీ పూజనుండి లేవనే లేదు. ఆమెకు వార్తను వినిపించుటకు వీలుపడనే లేదు.

యుద్ధభూమినుండి తిరిగివచ్చుచున్న వీరయోధులకు స్వాగతములు చెప్పి విజయోత్సవములు చేయుటకు మహారాజులవారు సన్నాహములు చేసిరి. నగరములోని జనమందరు మహోత్సాహభరితులై యుండిరి. విజయలక్ష్మిని చేపట్టి విక్రమసింహాపురమునకు తిరిగివచ్చుచున్న మహాసేనాపతులవారికి - వారి అనుచరవీరయోధులకు స్వాగతములు చెప్పుటకు జనులు తండోపతండములుగ బయలుదేరి వచ్చుచుండిరి.

యాదవులు మంత్రశక్తితో గోవులచేత సేనలను రణభూమిలో నిర్మూలింపచేయగా - అవమానభారముతో క్రుంగిన విక్రమసింహాపురము, ఆయాదవులే తమసైనికులచేతిలో నిశ్శేషముగా నిర్మూలింపబడిరని తెలిసికొని ఉత్సాహముతో కట్టలు తెంపుకొన్నది.

రణభూమినుండి విజయధ్వానములతో తిరిగి వచ్చుచున్న సేనలకు స్వాగతములు చెప్పుటకు మహారాజులవారు స్వయముగా బయలుదేరిరి.

తిరిగివచ్చుచున్న సేనలను చూచి జనము హర్షధ్వానములు చేసినది. సేన మహారాజులవారిని సమీపించి జయజయారావములతో అభివాదములు చేసినది. సేనాముఖము నందు సేనాపతులవారు లేకుండుట చూచి మహారాజులవారు

"సేనాపతుల వారెక్కడ" అని ప్రశ్నించిరి. తిరిగివచ్చుచున్న సేనలకు నాయకుడుగా వ్యవహరించుచున్న కాళహస్తి పాప తిమ్మరాజు మహారాజులవారికి నమస్కరించి, అంజలి బంధముతో "యుద్ధమున యాదవవీరులందరు మడిసిపోయినా కాటమరాజు రణభూమికి రానేలేదు. బ్రహ్మరుద్రయ్యగారి ఆశ్రమమునకు పోయియుండునని. మరల నేదో మంత్రప్రయోగమునకు పన్నాగము జరుపుచుండవచ్చునని తోచినది. మమ్మందరను విక్రమసింహపురమునకు వెళ్లుడని ఆజ్ఞాపించి సేనాపతులవారు అశ్వారూఢులై కాటమరాజును వెదకికొనుచు వెళ్లిరి." అని విన్నవించెను. వెలకంచి వెంగళపతిరాజు అంజలి బంధించి "ఈపాటికి సేనాపతులవారు కాటమరాజును జయించి తిరికివచ్చుచుందురు" అనెను.

బ్రహ్మరుద్రయ్యగారి పేరుచెప్పగా మహారాజులవారి శరీరమంతయు వణికిపోయినది. తెలియని భయమేదో మనస్సును ఆవహించినది. విజయమును పొందివచ్చుచున్న సేనాపతుల వారు తిరిగిరాకపోవుట మహారాజులవారికి నిరుత్సాహముగా నున్నది.

ఎంతో సంరంభముతో, ఉత్సాహముతో స్వాగత గౌరవములు జరుపుటకు వచ్చిన మహారాజులవారి పరిస్థితి నీరుకారి పోయినట్లున్నది. కాని నిరుత్సాహమునకు హేతువు లేదని మనస్సు సమాధానపరచుకొనిరి. ఐనా మనస్సునందు శంక యొకటి స్థావరము చేసికొనినది. ఆశంకయొక్క రూప

మింకను పూర్తిగా యేర్పాటుకాలేదు. ఆశంకకు తగినంత హేతువు కన్పింపలేదు. ఆసందర్భములో తాము నిరుత్సాహ పడినచో రణభూమినుండి తిరిగివచ్చుచున్న వీరయోధులు బాధపడిపోవుదురని మహారాజులవారు భావించిరి. ఆవీర యోధు లందరను సముచితముగ గౌరవించిరి. ఆదరముగా స్వాగతసత్కారవాక్యములనుచెప్పి సంతోషపెట్టిరి. జయజయ ధ్వానములతో విజయలాంఛనములను సమర్పించిరి.

తిరిగివచ్చుచున్న వీరయోధులను పురప్రవేశము చేయించుటకు అనుజ్ఞనిచ్చిరి. తాము మాత్రము సేనాపతుల వారు తిరిగివచ్చునంతవరకు బహిర్వనములోనుండుటకు నిశ్చ యించుకొంటిమని చెప్పిరి.

మహారాజులవారు సేనాపతులు ఖడ్గతిక్కనగారు రణ భూమినుండి తిరిగి వచ్చునంతవరకు బహిర్వనమునందే వేచి యుండెదమని చెప్పగా - సేనలోని దండనాథులకు, దళపతులకు, యోధులకు వెంటనే లోపమొక్కటి తోచినది. సేనాపతుల వారు - ఈ అపూర్వవిజయమును స్వయముగా సాధించిన సేనాపతులవారు - తిరిగి రాకమునుపు తాము పురప్రవేశము చేయుట అనుచితమని వారు గ్రహించిరి. ఏకకంఠముతో వారందరు మహారాజులవారితో తాము కూడ సేనాపతుల వారు వచ్చినతరువాతనే పురప్రవేశము చేయుదుమని వారు తిరిగివచ్చువరకు వేచియుందుమని మనవి చేసిరి.

సేనాపతులవారు లేక సేన తిరిగివచ్చిన దన్నవార్త శరవేగ వాయువేగ మనోవేగములతో ప్రయాణించి సేనాపతుల గృహము చేరినది. సిద్దన్నగారు బయట నిలచియుండగా వార్తవచ్చినది. అశుభమేదో రూపుకట్టుచున్నట్లు తోచినది. ఇంతలో ప్రోలాంబ సమీపింపగా ఆమెకు తెలిపిరి. ఆవార్తకు ఆమె గజగజలాడిపోయినది. ఆమె కన్నులనుండి జలజల నీరు కారినది. ఆమెను చూడగా సిద్దన్నగారికి కూడ కన్నులనుండి నీరు ప్రవహించినది. ఇరువురును ధీరులు కావున దుఃఖమును భరించి అదుపులోనికి తెచ్చికొనిరి. ఈ వార్తను కోడలు పెద్దచానమ్మకు చెప్పుటకు ప్రోలాంబ లోనికి వెళ్లినది. పెద్దచానమ్మ గౌరీదేవిముందు కూర్చుని ధ్యానము చేయుచునే యున్నది. ఆమె కన్నులు మూసికొని నిశ్చేష్టితముగా కూర్చునినది. అప్రియమైన వార్తను చెప్పుటకై ఆమెను పలుకరించుటకు ప్రోలాంబకు మనస్కరింపలేదు. బయటకు వచ్చినది.

బహిర్వనములో మహారాజులవారు, దండనాథులు, దళపతులు, యోధులు, జనసందోహము, మంగళవాద్యములతో వేచియుండిరి. దూరమున గుఱ్ఱపుడెక్కల చప్పుడు విన్పించినది. ఆచప్పుడు సమీపించుచున్న పద్ధతి చూడగా గుఱ్ఱము మహావేగముతో వచ్చుచున్నట్లు తోచినది. సైనికుల ముఖములు విప్పారినవి. జనసందోహము జయజయారావములు చేసిరి. కాని అశ్వహృదయమెరిగిన దండనాథులకు మాత్ర మావేగములో మానవాతీతమైన దేదో కలదని తోచి మహారాజుల

వారి దెసచూచిరి. ఆయన వారి భావమును గ్రహించి దానికి గల హేతువును గుర్తించి వెలవెల లాడిపోయెను.

గుఱ్ఱము మహావేగముతో వచ్చుచుండగా తామ సంతోషపడుటయు, కాని దండనాథులు మహారాజులవారు దైన్యము చూపుటయు సామాన్యజనులను చకితులనిచేసి - వారిని కూడ ఆలోచనావ్యగ్రులను చేసినవి.

వచ్చుచున్న గుఱ్ఱము సకిలించినది. ఆసకిలింపు విజయోత్సాహములో ఉత్తమజాతి అశ్వముచేయు సకిలింపువలె లేదు. ఏదో అనుల్లంఘనీయమైన మహావిపత్తులో పడిపోయిన ఉత్తమాశ్వము చేయుచున్న ఆక్రందనమువలె నున్నది. వీర యోధులై నిత్యము అశ్వములను పాలించుచున్న వారందరకు అశ్వములు ఆనందముతో, ఉత్సాహముతో, భయముతో, దైన్యముతో, ఆకలితో, దాహముతో, ఆయాసముతో, శరీర బాధతో చేయు సకిలింపుల తేడాలు తెలియును. ఆవచ్చుచున్న గుఱ్ఱము సకిలింపునకు, మహారాజులవారు, దండనాథులు, దళపతులు, వీరయోధులు కళవళపడిరి. నగరమున సేనాపతులెంత ప్రసిద్ధులో వారి పంచకళ్యాణి అశ్వముకూడ నంత ప్రసిద్ధమైనది. దాని హేషలు నగరము వారందరకు పరిచితములే. వచ్చుచున్న గుఱ్ఱ మెవ్వరిదో వారందరకు నిర్ధారణగా తెలిసినది.

గుఱ్ఱము రానేవచ్చినది. జనులను చూచి గుఱ్ఱము వేగమును తగ్గించి మందగమనమున వచ్చుచున్నది. అందరకు తెలిసిపోయినది. తలలేని ఖడ్గతిక్కనగారి మొండెము రికాబులలో

కాళ్లు పెట్టుకొని, గుఱ్ఱముమీద కూర్చొని, పగ్గములు పూని, వచ్చినది. అందరు హాహాకారములు చేసిరి. గొల్లుమనిరి. ఆజనుల దుఃఖమునకు అవధులు లేకపోయినవి. మహారాజులవారు, దండనాథులు, దళపతులు, సామాన్యజనము కలసి రోదించిరి. తమతమ తండ్రులను పోగొట్టుకొనినట్లు రోదించిరి. యుద్ధరంగమున వీరవిహారముచేసి భయమన్న దెరుగని వీరపురుషులు స్త్రీల వలె ఆక్రందనముచేసిరి. వారిని అనునయించువారు లేకపోయిరి.

గుఱ్ఱము మహారాజులవారిని సమీపించి నిలువలేదు. నగరమునకు మార్గమునుబట్టి మందగమనమున ప్రయాణము చేయుచున్నది. అప్పుడు మహారాజులవారికి, మిగిలినవారికి కర్తవ్యము బోధపడ్డది.

మహారాజులవారు తేరుకొని, వీరయోధులను సమీకరించి, ఖడ్గతిక్కన్నగారి కళేబరమునకు సర్వరాజలాంఛనములతో గౌరవములు నెరపుతూ పురప్రవేశముచేయుటకు ఆనతులిచ్చిరి. తదుచితమైన వ్యూహరచననుచేసి సైనికులు గుఱ్ఱముతో నడిచిరి.

అశ్వమునకు ముందు ఆశ్వికదళము బారులు కట్టి నడచినది. వెనుక పదాతిదళము శిరములువంచి నడచినది. దండనాథులు, దళపతులు గుఱ్ఱమును పరివేష్టించినడచిరి. మహారాజులవారు స్వయముగా కళేబరమునకు శ్వేతఛత్రముపట్టి గుఱ్ఱము వెంటనడచిరి. గుఱ్ఱముఠీవిగా, మందగమనముతో,

ముందు మంగళవాద్యములు మ్రోయుచుండగా పురప్రవేశము చేసినది.

రాజమర్యాదలతో వచ్చుచున్న కళేబరము గుఱ్ఱము మీద కదలకుండ కూర్చుని ఉన్నది. వామహస్తమున పగ్గములు పట్టుకొని యున్నది. కుడిచేయి కత్తి విసురుతున్న వైఖరిగా నున్నది. కాళ్లు రికాబులందు త్రొక్కుకొని యున్నవి.

ఖడ్గతిక్కనగారి గుఱ్ఱము ఆయన కళేబరమును మోసికొనివచ్చిన దన్నవార్త మహావిపద్దుఃఖాకారంతో ప్రయాణించినది. సాయంవేళలందు చీకటి నీడలు వ్యాపించినట్లు వ్యాపించినది. ఆకాశము మేఘావృతము కాగా లోకమును ఆవరించు తమస్సంచితమువలె వ్యాపించినది. దాని ఆఘాతమునకు ఖడ్గతిక్కనగారిగృహము కదలాడిపోయినది. తండ్రి సిద్దనగారు, తల్లి ప్రోలాంబ, కుమారుడు చాలసేపటినుండి వార్తకోసమై వేచియుండిరి. ఆవార్త అశనిపాతమువలె వచ్చినది. వారక్కడనే కుప్పకూలిపోయిరి.

ఇంతలో ఖడ్గతిక్కనగారి గుఱ్ఱము వారిగృహము ముందునకువచ్చి చేరినది. సేనలువచ్చి చేరినవి. జనసందోహము వచ్చిచేరినది. పరివేష్టించి వచ్చుచున్నదండనాథులు దళపతులు వచ్చిచేరిరి. శ్వేతఛత్రమును పూనియున్న మహారాజులవారు వచ్చిచేరిరి. ఇంటిముందు గుఱ్ఱము నిలువగా శ్వేతఛత్రమును భటునకిచ్చి మహారాజులవారు గుఱ్ఱము ముందునకు వచ్చిరి.

కాళహస్తి పాపతిమ్మరాజు, మహారాజులవారు పట్టుకొని కళేబరమును గుఱ్ఱముమీదనుంచి దింపి చేతులమీద మోసికొని ముందువాకిటకు తెచ్చిరి. దండనాథులు శీఘ్రముగా నమర్చిన ప్రక్కపై పరుండబెట్టిరి. దానిపై సేనాపతుల విజయ పతాకమును మహారాజులవారు కప్పిరి. అంత దుఃఖములో జనము, సేనలు జయజయ ధ్వానములు చేసెను. ఖడ్గతిక్కన గారి తలితండ్రులు కుమారుడు లేచివచ్చి కళేబరమునకు ప్రక్కగా కూర్చొనిరి. ఖడ్గతిక్కనగారి అశ్వరాజము పడు కొనియున్న కళేబరమును సమీపించి పాదములను ముట్టితో స్పృశించి - తలపైకెత్తి ప్రళయగర్జగా సకిలించినది. అంతలో చిత్రముగా ఆమహాశ్వము ఆకళేబరము పాదముల సమీప మున నేలమీదపడి ప్రాణములు వదలినది.

చూడగా గుఱ్ఱమునకు బలమైన గాయములు తగిలి యున్నవని, అంతదూరము ప్రయాణము చేసివచ్చుట ఆశ్చర్య కరముగా నున్నదని జనులు చెప్పుకొనిరి. ఆ కళేబరము, ఆ గుఱ్ఱము, ఏశక్తివలన నింతదూరము వచ్చినవి? ఖడ్గతిక్కన గారి సత్యవ్రతమాహాత్మ్యమా? దానశీలత్వమా? ఆయన దివ్యశౌర్యగుణప్రాభవమాహాత్మ్యమా? ఆయన పితృభక్తి మాహాత్మ్యమా? ఆయన తలితండ్రుల పుత్రవాత్సల్యబలమా? ఆయన భార్య పెద్దచానమ్మగారి పాతివ్రత్యమాహాత్మ్యమా? ఆరాజ్యమేలు ప్రభువుల ధర్మగుణమాహాత్మ్యమా? ఆనగర వాసుల సాధుశీలత్వమా?

అట్టి అతిలోకమైన దివ్యశక్తియొక్క మాహాత్మ్యపు బలమువలననే మరణించిన కళేబరము కళ్లెమునుపట్టుకొని గుఱ్ఱమును నడిపించు కొనివచ్చినది. జీవన్మరణముల మధ్యనున్న గుఱ్ఱము శరవేగముతో అంతదూరము ప్రయాణముచేసినది. అక్కడనున్న వారందరకు ఆసన్నివేశదివ్యత్వము అవగాహనకు వచ్చినది. కాని ఆదివ్యశక్తి యేదో వారికి తెలియలేదు. అందరును సంభ్రమాశ్చర్యచకితులై దుఃఖపుతెరలను తొలగించుకొని మరణించిన అశ్వరాజమును తిలకించిరి.

ఆశ్వికదళాధిపతినిపిలచి, ఆమహాశ్వకళేబరమును రాజమర్యాదలతో తీసికొనివెళ్లి అంత్యక్రియలను జరుపవలసినదిగా మహారాజులవారు ఉత్తర్వులిచ్చిరి. ఆప్రకారము జరిగినది.

ఖడ్గతిక్కనగారి తలితండ్రులను కుమారుని సమీపించి మహారాజులవారు అనునయవాక్యములను పలికిరి. వారు తలలు వంచి కన్నీటిధారలతో నుండిరి. వీరయోధులు, దండనాథులు, ప్రజలు - నిలువబడియుండిరి. ఖడ్గతిక్కనగారి దానశీలమును, సత్యవ్రతమును, పితృభక్తిని, ప్రభుభక్తిని, సాహసధైర్య శౌర్యములను ప్రశంసించుచు మహారాజులవారు కన్నీరు కార్చుచు మెల్లిగా మాటాడిరి. సిద్ధన్నగారు, ప్రోలాంబ, ఖడ్గతిక్కనగారి కుమారుడు, జనసందోహమంతయు, తలలువంచి కన్నీరుధారలు కురియగా మహారాజులవారి మాటలను వినుచుండిరి.

ఇంతలో ప్రబంధాంకం అన్నంభట్టు పరువెత్తుకొని వచ్చెను. ఖడ్గతిక్కనగారిని యుద్ధమునకు పంపినప్పటినుండి అతని కారోగ్యము సరిగాలేదు. తన కైవారము పూర్తికాకమునుపే ఖడ్గతిక్కనగారు వెళ్లిపోయిరని బాధపడెను. అప్పటినుండి నిరాహారముగ గృహములో కూర్చొని, ఆకైవారపు పద్యమునే మరల మరల మననముచేసికొనుచుండెను. నిద్రపోలేదు. విశ్రమింపలేదు. మానసికబాధపడుచుంచెను. తిరిగివచ్చుచున్న సేనలకు స్వాగతము చెప్పుటకుపోలేదు. ఖడ్గతిక్కనగారి కళేబరము గుఱ్ఱమును స్వారిచేయుచు వచ్చినదన్నవార్త అన్నంభట్టునకు ఆలస్యముగా తెలిసినది. తెలిసిన వెంటనే పరువులతో వచ్చెను.

వచ్చిన అన్నంభట్టు ఖడ్గతిక్కనగారి కళేబరము పాదములకు నమస్కరించి రోదించెను. తన్ను తాను సంబాళించుకొనెను. సిద్ధన్నగారికి నమస్కరించెను. ఖడ్గతిక్కనగారి కుమారుని శిరము స్పృశించి కన్నీరు కురిసెను. ప్రోలాంబను చూచి బావురుమనెను. ఒకసారి మహారాజులవారిని వీరయోధులను చూచి, గొంతు సవరించుకొని ముఖారిరాగఛణితిలో—

"ధైర్యంబు నీమేన తగిలియుండుటజేసి చలియించి మందరాచలము తిరిగె, గాంభీర్యమెల్ల నీకడనయుండుటజేసి కాకుత్థ్సుచే వార్థి కట్టుబడియొ, జయలక్ష్మి నీయురస్థలినె యుండుటజేసి హరిపోయి బలిదానమడుగుకొనియె, ఆకారమెల్ల నీయందె యుండుటజేసి మరుడుచిచ్చునబడి మడసిచనియె, తిక్కదండనాథ దేవేంద్రపురికి నీవరుగుటెరిగి నగము తిరుగుటుడుగు

అబ్ధికట్టువిడచు, అచ్యుతుకోదమానుు, ఉరుడుు పలుల గలుగు మగలరాజ! నందిని బుత్తెంచె నిందుశేఖరుడు నీవన్న యే తెమ్ము తారాద్రికడకు, గరుడుని బుత్తెంచె నరహరి రావయ్యవడి సిద్ధ తిక్క కైవల్యమునకు, హంసను బుత్తెంచె నజుడు నీకడకు నుభయకుల మిత్ర రాబ్రహ్మసభకు, ఐరావతముబంపె నమ రేంద్రు డిప్పుడు దివమునకే తెమ్ము తిక్కయోధ, అనుచు వేలు వేలనర్థితో బిలువంగ వారు వీరుగూడ వచ్చివచ్చి, దివ్యయోగి యైన తిక్కనామాత్యుడు సూర్యమండలంబు జొచ్చిపోయె" అని కైవారమునుచేసెను. జయ జయారావములు మిన్ను ముట్టినవి.

అన్నంభట్టు కైవారము పూర్తియగుచుండగా ఖడ్గ తిక్కనగారి కుమారుడు లేచి తండ్రిగారి కళేబరము చేతుల నుండి సింహతలాటవు కంకణములను తీసికొని రెండుచేతులతో పట్టుకొని అన్నంభట్టు కడకువచ్చి నిలచి అతనితో "భట్టు కవీంద్రా! మొదటిపద్యములోని మొదటిభాగమునకే మాతండ్రి గారు మీకు పారితోషికమిచ్చెదమనిరి. అందుకుగాను హస్త కంకణమొకటి. ఆపద్యమున రెండవభాగమునకు రెండవ హస్త కంకణము. మీరుచెప్పిన రెండవపద్యమునకు నాకంఠహారము స్వీకరించండి" అని అందివ్వబోయెను.

అన్నంభట్టు "నాయనా! మీతండ్రిగారు మహావీరుడు, ఆంధ్రమహావిష్ణువు, శకకర్తయైన శాలివాహనుడువంటి యోధాగ్రేసరుడు మీతండ్రిగారు. ఆయనకీర్తి ఆంధ్రజాతి

యున్నంతకాలము పరిమళించుచుండును. ఆయనను కీర్తించుట ఆంధ్రకవుల బాధ్యత, విధ్యుక్తధర్మము. నావిధి నేను నిర్వహింపగా నాకు పారితోషికమేమిటి? ఈమహాదుఃఖపరిస్థితులలో పారితోషికమా” అని బావురుమనెను.

సిద్దన్నగారు లేచి “భట్టుకవీ! నావంశమునకు రత్నమైన నాకుమారుని కీర్తించి నీవు నావంశకీర్తిని సుస్థిరము చేసితివి. ఆంధ్రజాతియున్నంతకాలము, ఆంధ్రభాషయున్నంతకాలము ఖడ్గతిక్కన యశశ్చంద్రికలు ప్రకాశించునట్లున్నదినీసాహిత్యము. అటువంటి చక్కని సాహిత్యమునకు తగిన పారితోషికమును ముట్టజెప్పలేకపోయిరన్న అప్రతిష్ఠను మాకు కలిగించుట నీకు ధర్మమా?” అని దైన్యావేశముతో ప్రాధేయపడిరి.

అన్నంభట్టు సిద్దన్నగారివంక చూచుచు “నేను బాల్యమునుండి మీపాదములను సేవించినవాణ్ణి. నాకు మీ ఆజ్ఞలను శిరసావహించుట మాత్రమే తెలియును. ఈశిరస్సు సిద్దన మహామాత్యులవారి ఆజ్ఞాభారవినమ్రమైనది. ఈ మహాదుఃఖసమయమున మీమాటకు అడ్డుచెప్పి మీకు బాధ కలిగించుట నాకిష్టములేదు. నేను మీ ఆజ్ఞాబద్ధుడను” అని శిరము వంచెను.

ఖడ్గతిక్కనగారి కుమారుడు హస్తాకంకణములను అన్నంభట్టు చేతులకు తొడిగి తన కంఠహారమును అతని మెడలో వేసెను. జనము జయజయధ్వానములు చేసిరి.

మహారాజులవారు సిద్దన్నగారిని సమీపించి "అమ్మగారి కీవార్త తెలుపలేదు" అనెను. సిద్దన్నగారు, ప్రోలాంబ, లోపలకు త్రోవతీయగా మహారాజులవారు అనుగమించి లోపలకు వెళ్లిరి.

లోపల పెద్దచానమ్మ గౌరీదేవి ముందు కూర్చుని ధ్యాన సమాధియందున్నది. వీరుముగ్గురు వెళ్లి ప్రక్కలందు నిలచిరి. అత్తమామలు కుడిప్రక్క నిలువగా మహారాజులవారు రెండవ ప్రక్క నిలువబడిరి. ఆమె తపస్సమాధియందున్నట్లుగా నున్నది. ఖడ్గతిక్కనగారు రెండవపర్యాయము యుద్ధమునకు వెళ్లినప్పటి నుంచి ఆమె అట్లే ధ్యానసమాధియందున్నదని, ఆమెకేవార్తలు తెలియవని, సిద్దన్నగారు చేతిసంజ్ఞలతో మహారాజులవారికి చెప్పెను.

ఖడ్గతిక్కనగారి మృతకళేబరము గుఱ్ఱముమీద స్వారి చేయుచు రాగలుగుటకు, మరణోన్ముఖమైన అశ్వరాజము అంతదూరము ప్రయాణము చేయగలుగుటకు పెద్దచానమ్మగారి పాతివ్రత్యమే కారణమని మహారాజులవారికి గోచరించినది. ఆభావము తోచుటతో ఆమెయందు మహారాజులవారికి అపూర్వమైన భక్తి కలిగినది. ఆమహాపతివ్రతకు రాకూడని ఆపద వచ్చినదని మహారాజులవారికి దుఃఖము వెల్లువలుగా వచ్చినది. దుఃఖమును నిలుపుకొనలేక మహారాజులవారు వెక్కి వెక్కి యేడ్చిరి. ఆయన దుఃఖమునకు సిద్దన్నగారికి

ప్రోలాంబకు కూడా దుఃఖము పొంగివచ్చినది. వారుముప్పురు బావురుమని బిగ్గరగా రోదించిరి.

పెద్దచానమ్మకు ధ్యానభంగమైనది. ఆమె కనులు తెరచినది. వెనుకకు తిరిగి అత్తమామలను మహారాజులవారిని చూచినది. ఆమెకు విషయమంతయు తెలిసినది. కన్నులవెంట నీరు కాలువలు కట్టినది. మామగారితో "నాకు తెలిసినది. సాగుమానమునకు యేర్పాట్లు చేయింపుడు" అనినది. మరల దేవీవిగ్రహమువైపు తిరిగి కన్నులు మూసికొన్నది.

## 23

మహారాజులవారు ఖడ్గతిక్కనగారి దేహమునకు జరుగవలసిన దహనసంస్కారమునకు యేర్పాట్లను స్వయముగా చూచుచుండిరి. ఖడ్గతిక్కనగారి విన్నపమును సిద్ధన్నగారు మహారాజులవారికి మరల మరల జ్ఞాపకము చేసిరి. పొరపాటు చేతనైన మహామంత్రులవారి మహాభారత రచనావ్యాసంగమునకు అంతరాయము కలిగింపరాదని-వారి కీవార్తలు తెలియకుండ కట్టుదిట్టములు చేయవలయునని - మహారాజులవారు తగిన జాగ్రతలు తీసికొనిరి.

ఖడ్గతిక్కనగారి కళేబరమునకు సంస్కారమునకు, ఆయన భార్య సహగమనమునకు కావలసిన యేర్పాట్లు పూర్తి అయినవి. నగరములో ప్రజలందరు వచ్చిరి. ఖడ్గతిక్కనగారి శరీరమునకు కుమారుడు వైదికసంస్కారములను జరిపెను. దేహమును కాడిమీాద పరుండబెట్టిరి. బట్టకప్పిరి.

సిద్దన్నగారు మహారాజులవారు లోపలకువెళ్లి పెద్ద చానమ్మతో సన్నాహాములు పూర్తి అయినట్లు చెప్పిరి. ఆమె దేవీవిగ్రహాము ముందు పూర్వమువలెనే కూర్చుని యున్నది. అప్పటినుండి అదేవిధముగ కూర్చునియున్నదని, కన్నులు తెరవనే లేదని ప్రోలాంబ చెప్పినది. ఆమె ప్రకృతలోకమునం దున్నట్లే లేదు. సిద్దన్నగారు, మహారాజులవారు మరల మరల చెప్పగా లేచి నిలువబడినది. కాని కన్నులు తెరవలేదు. ఆమెను అత్తగారు ప్రోలాంబ గుచ్చిపట్టుకొని నడిపించినది. ఆమె కనులు మూసికొనియే నడచినది. ఆమె బయటకురాగా, రాజధానినగరములో సువాసినీ జనము ఆమె చుట్టునుచేరి మంగళహారతులనుపట్టి ఆమె పాదములను పసపు కుంకుమతో అర్చించిరి.

ఖడ్గతిక్కనగారి అంతిమయాత్ర ప్రారంభమైనది. ముందు చతురంగబలాంగములు. మంగళవాద్యములు. తరువాత దళపతులు, దండనాథులు. వారివెనుక మహారాజులవారితో రాజకుటుంబమువారు. తరువాత అగ్నిహోత్రమును ధరించిన ఖడ్గతిక్కనగారి కుమారుడు. అతనిని పరివేష్టించి బ్రాహ్మణ్యము. తరువాత బ్రాహ్మణులు మ్రోయుచున్న శవము. దానివెనుక సువాసినీజనసందోహాముతో పెద్దచానమ్మ. ముడువని కేశములతో, శరీరమునిండ పసపు కుంకుమలతో, దివ్యతేజస్సుతో ఆమె దేవతాస్త్రీవలె, పాతివ్రత్యము మూర్తికట్టివచ్చినట్లు - తపస్సమాధియందుండి నడచివచ్చుచున్నట్లు - ఆమె వచ్చు

చున్నది. ఆమెను పట్టుకొని బ్రాహ్మణముత్తైదువలు నడిపించు చున్నారు. ఆమెవెంట నగరములోని అన్నివర్ణముల సువాసినీ జనము వచ్చుచున్నది. వారు మంగళహారతులు పాడుచుండిరి. వారివెనుక పసపుకావిళ్లు - కుంకుమకావిళ్లు. నగరములోని ప్రతిగృహమువారు పసపుకావిడి యొకటి కుంకుమకావడి యొకటి, చీరె రవికలగుడ్డ తీసికొనివచ్చిరి.

ఊరేగింపు పాలికలను చేరినది. శవమున్న కాడి నేల మీద దింపబడినది. రాజలాంఛనములను తొలగించిరి. కట్టెలు పేర్చి అగ్నిహోత్రమును అంటించి - దేహమునకు చివరి మంత్రసంస్కారమును చేసిరి. ఇక పెద్దచానమ్మ భర్త శరీరమును చేతులలోనికి తీసికొని అగ్నిహోత్రమును ప్రవేశింపవలసి యున్నది. అప్పుడామె కనులు తెరచినది. చుట్టునున్న సువాసినీ జనమునకు నమస్కరించినది. ఖడ్గతిక్కనగారి దేహముకడకుపోయి - దానిని చేతులతో తీసికొనుటకు పైగుడ్డను తొలగించి-అట్లాగే సంభ్రమముతో నిలచిపోయినది. ఆదేహమునకు శిరస్సులేదని-అప్పటివఱకుగాని ఆమెకు తెలియలేదు.

ఆమె మహారాజులవారి వంకచూచి "ప్రభువులవారికి తెలియును. శరీరమునకు శిరస్సుప్రధానము. కళేబరమునకు శిరము లేకపోయిన దహనసంస్కారము పరిపూర్ణముకాదు. శిరములేకుండా సాగుమానముచేసి ప్రయోజనములేదు. కావున సేనాపతులవారి శిరమును వెదకి తెప్పించి నన్ను అను గ్రహించండి. ఆశిరస్సుకోసము నేను వేచిఉంటాను. అగ్ని

హోత్రమును అంతవరకు మండిస్తూ ఉంచండి. తొమ్మిదవరోజున నిత్యకర్మ ప్రారంభింపకతప్పదు. అందుచేత యెనిమిదవనాటి సాయంకాలములోగా సాగుమానము పూర్తికావలెను. ఇప్పటి కప్పుడే మూడవదినము. ఎనిమిదవనాటి మధ్యాహ్నము లోపుగా సేనాపతులవారి శిరస్సును నాకు ప్రసాదించండి. మర ణించిన మీసేనాపతుల వారిభార్యకు యీ అనుగ్రహాన్ని ప్రసాదించండి” అని అంజలి బంధించినది.

ఆమె అభ్యర్థనకు మహారాజులవారు సంచలించిపోయిరి. ఆమె కెదురుగా నిలువబడి మాటాడలేకపోయిరి. ఆమె మహా తేజస్సుతో ప్రకాశించుచున్నది. కైలాసగమనము చేయుచున్న పార్వతీదేవి అంశావతారముగా నున్నది. సౌభాగ్యము యొక్క మూర్తీభావముగా నున్నది. సర్వపతివ్రతా శిరోమణుల పావిత్ర్యము రూపుకట్టినట్లుగా నున్నది.మహారాజులవారుకంటి నీరుతో ఆమెకు పాదాభివందనముచేసి “తల్లీ నన్ను క్షమించు, మహాసేనాపతులవారి శిరస్సుకోసం మన యోధులు రణరంగ ములో వెదకి వచ్చారు. కనుపించలేదు. బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమమునుంచి - మన రాజనగరమువరకు ఉన్న మార్గ మంతయు వెదకించితిమి. ప్రయోజనము కలుగలేదు. కాని మేము ప్రయత్నమును విరమించలేదు. దండనాథులను తిరిగి హెచ్చరించుచున్నాము. బ్రహ్మారుద్రయ్యగారి ఆశ్రమమునకు మరల యోధులను పంపుతున్నాము. విక్రమసింహపురరాజ్య మందున్న యోధులందరు నిరాహారముగ రాత్రులనక పవలనక

సేనాపతులవారి శిరస్సుకై అన్వేషణచేస్తూనే ఉంటారు. సేనాపతులవారి శిరస్సును వెదకితెచ్చిన వారికి అర్ధరాజ్యమును సమర్పిస్తామని ప్రకటనచేయిస్తున్నాము" అని మనవిచేసిరి. దండనాథులతో - ముఖ్యయోధులతో అన్వేషణాప్రయత్నములు చేయుటకు వెళ్లిరి.

పెద్దచానమ్మగారు పాలికలలో అట్లే నిలువబడియున్నది. పుణ్యస్త్రీలు జట్లుజట్లుగా ఆమెను కనిపెట్టుకుని యుండిరి. కుమారుడు ఆమె దగ్గరలో నిలువబడియుండెను. చితిలో అగ్నిహోత్రమట్లే మండింపబడుచున్నది. వీరయోధులు జట్లుజట్లుగా కాపలా కాయుచుండిరి. ఆ పాలికలకు నగరమంతయు వచ్చియున్నది. రాత్రింబవళ్లు జనము నిరీక్షించుచునే యుండిరి. విక్రమసింహపురరాజ్యమున దూరదూరములనుండి - అన్ని ప్రాంతములనుండి - జనము - ముఖ్యముగా పుణ్యస్త్రీ బృందములువచ్చి ఆమెకు మంగళహారతులు పట్టిపసుపు కుంకుమలు అర్పించి పోవుచుండిరి. ఆమెను దర్శించి, ప్రదక్షిణకరించి, పాదాభివందనము చేసిపోవుచుండిరి. ఒకదివ్యదేవతాదర్శనము లభించినప్పుడు జనసందోహమువచ్చి దర్శనములు చేసికొనునట్లు దర్శనమునకు వచ్చుచుండిరి.

మూడవరోజు వెళ్లిపోయినది. నాలుగవదినము వెళ్లిపోయినది. సేనాపతులవారి శిరస్సు లభింపలేదు. ఐదవదినము వెళ్లినది. ఆరవదినము వెళ్లినది. ఏడవదినము వెళ్లినది. ఎనిమిదవదినము వచ్చినది. సేనాపతుల వారిశిరము లభింపనేలేదు.

మహారాజులవారు చేయగలిగినదెల్ల చేసిరి. విక్రమసింహపుర రాజ్యమునందే గాక చుట్టుప్రక్కలవారందరు సేనాపతులవారి శిరస్సు దొరకలేదని వాపోయిరి. కాని శిరస్సు లభింపలేదు. ఇక మానవప్రయత్నమువలన ప్రయోజనము లేదని మహారాజులవారు గ్రహించిరి. ఈసంకటపరిస్థితులలో మహారాజులవారి కేమియు తోచలేదు. విపత్కరసమస్యలను పరిష్కరింపగల మహామంత్రి తిక్కనగారి కడకుపోయి నివేదించుటకు వీలులేని ఆజ్ఞ. ఆయనకు త్రోవ తెలియలేదు.

మహారాజులవారు ఆమెకు పాధాభివందనముచేసి "అమ్మా!" అని దుఃఖమును ఆపుకొనలేక వెక్కివెక్కియేడ్చి - సంబాళించుకొని "అమ్మా! ఇంతరాజ్యమునకు ప్రభువునై యుద్ధభూమిలో మహావిజయమును సాధించి వీరస్వర్గమునకు పోయిన మహాసేనాపతుల శిరస్సును వెద ట్టుకొనలేకపోయితిని. నారాజ్యమును త ప్రతాపముచేత రక్షించిన మహాసేనాని ఋణమును తీర్చుకొనలేకపోయితిని. ఈ రాజ్యము నేలుటకు యోగ్యత నాకు లేదు" అని తన శిరస్సుపైయున్న కిరీటమును ఆమె పాదముల చెంతపెట్టి పాదాభివందనము చేసిరి. జనులు సాధుసాధురావములు చేసిరి.

ఆమె నిశ్చలముగా మహారాజులవారిని చూచుచు "మహారాజా! మీరు దుఃఖపడకండి. చింతించి ప్రయోజనము లేదు. దుఃఖమువలన కార్యసాధనము జరుగదు. మీశక్తి లోపము లేనట్లు మీరు ప్రయత్నము చేసితిరి. 'యత్నే కృతే

న సిద్ధ్యతి కోఽత్రదోషః' అనిన కవికులగురువు మాట మీకు తెలియనిది కాదు. మానవప్రయత్నమునకు సేనాపతులవారి శిరస్సు లభింపలేదు. అనగా శిరస్సు అదృశ్యమగుటకు మానవాతీతమైన కారణ మున్నదన్నమాట. మానవశక్తిని మించినట్టి శక్తి యేదో ప్రతికూలముగానుండి సేనాపతులవారి శిరస్సును అదృశ్యము చేసినదన్నమాట. మీరు ధర్మప్రభువులు. శిరస్సు లభింపనందువలన మీయందు ధర్మలోపములేదు. మీకు పరాభవము లేదు. మీరు ధర్మమార్గమున విక్రమసింహపురమహారాజ్యమును పరిపాలించుటకే కదా సేనాపతులవారు రణరంగమునకువెళ్లి ప్రాణత్యాగము చేసినది. ఆయన వాంఛప్రకారము మీరు రాజ్యమును పాలించుచుండవలసినదే. ఇది సేనాపతుల అభీష్టము. నావిన్నపము. మీరు కిరీటమును స్వీకరింపుడు." అని చెప్పగా జనులు హర్షధ్వానములు చేసిరి. మహారాజులవారు మరల కిరీటమును స్వీకరించిరి.

ఆమె మహారాజులవారిని చూచుచు "సేనాపతుల వారి శిరస్సును నేను తెప్పించుకుంటాను. మీరంతా ఖేదపడకండి" అని చీరకొంగు నడుమునకు బిగించి ముందునకువచ్చి భర్తగారి దేహమునకు ప్రదక్షిణముచేసి పాదములను స్పృశించి నమస్కరించి, లేచి, కన్నులుమూసికొని కొలదిసేపు ధ్యానించి, మరల కన్నులు తెరచి—

"శ్రీలలరారశత్రువుల జెండితి వార్యులు మంత్రివర్యులా
ర్వేలఘనుల్ నుతించిరలవేల్పుదొరల్ ముదమంది మెచ్చిరో

లాలితశౌర్యధైర్యజయలక్ష్మి ప్రియంబున నివ్వరించె నీ
లీలలు హా చ్చె! తిక్కన కళేబరమా! యిక నిల్చియాడుమా"

అని బిగ్గరగా పఠించినది.

వెంటనే యెక్కడనుంచియో ఖడ్గతిక్కనగారి శిరస్సువచ్చి కళేబరమునకు అతుక్కుపోయినది. ఆయన దేహము లేచి కూర్చున్నది. అక్కడనున్న జనసందోహము ఆనందాశ్రువులతో తబ్బిబ్బులైనవి. ఆజనమంతా - ఎవరున్నచోట వారుండి ఆమెకు సాష్టాంగప్రణామము చేసిరి. పులకాంకితులైరి. తాము మానవాతీతమైన దివ్యశక్తిని దర్శించినట్లు గ్రహించినవారై పునీతులమైతిమని భావించుకొని ఆర్ద్రహృదయములతో సాశ్రుపూరితనయనములతో ఆమెకు అంజలించి నిలచిరి.

పుణ్యస్త్రీలు మరల ఆమెకు మంగళహారతులుపట్టిరి. ఆమె పావిత్ర్యమును పాతివ్రత్యమును రించు పాటలుపాడిరి. ఆమెపైన పసపు కుంకుమలతో పుష్పములతో వర్షము కురిపించిరి. ఒక్కొక్కరే పాదాభివందనము చేసిరి.

మహారాజులవారు ఆమెకు మరల పాదాభివందనము చేసి "అమ్మా! ఈనాటినుండి నీవు మాకులదేవతవు. ఈరాజ్యమును మీభర్తగారు నిలువబెట్టిరి. మీరు మరల నాకు ప్రసాదించిరి. నావంశము వారున్నంతకాలము మిమ్ము కులదేవతగా కొలిచెదరు. ప్రతిసంవత్సరము మీకు పసపు కుంకుమ ఉత్సవములు చేయుదురు. మీభర్తగారు ఆంధ్రదేశమున్నంతకాలము కీర్తింపబడునట్లే - మీరును పూజింపబడుదురు. ఆయన ఆంధ్ర

జాతి పౌరుష శౌర్య ధైర్యసాహసములు మూర్తికట్టినవాడు. మీరు ఆంధ్రజాతి పాతివ్రత్యభావమునకు మూర్తీభావము. మా ఆంధ్రజాతిని ఆశీర్వదించు తల్లీ!" అని కన్నులవెంట ధారలుకురియగా నమస్కరించిరి. ఆమె నిశ్చలదృష్టితో మహారాజులవారిని ఆశీర్వదించినది.

సువాసినీ జనమును యేకత్రసమావేశపరచి - వారందరకు సమిష్టిగా ఆమె ముమ్మారుప్రదక్షిణముచేసి సాష్టాంగ నమస్కారము చేసినది. అత్తమామలు పుత్రశోకమును భరింపలేక శ్మశానమునకు రాలేదు. పురమువైపు తిరిగి వారిని స్మరించి చేతులెత్తి నమస్కరించినది-భర్తగారి శరీరమునకు ప్రణామము చేసి దానిని చేతులలోనికి తీసికొన్నది. జనము అగ్నిహోత్రమును ప్రజ్వలింపచేసిరి. కుమారుడు తుదిసారి తల్లికి సాష్టాంగ ప్రణామముచేసెను. ఆమె భర్తగారి శరీరముతో అగ్నిహోత్రమునకు ప్రదక్షిణీకరించి. ఉత్తరదిక్కుగా అగ్నిప్రవేశము చేసినది. అగ్ని ఆమె తేజస్సును భరింపలేక వెల్లార్చి పదింతలుగా మండినది.

ఆదృశ్యమును చూచుచున్న జనము హాహాకారములు చేసిరి. వారి హాహాకారముల ధ్వనులు స్వర్గలోకపర్యంతము వ్యాపించినట్లు, దేవతలు పుష్పవృష్టి కురిసినట్లు, భారతమాత తన జాతియొక్క పావిత్ర్యమునకు మూలకందమైన పాతివ్రత్యమును ప్రదర్శించి పులకించినట్లు, సన్నని జల్లుపడినది.

## 24

మహామంత్రి తిక్కనగారు సంకల్పించిన విధముగా క్రతువులు జరుగుచున్నవి. సప్తపాకయజ్ఞములను సప్తహవిస్సంస్థలను పూర్తిచేసి సోమయజ్ఞములందు మొదటిది ముగిసిన నాడు మహాభారతరచనా ప్రారంభమైనది. అగ్నిష్టోమ అత్యగ్నిష్టోమ ఉక్థ్యషోడశీవాజపేయ అతిరాత్ర అప్తోర్యామసోమ యజ్ఞములు పూర్తియగునప్పటికి విరాట ఉద్యోగ భీష్మద్రోణ కర్ణశల్య సౌప్తికపర్వములు పూర్తిచేయబడినవి.

వాజపేయ యజ్ఞము పూర్తి చేయబడినప్పుడు పూర్ణాహుతి సమయమున మూర్ధాభిషిక్తుడైన రాజువచ్చి శ్వేతచ్ఛత్రమును పట్టవలసియున్నది. మనుమసిద్ధిమహారాజులవారు స్వయముగావచ్చి శ్వేతచ్ఛత్రమును పట్టుదురని యజ్ఞశాలలోని వారందరు భావించిరి. మహామంత్రి తిక్కనగారు కూడనట్లే తలపోసిరి. కాని మహారాజులవారు రాలేదు. మూర్ధాభిషిక్తుడైన మండలేశ్వరుడు గంగయసాహిణివచ్చెను. అతడు శ్వేతచ్ఛత్రమును పట్టి గౌరవమర్యాదలను నిర్వహించెను. మహారాజులవారు అమితమైన కార్యభారమున రాలేకపోయిరని అతడు విన్నవించెను. మహారాజులవారు రాలేదని మనస్సునందు బాధపడుచున్న మహామంత్రులవారు గంగయసాహిణిచేసిన ఔపచారికభాషణమును పట్టించుకొనలేదు. మహారాజులవారు రాని వెలితివెలితిగానే యున్నదని యజ్ఞశాలలోని వారందరు భావించిరి.

మహారాజులవారికి మహామంత్రి తిక్కనగారిపైన అనన్యమైన గౌరవము. మహారాజులవారికి మహాభారతరచనము తమ పితృకార్యమన్నంత భక్తికలదు. అట్టిస్థితిలో మహారాజులవారు స్వయముగా రాలేకపోవుట కేదో బలవత్తరమైన కారణమున్నదని మహామంత్రులవారు చలించిపోయిరి. మహారాజులవారి క్షేమమును గురించి, సిద్ధన్నగారి క్షేమమును గురించి ప్రోలాంబగారి క్షేమములను గురించి వేరువేరు వరుసనా గ్రుచ్చి గ్రుచ్చి గంగయసాహిణిని మహామంత్రిగారు ప్రశ్నించిరి. మధ్యవయస్కులై - మహాప్రతాపవంతులై, అసహాయశూరులైన ఖడ్గతిక్కనగారికి గాని ఆయన భార్యకుగాని ప్రమాదము జరుగవచ్చునని మహామంత్రిగారు శంకింపలేదు. వారిని గురించి ప్రత్యేకముగా ప్రశ్నింపలేదు.

మహారాజులవారి ఆజ్ఞలను శిరసావహించివచ్చిన వృద్ధ సామంతమండలేశ్వరుడు గంగయసాహిణి మహామంత్రులవారి ప్ర "చిత్తం చిత్తం" అని సమాధానముచెప్పి శిరమువంచి నిలువబడెను. మహామంత్రిగారి ప్రశ్నలకు తట్టుకోవడము చాలకష్టమైనది. అత దసత్యము చెప్పుటకు భయపడెను. అతని అదృష్టము కొలది మహామంత్రులవారు ఖడ్గతిక్కనగారి క్షేమములు ప్రత్యేకముగా ప్రశ్నింపలేదు. గంగయసాహిణి వృద్ధుడైనాడు. అశ్వికదళాధిపత్యమును నిర్వహింపలేక విరమణముచేసి స్వస్థానమునకు వెళ్లినవాడు. అచ్చట గంగయసాహిణి నామమాత్రమునకు సామంతప్రభువుగా

నుండెను. అతనికి సంతానములేదు. సోదరులు లేరు. అతనిసోదరి చందలాంబ. ఆమె భర్త అంబయదేవుడు. అంబయదేవుడే గంగయసాహిణి తరఫున రాజకార్యములు చూచుచుండెను. మహామంత్రులవారికి వృద్ధుడైన గంగయసాహిణిని ప్రశ్నలతో బాధించుట అభిమతము కాదు. ఆకారణమువలన కొన్ని ప్రశ్నలు రూపుకట్టలేదు. గంగయసాహిణి మాత్రము బహు కష్టముమీద బయటపడగలిగితినని భావించుకొనెను.

తరువాత పౌండరీకాంతము క్రతువులు జరిగినవి. స్త్రీపర్వము, శాంతిపర్వము, అనుశాసనపర్వము, అశ్వమేధ పర్వము, ఆశ్రమవాసపర్వము, మౌసలపర్వము, మహాప్రస్థానిక పర్వము, స్వర్గారోహణపర్వము పూర్తి అయినవి. ఆంధ్రమహా భారతము సంపూర్ణమైనది. ఆయా యజ్ఞాంతకాలములందు బ్రాహ్మణులకు భూరిదక్షిణలు లభించినవి. అందరకు సంతుష్టిగా సంతర్పణలు జరిగినవి.

చివరకు సర్వజిద్యాగము జరిగినది. మహామంత్రిగారు తనకున్న సర్వస్వమును అర్థిజనమునకు పంచిపెట్టిరి. ఆయన, ఆయనభార్య, కుమారుడు కట్టుపుట్టములతో మిగిలిరి. యజ్ఞములను నిర్వహించుటకు వచ్చినవారు, తిలకించుటకు వచ్చిన వారు సంతుష్టులై మహామంత్రులవారి అనుజ్ఞలను తీసికొని వెడలిరి.

తాము షట్కర్ములయ్యును-షట్కర్మాన్యమైన రాజసేవ స్వీకరించి రాజపురుషోచితమైన కార్యమును వహించియుండుట

చేత మహామంత్రిగారికి సర్వజిద్యాగము చేయవలెనని తోఁచినది.

మహామంత్రి తిక్కనగారు, భార్యాపుత్రులు, శిష్యుఁడు కేతన, లేఖకుఁడు ఆత్మకూరి గురునాథుఁడు, పరివారవర్గము, పరివారనాయకుఁడు భవ్యభారతి బయ్యనగారు మిగిలియుండిరి. ఆమరునాఁడు ప్రాతఃకాలమున పురప్రవేశము చేయుటకు నిశ్చయింపబడెను.

ఆరాత్రి యిష్టాగోష్ఠిలో కేతన మహామంత్రిగారికి నమస్కరించి "తమరు అర్థిజనమును సంతృప్తిచేసిపంపిరి. అంతేవాసినైన నాకు మాత్రము చిన్నకోరిక మిగిలిపోయినది" అని మందస్మితము చేసెను. మహామంత్రిగారు నవ్వి "అదియేదో చెప్పు. నాకు సాధ్యమైతే తృప్తికలిగించుటకు ప్రయత్నము చేసెదను" అనిరి. కేతనమహామంత్రిగారికి పాదాభివందనము చేసి "తమరు మహాభారతరచన చేయుచున్నకాలమున నేను కొంత కవితాభ్యాసంగమును చేసితిని. దండి విరచితమైన దశకుమారచరిత్రను ఆంధ్రీకరించితిని. దానిని తమ పాదములకు సమర్పించి చరితార్థుడను కావలెనని అభిలాషగా ఉన్నది." అని చేతిలోని గ్రంథమును మహామంత్రుల పాదసమీపమునందుంచి మరల పాదాభివందనము చేసెను. "దీనికింతప్రార్థనము దేనికి అభినవదండీ!" అని ఆగ్రంథమును మహామంత్రిగారు స్వీకరించిరి.

ఇంతలో గురునాథుడు సమీపించి నమస్కరింపగా మహామంత్రిగారు మందస్మితముచేసి కూర్చుండ నియమించి కేతనవంక చూచిరి. కేతన లోపలకుపోయి శాసనపత్రమొకటి తెచ్చి గురునాథున కిచ్చెను. ఆశాసనమును పఠించి గురునాథుడు కృతజ్ఞతాభరితుడై లేచి అంజలి బంధించి "మహామాత్య పాదులవారు మహాభారతరచనా ప్రారంభములోనే ఈశాసనాన్ని వ్రాయించారన్నమాట. గోపవరం మించుపల్లె గ్రామాలను నాకు అమరమాగాణముగా అనుగ్రహించిరి. దీనిని బ్రాహ్మీప్రసాదముగా శిరసావహించున్నాను. అని శాసనమును కన్నుల కద్దుకొని శిరమునందుంచుచుకొనెను. తిరిగి అంజలి బంధించి "నన్ను అనుగ్రహింపవలెను." అనగా మహామంత్రిగారు ప్రశ్నార్థముగా చూచిరి.

అంజలిబంధించి గురునాథుడు మనవిచేసెను. "నాకు అయిదు సంవత్సరముల వయస్సులో అకస్మాత్తుగా రాత్రివేళ జరిగిన అగ్నిప్రమాదమున మాతల్లితండ్రులు గతింపగా పరమ దయాళురైన కొమ్మనామాత్యులవారు నన్ను చేరదీసిరి. అమ్మగారు అన్నమాంబాదేవిగారు నన్ను కన్నకుమారునివలె ఆదరించిరి. నాకు మాకులవిద్యను నేర్పక కొమ్మనామాత్యులవారు స్వయముగా సంస్కృతాంధ్రములు గణితము చెప్పిరి. వారు నాకు విఘ్నేశ్వరమంత్ర ముపదేశించిరి. ఆయన వీరమరణము పొందగా నావిద్య నిలచిపోయినది. అప్పటికి సాహిత్యము పూర్తిఅయినది. వైయాకరణికావలెనని, దార్శనికుడు కావలె

నని గ్రంథకర్త కావలెనని నాకు అభిలాషఉండేది. కొమ్మ నామాత్యులవారు స్వర్గస్థులు కాగా నావిద్యాభ్యాసము నిలచి పోవడమే గాక నేను కష్టపడి జీవనోపాధి వెదకికొనవలసివచ్చి నది. నాకు గణితజ్ఞానమువలన నాకు కొలువు దొరికినది. సిద్ద నామాత్యులవారి అనుగ్రహమువలన నాగణితవిద్య రాణించి నాకు కోశాధిపత్యము లభించినది. కాని గ్రంథకర్త కావలె నన్న నాకోరిక నన్ను విడువలేదు. నేను తీవ్రతపస్సు చేయగా నాఇష్టదైవమైన గణనాథుని కరుణలభించినది. నే సీజన్మమున గ్రంథకర్త కాజాలనని గ్రహించితిని. ఇష్టదేవతాప్రసాదలబ్ధమై మీ అనుగ్రహమును పొంది ఆంధ్రమహాభారతమునకు నా పూర్వపుణ్యఫలముచేత లేఖకుడనైతిని. నావంశములో గ్రంథ రచనాదక్షులు జన్మించి ఆంధ్రసరస్వతీసేవచేయునట్లు ఆశీర్వ దించండి" అని వేడెను.

మహామంత్రి తిక్కనగారు గురునాథుని చిరునవ్వుతో చూచి, క్షణకాలము కనులుమూసి మరల చూచుచు "గురు నాథా! నీవు మహాభారతలేఖకుడనై చేసిన అనల్పసేవకు ఆంధ్ర సరస్వతీదేవి సంతోషపడినది. ఆమె అనుగ్రహమువలన నీవంశ మందు సరస్వతీ అంశతో జన్మించిన గ్రంథకర్త చిరయశస్సు నార్జించును" అనిరి. మరల "మీవంశమువారు తరతరములుగా మావంశమువారి దగ్గర సంస్కృతాంధ్రములు పఠింపవచ్చును." అని అనుగ్రహించిరి. గురునాథుడు "మహాప్రసాదం" అని ప్రణామము చేసెను.

మహామంత్రి తిక్కనగారు సమీపమందున్న భార్యతో చిరునవ్వుతో "కేతన గురునాథుడు కోరికలు కోరిరి. నీకు కూడ తీర్పవలసిన కోరికలున్నవా?" అనిరి. ఆమె నవ్వుచు "తీర్చు వారున్నప్పుడు కోరికలకేమి తక్కువ" అనెను. మహామంత్రి గారు "నీకేమి కోరిక ?" అనిరి.

ఆమె "నాకు కోరతగిన దేమున్నది? శ్రీదేవి నన్నింత కాలము చల్లగా చూచినది. మిమ్ముల్ని భర్తగా ప్రసాదించడము లోనే సర్వవరములను ప్రసాదించినది. ఇక మిగిలిన వాంఛ యొక్కటే. పుణ్యస్త్రీగా - సువాసినిగా - మీ చేతులమీదుగా వెళ్లిపోవుట. నాకు స్వచ్ఛందమరణమును అనుగ్రహించండి!" అని అంజలి బంధించినది.

తపస్సుచేసి కోరిన పురుషుని భర్తగాపొందిన దామె. సర్వరాజభోగములను అనుభవించినది. మహామంత్రిగారి భార్యగా మహాకవిగారి భార్యగా, కవిబ్రహ్మగారి భార్యగా— సమున్నతమైన గౌరవములు పొందినది. ఆయనకు ధర్మపత్నిగా నుండి ఆయనచేసిన సర్వయజ్ఞములందు యాజమాన్యస్థానము నందు కూర్చున్నది. త్రయ్యంతనిష్ణాతులైన భర్తగారితో యజ్ఞపురుషుని అనుగ్రహములను పొందినది. నిత్యము బహు మందిశిష్యులు వేదవేదాంగములు శాస్త్రములు అధ్యయనము చేయుచు చర్చలు చేయుచునుండుట వినియున్నదిగాన, ఆమెకు గల శ్రుతపాండిత్యము చాల గొప్పది. ఆమెకు తెలియని ధర్మరహస్యములు ధర్మసూక్ష్మములు లేవు. ఆమె అనుభవింపని

వైభవమా రాజ్యమున లేదు. మహారాజులవారు మహారాణీ వారు ఆమెకు పాదాభివందనముచేసిరి. దేశమున దిగ్దంతుల వంటి శాస్త్రపండితులు, సాహిత్యపండితులు భర్తగారి శిష్యులై ఆచార్యాణియగు ఆమెకు పాదాభివందనము చేసిరి. ఇట్టి స్థితిలో ఆమెకు తీరనికోరికయున్నదని మహామంత్రిగా రనుకొన లేదు. ఆమె చెప్పగా ఆశ్చర్యపడలేదు. ఆకోరిక స్త్రీ సహజముగా నున్నదని, ఆమె మనస్థితకు తగినట్లుగా నున్న దని ఆయనగ్రహించిరి. ఆమెకోరికను వినగా ఆయనకు హాస్య ధోరణిపోయినది. ఆలోచనలోపడిరి. వ్యగ్రమనస్సుతో కనులు మూసికొని ఆలోచించిరి. తరువాత ఆమెను చూచి "నీవు కోరినట్లే జరుగుతుంది. ఇన్ని మహాక్రతువులలో అవబృథ స్నానములుచేసిన యజమానురాలివి. యజ్ఞపురుషుడు నీయందు ప్రసన్నుడు. నీకు శాస్త్రములు ధర్మములు శ్రుతపూర్వములు. నీకు తెలియనిసాధన లేదు. నీకోరిక ఫలించును" అని ఆమెకు తృప్తిని కలిగించిరి.

## 25

ఆ ఉదయము పురప్రవేశమునకు సన్నాహములు జరిగినవి. ఉషఃకాలమున మహామంత్రిగారు పురమునకు విజయము చేయుచుండిరి. మహారాజులవారు స్వయముగావచ్చి తోడ్కొనిపోవుదురని మహామంత్రిగారు భావించిరి. మహా రాజులవారు రాలేదు. యజ్ఞావసానవేళ ఖడ్గతిక్కనగారు, ఆయనభార్య పెద్దచానమ్మ వచ్చి ఆశీర్వదింతురని కూడ మహా

మంత్రి తిక్కనగారు ఆశపడిరి. సిద్ధనగారు ప్రోలాంబ వృద్ధులగుటవలన రాలేకపోవచ్చునని తలపోసిరి. కాని యెవ్వరును రాలేదు. తోడ్కొనిపోవుటకు కూడ వచ్చినవారులేరు. ఈ అపూర్వనిరాదరణకు మహామంత్రిగారు కారణము నూహించుకొనలేకపోయి నిరుత్సాహపడిరి.

తోడ్కొనిపోవుటకు రాకపోయినను, పురమునకు బహిర్వనమునకు మహారాజులవారుగాని, సేనాపతులవారుగాని వచ్చి స్వాగతములు చెప్పుదురని మహామంత్రిగా రనుకొనిరి. వారిరువ్వురు రాలేదు. రాజోద్యోగు లెవ్వరు రాలేదు. పౌర ప్రముఖులుగాని సామాన్యజనులుగాని రాలేదు. అది విక్రమసింహపురమేనా? తా నారాజ్యపు మహామాత్యపదవియందున్నవాడేనా? అనిపించినది మహామంత్రి తిక్కనగారికి. ఇట్టి నిరాదరణచూచుట కాయన కదియే తొలి అనుభవము. ఆయన మనస్సు మిక్కిలి బాధపడినది.

మహాభారతము ఆంధ్రీకరించిన మహాకవికి అర్ధాసన గౌరవమిత్తునని, కోరినన్ని అగ్రహారము లిత్తునని ప్రకటించిన మహారాజు రాజ్యమిదియేనా? ఆమహాగ్రంథమును సంపూర్ణముగా రచించి వచ్చునప్పుడు పలుకరించువాడు లేకుండెను కదా! అని పరిపరివిధములుగా ఆలోచనలు వచ్చెను.

పురములో ప్రవేశించి తమ స్వగృహమునకు త్రోవ తీసిరి. ఇల్లు సమీపించుచున్నదనగా అన్నంభట్టు కన్పించి నమస్కరించెను. అత డమితదీనవదనముతో మహావిపత్తు నేదో

చెప్ప లేక బాధపడుచున్నట్లు తోచెను. కంఠనిండ నీటితో నుండెను. దుఃఖభాగుడుగ గాద్గదికముతో నుండెను. అతని వైఖరి మహామంత్రులవారికి అవగాహన కాలేదు. అన్నం భట్టును ప్రశ్నార్థకముగా చూచిరి. అన్నంభట్టు చేతులు జోడించి "మహారాజులవారు తమదర్శనమునకై సిద్ధనామాత్యులవారి గృహముకడ వేచియున్నారు" అని మనవి చేసెను.

మహారాజులవారు స్వాగతము చెప్పుటకు రాలేదు. తమ గృహమునకు రాలేదు. తమ్ము సిద్ధనామాత్యులవారి గృహమునకు రమ్మని వర్తమానము పంపిరి. దీనిలో నిగూఢమైన విషయమున్నదని మహామంత్రులవారు గ్రహించిరి. కుమారుని భార్యను తమ గృహమునకుచేర్చి తాము కేతనతో కలసి సిద్ధనామాత్యులవారి గృహమునకు పోవలెనని మహామంత్రులవారు భావించిరి. భార్యతో చెప్పిరి. ఆమె "మనము మహాక్రతువులు పూర్తిచేసి వచ్చుచుంటిమి. పెద్దలు మనలను దీవించుటకు రాలేదు. ఏదో కారణమున్నదేమో? మనము వెళ్లి పెద్దత్తగారికి పెదమామగారికి అక్కగారికి బావగారికి నమస్కరించి ఆశీస్సులు పొంది తరువాత మనగృహమునకు వెళ్లుట బాగుండును" అనినది. తమ మనస్సునందున్న భయాతిరేకమును మహామంత్రులు వ్యక్తము చేయలేదు. భార్యతో "అట్లాగే" అనిరి.

సిద్ధనామాత్యులవారి గృహము వచ్చినది. వెలుపల మహారాజులవారు నిరలంకారముగ, ఏకభట పరివారయుక్త

ముగ నిలచియుండిరి. సిద్ధన్నగారు గా నిఖడ్గతిక్కనగారు గాని బయటలేరు. వెలుపల మహారాజులవారు వేంచేసియుండగా, గృహములోనివారెవ్వరు బయటకు రాకుండుటేమి? ఇల్లు శోభావిహీనముగా కాంతి దక్కియున్నది. ఏదో విపత్తు ముంచుకు వచ్చుచున్నదని మహామంత్రిగారు గుర్తించిరి. ఆవిపత్తు స్వరూపమెట్టిదో వారికి తెలియలేదు.

ఇంటి గుమ్మమును చేరగా మహారాజులవారు మహామంత్రులకు అంజలి బంధించి, కన్నులనుండి నీరు కారగా బావురు మనిరి. మహామంత్రులవారికేమియు బోధపడలేదు. మహామంత్రులవారి భార్య కుమారుడు లోపలకు వెళ్లిరి. వారు లోనికివెళ్లినదే తడవుగా బ్రహ్మాండమైన ఆర్తనాదము. ఇంటిలోనివారు, చిన్నచానమ్మ కలసిచేసిన రోదనము. మహారాజులవారు ఆయన వెంటవెళ్లిరి.

లోపల గుమ్మము ప్రక్కగా సిద్ధనామాత్యులవారు కూర్చునియున్నారు. ఆయన సగము చిక్కి బలహీనముగా లేవలేనిస్థితిలో నున్నారు. ఒక్కసారి ఉద్ధృతముగా వృద్ధత్వమాయనను ఆవేశించినట్లుగా నుండిరి. ఆయన పూర్వ మున్న దానిలో సగము లేదు. చాల నీరసించెను. కన్నులు గుంట పడినవి. దుఃఖావతారముగ, దైన్యావతారముగ నుండెను.

సిద్ధనామాత్యులవారు మహామంత్రి తిక్కనగారిని చూడగా "నాయనా! అన్నయ్యా, వదినా వెళ్లిపోయారురా!" అని బావురుమనిరి. మహామంత్రులవారికి అంతా అవగాహన

అయినది. వివరములు మెల్లి మెల్లిగా తెలిసినవి. మొదటి యుద్ధమున ఆలపుంద బ్రహ్మరుద్రయ్యగారి మంత్రశక్తితో వీరభద్రావతారము తాల్చుట - రణభూమిలో ఖడ్గతిక్కనగారొక్కరేమిగులుట - రెండవసారి ఖడ్గతిక్కనగారు యుద్ధమునకు పోయి ప్రళయతాండవముచేయుట - చివరకు బ్రహ్మరుద్రయ్యగారి మాయాత్రిశూలమువలన మరణించుట - ఆయన శిరస్సు అదృశ్యమగుట - పెద్దచానమ్మగారు సాగుమానమునకు బయలుదేరుట - ఆమె తన పాతివ్రత్యమహిమతో అదృశ్యమైన భర్తగారి శిరస్సును తెప్పించుట - సిద్దన్నగారు చెప్పి దుఃఖించిరి.

ఇంతవిపత్తు సంభవించినప్పటికి తమకు తెలుపలేదని మహామంత్రిగారికి బాధకలిగినది. ఇంతసేపు మహారాజులవారు మహామంత్రిగారి ప్రక్కనేఉండిరి. మహామంత్రిగారు మహారాజులవారితో "నన్ను సహోదరునిగా కాపాడినవాడు. నాకు ప్రాణాధికుడు. మామధ్యఉన్న గాఢానురాగం మీరెరుగుదురు. ధర్మపత్నీ సమేతంగా ఆయన నిర్గమించుచున్నారని నాకు వార్తపంపకపోయితిరి. ఇదిరాజార్హమైన చర్యకాదు" అని నిష్ఠురముగా పలికిరి. మహారాజులవారు చలించిపోయిరి. సిద్దన్నగారు తేరుకొని "నాయనా! తొందరపడినావు! నీమహాభారత రచనావ్యాసంగమునకు అంతరాయము కలిగింపరాదని మీఅన్న సేనాపతుల ఆజ్ఞ. దానిని మహారాజులవారు పాలించిరి. తమ రెండుభుజములుపోయినట్లు మహారాజులవారు దుఃఖించారు. అన్నయ్య శరీరానికి సకలరాజగౌరవాలతో ఊరేగింపుచేశారు.

మహారాజులవారు స్వయంగా శ్వేతచ్ఛత్రంపట్టారు. అమ్మాయి సాగుమానానికి దివ్యమైన యేర్పాట్లుచేశారు. అన్నయ్య శిరస్సు లభింపకపోతే తమ రాజ్యాన్ని పారితోషికంగా యిస్తామని వెదకించారు. అమ్మాయి ముత్తైదువగా అగ్నిహోత్రాన్ని ప్రవేశిస్తుంటే తమ రాజ్యాన్ని ఆమెకు సమర్పించారు. ఆమె దేవతగా వెలయగా దేవాలయం కట్టించారు. ఆమెను కులదైవంగా ఆరాధిస్తున్నారు. మహారాజులవారిని దూషించడం అనుచితం. వారిదోషం లేనేలేదు." అని కన్నీరుపెట్టుకున్నారు.

తమ తొందరపాటునకు పశ్చాత్తప్తులై మహామంత్రి తిక్కన్నగారు "తొందరపడ్డాను. తమకు గోచారంలో శని కుజులు బాగాలేరు. రేపే శాంతిక్రియలు జరిపించుదము" అని బయటగా నున్న గురునాథుని పిలిపించిరి. అతనితో "మహారాజులవారికి గోచారమున లగ్నశనిగాడున్నది. శని కుజ పరస్పరవీక్షణం. నేను ఆవేశంలో రాజ్యార్థహితశంకిస్తూ మాటలాడితిని. అశుభం శమించును గాక! పౌరోహితులను పిలిపించి రేపే శాంతి హోమములు, దానములు, జపములు ప్రారంభము చేయవలెను. రేపు ప్రాతఃకాలమున నీ వీసంగతి తిరిగి నాతో ప్రస్తావనకు తీసికొని రావలెను."అనిరి. గురునాథుడు "చిత్తము. చిత్తము" అనెను.

మాధ్యాహ్నికసమయము దాటినదని మహామంత్రులవారు గుర్తించి మహారాజులవారితో "వేళ అతిక్రమించినది.

అంతఃపురమున ఆబాలవృద్ధము వేచి ఉంటారు" అని వారిని సాగనంపిరి.

ఆదిన మెవ్వరును భుజింపలేదు. ఖడ్గతిక్కనగా రానాడు మరణించినట్లు, పెద్దచానమ్మ ఆదినమున సహగమనముచేసినట్లు వారందరుకలసి దుఃఖించిరి. ఖడ్గతిక్కనగారి పితృభక్తి, భ్రాతృవాత్సల్యము, బంధుప్రేమ,దాతృత్వము,సాహసము, శౌర్యము, ఖడ్గవిద్యావైశద్యము, విద్వత్తు, మరల మరల చెప్పుకొని దుఃఖించిరి. పెద్దచానమ్మగారి వినయము, గుణసంపద, గృహపాలనానైపుణ్యము, బంధుప్రేమ, పాతివ్రత్యము మరల మరల చెప్పుకొని దుఃఖించిరి.

మహామంత్రి తిక్కనగారు చాలసేపు పెదతండ్రి సిద్ధన్న గారి యొద్ద కూర్చుండి ఆయనతోపాటు దుఃఖించిరి. మరి కొంత సేపు పెదతల్లిగారియొద్ద కూర్చుని ఆమెతోపాటు వాపోయిరి. ఆమె గర్భశోకము భరింపరానిదిగా నున్నది. ఆమె మహామంత్రి తిక్కనగారిని గ్రుచ్చికొని రోదించినది.

మహామంత్రి తిక్కనగారి భార్య చిన్నచానమ్మ వచ్చిన ప్పటినుండి ఖడ్గతిక్కనగారి కుమారుడు ఆమె యొడిలో నుండెను. అతనికి చిన్నప్పటినుండి తల్లియొద్ద చనవెక్కువ. ఆ తల్లి దేవీధ్యానసమాధిలో నుండి - అట్లే సాగుమానమునకు వెళ్లిపోయినది. దేవీలోకమును ప్రవేశించినది. ఆమె పాతివ్రత్య తీవ్రత్వమున - అగ్నిప్రవేశము చేయుచివరి ఘడియయందైన కుమారుని వంకచూడలేదు. రెండవసారి ఖడ్గతిక్కనగారు

యుద్ధమునకు వెళ్లినప్పటినుండి ఆమె కుమారునితో మాటాడ లేదు. చివరి ఘడియలలో కూడ కుమారుని గురించి పట్టించు కొనలేదు. తన కొకకుమారు డున్నాడని వానిని విడచి పోవు చుంటినని ఆమె భావించినట్లే లేదు. ఆమె మాతృవాత్సల్య గుణమును విస్మరించినది. ఆవిపత్కరపరిస్థితులు, మాతృవియో గము, బాలుని హృదయముపై చెరుగని దుఃఖముద్ర వేసినవి. అతని దుఃఖమును పట్టించుకొనువా రాగృహమున లేక పోయిరి. చిన్నచానమ్మ రాకతో వాని దుఃఖము కట్టలను త్రెంపు కున్నది. చానమ్మ లిద్దరకుగల అన్యోన్యతవలన, ఆబాలునికి చిన్నచానమ్మతో పూర్వమునుండి చనవున్నది. ఇప్పుడు చిన్న చానమ్మ రాకతో అతనికి తల్లి తిరిగివచ్చి తన్ను ఓదార్చు చున్నంత భావానుభవము కలిగినది.

ఆదినమున మహామంత్రిగారి కుటుంబము సిద్ధన్నగా రింటనే యున్నది ప్రోలాంబ చిన్నచానమ్మను విడువలేదు. ఆదినమంతయు వారిద్దరుకలసి దుఃఖించుచునే యుండిరి. పెద్ద చానమ్మను గురించి, ఆమె సాగుమానమునకు వెళ్లినప్పుడు జనులు చూపిన మహాగౌరవములు, ఆమె మహత్తు - ఆమె దేవతయై వెలయుట - వారు చెప్పుకొని దుఃఖించిరి.

చిన్నచానమ్మ నలతమనిషి. శరీరము పుష్టిచేసికొను చిన్న వయసులో నాలుగు సంవత్సరములు శుష్కింపచేసినది. నిజ ముగా ఆమె శరీరము చిన్ననాటి ప్రతితీవ్రత్వమునుండి కోలు కొననేలేదు. మరల సంవత్సరముపైగా నిత్యక్రతువుల వలన -

యజ్ఞకాలమున బరువు బాధ్యతలవలన, ఆహారనియమముల వలన, వ్రతనిష్ఠలవలన, సహజముగా శుష్కశరీరయగు ఆమె మరింత శుష్కించినది. దేహదార్ఢ్యములేని యామె సగమైనది.

చిన్నతనమున తల్లితండ్రులను పోగొట్టుకొనిన పెద్ద చానమ్మను పిన్నతండ్రి స్వంతకుమార్తెగా పెంచెను. చానమ్మ లిద్దరు స్వంత అక్క చెల్లెండ్రవలె పెరిగిరి. వారిద్దరకు అన్యోన్య ప్రేమాభిమానములు మిక్కిలిగా నున్నవి.

క్రతువులు ముగించుకొని రాగానే అక్కగారి మరణ వార్త, సహగమనవార్త చిన్నచానమ్మకు పిడుగుపాటువలె నున్నవి. అక్కగారు దేవీ అవతారమువలె - పసపు కుంకుముల వర్షములో అగ్నిప్రవేశము చేసినదని - ఆమహోదాత్త సందర్భమున ఆమెను సేవించుకొన లేకపోయితినని చిన్నచానమ్మ మిక్కిలిగా దుఃఖించినది. లోకమే తలక్రిందులైనట్లు ఆమె బాధపడినది.

అదివరకే శుష్కించి రోగగ్రస్తమైయున్న ఆమె శరీరము ఆనాటి అకస్మాద్దుఃఖమునకు తట్టుకొన లేకపోయినది. పైగా ఆనాడు భోజనమే లేదు. ఆసాయంత్రమునకే చిన్నచానమ్మకు విపరీతముగా జ్వరమువచ్చినది. జ్వరమెక్కువ కాగా, మానసిక స్వాస్థ్యము తగ్గి - సంధించి - ఆమె యేవేవో మాట్లాడుట మొదలుపెట్టినది. "అదిగో అక్క పిలుచుచున్నది! నేను అక్కతో మాట్లాడివస్తాను. వెళ్లుచున్నాను" అని చెప్పుచు మంచము మీదనుండి లేచి బోర్లపడి గాయములు చేసికొన్నది.

అసలే శుష్కించిన మనిషి. నిరాహారముగా నున్నది. తీవ్ర జ్వరము. పడిపోయిన గాయములు.

తెల్లవారు ఝామున కొంచెము స్మృతివచ్చినది. భర్తను పిలచి దగరగా కూర్చుండబెట్టుకొని ఆయన పాదములను కన్నుల కద్దుకొని నీరుపెట్టుకొనినది. కుమారునిపిలచి తండ్రి గారి ప్రక్కకూర్చుండ నియమించినది. వాని శిరస్సు స్పృశించి నది. ఈచర్యకే అలసిపోయినది. తన శిరస్సును భర్తగారి యొడిలోనుంచి సన్నగా దేవీత్రిశతి పఠించుచు కనులు మూసి నది. కొంచెము సేపటిలో ఆమె కంఠధ్వని ఆగిపోయినది. ఆమె కనులు తెరువలేదు. మరి యొకసారి ఆయిల్లు ఆక్రందనములతో ధ్వనించినది.

## 26

మరల విక్రమసింహపురము దుఃఖతరంగమయమై పోయి నది. మహామంత్రిగారు సర్వక్రతువులను ముగించుకొని, మహా భారతరచన ముగించుకొని పురప్రవేశముచేసిన నాటిరాత్రి వారికి కళత్రవియోగము సంభవించుట - నగరమును దుఃఖాతి రేకమున ముంచినది. మహామంత్రిగారి దుఃఖములో పాలు పంచుకొనుటకు మహారాజులవారు, పురప్రముఖులు యావ న్మంది వచ్చిరి. ఆనాటి దహనసంస్కారమునకు రాజధాని యావత్తు వచ్చినది. మరునాడు సంచయనము. మూడవనాడు నిత్యకర్మ.

ఆమె మహాపుణ్యవతి యని, మహాపతివ్రతయని, కరుణామూర్తియని స్నిగ్ధమనస్వియని, నగరములో చెప్పుకొనిరి. సర్వక్రతువులను పూర్తిచేసి పవిత్రమైన అవబృథస్నానములు చేసి, భర్తగారి యొడిలో దేవీ ధ్యానము చేయుచు స్వచ్ఛందముగా ప్రాణోత్క్రమణము చేసిన మహాయోగిని అని చెప్పుకొనిరి. అక్కగారి సహగమనవార్త భరింపలేకపోయిన స్నిగ్ధమూర్తి యని చెప్పుకొనిరి. ఆమె చిన్ననాడు ప్రాయోపవేశము చేసి దేవీధ్యానము చేయుచు దూరదేశాంతరగతుడైన భర్తగారిని దైవబలము చేత రప్పించిన వృత్తాంతమును ఆనాడు మరల ఊరిలో కథలుగా గాథలుగా, చిలువలు పలువలుగా చెప్పుకొనిరి. సంవత్సరకాలము క్రతునిర్వహణలోనుండి, యజ్ఞపురుషుని సన్నిధానములో సేవలు చేసి, తిరిగి లౌకికకశ్మలము లోనికి రాలేకపోయిన మనస్విని యని చెప్పుకొనిరి. మృత్యువేళ భర్తపాదములను స్పృశించి, ఆయనకు దేవీ రూపముతో అభిన్నతసాధించిన తపస్విద్ధయని చెప్పుకొనిరి.

కర్మలు యథాశాస్త్రీయముగా ప్రత్యక్ష గోహిరణ్యాది దానములతో మహావైభవముగా జరిగినవి. ఆమెకు మహారాణీ శీలామహాదేవివారు అయిదు అగ్రహారము లిచ్చినది. ఆ అగ్రహారములు పూర్తిగా వినియోగింపబడి కర్మలు జరిపింపబడినవి. కర్మలు జరిగిన దినములలో మహారాజులవారు ఉభయసంధ్యలందు వచ్చి పోవుచుండిరి. మహామంత్రిగారి ఆపదలలో-మహారాజులవారికై యుద్దేశింపబడిన శాంతిక్రియలు విస్మరింపబడినవి.

కర్మలు పూర్తి అయిన తరువాత మరునాడు మహారాజులవారు వచ్చి మహామంత్రిగారిని దర్శించి శాంతిక్రియల ప్రస్తావన చేసిరి.

మహామంత్రిగారు మంత్రులలో ముఖ్యులైన భవ్య భారతి బయ్యనగారిని, ప్రబంధాంకం అన్నంభట్టును, ఆత్మకూరి గురునాథుని, మహారాజులవారికి శాంతిహోమములు నిర్వహింపవలసిన కార్యకలాపములను నిర్వహించుటకు నియమించిరి. పురోహితులను రావించి శాంతి పౌష్టిక క్రియావివరములను చర్చించి నిర్ణయించిరి.

తరువాత మహారాజులవారితో మహామంత్రిగారు తాము కాశీయాత్రకు వెళ్లుచుంటిమని చెప్పిరి. మహారాజులవారు ఆందోళనపడి అంజలి బంధించి "సేనాపతులవారు ధర్మపత్నీ సమేతులై స్వర్గారోహణచేసిన దుఃఖము మరపునకు రాక మునుపే అమ్మవారు గౌరీలోకమునకు వెడలి దుఃఖమును తీవ్రతరముచేసిరి. రాజ్యమంతయు దుఃఖములో నుండగా తమరు కాశీయాత్రకు వెళ్లుట పౌరులెం దెవ్వరికి అభిమతము కాదు" అని మనవిచేసిరి.

మహామంత్రి తిక్కనగారు మందస్మితముతో "ఏలినవారు మన్నింపవలెను. శరీరమునకు మరణము కూడ సహజమైనదే. కళత్రవియోగమువలన నామనస్సు చెడిపోలేదు. విపత్కరపరిస్థితులలో కూడ మనము కర్తవ్యమును విస్మరింపరాదు కదా! 'కర్తవ్యమేవ కర్తవ్యంప్రాణైః కంఠగతైరపి'

దుఃఖము కర్తవ్యనిర్వహణకు అడ్డు రాకూడదు. గీతాపరమేశ్వరుని బోధలసారమదియే కదా!

సేనాపతులవారియొక్క వారి ధర్మపత్నియొక్క అస్థికలను గంగానిమజ్జనము చేయింపవలెనని పెదతండ్రిగారి అభిలాష సేనాపతులవారి కుమారుడు తలితండ్రుల అస్థికలతో కాశీ వెళ్లవలసియున్నది. నా కుమారుడు కూడ తనతల్లి అస్థికలను కాశీకి తీసికొనివెళ్లవలయునని అభిలాషపడుచున్నాడు. బాలుర నిద్దరను కాశీకిపంపి నేను నిలచిపోవుట ధర్మము కాదు. వారిని కూడ వలదనిచెప్పుటకు వీలులేనట్టిది నాచిన్ననాటి జీవితము.

కాశీపేరు జ్ఞాపకము రాగా పూర్వస్మృతులు కలిగి తిరిగి వెళ్లిరావలెనన్న వాంఛబలీయముగా నున్నది. మేము కాశీలో విద్యాభ్యాసము చేయునప్పుడు నిత్య గంగానదీనియమ వేళాకృతస్నానములతో, నిత్యవిశ్వేశ్వర దర్శనభాగ్యముతో, ఢుంఢిరాజసేవాభాగ్యముతో గడిపితిమి. ఆస్మృతులువచ్చి శరీరము జలదరించుచున్నది. ఇన్ని సంవత్సరము లాదివ్యమూర్తులను విస్మరించి నే నుండగలుగుట నా కాశ్చర్యముగానున్నది వెళ్లి దర్శనముచేసి రాకపోయిన నే నుండలేను. కుమారులను అనుగమించినట్లు నాకు పునర్దర్శనము లభించినట్లు ఉండును. అనుమతి నిప్పించండి. వెంటనే తిరిగి రాగలము. ఇక్కడ పరిస్థితులు శాంతముగా నున్నవి. తొందరలులేవు. భవ్యభారతి బయ్యనగారు, ప్రబంధాంకము అన్నంభట్టు, ఆత్మకూరి గురునాథుడు

కార్యచతురులు. ఏలినవారిని జాగ్రత్తగా సేవించుకొను చుందురు. మూడవనాడు శుక్రవారము ఉషఃకాలమున త్రయోదశి పుష్యమి నక్షత్రమున ప్రయాణమునకు బాగున్నది. కుమారు లిద్దరకు తారాబల చంద్రబల యుక్తముగా నున్నది" అని మహారాజులవారిని సమాధానపరచిరి.

ప్రయాణలగ్నమును నిశ్చయించుకొనిన ప్రకారము మహామంత్రిగారు కుమారద్వయముతో కాశీయాత్రకు బయలుదేరిరి. పాదచారులైన భటుల నైదుమందిని వెంట తీసికొనిపోయిరి. యాత్రను పాదచారులై పూర్తిచేయవలెనని నిశ్చయించిరి. తాము మహామంత్రులగుటవలన, ఆటోపముగా వెడలినయెడల రాజకీయపు ప్రయాణమై అనేక సమస్యలకు త్రోవతీయవచ్చునని భావించిరి. కావున సామాన్యయాత్రికుని వలె పాదచారిగా వెళ్లవలెనని, అప్పుడు జనము తమ్ము గుర్తింపరని - అనర్థములు వాటిల్లవని తలచిరి.

బ్రాహ్మీముహూర్తమున గృహమునుండి బయలుదేరి వెళ్లుటవలన పౌరులలో చాలమందికి వీడ్కోలు చెప్పు అవకాశము లభింపలేదు. మహారాజులవారు, మంత్రులు, ముఖ్య రాజోద్యోగులు వారిని బహిర్వనములవరకు సాగనంపి వీడ్కోలు చెప్పిరి.

## 27

మహామంత్రులవారిని యాత్రకుపంపి తిరిగివచ్చిన మహారాజులవారికి మనశ్శాంతిలేదు. మహాప్రతాపనిఘులైన

సేనాపతులు స్వర్గారోహణచేసి ఆరునెలలు కాలేదు. ఖడ్గతిక్కన గారి మరణముతో విక్రమసింహపురరాజ్యమునకు బలమే పోయినది. ఆయన ఖడ్గధారాజలశాంతశాత్రవపరాగుడు. ఆయనకు తోడు మహామంత్రి తిక్కనగారి బుద్ధిబలము. మహా మంత్రులవారు మహామేధావి. అపరయౌగంధరాయణుడు. సాంగవేదవేది. నిగమాగమసారహృదయుడైన శాస్త్రవేత్త. ఆయనకు సాటివచ్చు విద్యావారిధి దక్షిణభారతమున లేడు. ఆయనయందు గౌరవమువలన శత్రురాజు లెవ్వరు విక్రమ సింహపురప్రసక్తికి రారు. ఇప్పుడు ఖడ్గతిక్కనగారు లేరు. మహామంత్రులు దూరస్థులు. ఇది శాత్రవుల కనుకూలమైన కాలమా? ఈ ఊహలతో మహారాజులవారు చలించిపోయిరి. దండనాథులను సమావేశపరచి, ఆలోచించి, కట్టుదిట్టముగా రక్షణలు చేయించిరి.

మహారాజులవా రూహించినట్లే పరిస్థితులు విషమ ముగా పరిణమింపసాగినవి. రామేశ్వరయాత్ర కని చెప్పి కళింగాధిపతి బహిరంగముగా కొంత పరివారముతో దక్షిణ మునకు పోయియుండెను. అతడు మూడవ అని యంకభీముడు. బహిరంగముగా వచ్చిన పరివారముగాక గుప్తముగా వీర యోధులు వచ్చిరట. ఆయన ప్రధానసేనాని విష్ణుదేవుడు మహా సమర్థుడు. అపరచాణక్యుడు. అసమాన యుద్ధవేత్త.

తిరుగు ప్రయాణమునందు అనియంకభీముని పరివార మునకు పల్లవరాజైన కొప్పెరుంజింగ కాడవపతివలన అపచార

మేదో జరిగినదట. కాడవపతి కాంచీపుర ప్రాగ్భాగమునకు భూపతి. అనియంకభీమదేవుని గుప్తయోధులు విజృంభించిరట. వీరయోధశిఖామణి విష్ణుదేవుడు పల్లవరాజును పరాభూతుని చేసెనట. ఆ విష్ణుదేవుని భయమువలన శైవుడైన కాడవపతి విశ్వము విష్ణుమయమని తెలిసికొనగలిగినంతగా కాంచీపురము లోని వైఖానసవైష్ణవులు తమ గాఢపరిశ్రమచేత తెలిసికొన లేకపోయిరట. పాండ్యులు కల్పించుకొని కళింగయోధులను తరిమివేసిరట.

విక్రమసింహపురరాజ్య దక్షిణప్రాంతమున అశాంతి ప్రబలినది. అనియంకభీమన స్వస్థానము చేరిన తర్వాత అతని కుమారుడైన అనంతవర్మవీరనరసింహరావుతుదేవర అధీన ములో మహాబలములు దండెత్తివచ్చుచున్నవని వార్త. వారు గోదావరీనదిని దాటిరేని తామ్రపర్ణినదివరకు ప్రయా ణింపగలరు. వారు గోదావరిని దాటకుండుట వేంగీమండల మునకు విక్రమసింహపురరాజ్యమునకు క్షేమము.

మనుమసిద్ధి మహారాజులవారు దండనాథులను సంప్ర తించిరి. కొంత సైన్యమును తీసికొని వేంగీమండలేశ్వరునికి సహాయముగా వెళ్లుట సముచితమని వారి అభిప్రాయము. మహారాజులవా రంగీకరించిరి.

నగరరక్షణకు తగిన యేర్పాట్లుచేసి ప్రాంతీయపాల కులను అప్రమత్తులుగా నుండుడని హెచ్చరికలుచేసి సైన్య

ముసు సమాయత్తము చేసిరి. తమ ప్రయాణమును రహస్యముగా నుంచిరి.

మహారాజులవారికి ఆందోళనకరమైన వార్త మరి యొకటి కలదు. మహామంత్రులవారు కాశీయాత్రకు వెళ్లిరి. ఆప్రాంతమున శాంతిభద్రతలు లేవు. లఖ్నోతి (లక్ష్మణావతి) రాజ్యము మహమ్మదీయుల పాలనలోనున్నది. దాని సుల్తాన్ ఘియాజ్ ఖాన్. సేనాపతి షక్రుల్ ముల్క్ కరీముద్దీన్. లాఘురీకడు దుష్టుడు. హిందువులను హింసించుట వానికి ప్రీతికరమైన క్రీడ.

ఢిల్లీ సుల్తాన్ అల్లా ఉద్దీన్ మసూద్ షా. అతడును హైందవద్వేషి. మహామంత్రిగారికి, వారి పరివారమునకు మార్గమునం దెట్టి ప్రమాదములైన జరుగవచ్చు. కాశీకూడ శాంతిగా లేదు. మహామంత్రులవారు యాత్రకు వెడలకున్న బాగుండెడిది. వారి ఆలోచనాబలము తమకు మిక్కిలి ఆవశ్యకమైనది.

మనుమసిద్ధిమహారాజులవారు మిక్కిలి విశ్వాసపాత్రులైన వీరయోధులను సమీకరించిరి. వారందరు గుప్తవేషములను ధరించిరి. మహారాజులవారు కూడ గుప్తవేషమును ధరించిరి. అందరును వేంగీమండలమును సామాన్యయాత్రికుల వలె ప్రవేశించిరి.

గోదావరినది వరదలలో నున్నది. కాళింగులసైన్యము గోదావరి కావలిగట్టున వరదలు తగ్గునని వేచియున్నది. ఈవల

ప్రక్క వేంగీమండలేశ్వరుని సైన్యములు కాకతీయదండ నాథుడు పడిగము బొప్పదేవుని ఆధిపత్యమున మొహరించి యున్నవి. బొప్పదేవుడు చాళుక్యవంశోద్భవుడు. సకలసేనాపతి పట్టసాహిణి.

గోదావరి వరదలవలన రెండు ప్రక్కల రెండు సైన్యములు నిలచియున్నవి. దాటుటకు ప్రయత్నింపలేదు. మనుమసిద్ధిమహారాజులవారు ఆయన గుప్తయోధులు యాత్రికులవలె పుట్టీలలో గోదావరినదిని దాటి కొంతదూరము పోయి మరల వెనుతిరిగి కాళింగుల వెనుకకువచ్చి చేరిరి.

కాళింగుల సేనావారమునకు వెనుకతట్టున ఆహారశాల, పరిచారజనవసతులు కలవు. రాత్రి మూడవఝాము. సైనికులు నిద్రలో నుండిరి. గుఱ్ఱములు గుడారములం దున్నవి. గజములు వృక్షములకు కట్టబడియున్నవి. ఆచీకటిలో మనుమసిద్ధి మహారాజు వీరయోధులతో కాళింగులస్కంధావారమును ప్రవేశించెను. సాహసముగా గుఱ్ఱపుశాల ప్రవేశించి గుఱ్ఱములను నదిలోనికి తోలెను. గజములను కట్లువిప్పి నదికి తోలెను. దూరమునందున్న గుడారమునకు నిప్పు అంటించినది గుర్తుగా బొప్పదేవుని సైన్యములు నదిని దాటివచ్చినవి. చీకటిలో కాళింగులు తమసైనికు లెవరో శత్రువు లెవరో తెలిసికొనలేదు. కళింగసేన నశించినది.

తెల్లవారునప్పటికి బొప్పదేవుని సేనకు పనిలేకపోయినది. కాళింగులు మిగులలేదు. వారి స్కంధావారము పీనుగ పెంట

లైనది. గజములన్నియు గుఱ్ఱములన్నియు బొప్పనదేవునికి లభించినవి.

పడిగము బొప్పదేవుడు, మనుమసిద్ధిమహారాజులవారు అన్యోన్యము 'సమరగాండీవ! కళింగమండలీక ధాటీ సమ్మర్ద' అని పొగడుకొనిరి.

# 28

కాకతీయులకు కాళింగులకు గోదావరీప్రాంతమున యుద్ధము జరిగినదని కాశీకి పోవుచున్న మహామంత్రి తిక్కన గారికి తెలిసినది. ఆ యుద్ధమున మనుమసిద్ధిమహారాజులవారు పాల్గొనినట్లు తెలిసినది. ఆచర్య మహామంత్రిగారికి సముచితమని తోచలేదు.

విక్రమసింహపురరాజ్యమునకు ఉత్తరమున కాకతీయ చక్రవర్తులుండిరి. వారు బలాఢ్యులు. వారు కాళింగులను స్వయముగా జయింపగలరు. వారికి విక్రమసింహపురసహాయ మక్కరలేదు. అప్రతిహతమైన సేనాబలము కాకతీయులది.

విక్రమసింహపురమునకు దక్షిణమున హొయసాల కర్ణాటకులుగాక, పాండ్యులు, పల్లవులు బలమైన శత్రువులు. పాండ్యులకు మధుర రాజధాని. సుందరపాండ్యుడు మహా ప్రతాపశాలి. పల్లవకుల పారిజాతమని ప్రసిద్ధుడైన కొప్పెరుంజింగు కాడవపతి. వారిద్దరకు విక్రమసింహపుర దక్షిణ ప్రాంతమైన కాంచీపురముపై కన్ను కలదు. వారు యోధులు. ప్రజ్ఞాశాలురు. సమర్థమైన చారచతురులు కలవారు.

మనుమసిద్ధి మహారాజులవారు రాజధానిలో లేరని వారు నిమిషములలో కనుగొనగలరు. మహారాజులవారు లేనప్పుడు వారు దండెత్తివచ్చినచో దండనాథులు పురమును పట్టింపలేరు. ఈ అభిప్రాయములు కల మహామంత్రి తిక్కనగారు తమ పరికారములో సమర్థులిద్దరను మనుమసిద్ధి మహారాజులవారి కొక లేఖతో వెనుకకు పంపిరి.

సుందరపాండ్యునికి రాజ్యవిస్తరణకాంక్ష లేదని, అతనికి ధనకాంక్ష మిక్కుటమని, అతడు దండెత్తివచ్చినచో, అతనికి ధనాశచూపి వెనుకకు మరల్పవచ్చునని లేఖలో వ్రాసిరి.

మహామంత్రి తిక్కనగా రభిప్రాయపడినట్లు జరిగినది. మనుమసిద్ధి మహారాజులవా రుత్తరయాత్రకు వెళ్లినట్లు సుందర పాండ్యునకు తెలియగనే బలములను సిద్ధపరచెను. కాంచీపురమును ముట్టడించి వశపరచుకొని విశేషమైన ధనమును దోచుకొనెను.

పాండ్యునకు తృప్తిలేక ఉత్తరమునకు బయలుదేరి పల్లెలను పట్టణములను దోచుకొనుచు విక్రమసింహపురమునకు వచ్చి ముట్టడించెను. దుర్గరక్షకులు కోట తలుపులు మూయించి దుర్గరక్షణకు సిద్ధపడిరి. పెన్నానదీజలముతో కందకములను నింపిరి. యుద్ధము మొదలైనది. కోటలోనివారు అప్రమత్తులై యుండిరి. కోట పాండ్యుని వశముకాలేదు.

ముట్టడి కొంతకాలము సాగినచో కోటలోని ఆహార ధాన్యములు తగ్గిపోవునని - కోటపట్టుబడక తప్పదని పాండ్యుని

ఆశ. కోటచుట్టు నున్న ప్రాంతము పాండ్యుని వశమైనది. కోటను పాండ్యసైన్యములు ముట్టడిచేయుచునే యున్నవి. ముఖ్యావసరవస్తువులు లోనికిపోనప్పుడు కోటవశము కాకతప్పదు.

గోదావరీ తటమున కాళింగులను జయించిన తరువాత మనుమసిద్ధి మహారాజులవారు తిరుగుప్రయాణమును సాగించిరి. విజయోత్సాహమువలన - వేంగీమండలేశ్వరుని ఆతిథ్యము వలన, ప్రయాణములో జాప్యమైనది. వేంగీమండల సైన్యములు స్వస్థానములకు వెళ్లిపోయినవి.

త్రోవలో మనుమసిద్ధి మహారాజులవారికి సుందర పాండ్యుడు తమ రాజధానిని ముట్టడించెనని తెలిసినది. మహారాజులవారివెంట వీరయోధబృందము మాత్రమున్నది. ఈ బృందముతో సుందరపాండ్యుని జయింపగలుగుట కల్ల. అతనిని పారద్రోలుటకు తమకు శక్తిచాలదు. ఆలస్యమైనచో రాజధానినగరము సుందరపాండ్యుని వశముకాక తప్పదు. ఈ ఆలోచనతో గుండ్లకమ్మనది యొడ్డున మకాముచేసి యుండిరి.

ఆ సమయమున మహామంత్రి తిక్కనగారి లేఖ వచ్చి చేరినది. మహారాజులవారికి పరిస్థితులు అవగాహనఅయి కర్తవ్యమార్గము తోచినది. పథకమును నిర్ణయించుకొనిరి.

సుందరపాండ్యుని స్కంధావారము యోధపరివేష్టితమై యున్నది. కోటకు వెలుపలనున్న పేట పాండ్యుని వశమందున్నది. కాని పురములోని జనముపై అతనికి నమ్మకములేదు. పౌరులను తన స్కంధావార సమీపమునకు రానిచ్చుటలేదు.

అతని సైనికదళపతులే పురములోనికిపోయి కావలసిన వస్తువు లను తెచ్చుచుండిరి.

ఒకనాడు తీర్థయాత్రాపరులైన బాటసారులు కొందరు త్రోవవెంట పోవుచుండిరి. వారికి తెలియక పాండ్యుని సేనా గార సమీపమునుండి పోవుచుండిరి. వారిని పాండ్యసైనికులు బంధించి పాండ్యుని ముందుంచిరి. పాండ్యుడు వారిని చాల ప్రశ్నలువేసెను. వారు తమది గోదావరీతీరమని రామేశ్వర యాత్రకు పోవుచుంటిమని చెప్పిరి. గోదావరీతీరమున కాళింగు లకు కాకతీయులకు యుద్ధము జరుగుటలేదా యని పాండ్యుడు ప్రశ్నించెను. కాళింగులను మనుమసిద్ధి మహారాజు కాకతీయులు నశింపచేసిరనియు, పదివేలగజములు, ఇరువదివేల అశ్వములు మనుమసిద్ధి మహారాజునకు కానికలుగా లభించినవని చెప్పిరి. కాకతీయసైన్యములు మనుమసిద్ధి మహారాజులవారి వెంట వచ్చుచున్నవని చెప్పిరి. కాకతీయులు దక్షిణవార్ధి తటము వరకు తమ సామ్రాజ్యమును విస్తరింపవలయునని దృఢసంకల్ప ముతో పెద్దయెత్తున సన్నాహములు చేయుచుండిరని చెప్పిరి.

కాకతీయ సేనలలో రాజనాయకుడు, సోమయనాయ కుడు అయ్యవంశీయుడైన జాయన, సేనాపతులుగా నుండిరని, వారు యోధాగ్రేసరులని చెప్పిరి. వారు మువ్వురు సేనను మూడు విభాగములుగా చేసికొని, ఒక విభాగమును పల్లవుల మీదకు, ఒక విభాగమును పాండ్యనగరమైన మధురానగరము మీదకు, మూడవభాగము చోళరాజధానిమీదకు వెళ్లు

చున్నట్లు వింటిమని చెప్పిరి. హోయసాల కర్ణాటకపాలకుడు కాకతీయుల సార్వభౌమత్వమును అంగీకరించి పాండ్యనగరమును ముట్టడించుటకు తానుకూడ వచ్చుచున్నాడని వింటిమని చెప్పిరి.

ఆ యాత్రికుల మాటలను సుందరపాండ్యుడు వినెను. కాని [illegible]సింపవలెనో లేదో తెలియక తీవ్రాలోచన చేయుచుండెను. యాత్రికులను విడచి పుచ్చెను.

ఆమరునాడు మరియొక యాత్రికుల బృందము ఉత్తర దిశగా పోవుచున్నది. వారినికూడ పాండ్యసైనికులు పాండ్యుని ముందుంచిరి. వారినికూడ పాండ్యుడు ప్రశ్నించెను.

వారు తాము ఉడిపిప్రాంతకన్నడుగులమని, కాశికి పోవుచుంటిమని చెప్పిరి. దేనికి పోవుచుంటిరని పాండ్యుడు ప్రశ్నించెను. తమ ప్రాంతమున బెల్లిగ్రామమున జన్మించిన వాసుదేవభట్టను బ్రాహ్మణబాలుడు బ్రహ్మచర్యమునుండి సన్న్యసించి ఆనందతీర్థులై మధ్వమతమును ప్రచారము చేయుచుండిరనియు, ఆయనకు శృంగేరీశంకరపీఠాధిపతులైన విద్యాతీర్థులవారికి తిరువనంతపురమున శాస్త్రచర్చ జరిగినదని, అప్పుడు మధ్వమతమునకు ప్రమాణవ్యాఖ్యానములు లేని లోటు తెలిసికొనిన ఆనందతీర్థులు మనస్తాపము పొందినవాడై వారణాసి [illegible]ళ్లెనని - అక్కడ ప్రస్థానత్రయభాష్యములు రచించుచుండెనని వారిని దర్శించి క్షేమసమాచారములు తెలిసి

కొని రమ్మని వారి సన్నిహితవర్గమువారు పంపగా పోవుచుంటి మని చెప్పిరి.

హొయసాలరాజ్యము గతు లేమని పాండ్యుడు ప్రశ్నించెను అక్కడ సేనలన సమీకరించుచుంటిరని, పాండ్యనగరమైన మధురాపురమును స్వాధీనము చేసికొనుటకు బయలుదేరుచుంటిరని చెప్పిరి.

వారి మాటలలో విశ్వసింపరానిది పాండ్యునికి గోచరింపలేదు. పూర్ణప్రజ్ఞులైన ఆనందతీర్థులవారు మధ్వాచార్య నామముతో ద్వైతమతప్రచారమునకు పూనుకొనుట తాను విన్నదే. ఆయన తిరువనంతపురమున శృంగగిరిపీఠాధిపతులైన జగద్గురు శ్రీవిద్యాతీర్థులవారితో వాదములు చేసెననియు, తర్కముచేతగాని, శాస్త్రయుక్తులచేతగాని శంకరాద్వైతమును ఖండింపలేకపోయెననియు, తరువాత మరల వారిరువురు రామేశ్వరక్షేత్రమున చాతుర్మాస్యదీక్షను గడపుట తటస్థింపగా - అక్కడ పరస్పరద్వేషములతో, నిందలతో, దూషణలతో, వాతావరణమును కలుషితము చేసిరనియు అతనికి పూర్వము తెలిసిన విషయములే. రామేశ్వర మతని రాజ్యము లోనిదే.

తరువాత మధ్వాచార్యులవారు శ్రీరంగమునకు పోవుట, అక్కడ వైష్ణవులతో సంప్రతించుట, విశిష్టాద్వైతులంతకు పూర్వమే మాయావాదఖండనమునకు అసదృశమైన కృషిచేసియుండిరని గ్రహించి వారిని అభినందించి-కాని విశిష్టాద్వైతులు సృష్టికి భగవంతుడే ఉపాదానకారణమని చెప్పుటను

ఆయన విరోధించి - తరువాత ఉత్తరయాత్రకువెళ్లుట సుందర పాండ్యుడు విన్న విషయములే.

తాను పూర్వము వినిన వివరములకు, ఆయాత్రికులు చెప్పుచున్న దానికి వ్యత్యాసము లేకపోవుటవలన సుందర పాండ్యుడు వారి మాటలను విశ్వసించెను. ఉత్తరమునుండి కాకతీయులు, పశ్చిమమునుండి కర్ణాటకులు - ఏకకాలమున మధురాపురమును ముట్టడింపనెంచుచుండిరని పాండ్యుడు విశ్వసించెను.

కాకతీయులు దక్షిణాప్రాంతమును జయించుటకు రావచ్చునన్న భావమునకు ప్రబలమైన కారణము మరియొకటి కలదని సుందరపాండ్యుడు భావించెను.

విశ్వేశ్వర శివాచార్యులవారు కాకతీయ చక్రవర్తులకు రాజగురువు. ఆయన గోళకీ మఠశైవాచార్యుడు. ఆసంప్రదాయమున కాశ్మీరశైవముయొక్క ఔత్తరాహశైవము యొక్క ముఖ్యాంశము లున్నవి. ఈ సంప్రదాయమున తాత్త్వికసిద్ధాంతమున కర్మకాండలందు శివశక్తి విభాగము లున్నవి. అవి విస్పష్టమైన ప్రత్యేకత కలిగియున్నది. శివశక్తు లకు అభిన్నత సామ్యతచెప్పుచు శివశక్తిసామరస్యమే పరమ సత్యమైన పరతత్త్వమని ఉద్ఘాటింపబడుచుండెను. ప్రకాశాంశ మైన శివునకు విమర్శాంశమైన శక్తికి ప్రత్యేకవిశిష్టతలు. ప్రకాశాంశయనగా ప్రాతీతికబోధయట. మర్శాంశయనగా శివుని యొక్కయథార్థానుభవమట. ఈ సంప్రదాయము వారికి దక్షిణ

దేశమున చాల ప్రదేశములలో మఠములున్నవి. జంబుకేశ్వరములోని అఖిలాండేశ్వరి ఆలయము వారిదే. కాంచీపురములోని ఏకామ్రేశ్వరస్వామి ఆలయము, కామాక్షీదేవి ఆలయము వారివే. ఈమధ్య క్రొత్తగా బలము చేకూర్చుకొనిన రామానుజవైష్ణవులు శైవులకు అశాంతి కలిగించుచుండిరి. తమకు కలుగుచున్న అలజడిని, ఆమఠదేవాలయముల వారు విశ్వేశ్వరశివాచార్యులవారికి విన్నపములు పంపుకొని యుండవచ్చును. రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యులవారు తమ మఠములకు ఆలయములకు శాంతపరిస్థితులు కలిగింపవలెనన్న ఆప్రాంతములను వశము చేసికొనుట ముఖ్యమని భావించి యుండ వచ్చును.

ఈ ఊహాలతో సుందరపాండ్యునికి ఆందోళన ప్రారంభమైనది. ముట్టడి మానివేసి తిరోగమింపవలె నన్న భావము కలిగినది. కాని తాము వెనుదిరిగి పోవుచుండగా వీపు దెబ్బ తీయవచ్చును. ఆలస్యముచేసినచో తమ రాజధానినగరము మధురానగరము శత్రువశము కావచ్చును. ఈ ఆలోచనలతో వేదన పడుచుండగా మనుమసిద్ధి మహారాజులవారి రాయబారి వచ్చెనని దౌవారికుడు చెప్పెను.

రాయబారిని లోని కాహ్వానించి పాండ్యుడు మాట్లాడెను. రాయబారి తాను కోటలోపలనుండి రహస్యద్వారము ద్వారావచ్చితినని చెప్పెను. మనుమసిద్ధి మహారాజులవారు తన్ను పంపిరని చెప్పెను. మూడుదినములకు ముందే మహా

రాజులవారు రహస్యద్వారమున కోటలోనికి వచ్చిరని చెప్పెను. మనుమసిద్ధి మహారాజులవారు చెప్పుమన్న దేమనగా "తెలుగు చోళులకు పాండ్యులకు శత్రుత్వమునకు కారణము లేదు. స్వల్పవిభేదములున్న పరిష్కరించు కొనవచ్చును. యుద్ధమేమి టికి? పగను పగచేత సాధింపలేముకదా? వ్యర్థముగా రక్తపాత మేమిటికి? కాకతీయులు సహాయముగా వచ్చుచుండిరి. ఆసేనలు మూడు దినములలో వచ్చును. అప్పుడు పాండ్యసేనలు రెండు ప్రక్కలందు యుద్ధము చేయవలసివచ్చును. బ్రతికి బయట పడుట కల్ల. ఈలోగా ముట్టడిని విరమించుకొని పోయినచో క్షేమము. తెలుగు చోళభూపతుల మైత్రికూడ లభించును. మైత్రి చిహ్నముగా మనుమసిద్ధి మహారాజులవారు కానికలు పంపుటకు సిద్ధముగా నుండిరి.

ఈరాయబారము సుందరపాండ్యునకు అనుకూలముగా నున్నది. తాము పరాజయముపొంది వెళ్లుటలేదు. కానికలు గైకొని వెళ్లినప్పుడు సిగ్గుపడవలసినది లేదు. అంతేగాక కాక తీయులవలన కర్ణాటకులవలన తమ రాజధాని ముట్టడింపబడు టకు ముందే తాము నగరమును చేరవచ్చును. రాయబార మును పాండ్యుడు అంగీకరించెను.

ఆసాయంకాలమే మనుమసిద్ధి మహారాజులవారి కాను కలు సుందరపాండ్యునికి చేరినవి. పాండ్యుడు ముట్టడిని మాని సేనలను తరలించుకొని పోయెను. తాను తెలుగుచోళులను జయించి పోవుచుంటినని కాకతీయులను కూడ జయించి ఓడు

గల్లును స్వాధీనముచేసి కొనగలనని ప్రతాపోక్తులు పలుకుచు తిరోగమించెను.

పాండ్యసేనలు తిరోగమించుటకు కారణము కోటలోని వారికి తెలియలేదు. ఏదో పెద్ద యెత్తుమీద పాండ్యుడు వెళ్లి యుండునని తిరిగి రహస్యముగా రావచ్చునని దుర్గపాలకుడు భావించెను. అతడు బురుజుమీదనెక్కి తిరోగమించుచున్న పాండ్యసేనలను చూచుచుండెను. చాలసేపు చూచెనుగాని వారు తిరిగివచ్చు భావములున్నవారివలె తోచలేదు. ఇంతలో కోట ముఖద్వారము వద్ద జయజయధ్వనులు వినిపించినవి. చూడగా మనుమసిద్ధి మహారాజులవారు వీరయోధపరివేష్టితులై యుండిరి. వెంటనే కోట తలుపులు తెరువబడినవి. మహారాజులవారికి స్వాగతములు నివేదింపబడినవి.

దుర్గమును కాపాడిన దుర్గపాలకుని, సైనికులను, మహారాజులవారు అభినందించి సమ్మానించిరి. తమవెంట గోదావరీ తీరమునకువచ్చి కాళింగులతో యుద్ధముచేసి విజయముచేకూర్చిన వీరవరులను సమ్మానించిరి. సుందరపాండ్యుని సేనలను తిరోగమించునట్లు చేయుటకు ప్రయత్నించి గుప్తవేషములతో పథకమును చాతుర్యముగా నిర్వహించిన అనుచరవర్గమును సమ్మానించిరి. గోదావరీతీరయుద్ధమున, పాండ్యునితో యుద్ధమున తమ్ము రక్షించిన తమ యిలువేల్పు శ్రీరంగనాథస్వామివారికి బ్రహ్మోత్సవములు చేయించిరి.

ఖడ్గతిక్కనగారి భార్య పాలికలసమీపమున దేవతగా వెలసి దేవాలయము కట్టించుకొని గ్రామదేవతయైనది. ఆమె మహాకాళి అవతారమని రాత్రిపూట కాళికాదేవియై సంచరించు చుండునని వదంతులు ప్రబలి జనమాదెసకు పోవుటమానిరి. మహారాజులవారి గుప్తయోధులకా ఆలయము ఆశ్రయమిచ్చినది. ఆమెకు తిరునాళ్లు చేయించిరి. పసపు ఉత్సవం, కుంకుమ ఉత్సవం, పుష్పోత్సవం, గంధోత్సవం, వస్త్రోత్సవం, ఫలప్రధానోత్సవం ఆరు దినముల తిరునాళ్లు జరిపిరి. ఆమె ఆరు దినములు పాలికలలోనున్నందుల కారుదినముల ఉత్సవములు. ప్రతి సంవత్సరము జరుపుటకు కట్టడులుచేసిరి. మొదటిదినము ఉత్సవము పుట్టింటి వారితరఫున రాజకుటుంబము వారిది. రెండవ దినము ఉత్సవము కొట్టరువువారిది. మూడవదినము ఉత్సవము పౌరజనులది. నాలుగైదు దినముల ఉత్సవముల అశ్వికదళ పదాతిదళముల వారివి. ఆఖరి దినము ఉత్సవము సువాసినీ జనముది.

## 29

మనుమసిద్ధిమహారాజు సింహాసనమునకు వచ్చిన రెండవ నాడు సిద్ధవటము మండలేశ్వరుడు రక్కెస గంగడు దేశము నుండి బహిష్కరింపబడెను. రక్కెస గంగడుపౌరుషవంతుడు, ఖడ్గజీవి. తిరిగి తనరాజ్యమును తాను సంపాదించుకొనవలెనన్న ఆశకలవాడు. ఆశకు తగినంత సాహసముకలవాడు. ప్రయత్నశీలి.

అతడుపోయి కాకతీయచక్రవర్తిని ఆశ్రయింపవలెనని భావించెను. కాని కాకతీయులకు గంగయసాహిణిపై వాత్సల్యమున్నది. విక్రమసింహపురచోళరాజులందు మైత్రి కలదు. కాకతీయులు తన్ను ఆదరింపరని రక్కెస గంగన గ్రహించెను.

అద్దంకి పాలకులు నామమాత్రావశిష్టులు. వెలనాటి పృథ్వీశ్వరుని తరువాత వెలనాడులో సమర్థుడగు పాలకుడు లేడు. వేంగినాడు కాకతీయుల మండలమైపోయినది. ఆంధ్ర ప్రాంతమున తనకు ఆశ్రయమీయగలసామంతుడు లేడని గ్రహించెను. అతని దృష్టి దక్షిణమునకు మరలినది.

హొయసాల కర్ణాటకులు క్రొత్తగా తెలుగు చోళులతో స్నేహమును కట్టిరి. తనకై వారు మనుమసిద్ధిమహారాజుతో పగపూనరు. చోళదేశప్రభువు రాజేంద్రచోళుడు. అతడు బలహీనుడు. వాని మనుగడ విక్రమసింహపుర రాజన్యులమీద అధారపడియున్నది.

తనకు ఆశ్రయమీయగలవాడు చేదిదేశపాలకుడు కాడవపతి. పల్లవరాజు హిరణ్యవర్మకు కాడవకులమువాడని పేరువచ్చినది. అతని సంతతివారికి కాడవులనిపేరు కలిగినది. కాడవపతికి పల్లవకుల పారిజాతమని, కాడవకుల చూడామణి యని, క్షీరాపగాదక్షిణనాయకుడని, కావేరి కాముకుడని బిరుదము లున్నవి. అతడు మల్లాపురవల్లభుడు. మహాబలి పురమునకు మల్లాపురమనిపేరు. మహారాజసింహ అను

అర్థముగల కోప్పెరుంజింగు అను బిరుదు ముఖ్యమైనది. కాడవ పతులకు విక్రమసింహపురప్రభువులతో బద్ధవైరమున్నది. ఒక యుద్ధమున మనుమసిద్ధిమహారాజులవారి తండ్రి నేటి కాడవ పతి తండ్రిని జయించి కప్పము తీసికొనెను. ఆనాటినుండి కాడవపతులు విక్రసింహపురరాజులను లామొకసారి జయింప వలెనన్నపట్టుదల కలిగియున్నారు. కాడవపతి తన కాశ్రయ మీయఁగలడని రక్కెస గంగని కాశ కలిగినది.

రక్కెస గంగన పోయి కాడవపతిని దర్శించి తన గోడు చెప్పికొని ఆశ్రయమును అర్థించెను. కాడవపతి ఆశ్రయ మిచ్చెను. రక్కెస గంగన వీరుఁడు. తన పరాక్రమమువలన కాడవపతి విశ్వాసమును తేలికగా సంపాదించుకొనగలిగి రాజోద్యోగులలో ప్రముఖుడయ్యెను.

రక్కెస గంగనకు విక్రమసింహపురమున మిత్రులుండిరి. వారివలన అతని కచ్చటి వార్తలు తెలియుచున్నవి. ఖడ్గతిక్కన గారు మరణించుట, ఆయన భార్య సహగమనము చేయుట, మహామంత్రులవారు క్రతువులుచేయుట, మహాభారతరచనము చేయుట, పురప్రవేశముచేసిన నాటిరాత్రి ఆయనకు కళత్ర వియోగము కలుగుట అతనికి తెలిసినవి. మహామంత్రుల కాశీయాత్ర అతనికి తెలిసినది. ఖడ్గబల, బుద్ధిబల విహీనమై విక్రమసింహపురము శత్రువులకు వశము కాగలస్థితియం దున్నదని గ్రహించెను.

కొప్పెరుంజింగమహారాజుతో వివరములు ప్రస్తావించి, సేనలను సన్నద్ధము చేయుటకు పురికొల్పెను. రక్కెస గంగన మారువేషముతో విక్రమసింహపురము చేరెను. అతనికి తెలియని వీథి లేదు. సత్రములేదు. మనుమసిద్ధిమహారాజుల వారికి పూర్వము కుందమాదేవి ప్రియురాలని, తరువాత త్యజింపబడినదని అతడు తెలిసికొనెను. ఆమె తనకు సహాయము చేయవచ్చునని ఆశ కలిగినది. అక్కన బయ్యనలను గురించి కూడ అత డెరుగును. వారితో పరిచయము లేదు. వారు మనుమసిద్ధిమహారాజులవారికి సన్నిహితజ్ఞాతులు. వారిప్పుడు రాజాశ్రయము పోగొట్టుకొనినారనియు, జ్ఞాతివైరము కలవారనియు, రక్కెస గంగనకు తెలియును. వారి సహాయమును కూడ రక్కెస గంగన గణించుకొనివచ్చెను.

రక్కెస గంగన గుప్తవేషముతో వచ్చి సత్రమున బస కుదుర్చుకొనెను. తాను రత్నముల వ్యాపారిననియు, కావేరీ తటప్రాంతమువాడననియు చెప్పికొనెను. విక్రమసింహపుర రాజన్యులు రత్నప్రియులని తెలిసి వారికి కొన్నిరత్నములను విక్రయము చేయవలెనను ఆశతో వచ్చితినని - కాని ఖడ్గ తిక్కనగారి మరణమువలన - మహామంత్రుల కాశీప్రయాణము వలన మహారాజులవారు చింతాక్రాంతులుగా నుండిరనియు అందుచేత తనకు ప్రభువులవారిదర్శనము లభించుటకు ఆలస్యమౌతున్నదనియు చెప్పుకొనుచుండెను. సత్రమున వసతి. పూటకూళ్లింట భోజనము. ప్రాతస్సాయంకాలములందు

వ్యాహ్యాళినెపముతో రహస్యస్థానముల పరిశోధనము. తన్ను విడనాడని పూర్వమిత్రులందు ముఖ్యులతో నిశాకాలమున మంతనములు. కొన్ని దినము లిట్లు గడచినవి.

అతని అదృష్టము పండుటకు వచ్చినది. వీరయోధులతో మనుమసిద్ధిమహారాజులవారు కాళింగులపై యుద్ధమునకై గోదావరీనదీతీరమునకు వెళ్లిన రహస్యసమాచారము తెలిసినది. అప్పుడు కొప్పెరుంజింగు దండెత్తివచ్చిన బాగుండుననని రక్కెస గంగన ఊహ. కాని తానింకను కొన్ని భేదాభిప్రాయములను కల్గింపవలసియున్నది. కొంత వ్యవధి కావలసియున్నది. అతడు విస్తృతముగా వలలు పన్నెను. కోటలోని సేనాపతులలో, సైనికులలో ప్రభుభక్తిలేనివాడు దొరకలేదు. తనకు మిత్రులైనవా రల్ప ఉద్యోగులు.

రక్కెస గంగన ప్రతిదినము శ్రీరంగనాథస్వామివారి ఆలయమునకు పోవుచుండెను. ఒకనాడు మేనాలో కుందమాదేవి ఆలయమునకు వచ్చినది. ఆమె రక్కెస గంగనకు కనుపించినది. ఆమె సౌందర్యవతి. పదును చెక్కిన మన్మథుని బాణము వలె నున్నది. రక్కెర గంగన చలించిపోయెను.

ఆసాయంత్రమే రక్కెస గంగన వేశ్యావాటికకు వెళ్లి కుందమాదేవి మందిరమునకు పోయెను. ముందుగా తార సిల్లినది వేశ్యమాత. ఆమె వృద్ధ. అనుభవజ్ఞురాలు - రక్కెర గంగని చూడగానే రాజపురుషుడని గ్రహించినది. పూర్వము కుందమాదేవి మహారాజులవారికి ప్రియురాలు. కావున అన్య

పురుషు లామెమందిరమునకు వచ్చుటకు భయపడుదురు. ఆమె మహారాజులవారికి దూరమైపోయినదన్న వార్త లోకమున కాలస్యముగా తెలిసినప్పటికి - మరల ఆమెకు రాజాదరణము కలుగవచ్చునని, ఆమెను వాంఛించినవారు మహారాజులవారి ఆగ్రహమునకు లోనుకావలసివచ్చునని లోకుల భావనలు. ఆభావములకు వేశ్యమాత ప్రచారమే కారణము. మహారాజులవారు మరల తమ మందిరమునకు రాబోవుచున్నారని ఆమె నిత్యప్రచారము చేయుచున్నది.

మహారాజులవారి నిరాదరణ. అన్యపురుషు లెవ్వరును రారు. ఆమె వారకాంత. యౌవనవతి. పురుషస్పర్శలేక వ్యథ పొందుచున్నది. కుమార్తెకు వృత్తి లోపమగుచున్నదని వేశ్యమాత కుందుచున్నది. ఇట్టిస్థితిలో కుందమాదేవి మందిరములోనికి రక్కసగంగని రాక పండువెన్నెలలు కురిసినది. అతనికి రాజోపచారములతో వేశ్యమాత స్వాగతము చెప్పినది. మహాప్రభువులవారిని సంబోధించినది.

కుందమాదేవి సర్వాలంకార శోభితయై, అతనిని అలరించినది. అతడు స్వర్గసుఖ మనుభవించినట్లు ఆనందించెను. అతడు కుందమాదేవిని ప్రశ్నించెను. "నేను రత్నవ్యాపారినని చెప్పుచుండగా మీరు నన్ను రాజపురుషునిగా సంబోధించెద రేల? విటులెవ్వరైన సంబోధనమిదేనా?" అని నవ్వెను. ఆమె గల్లున నవ్వినది. "మీకు నిజముగా సమాధానము కావలెనా?" అని చిలిపిగా చూచినది. అతడు "వినవలెనని యున్నది." అనెను.

ఆమె "ఇది మావృత్తి రహస్యము. చెప్పకూడనిది. మీరు కోరుచుంటిరి గాన చెప్పుచున్నాను. మీరు చూడుడు. యుద్ధ భూమిలో ప్రవేశించినప్పుడు, శత్రువు ఖడ్గమును ధరించిన తీరునుబట్టి, గుఱ్ఱముపై కూర్చొనిన, తీవినిబట్టి. అశ్వలాఘువమును బట్టి, అతని వీరత్వమేపాటిదో తెలియును. అట్లే మీకు బహు స్త్రీపరిచయమున్నప్పుడు, కులస్త్రీ యెవ్వతెయో, శీలవతి యెవ్వతెయో, జారిణి యెవ్వతెయో విస్పష్టముగా తెలియును. అట్లే బహుపురుష పరిచయమున్న మాతల్లికి - విటులలో బ్రాహ్మణు డెవ్వడు, రాజపురుషు డెవ్వడు, రాజోద్యోగి యెవ్వడు, వ్యాపారి యెవ్వడు? వంటివి కరతలామలక విషయములు. అంతేగాక శృంగారానుభవ సమయమున రాజపురుషుని శృంగార మొక విధము. వారు అలంకారప్రియులు. అంతయు రాజఠీవిగా జరుగవలెను. బ్రాహ్మణశృంగారము మరియొక విధము. అది శౌచప్రధానమైనది. అంతయు శుచిగా కనుపింప వలెను. వారి శృంగారములో తీవ్రత్వముకంటె శుద్ధత్వ మెక్కువ. మీతో నాకు కలిగిన అనుభవముచలన మీరు రాజ పురుషులని నేను నిర్ధారించుచున్నాను." అని చెప్పి ఆలింగనము చేసికొనినది.

ఆమె కామశాస్త్ర పాండిత్యమునకు రక్కసి గంగన ఆశ్చర్యవిభ్రాంతు డయ్యెను. రణరంగ పాండిత్యమువలె అనంగ రంగపాండిత్యముకూడ గాఢమైనదని గ్రహించెను. మీ రెవ్వరో నిజము చెప్పుడన్నదామె. అది రాజకీయమైన రహస్య

మైనచో గుప్తముగా నుంచెదనని ప్రమాణముచేసినది. అతడు తరువాత చెప్పుదునని బయటపడెను.

ప్రతిదినము కుందమాదేవి రక్కెసగంగని ప్రశ్నించు చున్నది. బలవంతము చేయుచున్నది. బ్రతిమలాడుచున్నది. తనకు తెలియని రహస్యమేదో సన్నిధిలో నున్నదని తెలిసి నప్పుడు దానిని తెలిసికొనుటకు ప్రయత్నముచేయకుండ స్త్రీ నిలువదు. కుందమాదేవి తన రహస్యమును కాపాడగలదని, ఆమెవలన తనపథకము ఫలించునని నిశ్చయించుకొని రక్కెసగంగన ఆమెకు తనవిషయములు చెప్పుటకు ప్రారంభించెను.

తాను చేదిమహారాజుల సామంతుడు. రాజపురుషు డన్నమాట నిజమే. చేదిమహారాజులకు విక్రమసింహపుర రాజులకు శత్రుత్వము పూర్వమునుండి వచ్చినది. తిక్కదేవ చోడ రాజు చేదిరాజులనుండి కప్పమును గ్రహించినవాడు. చేది రాజులు మరల స్వతంత్రులైరి. పూర్వముపొందిన అపజయ మును తుడిచివేసికొనుటకై వారు విక్రమసింహపురరాజును జయించి కప్పమును గైకొనవలెను. అప్పుడు వారికి తృప్తి. వారి తరఫున తాను వచ్చి రహస్యములు తెలిసికొనుచుండెను. తాను తెలిసికొనిన రహస్యములలో ముఖ్యమైనది విక్రమ సింహపురమున అమూల్యమైన సౌందర్య రత్నమున్నదని. ఆ రత్నముపేరు బంగారము. ఆ మాటలకు కుందమాదేవి ఫకాలున నవ్వినది.

అతడు మరల "మాప్రభువులవారు విక్రమసింహపురమును జయించిన తరువాత—యిక్కడ దొరకిన రత్నముగా నిన్ను నేను తీసికొనిపోయెదను. నేను రత్నవ్యాపారిని కదా! నీ కిష్టములేనిచో విక్రమసింహపురమందే నా దానిగా నుండిపోవచ్చు" అనెను. కుందమాదేవి విభ్రమముతో "మీరు కూడా ఇక్కడనే ఉండండి. ఈ రాజ్యాన్ని మీరే తీసికొనండి. నాకు మహారాజులవారికి పట్టమహిషిగా ఉండాలన్న కోరికను తీర్చండి" అనినది. ప్రాధేయపడినది. అతడు "నీకోరికను నేను తీరుస్తాను. నాకోరికను నీవుతీర్చు" అని దగ్గరకు చేర్చుకొనెను. ఆమె "ఇది యెప్పుడు తీరుస్తున్నకోర్కెయే కదా!" అన్నది.

విక్రమసింహపురమును బాహుబలముతో జయించుట కష్టము. ఇచ్చట ప్రతిసైనికుడు ఖడ్గతిక్కనగారి శిష్యుడే. ఇతర రాజ్యములందు సైనికుల కింత ఖడ్గవిద్య తెలియదు. ఇక్కడ మహారాజులవారు స్వయముగా మహాయోధుడు. ఆయన ఖడ్గతిక్కనగారి శిష్యులలో ముఖ్యుడు. బాహుబలముతో జయించుటగాక మరియొక యుపాయమును చూడవలసి యున్నది. పన్నాగముతో పథకముతో వీరిని లోబరచుకొనుట తేలిక. ఆపథకమును రక్కెసగంగన అన్వేషించుచుండెను. ఆపథకములో కుందమాదేవి నిర్వహింపవలసిన పాత్రయున్నది. అతడావిషయ మామెకు చెప్పి ఉత్సాహమును కలిగించెను.

కొలది దినములకే సుందరపాండ్యుని సేనలు విక్రమసింహపురమును ముట్టడించినవి. ఆసమయమున రక్కెసగంగన

కోటలోనే యుండెను. ఆముట్టడిని, దాని ప్రతిఘటనను కను లారచూచెను. విక్రమసింహాపురము వారి ప్రతాపము, వారి ప్రభుభక్తి విశ్వాసములు, యుద్ధచాతుర్యము, మరియొకసారి రక్కసగంగనికి కనులకుకట్టినవి. వీరితో కలియబడి రణరంగమున చేవి సైనికులు జయింపలేరు. కత్తిపట్టుట నేర్చిన ప్రతివాడును ఖడ్గతిక్కనవలె నుండెను. వంచనావిధాన మవలంబింపకతప్పదని తెలిసెను. తనకు సహాయముచేయగల ఉన్నతోద్యోగి లేడు. ఇక్కడివారి ప్రభుభక్తి దేశభక్తిగొప్పవి. మహామంత్రి తిక్కన గారు మహాభారతము రచించిన నాటినుండి వీరికి భాషాభక్తి కూడ ప్రబలినది. ఆంధ్రులందరు కలసి ఆంధ్రావళియట. వారిది ఆంధ్రావనియట. మహామంత్రి తిక్కనగారు కాశీ యాత్రనుండి తిరిగి వచ్చినచో—వారు తన ఉనికినికూడ పసి కట్టగలరు. ఆయన కాశీనుండి తిరిగిరాకమునుపే తన పనిని ముగింపుచేయవలెను. చక్కదిద్దు కొనవలెను. ఇట్టి ఆలోచనలే రక్కసగంగన చేయుచుండెను.

రక్కస గంగన తీవ్రమైన ఆలోచనలే చేసెను. ఆంధ్రు లకు ప్రభుభక్తి దేశభక్తులతోపాటు భాషాభక్తి ప్రబలుచున్న కాలమున వారు అన్యభాషాప్రభువులను సహింపరు. వారికి ఆంధ్రుడే ప్రభువు కావలెను. అదేవంశమువారున్నచో చాల మంచిది. మనుమసిద్ధిమహారాజును సింహాసనభ్రష్టుని చేసినప్పటికి ప్రజలు ఆరాజును కొలువరు. తిరుగుబాటు చేయుదురు. సంహరింతురు. ప్రజలకు మధురాంతక పొత్తపి చోళదేవ

కుటుంబముపైన భక్తివిశ్వాసము లున్నవి. కావున మనుమసిద్ధి మహారాజుల జ్ఞాతులైన అక్కన బయ్యనలలో నొక్కని రాజుగాచేసి అతిస్వల్పప్రాంతము వారి కీయవచ్చును. రాజ్యమున మిగిలిన భాగము తానుగ్రహించి సిద్ధవటము ముఖ్యపట్టణముగా పరిపాలింపవచ్చును. కొంతకాలము చేసిరాజునకు సామంతుడైయుండి త్వరలో స్వతంత్రుడు కావచ్చును. కుందమాదేవిని సిద్ధవటమునకు తీసికొనిపోవచ్చును. కాని అక్కన బయ్యనలు అసమర్థులు. వారివలన సాధింపగల కార్యమున్నదా? వారిని సమకూర్చుకొనిన ప్రయోజన మున్నదా. ప్రజల ప్రభువంశభక్తిని తృప్తిపరచుటకు. ఐతే అక్కన బయ్యనలను తనవైపు త్రిప్పుకొను టెట్లు?

అక్కన బయ్యనలను విశ్వసింపవచ్చునా? వారిని కలసి మాటాడినచో విషయములు మార్గమునకు రావచ్చును. ఈ ఆలోచనలతో రక్కెర గంగన అక్కన బయ్యనలను కలుసుకొనుటకు ప్రయత్నించెను. అపని తేలికగా జరుగలేదు.

అక్కన బయ్యనలు విచిత్రమైనవారు. వారికి మహారాజులవారి కందానుండి భోజనమువచ్చును. రాచనగరులో వారిద్దర కొక గృహము. స్వల్పపరివారము. సాధారణముగా వా రిల్లు కదలిరారు. ఎల్లప్పుడు త్రాగియుందురు. వారిని కలియుటకు మార్గములేదు. త్రాగినప్పుడు మాటాడుస్థితిలో నుండరు. రహస్యములు మాటాడు టెట్లు?

అక్కన బయ్యనలకు సేవకు లిద్దరు. ఒకడు వృద్ధుడు. రెండవవాడు యువకుడు. వాడు రక్కసగంగనికి నాలుగైదు పర్యాయములు తటస్థపడెను. ఒకసారి రక్కసగంగన వానిని పలుకరించి "ఓయి! నీవు శ్రీఅక్కదేవ మహారాజులకు శ్రీబయ్యదేవమహారాజులకు పరివారముఖ్యుడవా ?" అని ప్రశ్నించెను. తన కెన్నడు లేని మర్యాదను చూపినందులకా యువకుడు సంతోషపడి "చిత్తము. ఏమి ఆజ్ఞ" అని చేతులు జోడించెను.

రక్కసగంగన వానితో తాను శ్రేష్ఠమైన మద్యములను ద్రాక్షపానీయములను తయారుచేయువాడనని - తన దగ్గర ఉత్తమమైన దివ్యాసవములున్నవని- వానినిఆపురములో పసందుచేయగలవారే లేరని - అక్కనదేవమహారాజులు, బయ్యనదేవ మహారాజులు ఆసవప్రియులని విన్నానని - వారికి తన ఆసవములను కొంచెము చూపించిరమ్మని-వారికవి బాగున్న యెడల తానువచ్చి దర్శనముచేసి కొందునని చెప్పి అద్భుతమైన ఆసవముల నిచ్చిపంపెను.

ఆ పరిచారకుడు కొండెక్కినంత సంతోషపడెను. ఆసవములను తీసికొనిపోయి అక్కన బయ్యనల కిచ్చెను. వారి ఆనందమునకు మేరలేదు. ఆమరునాడు వారే వచ్చి రక్కసగంగని దర్శించిరి. వారి రాకపోకలు కొన్నిదినములు జరిగినవి. ఆసమయమున కోటపాంచ్యని ముట్టడిలో నున్నది. కోటలోని వారందరిదృష్టి ఆవిషయమునందే లగ్నమైయున్నది. వారెవ్వరు అక్కన బయ్యనలు సత్రమునకు చేయుచున్న రాకపోకలను

గమనింపలేదు. పట్టించుకొనలేదు. సత్రములో రాజకీయములను చర్చింపరాదని రక్కెసగంగకు తెలియును.

రక్కెసగంగన అక్కన బయ్యనలను కుందమాదేవి మందిరమున కాహ్వానించెను. వారామెను చిన్నప్పుడు చూచిరి. ఆమె మహారాజులవారి ప్రియురాలైన తర్వాత వారికంట పడలేదు. ఆమెను చూడగా వారికి గంగవెఱ్ఱు లెత్తినవి. వారికి నిషాతగ్గి లౌకికప్రవృత్తి ప్రబలినది.

వారు కుందమాదేవి సౌందర్యమును త్రావివేయునట్లు చూచుట రక్కెసగంగన కిష్టములేదు. కాని ఆమె పారకాంత. ఆమె సౌందర్యమందరకు అందుబాటునందున్నది. తా నసూయపడరాదు. పైగా తాను రాచకార్యములను సాధించుకొనవలసియున్నది. అది చాల ముఖ్యము. ఆమెను వా రేమిచేసినను పట్టించుకొనరాదు. ఆమె వ్యతిరేకత చూపనంతవరకు భయవాలేదు.

అక్కన బయ్యనలకు రక్కెస గంగన తన పథకమును వివరించిచెప్పెను. వారు తాను చెప్పినట్లు కార్యమును చక్కదిద్దినచో - వారిద్దరలో వారు కోరుకున్నవారు విక్రమసింహపురమునకు రాజు కావచ్చును. అయితే తాను సహాయము చేయుచుండెను. కాబట్టి తనకు సామంతుడై యుండవలెను. ఈపథకమునకు వా రంగీకరించిరి. కాని "మేము దేహీ దేహన్యాయముగానున్న అన్నదమ్ములము. మాలో నొక్కరు మాత్రము మహారాజగుట మా కిష్టములేదు. మే మిద్దరము

కలసి రాజ్యము చేయుదుము. ఇద్దరము మహారాజులమే” అని చెప్పిరి. రక్కసగంగన ‘అట్లే కానివ్వండి’ అని నవ్వెను.

వారు “మరియొక సంగతి కలదు. మేమిద్దరము సంయుక్తముగా మహారాజపదవీస్థులము. మాకిద్దరకు కలసి కుందమాదేవి పట్టమహిషి” అనిరి. వారిద్దరు కలసి-ఏకస్త్రీని వాంఛించుట రక్కసగంగని అసహ్యమైనది. కాని తనది రాచకార్యము. అందుచేత ‘కుందమాదేవి అంగీకరింపవలదా?’ అని ప్రశ్నించి ఆమె దిక్కుగా చూచి మందస్మితము చేసెను.

కాని కుందమాదేవి చెప్పిన సమాధానము రక్కసగంగని ఆలోచనలను తలక్రిందులు చేయడమేగాక - అతనిని ఆశ్చర్యములో ముంచినది. అతని కసలు స్త్రీప్రకృతి-వెలయాలు ప్రకృతి తెలుసునా యనిపించినది. కుందమాదేవి మందస్మితముతో - ఠీవితో - అప్పుడే పట్టమహిషి అయినవిధముగా సమాధానమును చెప్పినది. “సాధారణముగా రాజ్యమునకుండునది రాజొక్కడే. కాని వీరిద్దరుకలసి - ఏకకాలమున రాజుగా వ్యవహరింతుమనుచున్నారు. అనగా రాచపదవి యొక్కటే. ఒక్క పదవిని అసాధారణముగా - యిరువు రనుభవించుచుండి రన్నమాట. పట్టమహిషి పదవికూడ యొక్కటే. ఆపదవిని తా నొక్కతే నిర్వహింపును. అనగా అసాధారణపరిస్థితులలో ఆయిద్దరుకలసినఒకరాజునకు - ఒకస్త్రీపట్టమహిషిగానుండుటలో అసందర్భము లేదు.” ఆమె చెప్పిన సమాధానమున “ఏమైనా సరే! నేను సింహాసనముమీద పట్టమహిషిగా కూర్చుని తీరు

తాను. పట్టమహిషి పదవిని చేపట్టి తీరుతాను. దానిని పోగొట్టు కొనను." అన్న తీవ్రాభిప్రాయ ముద్యోతకమైనది. రక్కసగంగన "ఇది ధర్మమా" అనునట్లు ప్రార్థేయపూర్వకమైన చూపులు చూచెను. ఆమె "పంచపాండవులు అయిదుమంది కలసి పట్టాభిషేకము చేసికొనలేదా! వారందరు కలసి ద్రౌపదీ దేవిని ఒక్కతెనే పట్టమహిషిగా స్వీకరింపలేదా?" అని కను బొమ లెగురవేసినది.

అక్కన బయ్యనలు అప్పుడే తమకు సింహాసనము లభించి నట్లు తమ్ము కుందమాదేవి వరించినట్లు పరవశులైపోయి - ఆమెను చెరియొక ప్రక్క ఆలింగనము చేసికొనిరి. ఏదో చేయి జారిపోయినట్లు దిగాలుపడి రక్కసగంగన దీనముగా చూచెను. అతనికి కుందమాదేవి హృదయము అవగాహన కాకపోయినను, ఆమె కతని హృదయము అవగాహన అయినది. అతనితో అనునయింపుగా "మీరు దిగాలుపడి రాచకార్యములను విస్మరింపకుడు. నేను నిజముగా మిమ్ము విస్మరింపను. నేను ద్రౌపది నైనప్పుడు మీరే ధర్మరాజు. వీరిద్దరు భీమార్జునులు." అని హసించినది. నెమ్మదిగా ఆతని చెవిలో 'వీరిద్దరు బృహన్నలావతారములే. త్రాగినప్పుడు వరాహావతారములు. బహిరంగముగ సింహాసనముమీద వీరికి నేను పట్టమహిషిని. నేను మీ మనిషిని. నేను కూడ సింహాసనము మీద ఉండుటవలన అధికారము మన చేతులందే ఉండి పోవును." అని చెప్పి సముదాయించినది.

## 30

రక్కసగంగన పథకము వేరులు పాతుకున్నది. అతనికి మార్గము దొరకినది. చేయవలసిన సన్నాహములు చేయు చుండెను. అనుకూల పరిస్థితులు వచ్చినట్లు సుందరపాండ్యుని సేనలు ముట్టడి చాలించి వెళ్ళిపోయినవి. మనుమసిద్ధి మహా రాజులవారు తిరిగి పురప్రవేశముచేసిరి. విజయోత్సవములు జరిగినవి. బ్రహ్మోత్సవములు జరిగినవి. తిరునాళ్లు జరిగినవి.

ఆ ఉత్సవములలో రక్కసగంగని ప్రోద్బలముతో అక్కన బయ్యనలు పూర్వమెప్పుడు లేనంత యుత్సాహముతో పాల్గొనిరి. మనుమసిద్ధి మహారాజులవారు గోదావరీతీరమున సాధించిన విజయము సుందరపాండ్యుని పారద్రోలిన విజయము తమకు మహదానందమును కూర్చినదని ప్రకటించిరి. తమకు అఖండమైన ప్రభుభక్తి కలదని ప్రచారముచేసికొనిరి. తమ ప్రభువులవారిసేవలో తా మెటువంటి సాహసకార్యమునకైన సిద్ధమేనని ప్రకటించుకొనిరి. వారి ప్రచారమువలన రాజో ద్యోగులు వారిని గౌరవించుట మొదలిడిరి. క్రమక్రమముగా మహారాజులవారి సమక్షమునకు పోవుటకువీలై, వారి సన్ని ధిలో మర్యాదలభించినది. వారిద్దరు ప్రభుభక్తి పరాయణులని విశ్వాసపాత్రులని మహారాజులవారు కూడ విశ్వసించి వారిని దగ్గరకు రానిచ్చిరి.

మనుమసిద్ధి మహారాజులవారు చేయించిన విజయోత్స ములు, బ్రహ్మోత్సవములు తిరునాళ్లు ముగియునప్పటికి మరల

అక్కన బయ్యనలు మహారాజులవారికి ముఖ్యులై, కావలసిన వారై, అత్యంతాప్తులై పోయిరి.

ఒకనాడు ఉదయగిరి ప్రాంతపాలకుడువచ్చి మహారాజుల వారి దర్శనముచేసి మనవి చేసికొనెను. పరిసరారణ్యములలో వన్యమృగముల బాధ మిక్కిలిగా నున్నదని, పంటలు చెడి పోవుచున్నవని ప్రజలు మొరపెట్టుకొను చుండిరని చెప్పెను. సన్నిధానవర్తులైన అక్కన బయ్యనలు మహారాజులవారిని మృగయావినోదమునకు ప్రోత్సాహపరచిరి. మహారాజుల వా రంగీకరించిరి. కొంత పరివారముతో ఉదయగిరి ప్రాంతా రణ్యములకు వేటకు బయలుదేరిరి. మహారాజుల వారివెంట అక్కన బయ్యనలు కూడ నుండిరి.

రక్కెసగంగనికి ఉదయగిరి ప్రాంతపాలకుడు బంధు కోటిలోనివాడు. గుప్తవేషముతో కుందమాదేవిని వెంటబెట్టు కొని రక్కెసగంగన ఉదయగిరి దుర్గమునకు ముందే చేరెను.

మనుమసిద్ధి మహారాజులవారు పరివారసహితముగా ఉదయగిరి ప్రాంతాటవులకు చేరి, అడవిలో గుడారములను నిర్మించుకొని మృగయావినోదమునం దుండిరి.

మొదటినాడు సన్నిహితప్రాంతములకు పోయివచ్చిరి. వేట బాగుగా సాగినది. రెండవ దినము మరికొంత దూరము పోయిరి. మూడవ దినమున దూరములో మానవమాంసాశన యైన పెద్దపులి సంచరించుచున్నదని వార్తలు వచ్చినవి. దానికి మాటుపెట్టించి ప్రయాణమై చనిరి. కొంతదూరముపోగా మహా

రాజుల వారివెంటనున్న పరివారము తప్పు త్రోవపట్టినది. అక్కన బయ్యనలు మాత్రమే మహారాజులవారి వెంటనుండిరి. ఒకరు ముందు మరొకరు వెనుకనుండి మహారాజులవారిని చాల దూరము తీసికొనివెళ్లిరి. దాహుపోయినచోట చిన్న చెరు వుండగా గుఱ్ఱములకు నీరుపెట్టిరి. ఆచెరువు గట్టుమీద చక్కని వృక్షము లున్నవి. వాటి చల్లనినీడలో కొంత విశ్రాంతి తీసి కొందమని అక్కన బయ్యన లనిరి. మహారాజులవా రంగీకరించిరి.

అక్కన బయ్యనలు తలపాగలుతీసి శుభ్రము చేసినచోట మహారాజులవారిని విశ్రాంతి తీసికొమ్మనిరి. ఆయన విశ్రమిం చెను. చల్లనినీడ. మంచిగాలి. ప్రక్కన జలపూర్ణమైన సరస్సు. జనసంచారములేని ప్రశాంతి. మహారాజులవారికి తేలికగా నిద్రపట్టినది.

నిద్రపోయిన మహారాజు తిరిగి లేచునప్పటికి ఉదయగిరి దుర్గమున బందీగా నుండెను. ఆయన కీవిషయమును బోధపడ లేదు. తా నెక్కడనున్నదియు, ఏవిధముగా వచ్చినదియు, ఏల వచ్చినదియు ఆయనకు తెలియదు. ఆయన ఉదయగిరి దుర్గమున బందీచేయబడినట్లు దుర్గములో పెక్కుమందికి తెలియదు.

మహారాజులవారి సన్నిహితపరివారము ఆదినమంతయు అడవిలో పరిభ్రమించి సాయంత్రమునకు గుడారముల కడకు చేరిరి. మహారాజులవారు తిరిగిరాలేదు. మహారాజులవారి వెంటనున్న అక్కన బయ్యనలు రాలేదు. వారి కేమియు తోచ లేదు. రాత్రి తెల్లవారలు జాగరముచేసిరి. మరునాడు కూడ

మహారాజులవారి జాడ తెలియలేదు. అడవి యంతయు వెదకిరి. ఉదయగిరి దుర్గమునకు వెళ్లి మరి కొంతమందిని తీసికొనివచ్చి అరణ్యమంతయు పరిశోధింపవచ్చునని భావించి ఉదయగిరి దుర్గమునకు వెళ్లిరి. వా రక్కడకు చేరునప్పటికి అలసిపోయి యుండిరి. వారు దుర్గమును చేరగా నిరాయుధులుగా చేయబడి బందీ చేయబడిరి. వారిపై అక్కన బయ్యనలు నేరారోపణ చేసిరి. వారు మహారాజులవారిని సరిగా కాపాడలేదట. అందుచేత మహారాజులవారి జాడ తెలియకుండపోయినదట. వారు తమ విధ్యుక్తధర్మమును నిర్వహించుటలో ప్రమత్తత చూపినందులకు బందీ చేయబడుచున్నారట. ఏదో ముఖ్యవార్త తెలియగా మహారాజులవారు విక్రమసింహపురమునకు వెళ్లినట్లు తోచుచున్నదట.

మహారాజులవారు, వారి పరివారవర్గము, రక్తపాతము లేకుండ తేలికగా బందీకావడము, అక్కన బయ్యనలకు, రక్కెసగంగనికి, ఉదయగిరి దుర్గాధిపతికి సంతోషమైనది.మహారాజుల వారిని బందీ చెయ్యడములో అక్కన బయ్యనలు ప్రదర్శించిన చాతుర్యమునకు వారిని రక్కెసగంగన ప్రశంసించెను. మహారాజులవారు అరణ్యమున విశ్రమించి నిద్రపోయినప్పుడు ఆయనపై మత్తుమందుచల్లి వారిని తాళ్లతో బంధించిరి. ముందుగా వేసుకొన్న పథకము ప్రకారము రక్కెసగంగన త్వరలో మేనా తీసికొనివచ్చెను. స్మృతిలేక బందీగాడున్న

మహారాజులవారిని మేనాలో ఆరాత్రికే ఉదయగిరి దుర్గమున చెరసాలకు చేర్చిరి.

మహారాజులవారియందు దుర్గరక్షణసైన్యములో చాల మందికి ప్రభుభక్తి విశ్వాసము లుండుటవలన, మహారాజుల వారు బందీగానున్న విషయము రహస్యముగా నుంచబడినది.

ఉదయగిరి దుర్గాధిపతికి రక్కెస గంగన పెద్ద ఆశలు చూపెను. దుర్గాధిపతి తనకు సంబంధించినంతవరకు కార్యమును పూర్తిచేసెను విక్రమసింహపురమును కూడ స్వాధీనము చేసికొనునంతవరకు మనుమసిద్ధిమహారాజును బందీగా నుంచమని, రహస్యముగా నుంచమని రక్కెస గంగన కోరెను. దుర్గాధిపతి కావలసిన కట్టుదిట్టములు చేసెను.

రెండుదినముల తరువాత అక్కన బయ్యనలతో కుంపమాదేవితో రక్కెస గంగన విక్రమసింహపురమునకు బయలుదేరెను. రెండు దినములలో వచ్చిచేరెను.

విక్రమసింహపురనగరపాలకుడు నగరమును జాగ్రత్తగా రక్షించుచుండెను. దుర్గద్వారములు మూయబడి యున్నవి. క్రొత్తవారికి కోటలోనికి ప్రవేశము లేకుండెను. అక్కన బయ్యనలకు, కుంపమాదేవికి ప్రవేశము తేలికగా లభించినది. కుంపమాదేవి పూనుకొని తన బంధువని చెప్పి, రక్కెసగంగనకు ప్రవేశము కలిగించినది.

అక్కన బయ్యనలు పురప్రవేశము చేయగానే-నగర పాలకుడు వారిని కలుసుకొని మహారాజులవారిని గురించి

ప్రశ్నించెను. రక్కెసగంగన ముందు జాగ్రత్తలు తీసికొని యుండెను. మహారాజులవారి రాజముద్రతో - ఒక ఆజ్ఞాపత్రమును సృష్టించియుంచెను. దానిప్రకారము మహారాజులవారికి అస్వస్థతగా నుండుటచేత ఉదయగిరిదుర్గమున ఔషధసేవ చేయుచుండిరని, వారు వచ్చుటకు ఆలస్యము కావచ్చునని, అందుచేత అక్కన బయ్యనలను విక్రమసింహపురమునకు పంపుచుండిరని - వారు తమకు బదులుగా తమ స్థానములో నుండి రాజప్రతినిధులుగా పాలించుచుందురని, తమకు చెల్లుబడి అగుచున్న మర్యాదలను వారికి చూపవలసినదని ఉన్నది.

ఆజ్ఞాపత్రమును చూచిన నగరపాలకుని కేమియు తోచ లేదు. సరేనని చెప్పి మంత్రులైన భవ్యభారతి బయ్యనగారిని, ప్రబంధాంకం అన్నంభట్టును, ఆత్మకూరి గురునాథుని సంప్రతించెను. దీనియందేదో మోసమున్నదని వారు గ్రహించిరి. కాని చేయగలిగినదేమియు లేదని గుర్తించిరి. కావున వారందరు కలసి పథక మొకటి యాలోచించిరి.

వారందరును కలసివెళ్లి అక్కన బయ్యనలను చూచిరి. అక్కన బయ్యనలకడ కుందమాదేవి యుండుట వారి అనుమానమును దృఢతరము చేసినది. అక్కడనున్న క్రొత్త వ్యక్తిని వారు గుర్తుపట్టిరి. అతడు రక్కెసగంగన యని వారు గ్రహించినప్పటికి గుర్తింపనట్లే నటించిరి. గుప్తమైన కట్టుదిట్టములు చేసి అక్కన బయ్యనలను రాజప్రతినిధులుగా అంగీకరించిరి.

రెండు దినములలో చేదిదేశపుసేనలు కొప్పెరుం జింగని నాయకత్వమున వచ్చి విక్రమసింహాపురమును ముట్టడించినవి. నగరపాలకుడు కోటకు ద్వారములు మూయించి దుర్గసంరక్షణకు పాల్పడెను.

కాని రాజప్రతినిధులుగానున్న అక్కన బయ్యనలు దుర్గద్వారములను తెరువమని ఆజ్ఞాపించిరి. నగరపాలకుడు చేయగలిగినది లేక ద్వారములను తెరచెను. రక్కసగంగన, అక్కన బయ్యనలు కొప్పెరుం జింగనికి అతని సేనలకు స్వాగతముచెప్పి పురప్రవేశము చేయించిరి. యుద్ధమక్కరలేక, రక్తపాతము లేక, కొప్పెరుం జింగని చేదిసేనలు విక్రమసింహాపురమును స్వాధీనము చేసికొన్నవి. రక్కసగంగన చేదీశ్వరుడైన కాడవపతిని "గండపెండారలుంటాంక, పెన్నానదీనాథ, ఖడ్గమల" అని కీర్తించెను.

కొప్పెరుంజింగుడు రక్కసగంగని స్థిరవటరాజ్యమునకు మండలేశ్వరుని చేసెను. విక్రమసింహాపురరాజ్యమంతయు తనదేనని చాటించెను. ఉదయగిరి దుర్గాధిపతిని ఉదయగిరి మండలేశ్వరునిగా ప్రకటించెను. రక్కసగంగనికి పూర్వశత్రువు గంగయసాహిణి. అతని స్థానమున అతని సహోదరి చందలాంబ భర్త అంబయదేవుడు రాజ్యమేలుచుండెను. అతనిని జయించి అతని రాజ్యమును స్వాధీనము చేసికొనుటకు రక్కసగంగనికి సహాయముగా చేది సైన్యమును పంపెను.

విక్రమసింహాపురమున రాజకోశాగారమునందున్న ధన రాసులను కైవశము చేసికొనవలెనని కొప్పెరుంజింగన తాప త్రయపడెను. రాజధనాగారము ఖాళీగానున్నదని, కోశాధిపతి గురునాథుడుగాని, మంత్రులు అన్నంభట్టుగాని, భవ్యభారతి బమ్మయనగారుగాని కన్పించడములేదని తెలిసినది. వారికోసము నగరమంతయు శోధించినప్పటికి లాభము లేకపోయినది. ఈ ముప్పురు మంత్రులు రాజ్యధనాగారమునందున్న అశేష ధనరాశులను తీసికొని అదృశ్యులైనారని తెలిసిపోయినది

మనుమసిద్ధిమహారాజులవారి అంతఃపురమున అమూల్య రత్నాభరణము లున్నవనియు, కనకవస్తువులు, ధనము కల వనియు ప్రతీతియుండుటచేత కాడవపతి అంతఃపురమును ముట్టడించెను. కాని అంతఃపురము ఖాళీగా నున్నదని, అంతః పురకాంతలు కనిపించుట లేదని - యేమైపోయిరో తెలియుట లేదని - అంతఃపురములోని అమూల్య ధన కనకరత్నాభరణ ములు కనుపించుట లేదని విశదమైపోయినది. అదృశ్యు లైపోయిన మంత్రులకు దీనితో కూడ సంబంధమున్నదని భావింపబడినది. చేదీశ్వరుడైన కాడవపతికైన ఆశాభంగమునకు మేరలు లేకున్నవి.

గంగయసాహిణి సోదరి చంపలాంబ భర్త అంబయ దేవుడు మహావీరుడు. అతనిని జయించుట సామాన్యకార్యము కాదు. రక్కెస గంగన అంబయదేవునిపై యుద్ధమునకుపోయి తేలికగా సాధింపలేకపోయెను. అంబయదేవుడు రాజధానిని

వల్లూరునుండి గండికోటకు మార్చెను. అది అసాధ్యమైన, దుర్భేద్యమైన జలదుర్గము. పెన్నానది మధ్యలో పర్వతమువంటి దీవిపై నున్నది. దానికి పెన్నానది సహజమైన కంటకమై రక్షించుచున్నది.

రక్కసగంగన స్వంతసైన్యములతో, విక్రమసింహపుర సైన్యములు కొప్పెరుంజింగని చేరిసైన్యములు వచ్చినవి. అంబయదేవుని బలిమి చాలలేదు. భీకర సంగ్రామమైనది. ఆయుద్ధమున రక్కసగంగన మరణించెను. కాని అతని కుమారుడు అల్లు గంగరాజు నిలువత్రొక్కుకొనియుద్ధమును నిర్వహించెను.

యుద్ధమున అల్లు గంగరాజుది పైచేయి అయినది. అతనును అంబయదేవరాజును సంధి చేసికొనిరి. జయము తనదేనని అల్లు గంగరాజు తృప్తిపడెను. తనరాజ్యము తనకు దక్కినదని అంబయదేవుడు కూడ తృప్తిపడెను.

కొప్పెరుంజింగనికి రక్కస గంగన మరణవృత్తాంతము నిరుత్సాహము కలిగించినది. అక్కన బయ్యనల కది సంతోషము కలిగించినది. జయము లభించిన తరువాత వారికి రాజకీయపుకుట్రలు శరీరమునకు పట్టినవి. అన్నివిషయములు తెలిసినవి. రక్కసగంగన బ్రతికియున్నచో తామతని చేతిక్రింద నుండిపోవలసినవారని గ్రహించిరి. అతని మరణము కాగల కార్యము గంధర్వులు తీర్చినట్లయినది.

రక్కస గంగన మరణవార్త కుందమాదేవికి కూడ దుఃఖమును కలిగింపలేదు. అతడు బ్రతికియుండిన తనకు స్వేచ్ఛ

యుండవని, తా నతని ఉంపుడుకత్తెగా మాత్రమే జీవింపవలసి యుండునని ఆమె భావించినది. అతని మరణమామెకు అభీష్టమే. ఇప్పుడు అక్కన బయ్యనలను తా నాశింపవచ్చును. తాను పట్ట మహిషి. ఉంపుడుకత్తె కాదు.

కొప్పెరుంజింగుడు రక్కెసగంగని మరణవార్త వినిన తరువాత విక్రమసింహపురమున నిలచి [illegible]నక్కర లేదని భావించెను. రక్కెసగంగని కుమారుడు అల్లు గంగరాజును సిద్ధవటమండలేశ్వరునిగ, ఉదయగిరి దుర్గాధిపతిని ఉదయగిరి మండలేశ్వరునిగ నియమించి కప్పము చెల్లించుటకు అంగీకరింప జేసెను. విక్రమసింహపురరాజ్యమును చిన్న సామంతమండల ముగాచేసి అక్కన బయ్యనల కిచ్చెను. వారును కప్పము కట్టుట కంగీకరించిరి. అల్లు గంగరాజుకడ ఉదయగిరి దుర్గాధి పతికడ నిలువయున్న ధనమును తీసికొనెను. విజయధ్వాన ములతో తిరిగి చేదిదేశమునకు వెడలిపోయెను.

అక్కన బయ్యన లిద్దరు సంయుక్తముగా మహారాజై కుందమాదేవిని పట్టమహిషి గా పెట్టుకొనిరి. చేదిరాజు వెళ్లి పోయిన వెంటనే వారు స్వాతంత్ర్యమున ప్రకటించిరి. వారిని అనుసరించి అల్లు గంగరాజు ఉదయగిరి దుర్గాధిపతి స్వతంత్రు లైరి.

## 31

అక్కన బయ్యనలకడ కుందమాదేవిని రక్కెసగంగని వారు ఉదయగిరినుండి తిరిగి వచ్చిననాడు చూడగా గుర

నాథుడు, అన్నంభట్టు బయ్యనగారు అనుమానపడిరి. మనుమ సిద్ధి మహారాజుల వారికేదో ఆపదవచ్చినట్లు వారు గ్రహించిరి. ఆ విపత్తును కత్తులతోగాక చాకచక్యముతో తొలగించుకొన వలసి యున్నదని వారు గ్రహించిరి.

అక్కన బయ్యనలను రాజప్రతినిధులనుగా అంగీకరించి నట్టు నటించి - అప్పటి కప్పుడే ఉదయగిరి దుర్గమునకు విశ్వాస పాత్రులైన సమర్థులైన రహస్యచారులను పంపిరి. మహారాణి అంతర్వత్నిగా నున్నది. ఆమెకు రక్షణ కల్పింపవలసియున్నది. ముఖ్యలైన పరిచారికలకుచెప్పి రాజపత్నిని విక్రమసింహ పురమునుండి గుప్తముగా వెళ్లిపోవుటకు సిద్ధపరచిరి.

కోశాగారమున ధనము బంగారము రత్నములు పుష్కల ముగా నున్నవి. అవి శత్రువులకు దొరకరాదు. అవియెల్ల మూటలలో కట్టింపబడినవి. రహస్యమార్గమున సురక్షితస్థలము నకు చేర్చుటకు సిద్ధము చేసిరి.

ఉదయగిరి దుర్గమునకు పదిమంది గుప్తచారులు బయలు దేరివెళ్లిరి. వారందరు మహాబలాఢ్యులు. ధనుర్వేదవేత్తలు.ఖడ్గ విద్యానిష్ణాతులు. వా రొక పథకమును నిర్ణయించుకొనిరి. ఒక్కొక్కరు పది పన్నెండు మైళ్లదూరములలో గల కొండ శిఖరములకుచేరి వేచియుండిరి. ఇట్లు విక్రమసింహపురమునుండి ఉదయగిరి వరకు గల మార్గమున ప్రతి పది పన్నెండుమైళ్ల దూరమున గల కొండకొమ్మునందు వీరిలో నొకరు చేరియుండి రన్నమాట. చివరికొకడు ఉదయగిరి చేరెను. వాని కచట

మనుమసిద్ధి మహారాజులవారి జాడ తెలియలేదు. ఏలైనంత రహస్య పరిశోధనచేయగా మహారాజులచ్చ నున్నట్లుగాని, వారికి అనారోగ్యమై ఔషధసేవ చేయుచున్నట్లుగాని ప్రజలు చెప్పుకొనుట లేదు. మహారాజులవారసలు ఉదయగిరి వచ్చినట్లు ప్రజలు చెప్పలేదు. వారికి తెలియక రహస్యముగా మహారాజులవా రేలవచ్చును? అనగా ఆయన ఉదయగిరిలో అక్కన బయ్యనలు చెప్పినట్లు లేదు. ఏవైరో తెలియని శత్రులోనుండిరన్నమాట. మహారాజులవారు ఉదయగిరి దుర్గమందున్నచో ఆయన స్వంతపతాకము దుర్గముపై యుండవలెను. మహారాజులవారి పతాక మెచ్చటను లేదు. తెలుగుచోళ నృపుల పతాకమే ఉదయగిరి దుర్గమున లేదు. ఆగుప్తచారునికి అనుమానము ప్రబలినది. దుర్గాధిపతిని చూచుదమను కొనెనుగాని, తన్ను బందీ చేయవచ్చునను భావము కలిగినది.

కోటలో కొన్నిగృహములను దుర్గాధిపతి భటులు కాపలాకాయుచుండిరి. దినమంతయు దుర్గాధిపతి ఆలోచనా మందిర మందేయుండెను. దుర్గాధిపతి మహారాజులవారి కేదో ద్రోహముచేసెనని వానికి తెలిసినది. ఒకవేళ రహస్యముగా మనుమసిద్ధిమహారాజులవారిని ఉదయగిరి దుర్గమునందే బందీచేసి యుండవచ్చునను అనుమానము కూడ కలిగినది.

ఆతడారాత్రికి ఉదయగిరిదుర్గమున కెదురుగానున్న కొండ మీదకుపోయి—యెండుటాకులుచేర్చి మంటచేసి — దానిని పెద్దదిచేసి—కొండదిగి విక్రమసింహపురమునకు శరవేగ

మున గుఱ్ఱమును నడిపించెను. ఆ కొండకు పది పన్నెండు మైళ్ల దూరమున కొండపైనున్న వీనిమిత్రుడు ఆమంటచూడ గానే తానును పెద్దమంటచేసి, కొండదిగి ముందు వానికై యెదురుచూచుచుండెను. ఇట్లే కొండలమీద మంటలు వరుసగా మండింపబడినవి. గంటసేపటిలో విక్రమసింహపురములోని మంత్రులకు అశుభసూచకంపు వెలుతురు కన్పించినది. తమకు కలిగిన అనుమానములు, భయములు, నిరాధారములు కావని గ్రహించిరి.

అప్పటి కప్పుడే రాజాంతఃపురమువారిని, ధనాగారము నుండి ధనమును రహస్యముగా కోటనుండి కదలించిరి.

భగవద్రామానుజాచార్యులవారు వైష్ణవమతమును ప్రబోధించి నూట యిరువది సంవత్సరములు జీవించి వైకుంఠ గమనముచేసి—అప్పటికి కొంకను రెండుపురుషాంతరములు కాలేదు. భగవద్రామానుజాచార్యులవారు విజయముచేసిన పవిత్రస్థలములలో తిరుపతియొకటి. శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయమున సేవావిధానమును, పూజావిధానమును, భగవ ద్రామానుజాచార్యులవారు సంస్కరించి పునర్వ్యవస్థీకరించిరి. అప్పటినుండి తిరుపతి వైష్ణవప్రముఖులకు ఆశ్రయమైనది. శ్రీరంగములో ప్రఖ్యాత వైష్ణవపీఠమునకు అధిపతి ఆళవందారు బిరుదాంకితుడైన యామునాచార్యులు. ఆయన పౌత్రుడు శ్రీశైలపూర్ణుడు. శ్రీశైలపూర్ణుని సహోదరి కాంతిమతీదేవి. ఆమె కుమారుడే భగవద్రామానుజాచార్యులవారు. శ్రీశైల

పూర్ణుడు తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారి నిత్యసేవా కైంకర్యములతో జీవితము గడపినవాడు.

శ్రీశైలపూర్ణుని వంశమువారే తిరుమలలో ముఖ్యార్చకులు. ఆకాలమున వైష్ణవశిఖామణులలో ప్రముఖుడు ఆత్రేయరామానుజాచార్యులవారు. అయన కాంచీపురనివాసి. కొంతకాలము తిరుమలలో నివసించెను.

మనుమసిద్ధిమహారాజులవారు వైష్ణవమతావలంబి. ఐతే అన్యమతద్వేషి కాడు. ఆయన ప్రతిమాసము తిరుమలకు వెళ్లి స్వామిని సేవించి వచ్చుట కలదు. తిరుమల విక్రమసింహపురరాజ్యములోనిదే. తిక్కదేవచోళమహారాజుల కాలమునందొక వ్యవస్థచేయబడినది. తిరుమలలో స్వామివారికి మాధ్యాహ్నిక నైవేద్యము జరిగిన తరువాత భేరీదుందుభులు మ్రోయించి బాకాలు ఊదవలెను. అక్కడనుంచి ప్రతిక్రోశడు దూరమునకు భేరీదుందుభులు బాకాలు పట్టుకొనియున్న భటులు—ఆమ్రోతను శబ్దవేగముతో విక్రమసింహపురరాచనగరునకు చేర్చుచుండిరి. ఆశబ్దమును విని స్వామివారికి నైవేద్యము జరిగినదని తెలిసికొని మహారాజుల వారు భోజనమునకు కూర్చొనెడు వారట. ఆవిధానమునే మనుమసిద్ధిమహారాజులవా రవలంబించిరి.

మనుమసిద్ధిమహారాజులవారు తిరుమలకొండకు మెట్లు కట్టించిరి. కొండమీద పుష్కరిణి చుట్టును ప్రాకారమును కట్టించిరి. సత్రములను కట్టించిరి. యాత్రికులకు అనేక

సదుపాయములను కల్పించిరి. అర్చకులకు వసతులను కల్పించిరి. నిత్యార్చనలకు చాల దానశాసనములు చేసిరి. మనుమసిద్ధిమహారాజుల వారియందు తిరుమలలోని అర్చకుల కుటుంబములవారికి ఆదరము అభిమానము కలవు.

భవ్యభారతి బయ్యనగారు రాజపత్నిని స్వల్పపరివారముతో గుప్తవేషములతో మరునాటి సాయంకాలమునకే తిరుమల కొండమీదకు చేర్చెను. అక్కడముఖ్యార్చకులతో మహారాజులవారి విపత్తును గురించి చెప్పెను. అర్చకులు మహారాణీవారిని తమ గృహములలో సౌకర్యములు కల్పించి కాపాడుటకు సమ్మతించిరి.

భవ్యభారతి బయ్యనగారు కృష్ణామండలములోని శ్రీకాకుళ ఆంధ్రవిష్ణుదేవాలయములోని వైష్ణవ అర్చకుడనియు, మహారాణీవారు ఆయన కుమార్తెయనియు చెప్పుకొనిరి. బయ్యనగారు వైష్ణవవేషమును చక్కగాకట్టెను. పూజారులకు బంధువై వారిలో నొక్కడై పోయెను. రాజపత్నిని నిరంతరము కాపాడుచుండెను.

ఉదయగిరివెళ్లిన చారులు తిరిగివచ్చువరకు ధనరాసులున్న అశ్వశకటములతో అన్నంభట్టు, గుహనాథుడు, సంకేతస్థలమున వేచియుండిరి. వారువచ్చి కలసుకొనిన తరువాత విషయములు పూర్తిగా తెలుసుకుని చేయవలసిన కర్తవ్యమును గురించి ఆలోచనలు చేసిరి.

ఆపదిమంది భటులు అన్నంభట్టుతో కలసి పల్లెకారులైరి. చేపలబుట్టలు వలలు సంపాదించిరి. చేపలు పట్టుటకు చిన్న పడవలను సంపాదించిరి. ధనము మూటలను పడవలలో రహస్యముగా పెట్టుకొనిరి. సముద్రములో చేపలుపట్టుటకు వెళ్లినవారివలె సముద్రమధ్యమందున్న శ్రీహరికోట దీవికి వెళ్లిపోయిరి. అక్కడ మహారాజులవారి వసతి మందిరము కలదు. దానియందు గుప్తస్థలములున్నవి. ధనమును గుప్తస్థలములందు దాచిపెట్టిరి. తాము పల్లెకారులై చేపలుపట్టుకొని జీవనము గడపుచు ధనాగారమును నిరంతరము కాపాడుచుండిరి.

గురునాథుడు ప్రజ్ఞాశాలి. బహుభాషావేత్త. సాంగవేదవేది కొమ్మనామాత్యులవారి అంతేవాసి. గణనాథుని భక్తుడు. పొట్టిగా - బానకడుపుతో - తేజస్విగా ఉండువాడు. అతనిని చూచినవారు అతడొక ఉత్తమకులజుడైన తపస్వియని భావించెడు వారు. రాజోద్యోగిగా కన్పించడు. మహామంత్రి సిద్ధన్నగారు రతనికి యోగగురువులు. తరువాత మహామంత్రి తిక్కనగారి యొద్ద మెలగినవాడు. కార్యభారనిర్వహణ చతురుడు.

మంత్రి భవ్యభారతి బయ్యనగారు మహారాణీవారిని తమ కుమార్తెగా స్వీకరించి కాపాడుటకు పూనుకొనిరి. మంత్రి ప్రబంధాంకం అన్నంభట్టు పల్లెకారి వృత్తిని చేపట్టి అమూల్యమైన రాజకోశాగారమును రక్షించు భారమును వహించెను. మంత్రి ఆత్మకూరి గురునాథుడు మహారాజులవారిని చెరసాల

నుండి విడుదల చేయింపవలసిన భారమును స్వీకరింపవలసి వచ్చినది.

## 32

గురునాథునికి పరివారము లేదు. ఏకాకి. మహారాజుల వారిని బందిఖానానుండి విడిపించుటెట్లు? మహారాజులవారిని బందీగా నెచ్చటనుంచిరి. మహామంత్రి తిక్కనగా రున్నయెడల వారు సమస్యలను తేలికగా పరిష్కరింపగిలరు. మహామంత్రుల వారు కాశీయాత్రకు పోకున్నయెడల మహారాజులవారికీ విపత్తులుండెడివి కావేమో. ఇట్లు ఆలోచనలుచేయుచు- విక్రమ సింహపుర పరిసరారణ్యములలో పగటివేళల తలదాచుకొనుచు రెండు దినములు గడపెను.

మహామంత్రి తిక్కనగారు తొందరపాటులో ఆగ్రహించి మహారాజులవారిని 'రాజార్హత' లేదన్నమాట శాపమై-యింత పనిచేసినదా? ఈభావము గురునాథునికి కలిగి - మరల మహారాజులవారికి రాజ్యలాభము కూడ మహామంత్రి తిక్కనగారి అనుగ్రహమువలననే కలుగవలెనేమో నని తోచినది. ఐతే మహామంత్రులు కాశీనుండి తిరిగివచ్చువరకు వేచియుండవలెనా? ఈలోగా శత్రువులు బలము సంపాదించుకొనవచ్చును. వ్రేళ్లు పాదుకొనవచ్చును. అంతేగాక విక్రమసింహపరిస్థితు లెరుగని మహామంత్రిగారు తిరిగివచ్చి శత్రువులకు చిక్కి బందీకావచ్చును. కనుక కార్యమును త్వరగా సాధించు

కొనవలసియున్న ఆవశ్యకతను గురునాథుడు గుర్తించెను కాని కార్యసాధనకు మార్గమేదో తెలియలేదు.

ఇట్టి భావములతో గుప్తవేషములతో గురునాథుడు విక్రమసింహపుర ప్రాంతాటవిలో సంచరించుచుండెను. ఇంతలో కొప్పెరుంజింగని చేడిసేనలు నగరమును స్వాధీనము చేసికొన్నవని తెలిసినది.

తప్పించుకొనిపోయిన మంత్రులకోసము, మహారాణీ వారికోసము, మాయమైపోయిన ధనాగారముకోసము రక్కెసగంగని భటులు వెదకుచుండిరని గురునాథునికి తెలిసినది. కొప్పెరుంజింగని సైన్యములు వచ్చుటవలన గురునాథుని ఆశలు మాయమై భయములు ప్రబలినవి. ఆతడు పూనుకొన్న కార్య భారము గొప్పది. కాని ఉపకరణములు శూన్యమే.

తప్పించుకొని వచ్చిన మంత్రుల కుటుంబముల వా రెవ్వరుగాని కోటలోలేరు. మహామంత్రి తిక్కగారు గురు నాథుని అమరమాగాణముగా గోపవరము మించుపల్లె గ్రామ ముల నిచ్చిరి. ఆ గ్రామభూములను చూచుకొనుటకు గురు నాథుడు తన కుటుంబమును గోపవరమునకు పంపెను.

అన్నంభట్టు స్వస్థానము అహోబలసమీపమున. అతని కచ్చట భూవసతులున్నవి. తెలుగు భాషమీద అభిమానము కొలది దాని మాధుర్యమును జిహ్వాపై నిలుపుకొని అన్నం భట్టు చాటుకవిగా ప్రసిద్ధుడయ్యెను. అందుచేత జన మతనిని ప్రబంధాంకుడనిరి. అది అతనికి గృహనామమై వెలసినది. మహా

రాజులవారి అనుగ్రహమువలన అతనకి అమరమాగాణ గ్రామ మొకటి లభించినది. అది గండికోట మండలమునందున్నది దాని నతడు ప్రబంధాంకము వారిపల్లెగా పేరుమార్చెను. అన్నం భట్టు కుమారులు పెద్దవారై అమరమాగాణము భూములను చూచుకొనుచుండిరి. అన్నంభట్టు కుటుంబము ప్రబంధాంకము వారి పల్లెలో నున్నది.

భవ్యభారతి బయ్యనగారు మహామంత్రి తిక్కనగారికి దూరపు బంధువు. మహామంత్రిగారిని శారదావతారముగ విశ్వ సించి సేవించినవాడు. తన కుమారులలో నొకనికి మహామంత్రుల వారిపేరే పెట్టుకొనినవాడు. ఆయన స్వస్థానము కృష్ణానదీ ప్రాంతము. ఆయన బంధుజనమంతయు ఆప్రాంతమువారే. మహా మంత్రి తిక్కన్నగారికి మహారాణీవా రిచ్చిన నాలుగు అగ్ర హారములలో కృష్ణాతీరమందున్న పెరుమగూ రొకటి. దానిని మహామంత్రి తిక్కనగారు భవ్యభారతి బయ్యనగారి కిచ్చిరి. ఆ అగ్రహారమాయనకు విద్వజ్జనానందమైన జీవనస్థితిని కూర్చి నది. ఆయూరు కృష్ణవేణి మలాపహారిణి భీమరథినా ధరిత్రి యందున్న నదీ త్రయాంతర్వేది యగు పావనక్షేత్రము. అది శ్రీకాకుళమునకు సమీపము. బయ్యనగారి కుటుంబమునకు శ్రీకాకుళములోని ఆంధ్రవిష్ణువు అభిమానదైవము. ఆయన యందు వారి కనన్యమైన భక్తి. భవ్యభారతి బయ్యనగారి కుటుంబము పెరుమగూరు అగ్రహారమునకు వెళ్లిపోయినది.

రక్కసగంగన మంత్రులకోసమై చేసిన పరిశోధనలు ఫలింపలేదు. పెన్నానదీ స్నానఘట్టమున గురునాథుడు గణనాథునికి ఆలయము కట్టించియుండెను. అక్కడ గురునాథునికి విశ్వాసపాత్రుడైన బ్రాహ్మణ పూజారికలడు. బైరాగి వేషమున గురునాథుడు రాత్రులందా దేవాలయమునకు వెళ్లి కోటలోని సమాచారములు పూజారివలన తెలిసికొనుచుండెను. చేది సైన్యములు వచ్చిన తరువాత విఘ్నేశ్వరాలయమునకు వెళ్లుటకు గురునాథునికి కష్టమైపోయినది. చేదిసేనలు విఘ్నేశ్వరాలయసమీపమున గుడారములు వేసికొన్నవి. అక్కడ రాత్రిపూట గస్తీతిరుగుచుండిరి. వచ్చిపోవువారిని పరీక్షించుచుండిరి. అతని రాక ప్రమాదభరితమైనదని పూజారి హెచ్చరికలు చేసెను.

అంతేగాక చేదిదేశీయులకు విఘ్నేశ్వరుని యందు ప్రత్యేకభక్తి. ఆంధ్రదేశమున విఘ్నేశ్వరునికి ప్రత్యేకముగా ఆలయములు లేవు. ఇతర దేవాలయములలో ఆయనకు స్థానమున్నది. చేదిదేశమున వాడవాడలలో విఘ్నేశ్వరునికి ప్రత్యేకాలయము లున్నవి. విక్రమసింహపురమున గురునాథుడు కట్టించిన దొక్కటే విఘ్నేశ్వరాలయము. అది చేదిదేశీయులకు ఆదరపాత్రమైనది. వారా దేవళమునకు రాకపోకలు చేయుట - దినమునందు చాల భాగమచ్చట నుండుట జరుపుచుండిరి. గురునాథున కది ప్రమాదమైనది.

మనుమసిద్ధి మహారాజులవారిని ఉదయగిరి దుర్గములో చెరయం దుంచిరని బహిరంగముగా పొక్కిపోయినది. జనులు బాహాటముగా చెప్పుచుండిరి. కాడవపతి, రక్కసగంగన, అక్కన బయ్యనల నుపయోగించుకొనిరని బయటపడినది.

గురునాథునికి విక్రమసింహపురమున పని యేమి యున్నది? విడిపింపవలసిన మహారాజు విక్రమసింహ పురము నందు లేరు. అందుకు సాధనము కూడ విక్రమసింహపురమున లేదు. సాధనమున్న చోటునకు పోవలెను. అతనికి ఉపాయము తోచలేదు. మహామంత్రి తిక్కనగారిని దర్శించి వారికి వివరములు నివేదించుటే తన కర్తవ్యమని భావించుకొనెను. మహామంత్రులవారిపాటికి కాశీనుండి తిరుగు ప్రయాణము ప్రారంభించియుండవచ్చును. వారికెదురుగాపోయి వివరములు తెలుపుట తనకు కర్తవ్యమని నిశ్చయించుకొనెను. బైరాగి వేషముతో కాషాయవస్త్రములతో గురునాథుడు కాశీ యాత్రకు బయలుదేరెను.

సాధారణముగా బ్రాహ్మణయాత్రికులు బసచేయు సత్రములకుపోయి మహామంత్రి తిక్కనగారికొరకు అన్వేషణలు చేయుచు —నిరుత్సాహపడుచు — నిరాశపడుచు — మరల ఉత్సాహమును ఆశను పెంచుకొనుచు—ముందునకు ప్రయాణము చేయుచు—పోవుచుండెను. వెలనాటి మండలమును, కమ్మనాటిని దాటి విజయవాటికచేరి వేంగీమండలము ద్వారా

ఉత్తర యాత్రకుపోయెను. అన్ని మజిలీలలోను మహామంత్రి గారికై అన్వేషించుచుండెను. వారిజాడ తెలియలేదు.

కృష్ణానదినుంచి ఉత్తరముగా ప్రయాణించి గోదావరీ నదిని దాటెను. మధ్యలో మహామంత్రి తిక్కనగారి జాడ కనుపించలేదు. గురునాథునికి నిరుత్సాహమువలన శక్తి తగ్గిపోవుచున్నది.

ఆదినము గురునాథుడు గోండుదేశమున శోణభద్రానది తీరమును చేరెను. మధ్యాహ్నకాలమున శోణభద్రానదిలో స్నానముచేసి గుడ్డలు పిండుకొనుచు తనకిష్టదైవమైన గణనాథుని ప్రార్థించుచు తెలుగు వారందరకు నిత్యపరిచయమైన "తుండము నేకదంతమును" అను పద్యమును గొంతెత్తి చదువుచుండెను. ఈపద్యమును వినిన వారెవరో వెనుకనుంచి "గురునాథా" అని కేకవేసిరి. ఆపద్యము గురునాథున కిష్టమైన పద్యము. అభిమానకరమైన పద్యము. అతడు దానిని నిత్యమననము చేయుచుండును. బిగ్గరగా చదువుచుండును. అది వినిన వారెవరో తన్నెరిగినవారు తన్ను గుర్తుపట్టి పిలుచుచున్నారని గట్టుపైకి చూచెను. గురునాథునికి ప్రాణములు లేచివచ్చినవి. ఆపిలచినది మహామంత్రి తిక్కనగారు. పరువులెత్తి గురునాథు డాయన పాదములమీద వ్రాలి బావురుమనెను. ఆనందపార వశ్యమున దేహము తెలియలేదు. మాటలు పెగులలేదు. ఉక్కిరి బిక్కిరైపోయెను. వైరాగివేషమున గురునాథుని

శోణభద్రాతటమున చూచుట మహామంత్రిగారికిని అచ్చెరువు గానే యున్నది.

గురునాథునికి మహామంత్రిగారు చెప్పిరి. కాశీలో గర్భవాసకాలము పది మాసములు—ఉండవలెనని బాలకులు పట్టుపట్టిరి. అక్కడనే సాంవత్సరికశ్రాద్ధములు ముగించిరి. పూర్వస్నేహితులు కాశీలో కొంతమంది మిగిలియుండిరి. వారందరు పట్టుపట్టి ఆతిథ్యములు స్వీకరింపుమని చేసిన బలవంతములవలన కొంత జాగైనది. కాశీలో కేదారఘాట్ సమీపమున దాక్షిణాత్యవిద్యార్థులకు సౌకర్యమునకై సత్ర మొక్కటి నిర్మించుటకు పూనుకొని స్థానికులసహాయముతో పూర్తిచేయుటతో కొంత ఆలస్యమైనది. తిరుగుప్రయాణములో—ఆదినమే శోణభద్రాతటమునకు వచ్చిరి. ఎదురుగానున్న వృక్షముక్రింద చుట్టును గుడ్డలుకట్టుకొని బసచేసిరి.

గురునాథుడు తన యిష్టదైవమైన గణనాథుని అనుగ్రహమునకు పొంగిపోయెను. శోణభద్రానదిలో ప్రతిశిలయు గణనాథుని అర్చారూపమని ప్రసిద్ధి. అక్కడనే తన అన్వేషణ ఫలించినదని సంతోషమైనది.

గురునాథునికి మహామంత్రిగారు భోజనముపెట్టి తరువాత విక్రమసింహపురవిషయములు ప్రస్తావించిరి. గురునాథుని కప్పటికి మనస్సు కుదుటపడి ధైర్యము వచ్చినది.

మహామంత్రులు కాశీయాత్రకు బయలుదేరిన నాటి నుండి చేదిసేనలు నగరమును స్వాధీనము చేసికొనిన నాటివరకు

జరిగిన సంగతులను గురునాథుడు వివరించెను. మహారాజుల వారు బందీగానున్న సంగతి తెలిపెను. బయ్యనగారు, అన్నంభట్టు, తాను, రాజపత్నిని, ధనాగారమును రక్షించిన వివరములు చెప్పెను. ఇక తన భారము తీరిపోయినదని సంతోషపడెను.

గురునాథుడు చెప్పినవార్తలు మహామంత్రిగారికి పిడుగుపాటువలె నున్నవి. పరిస్థితుల యోమయమై పోయినవి. ఏమియు తోచలేదు. బాగుగా ఆలోచించిరి. అనుసరణీయమైన మార్గమొకటి తోచినది.

కాకతీయగణపతిదేవచక్రవర్తి విక్రమసింహపురచోళవంశమునం దభిమానముకలవాడు. ఆయనకు ప్రధానసచివుడు, రాజగురువు విశ్వేశ్వరశివాచార్యులవారు. ఆయన తమకు కాశీలో ప్రాణమిత్రులైన సహాధ్యాయి. కాకతీయుల విద్యాధికారి మారన్న తమ శిష్యుడే. కనుక ఓరుగల్లువెళ్లి చక్రవర్తుల సహాయమును పొందవచ్చును. వారు మనుమసిద్ధి మహారాజును తిరిగి రాజ్యప్రతిష్ఠితుని చేయవచ్చును. ప్రయత్నము చేయవలెను.

మహామంత్రి తిక్కనగారు గురునాథుని బాలకులిద్దరను, పరివారసేవకులను విక్రమసింహపురమునకు ప్రయాణము చేసిరి. వారందరు కృష్ణాతీరమున వేచియుండవలెను. అక్కడకు కాకతీయసేనలు వచ్చినప్పుడు సేనాపతిని కలియవలెను. తమ్ము తెలుపుకొనవలెను. వారు విశ్వసించుటకు మహామంత్రి వారి

ముద్రను చూపవలెను. మరియు ఉదయగిరి దుర్గమునకు పర్వతములలో రహస్యమార్గమున్నది—ఆమార్గమున. దుర్గాధిపతికి తెలియకుండ దుర్గప్రవేశము చేయవచ్చునని, తేలికగా దుర్గమును స్వాధీనము చేసికొనవచ్చునని మహారాజులవారిని చెరనుండి విడిపింపవచ్చునని చెప్పిరి. ఆరహస్యమార్గ వివరములు చిత్రపటములు వ్రాసి గురునాథునికి తెలియజెప్పి మరల పటములను నిర్మూలించిరి. ముందు ఉదయగిరిని స్వాధీనముచేసికొని మహారాజులవారిని చెరనుండి విడుదలచేయించి తరువాత వారితో కలసి విక్రమసింహపురముపై దండెత్తినచో విజయము తేలికగా లభించునని చెప్పిరి. మహారాజులవారిని చూడగనే విక్రమసింహపురములోని సైనికులు, ప్రజలు, ఉత్సాహభరితులై అక్కన బయ్యనలను తామే బందీచేసి మహారాజుల వారికి స్వాగతము చెప్పుదురని చెప్పిరి.

గురునాథుడు పరివారసేవకులతో, బాలకులతో ప్రయాణమయి వెళ్లెను. అశ్వములను సంపాదించుకొని బాలకులతో, పరివారముతో, గురునాథుడు శీఘ్రగమనము చేయుచుండెను.

మహామంత్రి తిక్కనగారు, శిష్యుడు కేతన వెంట నుండగా పాదచారులై కాకతీయ గణపతిదేవచక్రవర్తి దర్శనమునకై బయలుదేరిరి. వారు నైష్ఠికులగుటచేత, అనుష్ఠాతులగుటచేత, సాయంప్రాతరనుష్ఠానములు దీర్ఘములై ప్రయాణములు సాగుటలేదు. వారు మజిలీచేయుచున్న గ్రామములలోని శ్రోత్రియులు వారికి ఘనముగా ఆదరసత్కారములను చేయు

చుండిరి. ఆతిథేయగౌరవములు నెరపుచుండిరి. సత్కారగౌరవ బాహుళ్యతవలన ప్రయాణములు శీఘ్రముగా సాగుటలేదు. ప్రతి గ్రామమువారును తమ గ్రామమునందు వారిని మరి కొంతకాలముండి తమ్ము పావనముచేయుడని ప్రార్థించు చుండిరి. మధురభాషణములతో వారిని సమాధానపరచుచు మహామంత్రిగారు ముందునకు సాగుచుండిరి.

సర్వపృష్ఠాగ్నిచయన పౌండరీకాంత సర్వక్రతునిర్వహణ దక్షులై త్రయ్యంతనిష్ణాతులైన మహామంత్రి తిక్కన సోమ యాజిగారు, తెలుగుభాషలో మహాభారతమును నిర్మించి ఆంధ్రావళికి మోదము చేకూర్చిన కవి బ్రహ్మ తిక్కన సోమ యాజిగారు, తమ గ్రామమునకు రేపు వచ్చెదరు, మాపు వచ్చెదరు, అని ముందు గ్రామములవారు వారికి స్వాగతములు చెప్పుకొనుటకు సన్నాహములు చేసికొనుచున్నారు.

ఒక గ్రామమునుండి మరియొక గ్రామమునకు వెళ్లువరకు ఆ గ్రామములోని ప్రజానీకము యావన్మందివారిని సేవించు కొనుచుండిరి. ఆయన మహావైయాకరణి యని, సాంగవేదవేది యని, నానాపురాణవిజ్ఞాననిరతు డని, సర్వక్రతుదక్షుడైన శ్రోత్రి యని, ధర్మమర్మజ్ఞు డని, ఆచారవిచారదక్షు డని, నిగమాగ మసారహృదయుడని, సర్వశాస్త్రవేత్తయని, పదవాక్యప్రమాణ పారావారపారీణుడైన మహాకవియని, పండితులు పామరులు ఆబాలవృద్ధము ఆయనను సేవించుచుండిరి. ఆయన ముందు గ్రామమును చేరువరకు వారి పరిచారసేవకజనమువలె సేవలు

చేయుచున్నారు. వాల్మీకి మహామునిని సేవించినట్లు, వేదవ్యాస భట్టారకులను సేవించినట్లు, క్షేమేంద్రుని, అభినవగుప్తపాదుల వారిని సేవించినట్లు, కాళిదాసుని, భవభూతిని సేవించినట్లు, నన్నయభట్టారకుల వారి పాదార్చనచేసినట్లు ప్రజలు సంతోష పడుచుండిరి.

## 33

కాకతీయ గణపతిదేవచక్రవర్తి పరమశివభక్తుడు. మహా శూరుడు. విజేత. పరిపాలనాదక్షుడు. ఆయన తండ్రి మహాదేవ రాజు యాదవరాజులతో వైరముకలవాడు. యాదవులు మహా దేవరాజు అన్నయగు రుద్రదేవుని చంపిరి. వారిపై పగతీర్చు కొనుటకు మహాదేవరాజు యాదవులపై దండెత్తిపోయి వారి రాజధానియగు దేవగిరికోటను ముట్టడించెను. ఆయనతో యువరాజు గణపతిదేవుడు వెళ్లెను. మహాదేవరాజు మహా శూరుడు. గజయుద్ధమున మహాఘటికుడు. కాని ఆయుద్ధఫలి తము ఆయనకు వ్యతిరేకమైనది. మహాదేవరాజు రణరంగమున మరణించెను. యువరాజు గణపతిదేవుడు యాదవులచేతిలో బందీగా చిక్కెను.

యాదవులచేతిలో బందీగా గణపతిదేవుడు రెండు మూడు సంవత్సరము లుండెను. తరువాత యాదవరాజైన జైత్రపాలుడు గణపతిదేవుని విడుదల చేసెను. అప్పటికే కాకతీయసామ్రాజ్యము తూర్పుసముద్రమునుండి పడమట కళ్యాణినగరము వరకు నున్నది. ఉత్తరమున మాల్యవంత

పర్వతమునుండి దక్షిణమున శ్రీశైలము వరకునున్నది. గణపతి దేవుడు బందీగా నున్న కాలమున సామంతరాజులు సామ్రాజ్యమును ఛిన్నాభిన్నము చేయుటకు చూచిరి. కాని రేచర్ల రుద్రయనాయకుడనే మహాసేనాని ప్రభుభక్తి పరాయణుడై సామ్రాజ్యమును సంరక్షించెను. గణపతిదేవుడు తిరిగివచ్చిన తరువాత అతనికి అప్పగించెను.

గణపతిదేవుడు తన రాజ్యమును విస్తరించి మహాసామ్రాజ్యముగా రూపుకట్టించెను. వెలనాడును, పలనాడును జయించి సామ్రాజ్యమున కలుపుకొనెను. కళింగదేశముపై దండెత్తిపోయి కాళింగులను జయించెను. రాజనాయకుడు సోమనాయకుడు అను సేనానులు కళింగులను పరాభూతులను చేసిరి. గణపతిదేవుడు కమ్మనాటిని జయించెను. యాదవ రాజగు సింహణను జయించెను.

విక్రమసింహపుర తెలుగు చోళరాజులు కాకతీయులకు సామంతులే. కాకతీయచక్రవర్తి సహాయముతో తెలుగు చోళరాజులు కాంచీపురమును ఆక్రమింపగలిగిరి. గణపతిదేవ చక్రవర్తి తానెంత శూరుడో, అంతటి ఉదారుడు, అంతటి ధర్మమర్మజ్ఞుడు. అంత శివభక్తుడు. అంత విద్యాప్రియుడు. సాహిత్యప్రియుడు. చక్రవర్తుల గజసాధనికుడైన జాయప సేనాని సంగీతభరతశాస్త్రనిష్ణాత. నృత్తరత్నావళి జాయప సేనాని గ్రంథము.

రాజగురువు ప్రధానసచివులు విశ్వేశ్వరశివాచార్యుల వారు. ఆయన పాశుపత శైవగోళకీ మఠశైవాచార్యులవారు. ఆమతమునకు లకులీశాధ్యాయి యని మరియొక పేరు. ఆయన మంథనములోను త్రిపురాంతకములోను, శ్రీశైలములోను పుష్పగిరిలోను విద్యాపీఠములు స్థాపించి నిర్వహించుచుండిరి.

కాకతీయులు స్వయముగా పెక్కు శివాలయములను నిర్మించిరి. శిల్పకళలో వారి దేవాలయవాస్తు నిర్మాణ మొక ప్రత్యేక వైఖరి కలది.

గణపతిదేవ చక్రవర్తి ప్రతిదినము వెళ్లి స్వయంభూ దేవాలయములోను రుద్రేశ్వరాలయములోను స్వామిదర్శనము చేసివచ్చెదరు. ఆయన విశ్వేశ్వరశివాచార్యుల వారికడ శైవదీక్ష స్వీకరించినవాడు.

ఆదినము మామూలుగా గణపతిదేవచక్రవర్తులవారు స్వయంభూనాథదేవాలయమునకు వచ్చిరి. స్వామివారికి ప్రాతః కాలాభిషేకము పూర్తి అయి అలంకారము జరిగిన తరువాత తీర్థప్రసాదములు స ంచి నమస్కారమంటపమున కూర్చుండి చాలసేపు కన్నులు మూసికొని మౌనధ్యానము చేసిరి.

చక్రవర్తులవారు దేవాలయమునం దున్నప్పుడు అంగ రక్షకదళము ప్రాకారములందు సన్నద్ధముగా నుండును. ఆసమయమున రాజకుటుంబమువారికి అతిముఖ్యులైన రాజో

ద్యోగులకు మాత్రమే ఆలయములోనికి ప్రవేశమున్నది. ఇతరులను లోనికి రానీయరు.

చక్రవర్తిగారు మౌనధ్యానమునం దుండగా విద్యా సచివులైన మారన్నగారు ఆదరాబాదరాగా ఆలయమునకు వచ్చి చక్రవర్తులవారి కోసము చూచిరి. ఆయన నమస్కార మంటపమందున్నారని తెలిసికొని, తాము స్వామి దర్శనమును ముగించుకొని తీర్థప్రసాదములను స్వీకరించి వచ్చిరి. చక్రవర్తుల వారింకను ధ్యానమునందుండుటవలన దగ్గరగా నిలచి అంజలి బంధించియుండిరి.

కొంతసేపటికి చక్రవర్తులవారు కన్నులు తెరచి— నమస్కార మంటపమునుండి సాష్టాంగప్రణామము చేసిరి. తరువాత లేచి నిలచి మారన్నగారిని చూచిరి. మారన్నగారి ముఖమున కనుపించుచున్న తొందరపాటునుబట్టి, ఆందోళనను బట్టి, వారేదో తొందర పనిమీదవచ్చిరని, ఏదో ముఖ్యమైన విషయమును గురించి విన్నపముచేయుటకు తొందరపడు చుండిరని చక్రవర్తులవారు గ్రహించిరి. ఆముఖ్యవిషయము రాచకార్యమో లేక మారన్నగారి స్వవిషయమో కావచ్చు ననుకొనిరి. ఐతే అంత ఆందోళన కలిగింపవలసిన రాచ కార్యములున్నట్లు చక్రవర్తులవారికి తోచలేదు. ఇది యేదో మారన్నగారికి సంబంధించిన ముఖ్యవిషయము కావచ్చునని భావము కలిగినది.

చక్రవర్తులవారు మారన్నగారిని ప్రసన్నదృష్టులతో చూచుచు "ఏదో ముఖ్యవిషయమును ముచ్చటించుటకు వచ్చి నట్లున్నారు. మేము కన్నులుమూసికొని యుండుటవలన ఆలస్యమైనట్లున్నది. తమరు ఆనతి యివ్వండి" అనిరి.

మారన్నగారు శిరఃకంపనముచేసి చేతులు జోడించి ప్రార్థేయపూర్వకమైన చూపులతో మనవిచేసెను "ఏలినవారు మన్నింపవలెను. ఏలినవారు దేవాలయమునందుండగావిన్నపము చేయవలసివచ్చినది. ముఖ్యమైన విషయము కావడమువలన - జాప్యమునకు వీలులేక పోవడమువలన ఏలినవారికి దేవాలయములో విన్నపములుచేసే సాహసాని పూనుకున్నాను. ఏలినవారి ప్రశాంతతకు భంగము కలిగించాను" అని శిరస్సు వంచిరి.

చక్రవర్తులవారు "ఫరవాలేదు. ఆనతియివ్వండి. ముఖ్యమైన విషయము కాకపోయిన మీ రీసమయమున వచ్చియుండరని మేము గ్రహించితిమి. సంకోచముపడకండి. ఆనతియివ్వండి" అని ప్రసన్నభావముతో చెప్పిరి.

మారన్నగారు "ఏలినవారికి నా చిన్నతనమునాటి విషయములు తెలిసినవే. నేను చిన్నప్పుడు విద్యాభ్యాసమునకై కాంచీపురమునకు బయలుదేరితిని. అక్కడ షట్ఛాస్త్రపండితులున్నారని, వారిని సేవించి శాస్త్రపాండిత్యము గడింపవలెనని బయలుదేరి వెళ్లితిని. ప్రయాణమార్గమున నొకనాడు విక్రమసింహపురమున మజిలీచేసితిని. ఆదినము పెన్నానదిలో స్నానము

చేయుచుండగా నాకు పుంరూపశారదాస్వరూపము ప్రత్యక్ష మైనది. దివ్యమైన బ్రాహ్మీమయ తేజస్స్వరూపమాయనది. సాక్షాన్మూర్తిత్రయ సంపుటీకరణమైన మానవాకారము. ఆ రూపము న న్నాకర్షించినది. సమీపించి పాదాభివందనముచేసి ప్రవరచెప్పుకొంటిని. ఆయన మందస్మితంగా ఘ తయుక్తముగా ఆశీర్వదించి మాతండ్రిగారిని తా మెరుగుదుమనిరి. తమ గృహా మునకువచ్చి ఆతిథ్యమును స్వీకరింపుమనిరి. అది వరప్రసాదమని సంతోషపడి వారివెంట వెళ్లితిని. వారి గృహమునుచేరిన తర్వాత వారు విక్రమసింహపురరాజ్యమహామాత్యపాదులైన తిక్కనామాత్యులవారని తెలిసినది.

వారును షట్ఛాస్త్రవేత్తలు. వారియొద్ద భిన్నభిన్న శాస్త్రములలో అధ్యయనముచేయుచున్న విద్యార్థులు చాల మంది కలరు. వేదాధ్యయనము చేయుచున్న వారుకూడ పెక్కు మంది కలరు. ఆయన సాంగవేదవేది. ఋక్సామాథర్వణములను క్రమాంతస్వాధ్యయనముచేసి స్వకీయమైన యజుర్వేదమును ఘనాంతస్వాధ్యయనము చేసినవారు. వారియొద్ద చదువుకొను చున్న విద్యార్థులందరకు వారే భోజనవసతి కల్పించి ఆదరించు చుండిరి. నేనును వారిని విద్యాభిక్ష అర్థించితిని. కాంచీపురము వెళ్లుటకు అభిలాషపోయినది.

వారు నన్ను అనుగ్రహించిరి. నన్ను అంతేవాసిగా స్వీకరించిరి. నాకు తర్కమీమాంసాద్వయముపై అభిమాన ముండెడిది. అవి నేను వారిపాదములకడ పూర్తిచేసితిని.

వారి పాదసేవచేయుటవలన విపరీతమైన సాహిత్యాభిమానము పుట్టుకొనివచ్చినది. మామూలు శాస్త్రవిద్యార్థులు కూడ సంస్కృతకావ్యములు చదివెదరు. నేను సాహిత్యమును ఆమూల చూడముగా చదివితిని. సాహిత్యమునకు అంగముగా మహాభాష్యము, కావ్యాలంకారశాస్త్రము నాచేత వారు చదివించిరి. ఆలంకారికశాస్త్రమున పూర్వాలంకారికుల వాదములే గాక నన్నయభట్టారకుల వారి ప్రత్యేక ఆలంకారికమార్గము—ఆలంకారిక మీమాంసలో ఆంధ్రుల ప్రత్యేకదృష్టి—వారు సోదాహరణముగా నిరూపించెడివారు. ఆకారణముచేత నాకు ఆంధ్ర సాహిత్యముపైన ప్రత్యేకాదరము అభిమానము కలిగినవి.

వారియొద్ద నావిద్య ముగింపుదశలో నుండగా—యిక్కడ పితృపాదులకు అనారోగ్యముగా నున్నదని వార్త వచ్చినది. నేను తిరిగివచ్చితిని. తరువాత కొంది దినములకే పితృపాదులు దివంగతులైరి. తరువాత ఏలినవారు నన్ను రాజోద్యోగిగా నియమించిరి. నేను మరల గురుదర్శనము చేయుటపడలేదు. వారికి ప్రాణసముడైన అన్నగారు—అంటే పెదతండ్రి సిద్ధన్నగారి కుమారుడు ఖడ్గతిక్కనగారు వీరమరణము పొందిరట. ఆయన భార్య సహగమనము చేసినదట. గురువుగారు సర్వపృష్ఠాగ్నిచయిన పౌండరీకాంత సర్వక్రతువులుచేసి ఆంధ్రమహాభారతమును రచించిరట. ఆచార్యాణిగారిలోకమునకు వెళ్లిపోయిరట. గురువుగారు కుమారుని వెంటబెట్టుకొని, ఆమె అస్థికలను తీసికొని గంగానిమజ్జనము

చేయించుటకు కాశీకి వెళ్లిరట. అక్కడ కొన్ని దినములుండి తిరుగుప్రయాణమున స్వస్థలమునకు వెళ్లుచు—వారు శిష్య వాత్సల్యమూర్తులు గనుక, శిష్యుని చూచి—వాని గృహము పావనముచేయు తలంపుతో—అనుగ్రహబుద్ధితో-మన పురము నకు వచ్చుచుండిరట. పాదచారులై వచ్చుచుండిరి. వెంట పరి వారజనము లేదట. శిష్యుడు మూలఘుటిక కేతనమాత్రమే సేవించుచువచ్చుచుండెనట వా రీసాయంత్రమునకే పురప్రవే శము చేయవచ్చునట. నా కీవార్త లిప్పుడే కర్ణాకర్ణిగ తెలిసినవి. తెలిసినవెంటనే ఏలినవారి దర్శనమునకు వచ్చితిని.

నేను వెంటనే సముచితమైన పరివారలాంఛనగౌరవ మర్యాదలతో వారి కెదురువెళ్లి స్వాగతములు నివేదించి, తోడితెచ్చుకొనకపోతే గురుద్రోహమే జరిగిపోతుంది. మహా పచారమే అవుతుంది. నాకు శాంతి ఉండదు. నాకృతఘ్నతకు మేరఉండదు. ఇప్పటికే అపచారమైపోయినది. ఇప్పుడే బయలు దేరి వెళ్లవలసియున్నది. ఏలినవారి అనుజ్ఞ అయితే పరివార మును తీసికొని బోయీలతో పల్లకిని తీసికొని వెళ్లివస్తాను” అని మనవిచేసిరి.

చక్రవర్తులవారు మందస్మితముచేసి “మీగురుభక్తి మాకు తెలియదా! గురుభక్తి విషయమున మీరు ఉపనిష త్కాలమహర్షి కుమారులవంటివారు. కావలసిన పరివారజన మును తోడ్కొనివెళ్లిరండి. మహాకవులు వచ్చినతరువాత మే

మున్నూ దర్శనం చేసుకుంటాము." అని సమ్మతి పూర్వకముగా చూచిరి.

ఇంతలో రాజగురువులు - ప్రధానసచివులు - విశ్వేశ్వర శివాచార్యులవారు - పెద్దపెద్ద అంగలువేసికొనుచు తొందర పాటుతో వచ్చుచుండిరి. చక్రవర్తులవారు మారన్నగారు వారిని చూచి వారి కెదురుగా వచ్చిరి.

చక్రవర్తులవారు మారన్నగారు విశ్వేశ్వరశివాచార్యుల వారి ముందు శిరములువంచి చేతులు జోడించి "ఏమిటి ఆజ్ఞ" అన్నట్లు నిలువబడి వినయము మూర్తికట్టినట్లుగా నుండిరి. ఆయన వైదికమైన ఆశీస్స్వరము పఠించి, శిరఃకంపనముచేసి చక్రవర్తులవారిని చూచుచు "చాల తొందరపని ఉండుటనుబట్టి మిమ్ము దేవాలయములోనే కలుసుకొనుటకు వచ్చితిని. పని చాల ముఖ్యమైనది. జాప్యము సహింపదు. ఇచ్చటకే వచ్చుటకు సాహసముచేసితిని." అని శుచిస్మితముగా, మృదువుగా చెప్పిరి. చక్రవర్తులవారు "ఎంతో ముఖ్యమైన కార్యము కాకపోతే గురుపాదులవారు దేవాలయంలోనే వచ్చిచూడరని మాకు తెలియదా ? ఆజ్ఞాపించండి" అనిరి చేతులు జోడించి వినయ సంపన్నముగా చూచిరి.

విశ్వేశ్వరశివాచార్యులవారు సంతృప్తిగా చూచుచు "మీకు నాచిన్నప్పటి ముచ్చటలు తెలియవనుకుంటాను. నేను చిన్నతనమున కాశీలో విద్యాభ్యాసము చేసితిని. కాశీలో బ్రహ్మశ్రీ గంగానాథమహోపాధ్యాయులవారు మాకు వేద

శాస్త్రగురువులు. వారి అనుగ్రహామువలననే మాకు వైదిక శాస్త్రపరిచయం లభించినది. అప్పుడు మాకిద్దరు ఆంధ్రసహాధ్యాయులుండేవారు. ఒకాయన పండితారాధ్యుల బ్రహ్మరుద్రయ్య. ఆయన అతితీవ్రమైన ప్ర సాక్షాత్తు క్రోధభట్టారకుడని చెబుతుండేవాళ్లము. రెండవ సహాధ్యాయి కొట్టరువు తిక్కనగారు. ఆయన పరమసాత్త్వికుడు. ఋషులలో వశిష్ఠునివంటి వరిష్ఠుడు. ఆయన నాకు ప్రాణాధికసఖుడు. మాకిద్దరకు దేహిదేహన్యాయము. ఆయన ఏకసంతగ్రాహి. ఆనాటి కాశీ విద్యాపరిషత్తులలో ఆయనను మించిన శాస్త్రపండితుడు లేడనిపించినవాడు. ఆజానుబాహువు. సుందరుడు. గుణాధికుడు. విద్యాధికుడు. నిగమాగమసారహృదయుడు. తపశ్చక్రవర్తి. పదవాక్యప్రమాణపారావారపారీణుడు. ఉత్తరదేశమున దాక్షిణాత్య విద్వాంసులందు చిన్నచూపు ఉండెడిది. ముఖ్యంగా న్యాయశాస్త్రం మనకు తెలియదని వారి అభిప్రాయము. ఆభావమును తలక్రిందులుచేసి దార్శనికపాండిత్యమనిన, సాహిత్యపాండిత్యమనిన, దాక్షిణాత్యులదేనని ఆయన దాక్షిణాత్య విద్వాంసుల కీర్తిని సుస్థిరముచేసెను. కాశీవిద్యాపరిషత్తులలో షట్ఛాస్త్రములందు విద్యావివాదములుచేసి జయపత్రములను స్వీకరించెను. ఆయనతో సహచరులుగా నుండుటవలన బ్రహ్మరుద్రయ్యకు మాకు ఆయన విజయములలో భాగము లభించినది. ఆయన ప్రయాగలో, నవద్వీపములో, జగన్నాథములో మహాపండితులను విద్యావివాదమున జయించెను. విద్యావివాద

ములలో ఆయన ప్రవర్తనమృదువుగా సుకుమారముగా నుండెడిది. అతిమార్దవమైన ప్రకృతి. ఆయనతో వివాదపడిన పండితులు కూడ ఆయన వినయమునకు మృదుమధురభాషణము నకు సంతోషపడి తమ పరాజయమును విస్మరించెడువారు.

సామాన్యముగ శాస్త్రవిద్వాంసులకు సాహిత్యాభిమాన ముండదు. వైముఖ్యత ఉండును. ఆయనకు గల సాహిత్యాభి మానము అపూర్వము. తెలుగుభాష మాధుర్యగుణములో సంస్కృతమునకు తీసిపోవదని ఆయన వాదము. నన్నయభట్టార కుల వారిరచన ఆధారముగా ఆయన ఆంధ్ర ఆలంకారిక వాద మొకటి నిరూపించెడువాడు.

ఆయనను తలచుకొనినప్పుడు నాశరీరము కృతజ్ఞతా భరితమై జలదరించుచున్నది. ఒక సన్నివేశము నాకు నిత్యస్మర ణీయమైనది ఉన్నది. ఒకనాడు ప్రాతఃకాలమున నేను ఆయన గంగానదికి స్నానమునకు వెళ్లితిమి. మణికర్ణికాఘట్టమది. స్నానము చేయుచుండగా నాకు కాలుజారినది. నేను నదిలో పడిపోయితిని. ప్రవాహవేగమధికముగా నున్నది. నాకు ఈత రాదు. నేను మునుగుచు తేలుచునుంటిని. అప్పుడు తిక్కనగారు ప్రాణమునకు తెగించి ప్రవాహములోనికి దూకిరి. రెండు బారలలో నన్ను పట్టుకొనిరి. అప్పటికి నాకు సగము స్మృతి పోయినది. ఆయన నన్ను పొదివిపట్టుకొని-మహాధైర్యముతో, సాహసముతో, శ్రమతో, ప్రవాహమున కెదురీది నన్ను గట్టు నకు చేర్చిరి. ఆయన నాకు ప్రాణదాత. నిత్యస్మరణీయుడు.

మేము కాశీలో విద్యావ్రతము పూర్తిచేసికొని కాశీ పరిషత్తులలో జయపత్రములు స్వీకరించి నవద్వీపమునకు వెళ్లితిమి. నవద్వీపము న్యాయశాస్త్రమునకు పుట్టిల్లు. నవ్యన్యాయ మచ్చట వికసించినది.అక్కడ మాకు న్యాయశాస్త్రములో వివాదములు జరిగినవి. అక్కడ జయపత్రములు స్వీకరించి జగన్నాథము వెళ్లితిమి. తరువాత రాజమహేంద్రవరము. అచ్చటనుండి ఆయన విక్రమసింహపురమునకు వెళ్లిపోయెను. నేను ఓరుగల్లు వచ్చితిని. తరువాత మరల నేనాయనను చూచుట పడనేలేదు.

ఆయన విక్రమసింహపురమున మహామంత్రిపదవిలో నున్నారని వింటిమి. ఈ ప్రాతఃకాలమున వారిని గురించిన వార్తలు కొన్ని తెలిసినవి. ఆయనకు కళత్రవియోగము కలిగినదట. తమ కుమారుని వెంటబెట్టుకుని భార్య అస్థికలను తీసికొని గంగానిమజ్జనము చేయుటకు కాశీవెళ్లిరట. అక్కడ నుంచి తిరిగి స్వస్థలమునకు వెళ్లుచుండిరట. త్రోవలో దగ్గరగా ఉన్న చిన్ననాటి ప్రాణమిత్రుని చూచి పోవలెనను అభిప్రాయముతో కావచ్చును - మన నగరమునకు విచ్చేయుచున్నారట. పరివారనిహీనముగా పాదచారులై వచ్చుచున్నారట. ఈ సాయంకాలమే పురప్రవేశము చేయవచ్చునట.

ఇప్పటికైనా సముచిత పరివారగౌరవలాంఛన మర్యాదలతో యెదురువెళ్లి వారికి స్వాగతములు నివేదించి తోడ్కొని రావలసి ఉన్నది. లేనిచో ప్రాణదాతను, కవిబ్రహ్మను

విస్మరించిన అపచారము జరుగును. ఇప్పటికే చాల జాప్యమై పోయినది. అపచారమైపోయినది. మీ అనుమతితో పరివార యుక్తముగ బయలుదేరి వెళ్లవలెనని వచ్చితిమి” అని చక్రవర్తులవారిని అర్థించుచున్నట్లు చూచిరి.

చక్రవర్తులవారు మందస్మితము చేయుచు “మీ అభీష్టమునకు అవరోధము కాకతీయసామ్రాజ్యములో లేనేలేదు. మీ అభిమతము ప్రకారము కానివ్వండి. మహామంత్రి తిక్కనగారు వచ్చిన తరువాత మేమున్ను దర్శనముచేసి సేవించుకుంటాము. వారు గురుపాదులకు సహాధ్యాయులు, ప్రాణమిత్రులు కావడమువలన మాకు సేవ్యమానులే” అని అంజలి బంధించిరి.

చక్రవర్తులవారు, విశ్వేశ్వర శివాచార్యులవారు, మారన్నగారు, కలసి పది అడుగులు నడచిరి. వెనుక ముందుల అంగరక్షకబలములోని దళపతులు దూరముగా నుండిరి. ఇంతలో వీరపురుషు లిద్దరు వెంటరాగా పురుషవేషముతో యువరాజు రుద్రమదేవమ్మవారు వచ్చి చక్రవర్తులవారికి, విశ్వేశ్వరశివాచార్యులవారికి, మారన్నగారికి నమస్కరించి అంజలి బంధించి నిలచినది. ముప్పురును ఆశీఃపూర్వకశిరఃకంపనములు చేసిరి.

యువరాజు రుద్రమదేవమ్మవారు చాల ఆందోళనపడుచున్నట్లు కనుపించెను. ఏదో చాల ముఖ్యమైన విషయమును చక్రవర్తులవారితో మనవి చేయవలయునని తొందరపడు

చున్నట్లు కనుపించెను. ఏదో ముఖ్యమైన విషయము లేకున్న-కుమార్తె దేవాలయములో విన్నపము చేయుటకు రాదని చక్రవర్తులవారు గ్రహించి "ఏమి విశేషము" అనినట్లు చూచిరి.

ఆమె "ఏలినవారు మన్నింపవలెను. దేవాలయములో రాచకార్యములు మనవి చేయరాదని మాకు తెలియును. కాని ఆలస్యము చేయుటకు వీలుకాని అనివార్యమైన విషయ ముండుటవలన సాహసించి దేవాలయమునకే వచ్చితిమి" అని చేతులు జోడించెను.

చక్రవర్తులవా రామెను ప్రసన్నముగా చూచుచు—"చెప్పండి వింటాము" అనిరి. ఆమె "ఏలినవారికి తెలియని విషయముకాదు. విక్రమసింహపురరాజ్యమున మహామంత్రి పదవిలో నున్నవారట. త్రయ్యంతనిష్ణాతులట. సర్వపృష్ఠాగ్ని చయనపౌండరీకాంతక్రతు నిర్వహణాదక్షులట. సాంగవేదవేదు లట. సర్వశాస్త్రవేత్తలట. ఆంధ్రమహాభారతమును రచించిన కవిబ్రహ్మలట. తిక్కనామాత్యులవారట. పాదచారులై, పరివారవిహీనముగా - కాశీనుండి తిరుగుప్రయాణమున మన నగరము మీదుగా వెళ్లుచున్నారట. ఈసాయంకాలమే వారు మన నగరప్రవేశము చేయనున్నారట.

వారికి స్వాగతములు నివేదించి తోడితెచ్చుకొనుటకు మన నగరములోని అన్నివాడలవారు, అన్ని వర్ణములవారు, అన్ని ఆశ్రమములవారు వారంతట వారే బయలుదేరి వెళ్లు

చుండిరి. పాదచారులుగా, శకటములలో, రథాశ్వగజముల పైన - యెదురువెళ్లుచున్నారు. పోటీలు పడుచు - పెండ్లి బండ్లను దాకించుకొని పోయినట్లు వెళ్లుచున్నారు. ఆయన రచించిన మహాభారతములోని విరాటోద్యోగపర్వములలోని పద్యములను పాడుచు, శ్రీకృష్ణరాయబారఘట్టమును అభినయ పూర్వకముగా పాడుచు వెళ్లుచుండిరి. ఆంధ్రావళికి, ఆంధ్రావనికి మోదమును కూర్చిన ఆంధ్రసరస్వతీ అవతారమని, బ్రాహ్మీమయమూర్తి యని, కవిబ్రహ్మ యని కీర్తించుచు వెళ్లుచున్నారు.

ఇప్పుడు ఆంధ్రసరస్వతీదేవి, పరివారవిహీనముగా, పాదచారి అయి మన నగరమునకు వచ్చుచుండగా మన విధ్యుక్త ధర్మమును మనము నిర్వహింపవలసియున్నది. మనము పూనుకొని స్వాగతములు నివేదించవలసియున్నది. లేకపోతే మనము అపహాస్యముపాలై, అప్రతిష్ఠపాలై పోవచ్చును" అని వ్యగ్రతగా మనవిచేసినది.

చక్రవర్తులవారు నవ్వుచు "యువరాజులవారి అభిప్రాయము సముచితముగా నున్నది. ఏమి చేయవలెనని అభిప్రాయమో వివరముగా చెప్పండి" అనిరి. ఆమె "మనము ప్రజలందరిని సమీకరించి ఆంధ్రచక్రవర్తులవారి తరఫున, ఆంధ్రసామ్రాజ్యముతరఫున, ఆంధ్రావళితరఫున, ఆంధ్రావని తరఫున, ఆంధ్రసరస్వతీదేవికి స్వాగతము నివేదింపవలెను. అప్పుడే ఆంధ్రచక్రవర్తుల కీర్తి కళంకితము కాకుండా రక్షింపబడగలదు. ఏలినవారి ఆజ్ఞ అయితే మేము స్వయముగా

చతురంగబలసమేతముగా మహాకవులకు యెదురువెళ్లి స్వాగతము నివేదించెదము. సకలరాజమర్యాదలతో పుర ప్రవేశము చేయించెదము. వారు మన సామ్రాజ్యమునకు అతిథిదేవులుగా గౌరవింపబడవలెను" అని మనవి చేసెను.

చక్రవర్తులవారు "అట్లాగే కానివ్వండి. మీవెంట గురుపాదులవారు, మారనామాత్యులవారు, కూడ వచ్చు చున్నారు. మహాకవులకు మా ప్రణామములు మనవి చేయుడు" అని చెప్పి మందస్మితము చేసిరి. అందరు సంతోషపడిరి. చక్రవర్తులవారు ముువ్వురను చూచి "ఐతే మహాకవి తిక్కన సోమయాజిగారు మన నగరానికి యేమి కార్యార్థము వచ్చు చున్నట్లు" అనిరి. వారు ముువ్వురు నొకరి నొకరు చూచు కొనిరి. చక్రవర్తులవారిని చూచిరి. మహాకవి, మహా మంత్రి తిక్కన సోమయాజిగారు, కాకతీయచక్రవర్తుల నగర మునకు వచ్చుటలో నేదో రాజకీయరహస్యమున్నదని - వా రప్పుడు గ్రహించిరి. కాని రహస్య మెట్టిదో వారికి అవగాహన కాలేదు. ఆభావములతో చక్రవర్తులను చూచిరి.

చక్రవర్తులవారు మందస్మితము చేయుచు "మేమే దేవాలమునుంచి ఆలోచనామందిరమునకు వెళ్లి మీముువ్వురను పిలిపించుదా మనుకుంటిమి. మీరే వచ్చుట మంచిదని అయినది. ఇది ముఖ్యమైన విషయము. మహాకవి తిక్కన సోమయాజిగారు మన నగరమునకు పాదచారులై పరివారము లేక - వచ్చు చుండిరని మేమును వింటిమి. ఆయన త్రయ్యంతనిష్ణాతుడు.

సర్వక్రతుదక్షుడు. సర్వజిద్యాగమునుచేసి తన సర్వస్వమును అర్థి జనులకిచ్చి తృప్తిపడినవాడు. మన నగరమున ఆయన వాంఛింపదగిన దేమున్నది? ఆయన మహామంత్రి. సర్వశాస్త్ర వేత్త. పంచమవేదమైన మహాభారతమును ఆంధ్రభాషలో నిర్మించిన మహాకవి. ధర్మవేత్త. ఆయనకు మన నగరములో కావలసిన దేమున్నది? ఆయన ధర్మాద్వైతసిద్ధుడు. అనుచిత మైన కార్యమునకై వచ్చుచున్నాడని భావించుటకే వీలు లేదు. సామాన్యజనులవలె అనురాగకారణముచే వచ్చుచుండెనను టకు వీలు లేదు. అల్పమైన కార్యము కాజాలదు.

ఆయన ఆగమనవార్త వినరాగా మేము సందర్భ మంతయు పరిశీలించితిమి. విషయము తేలికగా బోధపడలేదు! తరువాత దక్షిణమండలమునుండి వచ్చిన వేగులవారి నివేదికలు జ్ఞాపకము రాగా విషయము బోధపడినది.

విక్రమసింహపురరాజ్యమును మధురరాజు సుందర పాండ్యుడు దోచుకొని రాజధానిని ముట్టడి చేయగా మనుమ సిద్ధి చాలకష్టముమీద బయటపడెను. అంతకుముందే వీరశిఖా మణి ఖడ్గతిక్కనగారి మరణము, ఆయన భార్య సహగమనము, మహామంత్రి తిక్కన సోమయాజిగారి కాశీయాత్రాగమనము జరిగినవి.

సుందరపాండ్యుని ముట్టడి తొలగిన తర్వాత చేదిరాజు కొప్పెరుంజింగ కాడవపతి రక్కెసగంగన సహాయముతో మనుమసిద్ధిని ందీచేసి విక్రమసింహపురమును కబళించెను.

విక్రమసింహపురమునకు మనుమసిద్ధి దాయాదులైన అక్కన బయ్యనలను సామంతులుగా నియమించెను. విక్రమసింహపుర రాజ్యము ముక్కలైపోయినది. రక్కెసగంగన సిద్ధవటం సామంతుడు. ఉదయగిరి దుర్గాధిపతి మరియొక సామంతుడు. చేదిరాజు చక్రవర్తి యయ్యెను.

ఈవారలు కాశీలోనున్న మహాకవి తిక్కన సోమయాజిగారికి తెలిసినట్లున్నవి వారికి మనుమసిద్ధిపైన మిక్కిలి త్సల్యమని విని ? మహాకవులకు ఏకపుత్రసంతానము. కుమార్తెలు లేరు. మనుమసిద్ధిభార్య శీలామహాదేవి. ఆమె మహాకవులను పితృసమానంగా గౌరవించునని, మహాకవులామెను పుత్రికా నిర్విశేషముగా ఆదరింతురని వింటిమి. నిర్వచనోత్తరరామాయణమునుబట్టి మాకు అవగాహన అయిన అంతఃపుర రహస్యమది.

మహాకవులు మన పురమునకు విచ్చేసి విక్రమసింహపుర సింహాసనమున మనుమసిద్ధిని పునఃప్రతిష్ఠితుని చేయుటకు మన సాయ మపేక్షింపవచ్చును. ఇంతవరకు విక్రమసింహపుర రాజ్యము మనకు సామంతరాజ్యము. ఇప్పు డది చేదిసామ్రాజ్యమున చేరిపోవుట మనకును శ్రేయస్కరము కాదు.

దీనియందు మరొక మహాసన్నివేశము కలదు. ఆంధ్ర సరస్వతీస్వరూపమైన మహాకవి, త్రయ్యంతనిష్ణాతుడైన సాంగ వేదవేది, సర్వశాస్త్రవేత్త, సర్వపృష్ఠాగ్నిచయనపౌండరీకాంతము సర్వక్రతువులను మాత్రమేగాక సర్వజిద్యాగముచేసి తన

సర్వస్వమును అర్థిజనుల కిచ్చిన మహోదాత, మనలను అర్థించుటకు వచ్చుచున్నాడు. ఆయన కోరిక యెటువంటిదైనను మనము నెరవేర్పవలసియున్నది. ఇటువంటి అర్థి కాకతీయసామ్రాజ్య చరిత్రలోనే కాదు - భారతచరిత్రలోనే - 'న భూతో న భవిష్యతి.' ఈపరిస్థితులలో రాజన్యు డెవ్వరైనా ఆయన కోరికను తీర్చును. సందేహము లేదు.

మా పెదతండ్రి రుద్రదేవమహారాజులవారు చక్రవర్తులై యుండగా - దాక్షిణాత్యతమిళభాషామహాకవి కంబనాడార్ చోళరాజులచేత దేశమునుండి బహిష్కరింపబడి, అగచాట్లకు లోనైనప్పుడు - మా పెదతండ్రి రుద్రదేవమహారాజులవారు కంబనాడార్‌ను రాచమర్యాదలతో ఓరుగల్లునకు రప్పించి ఆదరించిరి. కంబనాడార్ తమిళభాషలో అద్వితీయమైన రామాయణమును నిర్మించిన మహాకవి. ఆ రామాయణమును ఓరుగల్లు నందున్నప్పుడే రచించెను. అన్యభాషాకవులకే కాకతీయచక్రవర్తులు చూపిన ఔదార్యము లోకాతిశాయిగానున్నప్పుడు ఆంధ్రమహాకవుల విషయములో ?

అందుచేతనే ఆలోచింపవలసివచ్చుచున్నది. అంతకంటె మన మధికముగా చేయవలసియున్నది." అని సాలోచనగా చూచిరి. అంగరక్షకులలో నొకరిని చూచి "సేనాపతి మల్యాల హేమాద్రిరెడ్డిని వెంటనే తీసికొనిరావలెను" అనిరి.

మారన్నగారికి, విశ్వేశ్వరశివాచార్యులవారికి, యువరాజులు రుద్రమదేవమ్మవారికి చక్రవర్తులవారి అభిప్రాయ

మేమిటో బోధపడ లేదు. మహాకవి తిక్కనగారు కోరితే విక్రమ సింహపురరాజ్యమును జయించి యివ్వవచ్చును. వారికి మహా గౌరవసత్కారములు చేయవచ్చును. అంతకంటె అధిక మనగా నేమి? వారికి బోధపడ లేదు. చక్రవర్తులవారే చెప్పుదురని మౌనము వహించియుండిరి.

చక్రవర్తులవారు ఆలయప్రాకారములందున్న ప్రాకార దేవతల మందిరములకు వెళ్లి దర్శనము చేసికొనిరి. వెంట యువ రాజులు విశ్వేశ్వరశివాచార్యులవారు మారన్నగారు నుండిరి. ఆలయమునుండి బయటకు వచ్చునప్పటికి సేనాపతి మల్యాల హేమాద్రి రెడ్డి వచ్చియుండెను. అతడు చక్రవర్తులకు, యువ రాజులకు, విశ్వేశ్వరశివదేశికులకు, మారన్నగారికి అభివాద నలు చేసెను.

చక్రవర్తులవారు హేమాద్రి రెడ్డివంక చూచి వేచి యున్న తమ అశ్వము నధిరోహించిరి. అందరు వారివారి అశ్వ ముల నెక్కిరి. చక్రవర్తులవారు ఆలోచనామందిరమునకు త్రోవ తీసిరి. అందరును ఆలోచనామందిరమును చేరిరి.

ఆలోచనామందిరమునందు వారందరు ఆసీనులైన తరువా హేమాద్రి రెడ్డి నుద్దేశించి చక్రవర్తులవారు విక్రమ సింహపురరాజ్యపరిస్థితులను మరల వివరించిరి. తరువాత "నీవు వెంటనే చతురంగబలములతో బయలుదేరవెళ్లు. విక్రమసింహ పురమును వశపరచుకో. మనుమసిద్ధిని చెరసాలనుండి విడిపించు. ఆవెంటనే మాకు అంచెగుఱ్ఱములపై వార్తను పంపు. తరు

వాత సిద్ధవటమండలేశ్వరుని ఉదయగిరి మండలేశ్వరుని జయించు. మనుమసిద్ధికి మా ఆజ్ఞలుగా చెప్పు. 'కాకతీయచక్రవర్తులు విక్రమసింహపురరాజ్యమును జయించి ఆంధ్రమహా భారతమును రచించిన కవిచక్రవర్తికి కానుకగా సమర్పించు కొనుచున్నారు. మహాకవి తిక్కనగారు వచ్చువరకు మనుమసిద్ధి రాజప్రతినిధి మాత్రమే. తరువాత మహాకవులు వారి అభిమతము ప్రకారము రాజ్యమును దత్తము చేసికొనవచ్చును.' నీవు వెంటనే ప్రయాణపు భేరీవేయించు" అని హేమాద్రిరెడ్డికి శలవు దయచేయగా అతడు అభివాదనలు చేసి వెడలెను.

తరువాత చక్రవరులు మిగిలిన వారిని చూచుచు "విక్రమసింహపురరాజ్యము హేమాద్రిరెడ్డి స్వాధీనమైనదని వర్తమానము వచ్చువరకు మాకు మహాకవి తిక్కనగారి దర్శనము లేదు. అంతవరకు మాకు స్వాస్థ్యము లేదన్నమాట. అప్పటివరకు మహాకవులు తమ శిష్యులైన మారన్నగారి ఆతిథ్యము సహాధ్యాయులైన గురుపాదులవారి ఆతిథ్యమును స్వీకరించుచుందురు.

హేమాద్రిరెడ్డి యొద్దనుంచి వార్తచేరిన మరునాడే మేము రాజసభకు వచ్చెదము. అప్పుడే మహాకవులకు ఆహ్వానము. ఆంధ్రసరస్వతీపూజ" అని మందస్మితము చేసిరి. ముగ్గురు సంతోషపడిరి. విశ్వేశ్వరశివదేశికులవారు "తమ ఆలోచన ఉత్తమముగా నున్నది. మహాకవులు అర్థించకుండానే రాజ్యము

యివ్వడము జరుగుతుంది. ఆంధ్రసరస్వతీదేవి యాచన చేయ వలసిన దురవస్థరాకుండా ఆంధ్రచక్రవర్తులు చేయుచున్నారు. మహదానందము" అని ఆనందాశ్రువులు ధారగాకార్చిరి. మారన్నగారు "ఏలినవారు ధర్మస్వరూపులు. రాధేయుడు శిబిచక్రవర్తి బలిచక్రవర్తి అడిగినవారి వాంఛలను తీర్చిన వారు. ఆంధ్రచక్రవర్తులైన యేలినవారు అర్థిజనులు తమ కోర్కెలను తెలుపకమునుపే తీర్చుచున్నారు. ఇది ఏలినవారికే చెల్లినది." అని ఆనందపరవశులయిరి. యువరాజులవారు "ఆంధ్రసరస్వతీదేవికి తగినట్లుగా ఉన్నది ఆంధ్రచక్రవర్తుల సత్కారము" అని ఆనందమును వెలిబుచ్చిరి.

తరువాత చక్రవర్తులవారి అనుజ్ఞతో యువరాజులు రుద్రమదేవమ్మవారు, విశ్వేశ్వరశివదేశికులు, మారన్నగారు, యితర ముఖ్యరాజోద్యోగులు చతురంగబలసమన్వితముగా సకలరాజలాంఛనములు గైకొని మహాకవి తిక్కనగారి కెదురు పోయిరి.

మహాకవి తిక్కనగారు వీరందరను చూచి ఆశ్చర్యచకితులైరి. సకల రాజమర్యాదలతో జరిగిన స్వాగతసత్కారములకు వారు మిక్కిలి ఆనందపడిరి. చిన్ననాటి స్నేహితులైన విశ్వేశ్వరశివాచార్యులవారిని ఆలింగనము చేసికొని, చిన్ననాటి సంగతులను జ్ఞాపకము చేసికొని ఆనందించిరి. శిష్యుని మారన్నగారిని చూచి చాల సంతోషపడిరి. క్షేమసమాచారములు విచారించిరి. యువరాజులు రుద్రమదేవమ్మగారు చేసిన

అభివాదనను వేదోక్తాశీర్వచనముతో స్వీకరించిరి. చక్రవర్తుల వారి కుశలమును విచారించిరి. స్వాగతమహోత్సవమును తిలకించుటకు వచ్చిన మహాజనసందోహమునకు నమస్కారములు చేసి వారందరకు మోదమును చేకూర్చిరి. ప్రజలు జయజయ ధ్వానములు చేసిరి.

మహాకవి తిక్కనగారు పట్టపు టేనుగుమీద శ్వేతచ్ఛత్ర లాంఛనములతో, విశ్వేశ్వరశివదేశికులు మారన్నగారు వింజామరలు పట్టగా, యువరాజు రుద్రమదేవమ్మగారు చతురంగబలములతో పరివేష్టించి నడువగా, మంగళవాద్యములు మ్రోయుచుండగా, ప్రజలు జయజయధ్వానములు చేయుచుండగా, ఆంధ్రచక్రవర్తుల రాజధానినగరమును ప్రవేశించిరి. పురవీథులలో ప్రతి గృహము ముంగిట పూర్ణకుంభములతో మంగళవాద్యములతో స్వాగతవచనములు చెప్పి పుణ్యస్త్రీలు మంగళ హారతులు పట్టిరి. మంగళాక్షతలు చల్లిరి.

ఆంధ్రసరస్వతీదేవి ప్రసన్నమోహనమైన పురుషాకారముతో, త్రయ్యంతనిష్ఠాతృత్వమైన బ్రహ్మతేజస్సుతో, తమ నగరమును పావనము చేయుటకు విజయము చేసినదని ఓరుగల్లు పట్టణవాసులు ఆనందపారవశ్య మనుభవించిరి.

## 34

మహాసేనాని మల్యాల హేమాద్రిరెడ్డి చతురంగబలయుక్తుడై, చక్రవర్తులవారి ఆనతిప్రకార మా దినమే దండయాత్రకు బయలుదేరెను. అతి శీఘ్రగమనమున సేనలు కృష్ణా

నదీ తటమును చేరినవి. అక్కడ వేచియున్న ఆత్మకూరి గురునాథుడు కాకతీయ పతాకములతో విరాజిల్లుచున్న మహాసైన్యమును చూచి సంతోషపడెను. కాకతీయసైన్యమంత శీఘ్రముగా వచ్చునని గురునాథుడు భావింపలేదు.

సేనలు కృష్ణాతీరమున నిడిసిన తరువాత గురునాథుడు సేనాపతి హేమాద్రిరెడ్డి దర్శనముచేసి తన్ను తెలుపుకొనెను. హేమాద్రిరెడ్డి గురునాథుని సముచిత మర్యాదలతో ఆదరించెను. గురునాథుడు తన్ను గురించి చెప్పికొని మహామంత్రి తిక్కనగారి ముద్రను చూపి వారు తన కొసగిన ఆదేశమును, ఉదయగిరి దుర్గ రహస్య సమాచారమును వినిపించెను.

హేమాద్రిరెడ్డికి అచ్చెరువు, అనుమానము కలిగినవి. మహాకవి తిక్కనగారు రాజనగరమునకు చేరకమునుపే తాను ప్రయాణమై వచ్చెను. కాకతీయ సైన్యములు వచ్చుచున్నవని మహాకవులు చెప్పకలుగుటెట్లు? అచ్చెరువు ఆశ్చర్యము కలుగుట కది కారణము. గురునాథుడు చెప్పిన రహస్య సమాచారము వివరములు మహామంత్రిగారి ముద్రిక అతని వెంట ఖడ్గతిక్కనగారి కుమారుడు, మహాకవి తిక్కనగారి కుమారుడు ఉండుట - గణపతిదేవ చక్రవర్తులవారు మహాకవిగారియందు చూపిన భక్తి గౌరవముల స్థాయిలోనే వీరందరు మహాకవిగారిని గురించి మాటలాడుట - హేమాద్రిరెడ్డికి విశ్వాసము కలిగించినవి. గురునాథుడు విశ్వసనీయుడని నిశ్చయించుకొనెను.

గురునాథుడు హేమాద్రి రెడ్డికి మహామంత్రి తిక్కన గారి పథకమును వివరముగా చెప్పెను. ఉదయగిరి దుర్గ రహస్యములు, విక్రమసింహపుర దుర్గరహస్యములు చెప్పెను.

గురునాథునికి కృష్ణా దక్షిణప్రాంతము మిక్కిలి పరిచితమైనది. సేనలు ప్రయాణించుటకు సౌకర్యములు గల మార్గములు, మజిలీ చేయుటకు వసతులున్న ప్రదేశములు - అతనికి తెలిసినవే. సేనలు కందుకూరుప్రాంతమును చేరిన తరువాత హేమాద్రి రెడ్డి రెండు విభాగములుగ చేసెను.

ఒక విభాగము హేమాద్రి రెడ్డి నాయకత్వమున ఉదయగిరి దుర్గము వైపు నడచినది. దాని వెంట గురునాథుడున్నాడు. రెండవ విభాగము విక్రమసింహపురమువైపు నడచినది. దానికి ముఖ్యదండనాథుడైన గన్నమనీడు నాయకుడు. దాని వెంట ఖడ్గతిక్కనగారి కుమారుడు, మహాకవి తిక్కనగారి కుమారుడు, గురునాథుని వెంటవచ్చిన పరివార సేవకులు వెళ్లిరి.

సేవలతో కలసి ప్రయాణము చేయుట బాలకులకు పరమోత్సాహకరముగా నున్నది. ఖడ్గతిక్కనగారి కుమారుని విషయము మరియు విచిత్రముగా నున్నది. అశ్వారోహణము, స్వారిచేయుట, యెట్టి గుఱ్ఱమునైన లొంగదీయుట - అతనికి అవలీలగా నున్నవి. అతనికి అశ్వహృదయము సహజముగా తెలిసినట్లున్నది. అతడు ఖడ్గమును ధరించు పద్ధతిలో ఠీవి యున్నది. మహావీర లక్షణ మున్నది. అతని ఖడ్గచాలనములో అతిలోకమైన శౌర్యరేఖ యున్నది. ఆఠీవి, ఆఖడ్గధారణము

చాలనము, చూపరులను సమ్మోహపరచుచున్నవి. బాలుడై యుండి మహావీరులకు సాధ్యపడని విచిత్రగమనములతో అశ్వము నడిపించుట, ఖడ్గముతో బహువిచిత్రమైన కార్యములను నిర్వహించుట— సేనలోనివారిని ఉత్సాహభరితము చేసినవి. అతని వీరకృత్యములకు తా ముత్సాహము చెందుచు, అతనిని ఉత్సాహపరచుచు సైనికులు పయనించిరి.

విక్రమసింహపురము సమీపించిన కొలది, ఖడ్గతిక్కనగారి కుమారుని ఉత్సాహము విపరీతమైపోయినది. వీరావేశము కలిగినట్లయినది. వయసు మీరిన మహాయోధునివలె, సేనలను నడిపించుటలో అనుభవము కలిగిన మహాసేనానివలె ప్రవర్తింపతొడగెను. విచిత్ర మేమనగా అతనిని మహాసేనానివలె సైనికులు గౌరవించుచుండిరి. అతడు సేనలను ఉత్సాహభరితము చేయుచు శీఘ్రగమనమున విక్రమసింహపురమును చేర్చి నగరమును ముట్టడి చేసెను.

దూరమునుండి కాకతీయ సైన్యములు వచ్చుచున్న వార్తలు విక్రమసింహపురమున తెలిసినవి. కోట తలుపులు మూయించి దుర్గపాలకుడు దుర్గరక్షణకు పూనుకొనెను. సేనలు దుర్గద్వారమును సమీపింపగా ఖడ్గతిక్కనగారి కుమారుడు "జయం జయం! మనుమసిద్ధి మహారాజులకు జయం జయం" అని విజయధ్వానములు చేసెను. కాకతీయ బలములు ప్రతిధ్వనులు చేసెను.

వచ్చినసైన్యము మనుమసిద్ధి మహారాజులవారిదని, ఆసేనకు ఖడ్గతిక్కనగారి కుమారుడు సేనాపతిగా వచ్చియున్నాడని దుర్గాధిపతి గ్రహించెను. ప్రభుత్వము మారిపోయి అక్కన బయ్యనలు రాజులైరి కావున అతడు వారిని కొలుచుచున్నవాడు. అతనికి నిజముగా మనుమసిద్ధి మహారాజులవారియందు ప్రభుభక్తి కలదు. అతనికి ఖడ్గతిక్కనగారియందు విపరీతమైన భక్తి. ఆయనను దైవముగా కొలిచినవాడు. ఖడ్గతిక్కనగారు మహాసేనాని కుమారస్వామి అవతారమని నమ్మినవాడు. ఇప్పుడాయన కుమారుడు బాలకుమారస్వామియై సేనలను నడిపించుకొనివచ్చి తన ప్రభువును సింహాసనస్థునిచేయుటకు ప్రయత్నము చేయుచుండెను. ఆకుఱ్ఱవాని ఠీవి, అతడు గుఱ్ఱముపై కూర్చున్నపద్ధతి, ఖడ్గమును ధరించిన వైఖరి, అంతయు తండ్రిగారివలెనున్నవి. ఖడ్గతిక్కనగారి నెరిగిన వారందరకు పరిచితవైఖరులై—పులకరింపులుగా నున్నవి. కోటతలుపులు తెరచి ఆబాలుని ఆలింగనము చేసికొనవలెనని దుర్గాధిపతి కనిపించినది. నిజమునకు కోటలోని సైనికులందరి భావము లట్లేయున్నవి.

దుర్గాధిపతివెళ్లి అక్కన బయ్యనలను దర్శించి—ఖడ్గతిక్కనగారి కుమారుడు సేనాసమేతుడై కోటను ముట్టడించెననియు, ఆసేనలు కాకతీయులవనియు చెప్పెను. అక్కన బయ్యనలు అదరిపడిరి. దుర్గమును రక్షింపుమనిరి. కాని దుర్గాధిపతి దుర్గములోని సైనికులందరు ఖడ్గతిక్కనగారియందు పరమభక్తికలిగియున్నారని ఆయన కుమారునితో యుద్ధము చేయు

తలపుగాని, అతనిపై కత్తిని యెత్తు మనస్సుగాని వారెవ్వరకు లేవని చెప్పెను. అక్కన బయ్యనలు వెలవెల లాడిపోయిరి. ఏమి చేయవలెనో వారికి తెలియలేదు. ప్రక్కనే యున్న కుందమాదేవి వివరములు విన్నది. ఆమెకు పరిస్థితులు అవగాహన అయినవి. చేయిజారిపోవుచున్నవని తెలిసినది. తన్ను తాను రక్షించుకొనుటకు ప్రయత్నముచేయవలెనని భావించినది. దుర్గాధిపతి వెంట కొంత పరివారమున్నదని గ్రహించినది. ఆమె దుర్గాధిపతిని సమీపించి "జయం జయం మనుమసిద్ధిమహారాజులవారికి!" అని అక్కన బయ్యనలు చూపుచు "వీరిద్దరు ప్రభువులవారికి ద్రోహము చేసినవారు. వీరిని బంధించు" అన్నది. దుర్గాధిపతి సన్నద్ధుడైవచ్చెను. అతడు అక్కన బయ్యనలను కుందమాదేవిని ముగ్గురను బంధించెను.

దుర్గాధిపతి కోట తలుపులుతీసి ఖడ్గతిక్కనగారి కుమారునికి, సేనలకు, స్వాగతముచెప్పి ఆహ్వానించెను. కోట లోని సైనికులందరు "జయం జయం మనుమసిద్ధి మహారాజులకు" అని జయధ్వానములు చేయగా కాకతీయసైనికులు ప్రతిధ్వనులు చేసిరి. ఖడ్గతిక్కనగారి కుమారుడు కత్తిదూయకుండా విక్రమసింహపురమును స్వాధీనముచేసికొనెను.

కాకతీయసేనల నాయకుడు గన్నమనీడు విక్రమసింహపురదుర్గమును స్వాధీనము చేసికొని, సేనలకు వసతు లేర్పాటు చేసెను. ఖడ్గతిక్కనగారి కుమారుని, మహాకవి తిక్కనగారి

కుమారుని, సైనికులు మహాసేనాని గౌరవలాంఛన మర్యాద లతో - మహావిజయమును సాధించుకొనివచ్చిన మహావీర యోధునికి తగిన గౌరవముతో—గృహమునకు చేర్చిరి.

వృద్ధులైన సిద్దన్నగారు తను గృహము ముందు మరల చతురంగబలములు వచ్చి జయ జయ ధ్వానములు చేయుట చూచి ఆనందపరవశులైరి. తమ పౌత్రుడు, ఖడ్గతిక్కనగారి కుమారుడు, సేనలకు తనంతట తానే నాయకుడై విక్రమసింహ పురదుర్గమును ముట్టడించి పట్టుకొనినాడని విని ఆయన అవ ధులు లేని ఆనంద మనుభవించెను. మనుమని ఆలింగనము చేసి కొని తిరిగి కుమారుడు ఖడ్గతిక్కనగారు బ్రతికివచ్చినంత సంతోషపడిరి. మంచముపట్టిన ప్రోలాంబ మనుమని వీరకృత్య ముల వృత్తాంతమును ఆలకించి వానిని చేతులలోనికి తీసికొని ఆనందపరవశురాలైనది.

సిద్దన్నగారు ప్రోలాంబను "నీవు వీరమాతవే కాదు, వీరపితామహివి" అని సంతోషపరచిరి. మనుమలను కాశీ ప్రయాణ వివరములను సిద్దన్నగారు మరల మరల ప్రశ్నించిరి. వారు విక్రమసింహపురమును వదలిపెట్టిన తరువాత వారి సంగతులు తెలియవు. పాండ్యసేనల ముట్టడి, చేదిసైన్యముల ముట్టడి, అక్కన బయ్యనల రాజరికము - యిట్టి పెక్కు యిక్కట్లలో విక్రమసింహపురము మునిగియుండుటవలన పురములోని వారికి బయట ప్రపంచముతో సంబంధమే పోయి నది. ఇప్పటికిగాని వార్తలు తెలియలేదు. మహామంత్రి తిక్కన

గారు కాకతీయ చక్రవర్తుల రాజధానికి వెళ్లిరని సిద్ధన్నగారు తెలిసికొని సంతోషపడిరి.

హేమాద్రిరెడ్డి గురునాథులు ఉదయగిరికి తీసికొని వెళ్లిన సేనావిభాగము - యెక్కువగా అశ్వికదళము. కొండ దారులలో ప్రయాణించుచు ఉదయగిరి దుర్గమును సమీపించినది. ఉదయగిరి దుర్గము అభేద్యమైన గిరిదుర్గము. దాని కెదురుగా నొక కొండ యున్నది. దానిపై నొక చిన్న దేవాలయమున్నది. దానికి పూజాపునస్కారములు లేవు. జను లచ్చటకు పోరు. అది పాడుపడిన దేవాలయమని చెప్పుదురు.

కాకతీయ సైన్యములు ఉదయగిరిని ముట్టడించెను. దుర్గాధిపతి తలుపులు మూయించి యుద్ధమునకు సిద్ధపడెను. ఉదయగిరి దుర్గములో కొండపైన జలధార లున్నవి. పంటచేలున్నవి. కోటలోని వారు బయటకు రావలసిన అవసరము లేనేలేదు. యుద్ధ మెన్ని సంవత్సరములు జరిగినను కోటను పట్టుకొనుట పొసగదు. కోటకు రెండు ప్రక్కల ద్వారము లున్నవి. మిగిలిన రెండు ప్రక్కలందు గోడలవలె నిటారుగా కొండభాగము. దాని నెవ్వరు అధిరోహింపలేరు.

తూర్పు దక్షిణములందు ద్వారము లున్నవి. అక్కడ కాకతీయులు మొహరించి ముట్టడిచేసిరి. కోటకు ప్రమాదము చేయలేకపోయిరి.

దుర్గమునకు పశ్చిమమున దుర్గమారణ్యము. దానియందు నెక్కు దిగుడు బావులున్నవి. ఒక నాటిరాత్రి సేనలోని మహా

సాహసికుల బృందమును హేమాద్రి రెడ్డి ఆదిగుడు బావుల కడకు చేర్చెను. తాను తిరిగి వచ్చువరకు వారిని వేచియుండ మని ఆజ్ఞాపించెను.

హేమాద్రి రెడ్డి గురునాథుడు ఖడ్గమాత్రసహాయులై దుర్గమున కెదురుగానున్న పాడుపడిన దేవాలయమునకు పోయిరి. అది మూయబడియున్నది. హేమాద్రి రెడ్డి గురు నాథుడు బలముగా తలుపులు పగులకొట్టిరి. లోపల ప్రవేశించి కాగడాలు వెలిగించి చూచిరి. అది కాళీ ఆలయము. కొన్ని సంవత్సరములుగా మానవులు వచ్చిన జాడలేదు. గుడిలో పాములపుట్టలు సాలెగూడులు. వీరిని చూచి రెండు మూడు కోడెత్రాచులు బుసలు కొట్టినవి. వారు విగ్రహమును చూచిరి. అది మహాభయంకరముగానున్న కాళీ విగ్రహము. దానిని బలముగా త్రోసిరి. ప్రక్కకు జరిగినది. దానిక్రింద పెద్ద సొరంగము.

సొరంగములోనికి దిగుటకు మెట్లున్నవి. ఆలయము తలుపులను మూసి—కాగడాపట్టుకుని హేమాద్రి రెడ్డి సొరం గములోనికి ప్రవేశించెను. గురునాథు డతనివెంట నడిచెను. వెనుకనుంచి మరల కాళీ విగ్రహమును యథాస్థానమునందుంచు టకు వీలున్నదని తెలిసికొని వారట్లు చేసిరి. ఆసొరంగము చాల యిరుకుగానున్నది. మెట్లు సన్నగానున్నవి. ప్రమాద భూయిష్ఠమైన మార్గముగానున్నది. దూసిన కత్తులతో— కాగడాలతో—అప్రమత్తులై వారు ముందునకుసాగిరి. కొంత సేపు మెట్లు క్రిందకు దిగినవి. మరల ఘడియసేపు పైకెక్కినవి.

కొంతసేపటికి తలు పొక్కటి వచ్చినవి. దానిని తెరచుటకు ఘడియ యున్నది—దానిని తీయగా రెండవప్రక్క నొక భయంకర మైన కాళీ విగ్రహము ప్రక్కకు తొలగియున్నది. ఇది యొకదేవాలయము. ఈవిగ్రహము అన్నివిధముల పాడు పడిన గుడిలోని విగ్రహమువలెనున్నది. కాని యిక్కడ నిత్య పూజ జరుగుచున్నట్లున్నది. విగ్రహమును యథాస్థానమునందుంచి నిశ్శబ్దముగా గుడితలుపులు తెరచుకొని బయటకువచ్చి చూచిరి. తాము ఉదయగిరి దుర్గమున పశ్చిమప్రాంతమందుంటిమని వారు గ్రహించిరి.

అచ్చట పాడుపడిన దిగుడుబావి యొకటి కనుపించినది. దానిలో దిగి చూడగా పెద్దద్వారమున్నది. దానిని తెరువగా పెద్ద సొరంగమున్నది. ముగ్గురు యోధులు ప్రయాణము చేయుటకు తగినంత పెద్దది. ఆసొరంగము వెంట పోగా పది నిమిషములలో మరల తలుపులు వచ్చినవి. దానిని తెరువగా మరల నొక దిగుడు బావి. దానినుంచి పైకిరాగా అది పది పదునైదు దిగుడు బావులలో నొక్కటి. ప్రక్కనే మహా సాహసికులైన తమ వీరయోధ బృందమున్నది.

సాహసికవీరయోధ బృందము కోటలో ప్రవేశించి కోటద్వారములు తెరచి సేనలకు దుర్గములోనికి ప్రవేశము కల్పించినవి. ప్రమత్తులైయున్న దుర్గాధిపతి అతని సైన్యము తేలికగా బందీచేయబడిరి. మనుమసిద్ధి మహారాజులవారు చెర నుండి విడిపింపబడిరి.

ఆరాత్రివేళ కలత నిద్దురలో మహారాజుల వారుండగా గురునాథుడు సమీపించి "జయం జయం మహారాజులకు" అని చెప్పగా ఆయనకు కలయో వాస్తవమో తెలియలేదు.

గురునాథునివలన మనుమసిద్ధి మహారాజులకు లోకము లోని విషయములు తెలిసినవి. రక్కెసగంగన వృత్తాంతము, అక్కన బయ్యనల వృత్తాంతము, విక్రమసింహపురమున జరిగిన విషయములు, రాజపత్ని రక్షింప బడుట, కోశాగారము రక్షింపబడుట తెలిసినవి. మహామంత్రులు తిక్కనగారిపై గౌరవము వలన కాకతీయసేనలు వచ్చినవని తెలిసి ఆయన కృతజ్ఞతా మూర్తి యయ్యెను.

మనుమసిద్ధిమహారాజు తో చెప్పి హేమాద్రిరెడ్డి చక్రవర్తులవారికి విన్నపములు వ్రాసి ఆంచె గుఱ్ఱములపై రాజధాని నగరమునకు పంపెను. అంతకు మును విక్రమసింహపురము నుంచి విజయవార్తలువచ్చినవి. ఖడ్గతిక్కనగారి కుమారుని వీర కృత్యములు అందరను పులకితులను చేసినవి.

మనుమసిద్ధి మహారాజు ఉదయగిరి దుర్గమును పట్టుకొనె నని తెలియగా గండికోటప్రభువు అంబయదేవుడు తన ప్రభు భక్తిని ప్రకటించుకొనుచు కానికలతో విన్నపములను పంపు కొనెను. రక్కెసగంగన కుమారుడు అల్లుగంగరాజు వివేక వంతుడు. కాకతీయసైన్యముతో తానుయుద్ధము చేయజాలనని గ్రహించెను. ఉదయగిరిదుర్గము మనుమసిద్ధివశమైనదని, అక్కన బయ్యనలు బందీలైరని గండికోట అంబయదేవుడు

మనుమసిద్ధి మహారాజులయందు ప్రభుభక్తిని ప్రకటించినట్లు వార్తలను విని తన కర్తవ్యము నిశ్చయించుకొనెను. తాను కూడ మనుమసిద్ధి మహారాజులయందు భక్తిని ప్రకటించుచు కప్పము కట్టు మండలేశ్వరునిగా తన్ను నిలువనీయుడని విన్నపములతో కానికలను పంపెను.

హేమాద్రిరెడ్డి సైన్యములతో మనుమసిద్ధి మహారాజు విక్రమసింహపురమును చేరగా, దుర్గాధిపతి, ప్రజలు, సైనికులు, ఖడ్గతిక్కనగారి కుమారుడు, మహామంత్రి తిక్కనగారికుమారుడు స్వాగతములు చెప్పిరి.

విక్రమసింహపురమును కాకతీయుల సేనాబలముతో ఖడ్గతిక్కనగారి కుమారుడు స్వాధీనముచేసికొనె నన్నవార్త మేఘములమీద ప్రయాణించినది. దశదిక్కులకు ప్రయాణము చేసినది. ప్రయాణముతో క్రొత్తసొబగును కూర్చుకొనుచు పోయినది. తిరుమలలో వైష్ణవసేవ సేయుచున్న బయ్యనగారి కా వార్త పరవశత్వము సమకూర్చినది. రాజపత్ని ప్రసవించి కుమారుని కన్నది. రాజపత్నిని రాజకుమారుని వెంటబెట్టుకుని బయ్యనగారు విక్రమసింహపురమునకువచ్చి చేరిరి. భవ్యభారతి బయ్యనగారు తిరుమలలో నుండగా వైష్ణవవేషమును ధరించియుండిరి. దినములు గడువగా వారికి నిజమైన వైష్ణవమతాభిమానము ప్రబలినది. తిరుమలలో ఉత్తమవైష్ణవులైన తిరుమల నల్లాణ చక్రవర్తులవారి కుటుంబములో ఆచార్యపురుషులైన గోవింద తాతాచార్యులవారిని ఆశ్రయించి సమాశ్రయణముపొంది

విష్ణుభక్తులైరి. ఆయనకు యిలువేల్పయిన శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువుపైన భక్తి పెరిగిపోయినది.

శ్రీహరికోటలోనున్న అన్నంభట్టునకు కూడ క్రమ సింహాపురమున జరిగిన మార్పులు తెలిసినవి. అతడు తన అను చరవర్గముతో పల్లెకారి వేషములను త్యజించి వీరోచితమైన ఆభరణాలంకారములతో ధనకోశమును తరలించుకొని విక్రమ సింహాపురమునకు వచ్చిచేరెను.

మనుమసిద్ధి మహారాజులవారికి స్వాగతము చెప్పిన వారిలో భవ్యభారతి బయ్యనగారు ప్రబంధాంకపు అన్నంభట్టు కూడ నుండిరి. ఆత్మకూరి గురునాథు డాయన వెంటవచ్చెను.

తిరిగివచ్చిన గురునాథునికి మహాదుఃఖము కలిగినది. పెన్నానదీ స్నానఘట్టమున గురునాథుడు నిర్మించిన విఘ్నేశ్వర దేవాలయము పడగొట్టబడియున్నది. విగ్రహము విరూపము చేయబడి ముక్కలు ముక్కలు చేయబడియున్నది. కొప్పెరుం జింగని చేదిసైనికులు గణపతి భక్తులు. వారు విక్రమసింహ పురమునందున్నంతవరకు విఘ్నేశ్వరాలయమును భక్తితో కాపాడిరట. వారు వెళ్లిపోయిన తర్వాత అక్కన బయ్యనలు గురునాథునిపై ఆగ్రహముతో అతడు నిర్మించిన ఆలయమును పాడుచేసిరట. గురునాథుడు మిక్కిలి దుఃఖించెను. అతని దుఃఖ మెరిగిన మనుమసిద్ధిమహారాజులవా రతనిని యోదార్చి మహా మంత్రులవారు తిరిగివచ్చిన తరువాత వారిని సంప్రతించి పెద్ద ఆలయమును కట్టింతుమనిరి.

మనుమసిద్ధిమహారాజులవారు ప్రభుభక్తి పరాయణు లైన సైనికులకు, దళపతులకు, దండనాథులకు, మంత్రులకు సమ్మానగౌరవములు చేసిరి. కాకతీయసైనికులకు, దండనాథులకు, సేనాపతికి సముచితమైన గౌరవములు చేసిరి.

హేమాద్రి రెడ్డి మనుమసిద్ధిమహారాజులవారికి కాకతీయగణపతిదేవచక్రవర్తులవారి ఆజ్ఞలను వినిపించెను. విక్రమసింహపురరాజ్యము ఆంధ్రసరస్వతీదేవికి చక్రవర్తులవారి సమర్పణమని - మహాకవులు తిరిగి విజయము చేయువరకు మనుమసిద్ది మహారాజులవారు రాజప్రతినిధిగా వ్యవహరింపవలసియుండునని చెప్పెను

తరువాత హేమాద్రి రెడ్డి కాకతీయబలములను తరలించుకొని రాజధానినగరమునకు బయలుదేరెను. మనుమసిద్ధి మహారాజు విక్రమసింహపురసేనాదళములవారు, కాకతీయ సైనికోద్యోగులకు సముచితమైన వీడ్కోలు చెప్పిరి.

హేమాద్రి రెడ్డిచెప్పిన మాటలనుబట్టి మనుమసిద్ధి మహారాజులవారికి కాకతీయగణపతిచక్రవర్తుల ఔదార్యగుణ మెంత గొప్పదో తెలిసినది. తన తండ్రి తిక్కదేవచోళ రాజులవారు మహాభారతమును ఆంధ్రీకరించిన వారికి అర్ధాసనమిచ్చి గౌరవింతుమని ప్రకటించిరి. ఆప్రతిజ్ఞను తాను నిర్వహింపనే లేదు. మహాకవులు భారతరచన పూర్తిచేసికొని పురప్రవేశము చేసిన నాడే వారికి కళత్రవియోగము జరిగినది. తరువాత వారు కాశికి వెళ్లిపోయిరి. తాము చేయవలసిన గౌరవసమ్మాన

ములల్లే నిలచియున్నవి. పాలింపవలసిన పితృశాసనమల్లే యున్నది. కాకతీయచక్రవర్తులు మహాకవికి రాజ్యమునే సమర్పించిరి. వారి ఔదార్యము షట్చక్రవర్తులను మరపించుచున్నది. ఆమహాకవికి సమ్మానము చేయకపోగా ఆయన సంపాదించిన రాజ్యమును తాము అనుభవింపవలసివచ్చినది. ఈ భావములతో మనుమసిద్ధి మహారాజు లజ్జాభరితుడై పోయెను.

మహామంత్రులవారు పాదచారులై పరివారవిహీనముగా కాకతీయనగరమునకు వెళ్లిరి. వారు తిరిగివచ్చుటకు పరివారమును పంపవలసియున్నది. పరివారము వెళ్లకపోయినచో చక్రవర్తులవారు వారిని తమ దగ్గరనే నిలుపుకొనవచ్చును. భవ్యభారతి బయ్యనగారు, ప్రబంధాంకం అన్నంభట్టు ఆత్మకూరి గురునాథుడు మహారాజులవారి అనుజ్ఞతో పరివారసమేతులై మహామంత్రులవారిని తోడితెచ్చుటకు బయలుదేరి

## 35

హేమాద్రిరెడ్డి పంపిన వర్తమానము అంచె గుఱ్ఱముల మీద ప్రయాణించినది. ఉదయగిరినుండి అహోబలము మీదుగా శ్రీశైలముచేరి అక్కడ కృష్ణానదిని దాటిన వార్త కాకతీయ రాచనగరు చేరినది.

మహాకవి తిక్కనగారికి ఓరుగల్లులో అఖండమైన ఆతిథేయసత్కారములు జరుగుచున్నవి. వారు విశ్వేశ్వరశివాచార్యులవారింటిలో బసచేసిరి. వారి నిత్యాగ్నిహోత్రమునకు

నిత్యానుష్ఠానమునకు కావలసిన సకల సదుపాయములు సమ కూర్చబడినవి. మహాకవిగారు తమ శిష్యుడైన మారన్నగారి గృహమున రెండు దినములు దేవతార్చన చేసిరి. మిగిలిన దిన ములలో విశ్వేశ్వరశివాచార్యుల వారింటిలోనే దేవతార్చన జరుగుచున్నది. వారిని నిత్యము అన్ని వేళలందు విశ్వేశ్వరశివ దేశికులు సేవించుచుండిరి. అనుష్ఠానభోజన నిద్రాకాలములందు గాక మిగిలిన సమయములందు విద్వద్గోష్ఠి, ఇష్టాగోష్ఠి జరుగు చుండెను. వేదపండితులు, వేదాంగవిదులు, శాస్త్రకోవిదులు, దార్శనికులు, సాహిత్యవేత్తలు, పౌరాణికులు వచ్చి మహాకవి గారితో విద్వద్గోష్ఠిలో పాల్గొనుచుండిరి. శాస్త్రవిదు లాయ నతో వాకోవాక్యమునందు పాల్గొనుట, విషయములు చర్చిం చుట, వేదార్థప్రవచనములు చేయుట, వ్యాఖ్యానములను పరి శీలించుట చేయుచుండిరి. ఆయనతో గోష్ఠి పండితులకు పరమా నందకరముగా నుండెను.

కాకతీయచక్రవర్తులు శైవులు. వారికి పరమతద్వేషము లేదు. అన్ని మతములవారిని ఆదరించుట వారి సంప్రదాయము. వారి సామ్రాజ్యమునందు, రాజధానినగరమునందు అన్ని మత ములవారు కలరు. అన్ని మతములవారి చక్రవర్తులవారి సభలో గౌరవముండెను. చక్రవర్తులకు వారందరియందు ఆదర ముండెను. బౌద్ధపండితులు, జైనపండితులు కూడవచ్చి విశ్వే శ్వరశివాచార్యులవారితో ఇష్టాగోష్ఠి జరుపుట కలదు. అన్ని మతముల పండితులు, దార్శనికులు, మహాకవి తిక్కన సోమ

యాజిగారితో దార్శనిక తాత్త్వికప్రసంగములు చేయుచుండిరి. వారందరు అపారమైన మహాకవుల శాస్త్రపాండిత్యమును ప్రశంసించిరి. బౌద్ధులలో ప్రమాణశాస్త్రచర్చకు సరళస్వరూప మును ప్రసాదించి, పారిభాషిక పదజాలరహితముగా శుద్ధ బుద్ధి వాద దార్శనికశాఖగా ప్రమాణశాస్త్రమును రూపొందించిన దిఙ్నాగాచార్యులవారు మధ్యయుగ న్యాయశాస్త్రమునకు పితృపాదుల వంటివారనియు, ఆయన తన న్యాయశాస్త్రమును వేంగీమండలమున నివసించుకాలమున ఆంధ్రపండిత గోష్ఠు లలో చర్చల ఫలితముగా సంకలించిరనియు మహాకవులు చెప్పగా బౌద్ధపండితులు సంతోషపడిరి. మరియు ఆర్యనాగార్జు నుల శూన్యవాదబౌద్ధము భావాభావరహితమై - ఉపనిషన్మత మునకు దగ్గరగా నున్నదనియు, నిజమునకు నాగార్జునుఁడు ప్రచ్ఛన్న అద్వైతవాది యని మహాకవులు నిరూపించిరి.

ఇన్ని దినములు విశ్వేశ్వరశివాచార్యులవారు, మారన్న గారు, రాచకార్యములను పట్టించుకొనలేదు. మహాకవులతో కాలము గడపుచుండిరి. చక్రవర్తులవారికి స్వాస్థ్యము లేదనియు, త్వరలో వారికి స్వాస్థ్యము చేకూరుననియు, తరువాత వెంటనే చక్రవర్తులవారి దర్శనము చేయింపగలమనియు మహాకవు లకు మనవిచేసిరి. ఈలోగా మహాకవులకు ఆతిథేయసత్కార ములతో, పండిత గోష్ఠులతో ఆనందము కలిగించుచుండిరి.

ఒకనాటిరాత్రి హేమాద్రి రెడ్డి పంపిన వార్తవచ్చి చేరి నది. దివాణమునుండి విశ్వేశ్వరశివాచార్యులవారికి విన్నపము

వచ్చినది. ఆయన వెళ్లి చక్రవర్తినిగారిని దర్శించివచ్చి మహాకవులకు చెప్పిరి. చక్రవర్తులవారికి ఆరోగ్యముగా నున్నదనియు, వారు మహాకవుల దర్శనముచేసి సేవించుకోవడమునకు తొందరపడుచుండిరనియు - ఆ మరునాడే మహాకవులవారిని సకల సార్వభౌమలాంఛనములతో సభకు తోడ్కొని రమ్మని చక్రవర్తులవారి ఆజ్ఞ అయినదని - సభలో మహాకవులను చక్రవర్తులవారు సేవించుకొందురనియు చెప్పిరి.

మరునాడు మహాకవుల ప్రాతస్సాధ్యాహ్నిక అనుష్ఠానములు పూర్తి అయి, భోజనములైన తర్వాత వారిని చక్రవర్తుల సభకు తోడ్కొనిపోవుటకు పట్టపుటేనుగు వచ్చినది. అది చక్రవర్తులవారు మాత్రమే ఉపయోగించు గజశ్రేష్ఠము. మహాకవుల నాసార్వభౌమగజముపై కూర్చుండబెట్టిరి. విశ్వేశ్వరశివదేశికులు, మారన్నగారు వింజామరలు పట్టిరి. శ్వేతచ్ఛత్రాది సార్వభౌమలాంఛనములతో, నాట్యకత్తెల మేళములతో, మంగళవాద్యములతో, చతురంగబలపరివారముతో, జయజయ ధ్వానములతో ఊరేగింపుసాగినది. ప్రతివీథిలో ప్రతిగృహముకడ పూర్ణకుంభములతో మంగళహారతులతో గౌరవములు నడచినవి. సర్వసేనాధ్యక్షులైన వృద్ధనాగమనీడుగారు, యువరాజు రుద్రమదేవమ్మవారు చోపుదారులుగా వెండి బెత్తములతో ముందు నడచిరి. వైతాళికులు బిరుదుగద్యలు చదివిరి. వేదపండితులు స్వస్తివాచకము పలికిరి.

ఊరేగింపు రాచనగరులో ప్రవేశింపగా మహాకవులు గజమునుండి దిగి పల్లకిలో కూర్చుండిరి. అక్కడ చతురంగ బలము నిలచిపోయినది. నాట్యకత్తెలు నిలచిపోయిరి. మంగళ వాద్యములతో పల్లకీ ముందునకు సాగిపోయినది. విశ్వేశ్వర శివాచార్యులవారు మారన్నగారు వింజామరలతో పల్లకీ రెండు ప్రక్కలందు నడచిరి. సర్వసేనాధ్యక్షులు నాగమనీడు గారు, యువరాజులవారు ముందు నడచిరి.

రాజసభాముఖద్వారముకడ గణపతిదేవ చక్రవర్తుల వారు నిలచియుండిరి. వారు పల్లకిని సమీపించి కొమ్ముపట్టి దింపిరి. వారు చూపిన గౌరవము అపూర్వమైనదని, అదిలోక మైనదని, అనన్యమైనదని అందరు ఆశ్చర్యచకితులైరి. చక్ర వర్తుల మహౌదార్యమునకు మహాకవులు పరవశులైరి. అన్యో న్యఅభివానదల తరువాతచక్రవర్తులవారు మహాకవులతో "తమరు ఆంధ్రసరస్వతీదేవిఅవతారమూర్తులు. తమకు చేసిన సేవ బ్రాహ్మీసేవ అవుతుంది. అమ్మవారు మమ్ము అనుగ్రహించు టకు స్వయముగా విజయము చేసినప్పుడు మానవశక్తిపరి మితిలో చూపబడే గౌరవములు అల్పములే. కాబట్టి మా నవ సత్కారములలో మానవ సహజమైన లోపములుంటే మన్నింపుడని ప్రార్థన" అని చేతులు జోడించిరి.

మహాకవులు అంజలి బంధించి "చక్రవర్తులవారు అనన్య మైన గౌరవమును అనుగ్రహించిరి. వ్యాసవాల్మీకి మహర్షులకు గాక - మరేకవి కీయిటువంటి మహాగౌరవము - ఏచక్రవర్తీ

చూపించలేదను కుంటాను. నాకృతజ్ఞతలు సహస్రధా మనవి చేసుకుంటున్నాను" అని విన్నవించిరి.

వేదవేత్తలు పూర్ణకుంభముతో స్వాగతము నివేదించిన తర్వాత చక్రవర్తులవారు మహాకవులను సభలోనికి తోడ్కొని పోయిరి. ముందు వెండిబెత్తములతో సర్వసేనాధ్యక్షులవారు నాగమనీడుగారు, యువరాజులు రుద్రమ్మదేవమ్మవారు త్రోవ తీసిరి. చక్రవర్తులవారు మహాకవుల చేతులను తమ హస్తము లందుంచుకొని తోడ్కొనిపోయిరి. విశ్వేశ్వరశివదేశికులు మారన్నగారు వింజామరలు పట్టుచు వెంటనడచిరి. వైతాళికులు బిరుదు గద్యలతో హెచ్చరికలు చేసిరి. సభాస్తారులు లేచి హర్షధ్వానములు చేసిరి.

మహాకవులకు సార్వభౌమ గౌరవలాంఛనములతో చక్రవర్తుల సభాప్రవేశము కలిగినది. వెండిబెత్తములవారి బరాబరులు, వందిమాగధుల కైవారములు, సామ్రాజ్యమహా ప్రధాన రాజగురువుల వింజామరలు, శ్వేతచ్ఛత్రము, పగటి దివిటీలు, హెచ్చరికలు, చాంగుసాహులు, సముచితగౌరవములు జరుగుచుండ చక్రవర్తులవారు కవిబ్రహ్మల కైదండపూని తోడ్కొనివచ్చిరి. పురోహితులు ముందుగా నడచి చక్రవర్తుల వారి సింహాసనమును, మహాకవులు ఆసీనులు కావలసిన ఆసనమును, విశ్వేశ్వరశివాచార్యులవారి ఆసనమును మంత్ర సంస్కారముచేసిరి. చక్రవర్తులవారు, మహాకవులు, విశ్వేశ్వర

శివాచార్యులవారు నిలువబడియున్న సభాస్తారులకు వినయ నమస్కారములు చేసిరి.

చక్రవర్తులవారు మహాకవులను ఆసీనులనుచేసి, రాజగురువులగు విశ్వేశ్వరశివాచార్యులవారు ఆసీనులైన తర్వాత తాము సింహాసనారూఢులైరి. సభ జయజయ నాదములతో నిండెను.

## 36

వేదపండితులు స్వస్తిప్రవచనము సలుకగా, సభా ప్రారంభమైనది. వందిమాగధులు కాకతీయ గణపతిదేవ చక్రవర్తులవారి విజయబిరుద ప్రశస్తిచదివిరి. "స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర రాజపరమేశ్వర, ఉద్దండ మండలాగ్రప్రచండ, నెలవీడుగండ...కొమరమీసరగండ" అని చదివి అవధారు చిత్తగింపు మనిరి.

తరువాత భట్టుకవులు మహాకవి తిక్కనగారి విజయ ప్రశస్తి చదివిరి. "స్వస్తి ఉభయ కవిమిత్ర, బుధారాధనవిరాజమాన, ఆంధ్రభాషాకవిబ్రహ్మ, సర్వపృష్ఠాగ్నిచయన పౌండరీకాంత సర్వక్రతునిర్వహణదక్ష, త్రయ్యంతనిష్ణాత, మత్స్యమరాధిపాచార్య, ప్రజ్ఞాయౌగంధరాయణ" అని చదివి అవధారు చిత్తగింపు మనిరి.

మారన్నగారు లేచి సభా నమస్కారముచేసి చక్రవర్తులవారి సభను యేర్పాటుచేయుట, మహాకవులను గౌరవ సమ్మానములతో సత్కరించి వారియందు కాకతీయాంధ్ర

సామ్రాజ్యప్రజలకు, చక్రవర్తులకు గల భక్తి గౌరవములను వెల్లడించుట కనియు, ఆంధ్ర మహాభారతమును నిర్మించిన మహా కవియందు కృతజ్ఞతాంజలి ఘటించుట కనియు చెప్పి సభను కలయజూచిరి.

సహస్రమాసవృద్ధుడు సర్వసేనాధ్యక్షులవారు, నాగమనీడు గారు లేచి, చక్రవర్తులకు, మహాకవులకు, సభకు నమస్కరించి, చేతులు జోడించి, తమ దొక విన్నపమున్నదని అవధరింపుడని చక్రవర్తులవారికి మనవిచేసెను. చక్రవర్తులవారు మందస్మిత పూర్వకమైన అనుకూలశిరఃకంపనము చేసిరి. నాగమనీడుగారు తమ విన్నపమును విన్నవించిరి. "మహాకవులవారి దర్శనము కాకతీయాంధ్రచక్రవర్తుల రాజధానీ నగరప్రజలకు తమ పూర్వపుణ్యవిశేషమువలన లభించినది. మహాదృష్టమువలన లభించినది. ఈ అవకాశమును సభాస్తారులు చేయి జారవిడచుకో దలచుకొనలేదు. ఆంధ్రమహాభారతమునం దొక రమ్యమైన ఘట్టమును ఆంధ్రసరస్వతీ ముఖమున వినవలెనని సభవారికి కుతూహలముగా నున్నది. తమ కోరికను మన్నింపుడని బ్రహ్మీమూర్తులైన మహాకవులను సభికులు వేడుచున్నారు" అని శిరము వంచిరి.

చక్రవర్తులవారు మహాకవులవంకచూచి మందస్మితము చేసిరి. మహాకవులు సుముఖులై ప్రసన్నులై యుండుట గమనించి చక్రవర్తులవారు నాగమనీడుగారితో "ఆరమణీయఘట్టమేదో మీరే చెప్పుడు" అనిరి. "మహాప్రసాదము" అని నాగమనీడు

గారు మరల "మహాకవుల భారతరచనలో విరాటోద్యోగ పర్వములు మన నగరములోని వారందరకు కంఠగతములైనవి. ఈనాటి సభ యంతయు వీరపురుషమయముగా నున్నది. యుద్ధపంచకములోని ఘట్టమేదియేని చదివిన వీరపురుషవిస్తార మైన సభ సంతోషభరితమౌతుంది." అనిరి.

విశ్వేశ్వరశివాచార్యులవారు మందస్మితముతో "యుద్ధ మంటే కురువృద్ధులైన భీష్మాచార్యులవారి యుద్ధముగాని, పాండవకుమారవీరాగ్రణి అభిమన్యుకుమారుని యుద్ధముగాని అవుతుంది. మిగిలిన వారి యుద్ధాలు సామాన్యములు" అనిరి. చక్రవర్తులవారు కల్పించుకొని "మన నాగమనీడుగారు భీష్ముల వలె శతవృద్ధు. కాని రణరంగమున కుమారవీరులే. వారికిన్నీ అభిమన్యుకుమారుని రణక్రీడావిహారమే అభీష్టఘట్టమయి ఉంటుంది. పద్మవ్యూహఘట్టము అభిమన్యుకుమారుని రణకేళిలో ముఖ్యమైనది కదా" అని మహాకవుల వంకచూచిరి.

సభలో మహాకవి తిక్కనగారి శిష్యుడు మూలఘుటిక కేతన లేచి ఆంధ్రమహాభారతగ్రంథమునుండి ద్రోణపర్వ ద్వితీయాశ్వాసభాగమును తీసికొని ముందునకు వచ్చెను. మారన్నగారువచ్చి దానిని గ్రహించి మహాకవి తిక్కనగారికి అందించిరి.

మహాకవులు గ్రంథమును స్వీకరించి—ఒడిలో పెట్టు కొనిరి. కనులు మూసికొని మౌనముగా ఇష్టదేవతాధ్యాన మును చేసిరి. తరువాత సభను చూచి వినీతశిరశ్చాలనము,

చేసిరి. నారాయణుని, నరోత్తముడైన అర్జునుని, సరస్వతీదేవిని, వేదవ్యాసుని, నన్నయభట్టారకులవారిని స్తుతించిరి. గ్రంథమును తెరచి కుడిచేతి యందుంచుకొని పఠించుటకు ప్రారంభించిరి.

"శ్రీకరభక్తాంభోధి సుధాకర, చక్రత్రిశూల ధారణ రక్షో
భీకర, నిర్భరతరకరుణాకర, దృగ్దీప్తినికర హరిహరనాథా."

అది ద్రోణాచార్యులవారి మూడవనాటి యుద్ధము. ధర్మరాజును చెరపట్టితెచ్చి యిత్తునని ద్రోణులు కురురాజునకు వరమిచ్చియుండుటచేత, తమమాట నిలుపుకొనుటకు ద్రోణులు కృతనిశ్చయులై యుండిరి.

ద్రోణులు కౌరవసైన్యములను పద్మవ్యూహమున సంఘటించిరి. పద్మాకారముగల ఆవ్యూహమునకు వివిధరాజలోకము దళములుగా నుండిరి. రాజకుమారులు కేసరములుగా నుండిరి. కర్ణునిచేత, దుశ్శాసనునిచేత బహుసేనాబలముచేత పరివేష్టింపబడిన కురువిభుడు కర్ణికగా నిలచెను. ఆవ్యూహము అభేద్యమైనది. ఆవలయాకారసేనావ్యూహమునకు ముఖద్వారముకడ ద్రోణాచార్యులవారు దర్పము మెరయగా నిలువబడియుండిరి. మరియు జయద్రథుడు, అశ్వత్థామ, కృపాచార్యులు, శకుని, కృతవర్మ, భూరిశ్రవశ్శలశల్యులు, మిగిలిన ధార్తరాష్ట్రులు, వారిపుత్రులు రక్తమాల్యములతో, రక్తాంబరభూషణములతో సంఘటించి నిలచిరి. ఆకౌరవబలమును పాండవబలమువచ్చి తాకినది. పాండవసేనాముఖమున భీమసేనుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కుంతిభోజుడు మొద

లైనవారుండిరి. ద్రోణాచార్యులవారు వారందరను వాడియైన బాణములతో త్రిప్పికొట్టిరి. వారు మహావీరులై యుండియు ద్రోణాచార్యులవారి ముందు నిలువలేకపోయిరి. పాండవ బలము తిరుగుడు పడినది. ధర్మరాజు వెరగుపాటుతో తల్లడిల్లెను. ఉత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్షకుడైన అభిమన్యుకుమారుడు మాత్రమే ఆవ్యూహమును భేదింపగలడని ధర్మరాజు నిశ్చయించినవాడై అభిమన్యుకుమారుని పిలచి "నాయనా! ఈవ్యూహమును భేదింపగల సమర్థులము మేము కాము. నీవు, అర్జునుడు, అచ్యుతుడు ప్రద్యుమ్నుడు మాత్రమే సమర్థులు. ఇప్పుడు మీతండ్రి దూరముగా యుద్ధము చేయుచున్నాడు. అచ్యుతు డతనికి సారథిగా వెళ్లెను. వారు వచ్చి మమ్ము అపహాస్యము చేయకుండునట్లు నీవు పద్మవ్యూహమును భేదింపుము. నీవెనుక నేను వచ్చి కౌరవ మూకలను చించి చెండాడెదను." అని వచించెను. అప్పుడు అభిమన్యుకుమారుడు ధర్మరాజుతో "నే నీ వ్యూహమును భేదించు విధానమును మాత్రమే మా తండ్రిగారివలన వింటిని. బయల్వెడలునట్టి విధమును వినలేదు. దానికేమి? నేను లోపలకు పోయెదను. శౌర్యము చూపెదను" అనెను. అంత ధర్మరాజు "నీవు లోపలకు చొచ్చినవెంటనే మే ముంతరము నీవెనుక వచ్చెదము." అనెను. భీమసేనుడు కూడ ఆ అభిప్రాయమును సమర్థించెను. అభిమన్యుకుమారుడు పెదతండ్రు

లకు ఆనందమును కలిగించుటకై రథమెక్కి కౌరవసేనల పైకి వెళ్లి వారిని మార్కొనెను.

అభేద్యమైన పద్మవ్యూహమును సౌభద్రుడు భేదించుకొని రౌద్రమూర్తిగా కౌరవసేనలను కల్లోలము చేసెను. అభిమన్యుకుమారుని వీరవిహారమునకు తేరులు విరిగినవి. హయములు నేల కొరిగినవి. కాల్బలములు త్రెళ్లినవి. పతాకములు తెగినవి. ఛత్రములు నేల పడినవి. కౌరవసైన్యము దీనదశకు వచ్చినది. అప్పుడు సుయోధనచక్రవర్తి సౌభద్రునితో తలపడుటకు సిద్ధపడెను. అది చూచిన ద్రోణాచార్యులవారు కౌరవసైన్యమును పిలచి సుయోధనుని రక్షించుటకు పురికొల్పెను. అంత కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుడు, సోమదత్తుడు, సౌబలుడు, మద్రపతి మొదలగువారు అభిమన్యునితో తలపడిరి. వారందరు అనేక శస్త్రాస్త్రపరంపరలచేత అభిమన్యుని నొప్పించిరి. కాని సౌభద్రుడు వారందరను సమెత విశిఖవేగమున నెత్తుట బొత్తిల్ల చేసెను. కర్ణుడు పలాయనము చేసెను. శల్యుడు మూర్ఛపోయెను. కౌరవసేనలు పారిపోయినవి.

అంత శల్యుని తమ్ముడు సౌభద్రుని తీవ్రబాణములతో గాయపరిచెను. అభిమన్యుడు కోపించి వాని గుఱ్ఱములను చంపి, రథసారథిని తెగటార్చి, పతాకమును కూల్చి, వాని బాహువులను ద్రుంచి శిరము నేలపై దొల్లునట్లు చేసెను.

అంతట ద్రోణాచార్యులవారు, కృపాచార్యులవారు, అశ్వత్థామ, కృతవర్మ, బృహద్బలుడు, కర్ణుడు మొదలగు మహాయోధులందరు ఒకరి నొకరు పిలిచికొని, ఉత్సాహపరచుకొని, సేనలను సమీకరించుకొని, రథనేమి గజఘంటాతురంగ కింకిణీస్వన సింహనాదమేదురోదోంతరరౌద్రముగా సుభద్రకుమారుని చుట్టు ముట్టిరి. కాని వీరాభిమన్యుకుమారుడు భయపడలేదు. చలింపలేదు. వీరాట్టహాసము చేసెను. లాఘవముతో లక్ష్యశుద్ధితో చిత్రమైన శరఖేలనముతో కృష్ణార్జునులను తలపించునట్లుగా యుద్ధముచేసెను. ఒక్క కోదండముతో శరవేగనైపుణ్యమువలన మండలమును నిర్మించుకొని శరపరంపరలనబడుకిరణములతో పరివేషవలయమున దుర్నిరీక్ష్యుడైన సూర్యభగవానునివలె నుండెను. అభిమన్యుకుమారుని ముందు కౌరవసేనలు నిలువలేకపోవుచుండెను.

విక్రమదుర్దముడైన పార్థనందనునికి తోడుగా వెనుక వచ్చుచున్న పాంచాలయాదవ పౌండ్రకేకయ మాత్స్య ప్రముఖసైన్యమును సింధురాజైన జయద్రథుడు అడ్డుపడి మహాపర్వతమువలె నిలుపుదల చేసెను.

పద్మవ్యూహమధ్యమున సుభద్రాకుమారు డొక్కడే అసహాయశూరుడై కోదండమాత్రసహాయుడై వీరవిహారము చేయుచుండెను. ఆసమయమున అనేకమంది కౌరవమహాయోధులు బాలుడైన అభిమన్యుని చుట్టుముట్టిరి."

కథ నడచిన దింతవరకు. సభ ప్రశాంతముగా, ఏకాగ్రచిత్తముతో కుతూహలాయత్తమై వినుచున్నది. అంతలో సర్వసేనాధ్యక్షులు సహస్రమాసవృద్ధులు, నాగమ సేనాని సింహగర్జనలుచేయుచు—ఖడ్గమును దూసి—ఆసనము పైనుంచి లాఘవముగా లంఘించి సభా మధ్యభాగమునకు దూకి రుద్రాకృతిగా వెలిగెను. సభాస్తారులకు ఏకాగ్రతభంగము కాగా విస్తుపోయిరి.

చక్రవర్తులవారు ప్రమత్తులుగా నున్నప్పుడు మీదకు లంఘించి హత్యచేయు దురుద్దేశముతో నాగమనీడు లంఘించి యుండెనేమో యన్న భావముతో చక్రవర్తులవారి అంగరక్షక బలము కత్తులుదూసి చక్రవర్తులవారి సింహాసనము చుట్టు ఖడ్గములతో వలయమును నిర్మించినది. సర్వసేనాధ్యక్షుల వారికికూడ ముప్వురు అంగరక్షకు లుండిరి. ఆపరిస్థితులలో వారికేమి చేయవలయునో తెలియక కత్తులు దూసి నాగమనీడు గారి చుట్టును రక్షణవలయమును నిర్మించి మొహరించి నిలువ బడిరి. సభాస్తారులందరు హాహాకారములు చేసిరి నాగమనీడు గారింకను సింహగర్జనలు చేయుచుండెను. ఎవ్వరికి నేమియు బోధపడలేదు. ఆ పరిస్థితులలో మహాకవి తిక్కనగారు మహా భారతపఠనమును నిలుపుదలచేసిరి.

చక్రవర్తులవారు లేచి నాగమనీడుగారిని చూచుచు "సర్వసేనాధ్యక్షులవారు చాల వీరోద్రేకమున నున్నారు. ఏమో చెప్పదలచుకున్నట్లు తోచుచున్నది. చెప్పండి" అనిరి.

నాగమనీడుగారు లాఘవముగా ఖడ్గమును శిరము చుట్టు వలయముగా త్రిప్పి వీరనమస్కారము చేసిరి. ఖడ్గమును ధరించిన కుడిచేతిని పైకెత్తి "ఆంధ్రచక్రవర్తులకుజయం జయం. ధర్మమూర్తులు గణపతిదేవచక్రవర్తులు ఆంధ్రసామ్రాజ్యమును పరిపాలించుచుండగా అధర్మము జరుగుటకు వీలులేదు. అధర్మమును ఆంధ్రజనులు సహింపరు. భరింపరు. రణరంగమున ధర్మయుద్ధమే జరుగవలెను. అధర్మయుద్ధము జరుగరాదు చూడండి. కౌరవహతకులు పెక్కుమంది మహాయోధులు యేకమై, అధర్మయుద్ధముగా అభిమన్యుకుమారుని మీద—
క్కుమ్మడిగా తలపడిరి. అది యుద్ధధర్మము కానేకాదు అభిమన్యునికి సహాయముగా వెళ్లువారిని సైంధవుడు నిలిపి
ను. అది న్యాయముకాదు. ఇంత అధర్మమును ఆంధ్ర
నికులు చూచి సహింపలేరు. చక్రవర్తులవారి ఆజ్ఞ అయితే నేను ఇప్పుడే ఆంధ్రసేనలను తరలించుకొని హుటాహుటిని కురుక్షేత్రమునకు వెళ్లి అభిమన్యుకుమారునికి తోడ్పడతాను కౌరవహతకులకు బుద్ధిచెప్పి రణధర్మమును బోధింపగలను! ఆజ్ఞ యిప్పించండి!" అని సింహగర్జన చేసి వలయచంక్రమణముచేసి కత్తిపై శిరస్సువంచి నిలువబడెను.

సభ సాధుసాధుధ్వానములతో పులకాంకితమై పోయినది. పరిస్థితులను అవగాహనచేసికొనిన నాగమనీడుగారి అంగరక్షకులు, చక్రవర్తులవారి అంగరక్షకులు యథాపూర్వస్థానములకు వెళ్లి ఆనందపులకితులై నిలువబడిరి.

నాగమనీడుగారు అట్లే ఖడ్గముమీద శిరస్సువంచి వీర సమాధిలో నుండిపోయిరి. చక్రవర్తులవారు పులకాంకితులై సింహాసనమునుండి దిగివచ్చి నాగమనీడుగారిని ఆలింగనము చేసికొని—ఆయన ఖడ్గమును తీసికొని, ఒరలోపెట్టి, వారి చేతులను తమ చేతులలోనికి తీసికొని "సర్వసేనాధ్యక్షులవారు శ్రమపడనక్కరలేదు. శ్రీకృష్ణపరమాత్ములవారు స్వయముగా కురుక్షేత్రమందుండి యేదియెట్లుచేయవలెనో అట్లేజరిపించిరి. ఆయన జగన్నాటకసూత్రధారి. మీరు ఆవేశపడకండి". అని చెప్పి నాగమనీడుగారిని ఆయన ఆసనముకడకు తీసికొని పోయి వారితో "మీరుమాతండ్రిగారి కాలమునుండి ఆంధ్ర సాంమ్రాజ్య సర్వసేనాపతులుగా నుండితిరి. మిమ్ముచూడగా మాకు మాపితృసాన్నిధ్యమునందున్నట్లుగా నున్నది. మీవంటి మహావీరపురుషులను సేనాపతులనుగా పొందిన ఆంధ్ర సామ్రాజ్యముయొక్క భాగ్యము అనన్యమైనది. మీవంటి మహావీరులకు తల్లియైన ఆంధ్రభూమి చరితార్థతపొందినది. అన్నిరసములలో శృంగారరసములో స్థాయీభావము చేరుట తెలికయని వీరరసమునందు తన్మయతచెందుట సమాధి స్థితిచెందుట న్యూనమైనవని మేము భావించుచుంటిమి. ఇప్పుడు వీరరసముకూడ స్థాయీభావమును, సమాధిస్థితిని చేర్పగలదని మీరు నిరూపణచేసితిరి. మిమ్ము మాసభాభరణముగా పొందిన మా అదృష్టభాగ్యమును మేము అభినందించుకొనుచున్నాము. మూర్ధాభిషిక్తులమగుటచేత మేము సేనాపతులగు మీకు

పాదాభివందనము చేయలేక పోయినందులకు కొరతగా నున్నదని భావించుకొనుచున్నాము.” అని ఆలింగనము చేసికొని నాగమనీడుగారిని ఆయన ఆసనముమీద కూర్చుండబెట్టిరి.

నాగమనీడుగారింకను సమాధిస్థితినుంచి కోలుకున్నట్లు లేదు. వారేదో విభ్రాంతునివలె—చూచుచు కూర్చుండిరి. చక్రవర్తులవారు తిరిగి తమ సింహాసనమును అలంకరించిరి. సభాస్తారులను తిలకించుచు “పూర్వము కులశేఖర ఆళ్వారుల వృత్తాంతము వినియున్నాము. వారుపరమభాగవతోత్తములు. ఆయన రామాయణ గాథవినుచు భక్తితన్మయులై లంకా ప్రయాణము చేయబోయిరి. అక్కడ సమాధిస్థితికి త్రోవ తీసినది భక్తి. అందుచేతనే కొందరు ఆలంకారికుల దృష్టిలో భక్తిరసరాట్. దాని కాలంబన విభావములు పరమాత్మ. శాంతప్రేయోవత్సలోజ్జ్వల భేదములచే నాభక్తియే వైవిధ్యము పొందునట. కాని మనసేనాధ్యక్షులవారి విషయమున కేవలము ధర్మవీరమే. ఇది అచ్చమైన వీరరసము. వీరరసమునకు ఆలంబనము ధర్మమే. ఇక్కడ భక్తియొక్క ఆభాసకూడలేదు. వీరి ధర్మవ్యగ్రత ఉత్తమశ్రేణికి చెందినది. ఆళ్వారుల విషయమున భక్తిప్రధానరసము. కొంచెము వీరము ఆంగిక ముగానున్నదేమో. ఇక్కడ ఆంగికము లేనేలేదు. వీరమే సర్వప్రధానం” అని మహాకవి తిక్కనగారివంక, విశ్వేశ్వర శివాచార్యులవారివంక, విద్వాంసులవంక, సభవంక చూచిరి. సాధువాదములు సభలో మ్రోగినవి.

చక్రవర్తులవారు మరల సభనుచూచుచు "మహాకవులు సాక్షాత్ సరస్వతీస్వరూపులని, ఆంధ్రమహా భారతము లోకోత్తరమైన మహాకావ్యమని, స్నిగ్ధహృదయులకు సమాధి స్థితిని చేకూర్చునదిగా నున్నదని, సభవారు ప్రత్యక్ష నిదర్శనముగా గ్రహించిరి. ఆవిషయమును గురించి చెప్పుట పునరుక్తికాగలదు. చతుర్వేదములకే ఆదరోక్తికలదుగాని పంచమవేదమునకు కాదు.

బ్రాహ్మీమయమూర్తులై ఆంధ్రసరస్వతీ అవతారమైన కవిబ్రహ్మలను సేవించుకోగలుగుట భాగ్యవిశేషమే" అని మారన్నగారివంకచూచిరి. మారన్నగారు వేదపండితులవంక చూచిరి.

చతుర్వేదవేత్తలైన నలువురు ఘనాంతస్వాధ్యాయులు వచ్చివేదోక్త ఆశీర్వచనముతో స్వస్తిమంత్రార్థముతో మహాకవి తిక్కనగారిపై మంత్రపుష్పాక్షతలు చల్లి పన్నీరు కురిసిరి.

తరువాత మారన్నగారు లేచి శ్రీరాగయుక్తముగా "ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాకథా విభుపరతత్త్వబోధకు నవీన పరాశరసూను సంతత త్రిభువనకీర్తనీయయశు తిక్కకవీంద్రుని గొల్తునర్థితోన్" అని పఠించి నమస్కరించిరి. సభాస్తారులు హర్షధ్వానములు చేసిరి.

రాజగురువులు విశ్వేశ్వరశివాచార్యులవారు లేచి నిలువబడగా సభ ప్రశాంతమైనది. వారేదో ముఖ్యమైన విషయమును ప్రసంగింపనున్నారని సభవారు సావధానులైరి. ఆయన శాంతస్వభావులు. కాని ఆసమయమునవారు ఆవేశ పూరితులై మిక్కిలి వ్యగ్రమనస్కులై యున్నట్లుతోచిరి. ఏదో అపూర్వమైన ఆనందాతిరేకమున నున్నట్లుతోచిరి. వారి మనస్సు అతిలోకసీమలందున్నట్లు, వారేదో అపూర్వ ధర్మ జ్యోతిని దర్శించి మహనీయమైన తేజముతో ప్రకాశించు చున్నట్లు సభాస్తారులకు తోచిరి.

విశ్వేశ్వర శివదేశికుల వారు సభాస్తారుల నుద్దేశించి "సభలో పెక్కుమందికి మేమును మహాకవులును ఆబాల్య సహాధ్యాయులమని తెలిసియుండకపోవచ్చును. వారును మేమును వారణాసిలో పుష్కరమునకు మించినకాలము కలసి విద్యాభ్యాసమును చేసితిమి. మేము ప్రాణమిత్రులము. ఒక సారి గంగాప్రవాహమున కాలుజారి మేము కొట్టుకొని పోవు చుండగా ఆయన సాహసముతో ప్రవాహమున దూకి మాకు ప్రాణదానము చేసినవాడు. ఆయన మాకు సహాధ్యాయిగా నుండుటవలననే మేము కొన్ని విద్యారహస్యములను తెలిసి కొనగలిగితిమి. మాకువచ్చిన విద్యాకీర్తి ప్రతిష్ఠలు ఆయన స్నేహము అనుగ్రహించినవి.

ఆయన ఆంధ్రమహాభారతమును నిర్మించి తాను సరస్వతీ దేవ్యవతారమని వ్యక్తముచేసెను. సరస్వతీపూజ మన కంచ

రకు కర్తవ్యమే. మేము గోళకీమఠశైవాచార్యులము. సర స్వతీదేవి శంకరబహిర్ముఖాకృతి. సరస్వతీపూజ మాకు అవశ్య కర్తవ్యము. మాకు విక్రమసింహపురమండలమున పదునైదు అగ్రహారము లున్నవి. ఆశ్రోత్రియములను ఆంధ్ర సరస్వతీదేవికి పూజాసమర్పణముగా గోళకీశైవమఠము తరఫున మహాకవు లకు సమర్పించుకొనుచున్నాము” అని అగ్రహారదాన శాసన మును మహాకవి తిక్కనగారి హస్తములందుంచిరి. మహాకవులు లేవగా ఆయనను ఆలింగనముచేసికొని, ఆయనను కూర్చుండ బెట్టి, విశ్వేశ్వర శివాచార్యులవారు తిరిగి తమ ఆసనమునందు కూర్చుండిరి. సభాస్తారులు జయజయారావములతో హర్ష ధ్వానములతో సభాభవనము నింపిరి.

మహాకవి తిక్కనగారు లేచి, చక్రవర్తులవారికి, విశ్వే శ్వర శివాచార్యులవారికి సభాస్తారులకు శిరమువంచి నమస్క రించిరి. సభాభవనము ప్రశాంతముకాగా ఆయన “విశ్వేశ్వర శివాచార్యులవారు నాకు అన్నగారు. నాకంటె జ్ఞానవయో వృద్ధులు. వారికి నాయందు అమితవాత్సల్యము. నేను బాల్యము నందే తలితండ్రులను పోగొట్టుకొని దూరదేశమున కాశిలో విద్యాభ్యాసము చేయుటకు పోయితిని. అక్కడ కాశీవిశ్వేశ్వర స్వామి నాయందు కరుణతో నాకు అనుగ్రహించిన తల్లి, తండ్రి, అన్నగారు, సహాధ్యాయి, ప్రాణమిత్రుడు యీ విశ్వేశ్వర శివాచార్యులవారు. ఆనాటి వాత్సల్యముతోనే వారు నన్నిం కను చూచుచున్నారు. వారి వాత్సల్య ఋణమును నేను తీర్చు

కొనలేను. నేను సర్వజిద్యాగము చేసి నాకున్న యావదాస్తిని దానమిచ్చితిని. మరల భూధనకనకవస్తువాహనాది సంపదలను సంపాదింపకూడదని భావించితిని. కాని విశ్వేశ్వరశివాచార్యుల వారి శాసనము నాకు అగ్రజన్ముల శాసనమువంటిది. నావంటి సౌమిత్రికి వారు శ్రీరామచంద్రులు. వారి ఆజ్ఞ నేను శిరసా వహింపవలసినదే. అది నాకు అనుల్లంఘనీయమైనది. కావున వారు నాకు అనుగ్రహించిన అగ్రహారములను విశ్వేశ్వర శివ ప్రసాదముగా శిరమునందు ధరించుచున్నాను.

ఐతే గోళకీ శైవమఠము వారు త్రిపురాంతకమున, మంథడమున, శ్రీశైలమున, పుష్పగిరియందు నిర్వహించుచున్న విద్యాపీఠములకు నేనీ అగ్రహారములను భక్తిపూర్వకముగ సమర్పించుకొనుచున్నాను. సరస్వతీ పాదార్పణ బుద్ధితో నేనీ సమర్పణ చేయుచున్నాను.'' అని విశ్వేశ్వర శివాచార్యులవారికి నమస్కరించిరి.

విశ్వేశ్వర శివాచార్యులవారు అనుకూల శిరఃకంపన మందహాసములు చేసిరి. చక్రవర్తులవారు ప్రఫుల్లవదనులై హసించిరి. మహామంత్రి తిక్కనగారు అగ్రహారదానశాసనము విద్యాసచివులైన మారన్నగారి కిచ్చిరి. ఆయన కన్నుల కద్దుకొని ''సరస్వతీప్రసాదము'' అని స్వీకరించిరి. సభ హర్షధ్వానములతో మ్రోగినది.

మరల మహాకవి తిక్కనగారు లేచి ''శ్రీగోళకీమఠము వారు నిర్వహించుచున్న విద్యాపీఠములకు నా సమర్పణను

మన్నించినందులకు. శ్రీవిశ్వేశ్వరశివాచార్యులవారికి నా కృతజ్ఞతానమస్కారములు. ఆంధ్రచక్రవర్తులకు ప్రధానసచివులైన విశ్వేశ్వరశివాచార్యులవారు తమ చిన్ననాటి మిత్రునియందు గల వాత్సల్యమును నిరూపించుచు భూరిసమ్మానము చేసిరి. పదునైదు అగ్రహారము లనగా అర్ధ సామంతరాజ్యము. ఇట్టి భూరితర ఔదార్యము చక్రవర్తులవారి ప్రధానసచివులకే చెల్లినది. ఆంధ్రచక్రవర్తుల ఔదార్య మెుక్కటే దానికి మించి యుండగలదు." అని హాసించిరి.

అంతలో చక్రవర్తులవారు సంభ్రమచకితులై లేచి మహాకవి తిక్కనగారిని చూచి, సభాస్తారులను చూచి చేతులు జోడించి మాట్లాడిరి. "మహాకవులు సరస్వతీఅవతారము. బ్రాహ్మీమయమూర్తులు. వారి పలుకు శారదాశాసనము. ఆపలుకు వేదవాక్కువలె సర్వానుల్లంఘ్యశాసనము. శారదా శాసనము, ఆంధ్రచక్రవర్తులసభలో, రాజధానిలో, సామ్రాజ్యములో అప్రతిహతముగా చెల్లుబడి కావలసినదే. తత్‌క్షణమే అనుసరణీయము" అని తమచేతియందున్న శాసనపత్రమును మారన్నగారి కందిచ్చిరి. మారన్నగారు దానిని స్వీకరించి పఠించిరి.

"స్వస్తి సమస్త పంచమహాశబ్ద మహామండలేశ్వర, రాజపరమేశ్వర, విజయప్రతీకాతిషణ్ముఖ, వివేకనారాయణ, ఆశ్రితజనకల్పవృక్ష, శ్రీమదాంధ్రమహాసరస్వతీ దివ్యశ్రీ పాదపద్మారాధక శ్రీశ్రీశ్రీ గణపతిదేవచక్రవర్తులవారు - స్వస్తి సమస్త

రాజ్యభారనిరూపిత మహామాత్యపదవీ విరాజమానోన్నత ప్రభుమంత్రోత్సాహశక్తిత్రయగుణసంపన్న అష్టావధారణా ధౌర్యభరిత ఉత్పన్నమతిసంపన్న సురగురుసమాన, సకలశాస్త్ర పారావారక, పదవాక్యప్రమాణపారావారధురీణ, సాంగవేద వేదాంగఆగమసారహృదయ, సర్వపృష్ఠాగ్నిచయన పౌండరీక కాంత సర్వక్రతునిర్వహణదక్ష, త్రయ్యంతనిష్ణాత, ఆంధ్ర భాషాకవిబ్రహ్మ, ఉభయకవిమిత్ర, బుధారాధనవిరాజమాన, మంత్రిమాణిక్య, నీతిచాణక్య, ప్రభుకార్యదురంధర, గౌతమ పురోగమనులైన బ్రహ్మశ్రీ కొట్టరువు తిక్కనామాత్యపాదుల వారియందు తమకుగల సకలభక్తి గౌరవపురస్సరముగా - వారికి విక్రమసింహపురమహారాజ్యమును యథేచ్ఛగా ననుభవించు టకు ధారాదత్తము చేయుచున్నారు.

ఈమహారాజ్యము అక్కన బయ్యనలు మనుమసిద్ధి రాజునుండి స్వాధీనము చేసికొనగా కాకతీయాంధ్రసేనాపతి మల్యాల హేమాద్రిరెడ్డి అక్కన బయ్యనలను బంధీచేసి - ఆరాజ్యమును తిరిగి జయించెను. ఇప్పు డారాజ్యమునకు మనుమసిద్ధిని రాజప్రతినిధిగా మేము నియమించియుంటిమి. మహాకవి విక్రమసింహపురమును చేరువరకు మాత్రమే మనుమ సిద్ధి రాజప్రతినిధిగా వ్యవహరించును. ఆ తరువాత మహాకవుల అభిమతము.

ఇది ఆచంద్రతారార్కముగా నీయబడినది" అని చదివి ఆ పత్రమును మారన్నగారు మహాకవి తిక్కనగారి కిచ్చిరి.

వారు దానిని గైకొని కన్నుల కద్దుకొని శిరమునందుంచుకొని లేచి తమ ఆసనమునం దుంచిరి. తరువాత చక్రవర్తులవారి కడకు నడచిరి. చక్రవర్తులవారు లేచి నిలువబడిరి. మహా కవులు చక్రవర్తులవారి హస్తములను తమ చేతులలోనికి తీసి కొని ఆనందబాష్పములతో తడిపిరి. ఆనందపారవశ్యమున మాటలు రాక తబ్బిబ్బుపడిరి. మరల సంబాళించుకొని - ఆనందగాద్గదికముగా ని ట్లనిరి. శ్రీగణపతిదేవచక్రవర్తులు సత్యముగా శ్రీమన్నారాయణ స్వరూపులు. 'నావిష్ణుః పృథివీ పతి' అన్న ఆర్యోక్తి శ్రీచక్రవర్తులయందు సార్థకత పొందినది.

షట్చక్రవర్తులైన హరిశ్చంద్ర, నల, పురుకుత్స, పురూ రవ, సగర, కార్తవీర్యార్జును లెవ్వరుగాని తా మొసగినమాట నిలుపుకొనుటకు ప్రయత్నించినవారేగాని - యివ్వనిమాట - యివ్వదలచిన మాట కూడ ముందుగా ఫలింపచేసినవారు లేరు. షోడశమహారాజులు కూడ నట్టివారే. దాతృత్వమునకు ప్రథమగణ్యులైన మహాదాతలు శిబిచక్రవర్తి, రంతిదేవుడు, బలిచక్రవర్తి, రాధేయుడు - వీ రెవ్వరుగాని యాచించినవారికి తృప్తి కలిగించినవారేగాని, అర్థిజనుని మనస్సెరిగి, అర్థిజనుడు నోరు తెరువకమునుపే దానము చేసినవారు లేరు. కల్పవృక్షము గాని కామధేనువుగాని, చింతామణి రత్నముగాని కోరక మునుపే ఫలమును కలిగింపలేవు. ఈ అందరినీమించిన అపూర్వ దానగుణము శ్రీగణపతిదేవచక్రవర్తులవారిది. వారి ఔదార్య మును వర్ణించుటకు ఉపమాలంకారముగాని రూపకాలంకా రముగాని ఉపకరించుట లేదు.

చక్రవర్తులవారికి నా దొక విన్నపమున్నది. షట్కర్మ నిబద్ధుడనైన నాకు రాజ్యపాలనము అసందర్భమే. మహాభారతమున స్వర్గారోహణపర్వమును రచించి సర్వజిద్యాగముచేసి సర్వత్యాగముచేసిన నాకు మరల ఐశ్వర్యసంపాదనము వాంఛనీయము కాదు. తిరిగి కర్మబంధములను పెంచుకొనుటే. చక్రవర్తులవారు అనుగ్రహించిన విక్రమసింహపుర మహారాజ్యమును నేను మాప్రభువులవారైన మనుమసిద్ధి మహారాజులవారికి సమర్పించుచున్నాను." అని చక్రవర్తులవారి హస్తములను లాలించిరి. మరల "స్మృతినిర్ణయము మీకు తెలియనిది కాదు. పౌండరీకాంతము నిర్వహించి మహాపాదుకాంత దీక్షాబద్ధుడను కావడమువలన నేను పాదాభివందనము చేయలేక పోవుచున్నాను." అని తమ శిరస్సును చక్రవర్తులవారి హస్తములం దుంచిరి.

చక్రవర్తులవారు "ఎంతమాట! ఆంధ్రచక్రవర్తికిరీటము ఆంధ్రకవి బ్రహ్మలైన తమ చరణపీఠమునకు నిత్యసేవాలంకారము వంటిది." అని మహాకవులను వారి ఆసనముకడకు తోడ్కొనిపోయి కూర్చుండబెట్టిరి.

సభాస్తారులు హర్షానందవివశులైరి. ఇది శ్రీరామచంద్రుని సభయా, యుధిష్ఠిర మహారాజుసభయా, నలచక్రవర్తిసభయా అనిపించినది. విక్రమార్కచక్రవర్తి నవరత్నవిద్వాంసులను పోషించెనేగాని రాజ్యప్రదానము చేయలేదు. భోజమహారాజు అక్షరలక్షలిచ్చి మహాకవులను గౌరవించెనుగాని మహా

రాజ్యములు సమర్పింపలేదు. నిజమునకు భోజమహారాజు పాలించిన రాజ్యముకంటె విస్తారమైన దీవిక్రమసింహాపుర మహా రాజ్యము. గణపతిదేవ చక్రవర్తుల ఆంధ్ర భాషాసేవ 'న భూతో న భవిష్యతి'గా నున్నది. ఈ భావములతో సభవారు పునః పునః జయజయ ధ్వానములు చేసిరి.

మంగళహారతులతో, వందిమాగధుల విజయబిరుదు గద్యలతో, స్వస్తివాచకములతో సభ ముగిసినది. మహాకవు లను సకలసార్వభౌమ లాంఛనములతో వారి వసతిగృహమును చేర్చిరి.

## 37

గణపతి దేవచక్రవర్తులు మహాకవులను ప్రతిదినము తమ యేకాంతమందిరమున కాహ్వానించి మహాభారత ప్రవచనము వినుచుండిరి. విశ్వేశ్వర శివాచార్యులవారును, మారన్న గారును, యువరాజులు రుద్రమదేవమ్మవారును, మహాకవుల శిష్యుడైన కేతనయు, ఆసమావేశమునకు ఆహ్వానింపబడు చుండిరి.

విక్రమసింహాపురమున పరిస్థితులు శాంతిగా నున్నవని హేమాద్రిరెడ్డి పంపిన వర్తమానము వచ్చుటవలన మహా కవులు తిరుగుప్రయాణమునకు తొందరపడుట లేదు.

ఇంతలో నొకనాడు విక్రమసింహాపురమునుండి పరివార సమేతముగా మంత్రులు భవ్యభారతి బయ్యనగారు, ప్రబం ధాంకం అన్నంభట్టు, ఆత్మకూరి గురునాథుడువచ్చిరి. మహాకవు

లను కర్పించిరి. విక్రమసింహపుర ప్రజలు మహారాజులవారు, సిద్దనామాత్యులవారు, మహాకవులరాకకై తహతహ పడుచుండి రని నివేదించిరి. ముఖ్యముగా వృద్ధులైన సిద్దన్నగారు, ఆయన భార్య ప్రోలాంబ చాల తొందరపడుచుండిరని మనవిచేసిరి.

మహాకవులు వారిని ఆదరించి విశ్వేశ్వర శివాచార్యుల వారి దర్శనము చేయించిరి. వారితో కలసి చక్రవర్తులవారి దర్శనముచేసి తమ ప్రయాణమునకు అనుమతింపవలసినదని కోరిరి. చక్రవర్తులవారు విశ్వేశ్వర శివదేశికుల వంకచూచిరి. వారు మందహాసముతో "మహాకవులు చక్రవర్తులవారి సభను అలంకరించి సర్వదా యుండవలెనని చక్రవర్తులవారి అభిలాష. కాని విక్రమసింహపుర పరిస్థితులు చక్రవర్తులవారికి తెలియనివి కావు. శతవృద్ధులైన సిద్దనామాత్యులవారు, ఆయనభార్య, వీరశిఖామణియైన పుత్రరత్నమును పోగొట్టుకొనిన దుఃఖము నందున్నారు. వారికి తమరు సన్నిధానమునందున్నచో శాంతి యుండును. పరిస్థితులను గమనించి చక్రవర్తులవారు తమ ప్రయాణమునకు అడ్డుచెప్పుట లేదు.

ఐతే మాదొక విన్నపమున్నది. త్రిపురాంతకమున మహాదేవుని ఆలయమున మేము శివరాత్రి ఉత్సవముల సందర్భమున కుంభాభిషేకము నిర్వహింపదలచినాము. మీరు మాతోవచ్చి శ్రీశైలమున భ్రమరాంబా మల్లికార్జున స్వామివార్లను సేవించి త్రిపురాంతకమున కుంభాభిషేకమును తిలకించి మాకు సంతోషమును కలిగింపవలెను. తరువాత మీరు అహో

బలము మీదుగా విక్రమసింహపురమునకు ప్రయాణము చేయవచ్చును" అని విన్నవించిరి.

మహాకవులు విశ్వేశ్వర శివాచార్యులవారి కోరికను మన్నించిరి. వారు కోరినట్లే ప్రయాణము సాగినది. మహాకవులు శ్రీశైలమున శివానందలహరి, సౌందర్యలహరి గానముచేసి స్వామివారిని యామాభిషేకముతో, అమ్మవారిని నవావరణ పూజతో సేవించిరి. తమవద్ద సమర్పణకు మిగిలిన దేమియు లేదని నివేదించిరి.

త్రిపురాంతకమున మహాదేవుని ఆలయమునకు క్రొత్తగా రాజగోపురము కళ్యాణమంటపము కట్టబడి కుంభాభిషేకములు జరిగినవి. ఆఉత్సవములు తిలకించి మహాకవులు సంతోషపడిరి. కళ్యాణమంటప రాజగోపురనిర్మాణములుచేసి కుంభాభిషేక ములు నిర్వహించిన విశ్వేశ్వరశివాచార్యులవారిపై మహాకవులు రెండు శ్లోకములను ఆశువుగాచెప్పిరి. ఆశ్లోకములను విశ్వేశ్వర శివాచార్యులవారి కుమారుడు కళ్యాణమంటపమున కుడ్య ముపై చెక్కించెను.

మహాకవులు కాకతీయ రాజధాని నగరమును వదలి వచ్చునప్పుడు చక్రవర్తులవారు బహిర్వనములవరకు వచ్చి వీడ్కోలుచెప్పిరి. చక్రవర్తులవారు మహాకవులను వదలలేక పునఃపునరాలింగనముచేసికొని ప్రయాణముహూర్తము అతి క్రమించుచున్నదని తెలిసికొని వారిని వెడలనిచ్చిరి. మహా కవులకు సకల సార్వభౌమ గౌరవలాంఛనములతో విక్రమ

సింహపురమునకు తోడ్కొనిపోవుటకు చతురంగపరివారమును నియోగించి, ఆపరివారనాయకునిగా మారన్నగారిని నియమించిరి.

యువరాజులు రుద్రమదేవమ్మవారు శ్రీశైలమువఱకు వచ్చిరి. అక్కడ మహాకవులకు నమస్కరించి వీడ్కోలు చెప్పిరి విశ్వేశ్వర శివాచార్యులవారు త్రిపురాంతకమున మహాకవులకు వీడ్కోలు చెప్పిరి. చిన్ననాటి ప్రాణమిత్రులు అన్యోన్యము విడువలేక పునఃపునరాలింగనములతో అన్యో న్యము వీడ్కోలు చెప్పికొనిరి.

మహాకవులు అహోబలమున నృసింహస్వామి దర్శనము చేసిరి. శ్రీమద్భాగవతగత ప్రహ్లాదచరిత్రను నృసింహతాపినీ ఉపనిషత్తును పారాయణముచేసిరి. అహోబలమునకు సమీప ములో నున్నది ప్రబంధాంకం అన్నంభట్టు గ్రామము అతని కుటుంబమచ్చటనే యున్నది. తన అమరమాగాణ గ్రామమును పవిత్రము చేయుడని అన్నంభట్టు మహాకవులను ప్రార్థించెను. అతనిని సంతోషపెట్టుటకు మహాకవులు ప్రబంధాంకమువారి పల్లెకు వెళ్లిరి. అన్నంభట్టు, అతని కుటుంబమువారు మహా కవులను సేవించుకొనిరి.

అన్నంభట్టు కుమారుడు సూరంభట్టు. ఆతడు హాస్య చతురుడు. అతని చమత్కారసంభాషణము మహాకవులను అలరించినది. ప్రబంధాంకము వారి పల్లె ప్రకృతిరమణీయ దృశ్యములతో సొగసుగానున్నది. గ్రామము ప్రక్క చిన్న

పర్వతము. దానిని చుట్టి, చక్కని సెలయేరు. ఆపర్వతమును
సెలయేటిని మహాకవులు సూరంభట్టునకు చూపి "అవి కోలా
హలపర్వతము శుక్తిమతినదివలె నున్నవి. ఉపరిచరవసువు
వృత్తాంతము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఈవృత్తాంతము
గైకొని మీవంశమునం దెవ్వరైన చక్కని ప్రబంధము రచిం
మీయింటిపేరు సార్థకము చేసికొనవలెను. ఆకావ్యమ
నీహాస్యశ్లేష చమత్కారములతో, శబ్దార్థశ్లేష వైచిత్రి
పూర్ణముగా రసజ్ఞరసాయనముగా వ్యంగ్యసమృద్ధముగ
నుండవలెను" అని ఆశీర్వదించిరి. అన్నభట్టు, సూరంభట్టు
సాష్టాంగప్రణామములుచేసి "సరస్వతీ వరప్రసాదము" అ
ఆనందాశ్రువులతో మహాకవుల పాదములకు పాద్యము
సమర్పించిరి.

మహాకవులు అహోబలప్రాంతమునందుండగా వా
ప్రయాణవార్త గండికోటప్రభువు అంబయదేవునికి తెలిసిన
అంబయదేవుడు పరివారసహితముగా మహాకవుల కెదురు
పోయి స్వాగతములు నివేదించి గండికోటకు విచ్చేయుడని
ప్రార్థించెను.

అంబయదేవుని ప్రార్థనము త్రోసివేయలేక మహాకవుల
కొన్నిదినములు గండికోటలో విశ్రమించిరి. మహాకవులు
గండికోటలో నుండిరని సిద్ధవట మండలాధిపతియైన అల్లుగంగ
రాజునకు తెలిసినది. అతడు రక్కెరగంగని కుమారుడు,
అతడు విధేయుడైన సామంతుడై విక్రమసింహప్రభువులను

లుచుచుండెను. అతడు పరివారసమేతముగా మహాకవుల దురుపోయి సిద్ధవటమునకు విజయము చేయుడని ప్రార్థేయడెను. మహాకవులు శ్రీశైల మల్లికార్జునస్వామివారిని సేవించి, పురాంతకమహాదేవుని సేవించి వచ్చుచుండిరి. కావున సిద్ధ శ్వరుని కూడ సేవించుకొనుటకు అభిలాషపడిరి. సిద్ధవట నకు విజయము చేసిరి.

సిద్ధవటములో సిద్ధవటేశ్వరుని నాలుగు దినములు వించుకొనుటకు తలపోసిరి. సిద్ధవటము చేరిన సాయంకాలము దోషకాలమున సిద్ధవటేశ్వరునికి అభిషేకము చేయించి తీర్థ సాదములు స్వీకరించిరి. ఆరాత్రి విశ్రమించిరి.

బడలికమీద మహాకవులకు తేలికగా నిద్ర పట్టినది. తెల్లవారుఝామున సుఖస్వప్నమైనది. తాము పాటూరులో తువులు నిర్వహించిన యజ్ఞశాలయందున్నట్లు, తమకు జ్ఞేశ్వరదర్శనము లభించినట్లు, ఆసమయమున తమ ధర్మపత్ని తమసన్నిధియందున్నట్లు-ఉభయులు యజ్ఞపురుషునికి సాష్టాంగ ప్రణామము చేయగా యజ్ఞపురుషుడు అదృశ్యమైనట్లు- యజ్ఞేశ్వరుడు అదృశ్యమైనందులకు ఖేదము కలిగినది. ఆఖేద ముతో మెలకువ వచ్చినది. మరల వెంటనే నిద్రపట్టినది. మరల స్వప్నము వచ్చినది. తమ ధర్మపత్ని కనుపించి "యజ్ఞములు నిర్వహించి పురప్రవేశము చేయునప్పుడు మీ అన్నగారు బహి ర్వనమునకువచ్చి స్వాగతము చెప్పలేదని అనుకున్నారుకదా! ఇదిగో! ఇప్పుడు మీ అన్నగారు, మా అక్కగారు మీకు

స్వాగతములు చెప్పుటకు వచ్చిరి" అనిచెప్పి పైకిచూడగా ఆకాశమున ఖడ్గతిక్కనగారు పెద్దచానమ్మ మందస్మితము చేయుచు కనుపించిరి. తాము సాష్టాంగప్రణామముచే: చూడగా వారిద్దరుగాని తమ ధర్మపత్నిగాని కనుపించలేదు. మరల ఖేదము కలిగి మెలకువ వచ్చినది.

మహాకవి తిక్కనగారికి మరల నిద్రపట్టలేదు. ఏమియు తోచలేదు. అప్పుడే బ్రాహ్మీముహూర్తము ఆసన్నమగుట తెలిసికొని లేచి కాల్యకరణీయములను నిర్వర్తించిరి. నాలుగ దినము లుండుదమనుకొన్న వారు వెంటనే ప్రయాణమైరి. తన వలన అపచారమేదైన జరిగినదేమోనని, అందువలన మంత్రిగారు వెళ్లిపోవుచున్నారేమోనని అల్లు గంగర గడలాడిపోయెను. మహామంత్రులవారికి పాదాభివం: తమ అపచారములను మన్నింపుడని కళ్ల నీళ్లతో పడెను.

మహామంత్రిగారికి అల్లు గంగరాజుపైన జాలి కలిగినది. అతని ప్రార్థనలు మన్నించి ప్రయాణము నిలుపుచేయుటకు త పోసిరి. కాని ఆంతరప్రబోధమేదో వెంటనే బయలుదేర మన్నట్లు భాసించినది. అంతర్వాణీప్రబోధమును త్రోసివేయ లేకపోయిరి. అల్లు గంగరాజునకు అనునయింపుగా మధుర భాషణముచేసి, అతనివలన అపచారము లేదని చెప్పి, అతనిని బాధపడవలదని చెప్పిరి. అతడు కొంత ఉపశమనము పొంది నప్పటికి మహాకవులు వెంటనే వెళ్లిపోవుచున్నారను అసం